

# మనలో మాట



**అగజానన పద్మార్కం గజానన మహర్నిశం**
**అనేక దంతం భక్తానామ్ ఏకదంత ముపాస్మహే**

"నాగేశ్వరులు మహారాష్ట్రదేశ మధ్యములోనుండి ఆంధ్రదేశానికి ప్రదర్శించిన మొదటి దీపము ఆంధ్రపత్రిక! అది 1908 సం లో కీలక సం భాద్రపద శుద్ధ చతుర్దశి బుధవారమునాడు ప్రారంభమైనది అప్పుడది వారపత్రిక శ్రీ మహాగణపతిని ప్రసన్నులునుగా చేసికొని ఆంధ్రపత్రికను ఆరంభించారు," అని కీ శే నోరి నరసింహశాస్త్రిగారు రాశారు

ముప్పాతిక శతాబ్దం కాలంలో ఆంధ్రపత్రిక వారపత్రిక ఎంతో మారింది ఇంకా మారుతోంది! సుమారు మూడు దశాబ్దాలపాటు ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో సాంఘిక సమస్యలకీ, రాజకీయాలకీ ఎక్కువ ప్రాముఖ్యం ఉండేది తెలుగువారి అభ్యుదయం సంగతి సరేసరి! ఆంధ్రరాష్ట్రం కోసం ఆంధ్ర సచిత్ర వారపత్రిక చేసిన కృషి అద్వితీయం ఈ వజ్రోత్సవ సంచికలో మచ్చుకి మళ్ళీ అచ్చువేసిన కొన్ని రచనలు ఈ విషయాన్ని బాగా నిరూపిస్తాయి 1930 ప్రాంతంలో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కొన్ని మార్పులు రావటం ప్రారంభించాయి కథలూ, చలనచిత్రాలకి సంబంధించిన రచనలూ, బొమ్మలు ఆంధ్ర పత్రిక వారపత్రికలో అధికంగా చోటు చేసుకోవటం మొదలుపెట్టాయి అయితే, అప్పుడూ – ఇప్పుడూ కూడా ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆంధ్రుల ఆదర్శాలకిగాని, భారతీయుల ఆదర్శాలకిగాని ఏ మాత్రం దూరంకాలేదు. భారతీయుల సంస్కృతిలో ఒక భాగమయిన ఆంధ్రుల సంస్కృతికి ప్రతిబింబంగా ఉండటమే ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆశయం ఆంధ్రపత్రిక వారపత్రికని స్థాపించినవారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర సచిత్ర వారపత్రికకి నేటి రూపురేఖలు ప్రసాదించినవారు శివలెంక శంభుప్రసాదుగారు వీరుకాక ఈ ఏడున్నర దశాబ్దాలలో ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక అభివృద్ధికోసం, వికాసం కోసం కృషి చేసినవారూ, ఇంకా కృషిచేస్తున్నవారూ – రచయిత్రు(త)లూ, సిబ్బందీ, ప్రక్రియానికి తోడ్పడేవారూ, ప్రకటనదారులూ, ప్రకటనసంస్థలూ – లెక్కలేనంతమంది అంటే అతిశయోక్తి కాదు డెబ్బయి అయిదు సంవత్సరాలలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక అభివృద్ధికి కారకులయిన వీరందరినీ స్మరించుకుని వారికి ఈ సంస్థ తన కృతజ్ఞతని తెలుపుకుంటోంది

వజ్రోత్సవ సంచికలో కొన్ని పాత రచనలనీ, కొన్ని కొత్త రచనలనీ కలిపి వేద్దామనుకున్నాము మా అభ్యర్థనని మన్నించి రచయిత(త్రు)లు తమకి తోచినవి రాసి వజ్రోత్సవ సంచికకి పంపారు ఇంతకి ముందు పడినవే కొన్నిటిని వాటిని రచించిన వారితో చెప్పి మళ్ళీ అచ్చువేస్తున్నాము అందరికీ మా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాము పాత సంచికలు కొన్ని పోయాయి! మరి కొన్నిటిలో పేజీలు కత్తిరించి ఉన్నాయి! కాని మొత్తంమీద వజ్రోత్సవ సంచికలో పడిన రచనలన్నీ నేటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రతిబింబించిన ఆంధ్రుల సాంస్కృతిక వికాసానికి మచ్చు తునకలన వచ్చుననిపిస్తుంది

ఈ వజ్రోత్సవ సంచికని తయారుచేస్తూ ఉండగా ఎదురుచూడని కాగితం కొరత ఒకటి ఏర్పడి ముద్రణ కొంత ఆలస్యం అయింది, అనుకున్నన్ని పుటలు వెయ్యలేకపోయాము మిగిలిపోయిన రచనలని రాబోయే సంచికలలో వెయ్యగలమని ఆశిస్తున్నాము! ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సంచిక వెలువడటానికి సహకరించిన రచయిత(త్రు)లకీ, ప్రకటనదారులకీ, ఇతరులందరికీ మా కృతజ్ఞత తెలియ చేసుకుంటున్నాము గౌరవనీయులయిన రాష్ట్రపతీ, శ్రీయుతులు బ్రహ్మానందరెడ్డి, నరసింహారావు, వెంగళరావు, డాక్టరు చెన్నారెడ్డి, రామారావుగారలూ, ఇతరులూ తమ శుభ సందేశాలు పంపారు వారికి కృతజ్ఞులము

ఏ పత్రికకయినా అతి ముఖ్యమయినవారు పాఠకులు! ఆంధ్ర సచిత్ర వారపత్రిక తన వజ్రోత్సవం సందర్భంలో తన పాఠకులకి ప్రత్యేకంగా శుభాభివందనాలని అందచేస్తోంది వారి ఆదరాభిమానాలని మించిన బలం ఏదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికకి ఉండదు అవి ఎప్పుడూ ఆంధ్ర సచిత్ర వారపత్రికకి లభించగలవని నమ్ముతున్నాము

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
**దేశోద్ధారక కాశీనాథుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం 1908

*శివలెంక శంభుప్రసాద్*
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం 16–9–'83
రుధిరోద్గారి నామ సం భాద్రపద శు దశమి
**సంపుటము 76 సంచిక 1**

సంపాదకుడు
*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు 4-00

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం విజయవాడ 520 003

## విషయానుక్రమణిక

# వజ్రోత్సవ సంచిక ✱ ఊమెన్
















# గణపతి



లోహ శిల్ప గణపతి



నాట్య గణపతి

ఏ పని ప్రారంభిస్తున్నా ముందుగా విఘ్నేశ్వరుని పూజిస్తే సంకల్పించినకార్యం నిర్విఘ్నంగా సాగుతుందని ఒక నమ్మిక గణపతికి సమర్పించే నైవేద్యాలు, పూజకు వినియోగించే ద్రవ్యాలు సామాన్యునికి అందుబాటులో వుండేవే ముఖ్యంగా గ్రామీణప్రాంతాలలో అత్యంత శ్రద్ధాభక్తులతో వినాయకుని పూజిస్తారు కుడుములు ఉండ్రాళ్లకే తృప్తిపడే అల్ప సంతోషి వినాయకుడు ప్రకృతిలో విరివిగా లభ్యమయ్యే అన్ని రకాల ఆకులు, పూలు పూజకువాలు అవే దేవుడు, చేలగట్లపై పచ్చ పచ్చగా పెరిగే గరికే కూడా పూజాద్రవ్యమే ప్రకృతిలోదొరికే అన్ని రకాల పత్రాలు, పుష్పాలు, ఉపయోగకరమైనవే అని పరోక్షంగా చెప్పడం దీని లక్ష్యం కావచ్చు

వినాయకచవితినాడు బస్తీలలోను గ్రామాలలోనూ వీధులన్నీ పత్రి గుట్టలతోనూ, పూలు, పళ్లతోను నిండిపోయి చిట్టడవి మొలిచిందేమో ననిపిస్తుంది వనితలు ఎర్రకలువ, తామరపూలు అమ్ముతారు నేరేడు, మారేడు, వెలగ, మామిడి రెమ్మలతో బజారంతా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంటుంది

పాలవెల్లులు అమ్మేకుర్రాళ్లు, వినాయక చవితి పుస్తకాలు అమ్మేకుర్రాళ్లు చిట్టడవిలో తిరిగే కుందేళ్లలాగా కొనబోయినవారికి కాలికి చేతికి అడ్డుతగులుతూ వుంటారు శుద్ధమైన బంకమన్నుతో అచ్చుతీసిన వినాయకుడు,రంగులు వేసి హంగుగాచేసిన నిలవ వినాయకులు అమ్మకానికి పెట్టేస్తారు దేవుడికి తళుకులతోచేసిన గొడుగుకొనాలని పిల్లలు మారాం చేస్తారు ఇక పల్లెలలోఅయితే పూలు పత్రి కొనవలసినఆగత్యం వుండదు తెల్లవారుజామున పిల్లలు తోటలమీద పడి కిష్కింధాకాండ ప్రారంభిస్తారు తెచ్చిన సరంజామా సమానంగా పంచుకుంటారు. అన్నీ వినాయకుడికోసమే అన్నట్లు పాలవెల్లి, అంతా వెలగ, మారేడు,నేరేడు, కలువ, తామరపూలతో—కాయలతో అందంగా అలంకరించి దాని నీడన దేవుణ్ని పెట్టి పూజిస్తారు



కర్నాటకలోని
ఇడుగుంజి గణేశ్

గణపతి మనకు అనేకపేర్లతో, రూపాలతో ఇతర దేశాల్లో కూడా కానవస్తూ పూజలందుకుంటున్నాడు బాల, తరుణ, శక్తి, సిద్ధి, నృత్య, ఏకదంత, ద్విముఖ, త్రిముఖ, హేరంభ,ఉచ్ఛిష్ట, మొదలైనపేర్లు ఉన్నవి జావా, సుమిత్రా బోర్నియో, జపాన్, చైనా, ఆఫ్ఘనిస్తాన్, బుందెలఖండ్, పర్షియాల్లో రకరకాల శిల్పచాతుర్యంతో తయారై గణపతి పూజలందుతున్నాడు

బౌద్ధ జైన సంప్రదాయాల్లో కూడా ఈ ఆరాధన వుంది లండన్ మ్యూజియంలో ఐదు తలలు, పది చేతులు, సింహవాహనంగల నేపాలీ విగ్రహం వుంది మహారాష్ట్రలో అష్ట వినాయకులున్నారు దక్షిణాదిలో వినాయకుడ్ని 'వెళ్లయ్యార్' అంటారు రకరకాల ఆకారాల్తో అనేక పేర్లతో పూజలందుతూ ఈ ఒక్కరోజు తనతోపాటు పదిమంది పేదలకు కడుపునింపుతూ ఉన్నాడు గణపతి

ఫొటోలు, వ్యాసం
—వీలేశ్వరపు వరసింహరావు

# సందేశాలు



ఆంధ్ర సచిత్ర వారపత్రిక 75 సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకుని వజ్రోత్సవం సందర్భంగా ఒక ప్రత్యేక సంచికని వెలువరిస్తోందని తెలుసుకుని సంతోషిస్తున్నాను

1908 లో దేశోద్ధారక నాగేశ్వరరావుచేత స్థాపింపబడి ఈ తెలుగు వారపత్రిక తెలుగు వారిలో జాతీయ స్వాతంత్ర్యోద్యమ చైతన్యాన్ని పెంపొందించటానికి ఎనలేని కృషి చేసింది ఆయన ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్యయోధులలో అగ్రగణ్యులు, ఆయన నెలకొల్పిన సంప్రదాయం ఇంకా కొనసాగటం నాకు హృదయాహ్లాదకరమయిన విషయం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక యాజమాన్యానికీ, ఉద్యోగులకీ, పాఠకులకీ నా శుభాభినందనలు అందచేస్తూ ఆ పత్రిక నిరంతర విజయానికి నా శుభాకాంక్షలు తెలియచేస్తున్నాను

**జెయిల్ సింగ్**

**భారత రాష్ట్రపతి**



ఆంధ్రసచిత్ర వారపత్రిక వజ్రోత్సవం జరుపుకొనడం చాలా సంతోషకరమైన విషయం వారపత్రిక తెలుగు భాషలోనేకాక మొత్తం భారతదేశంలోనే తొలిగా వెలువడ్డ కొద్ది జాతీయ పత్రికలలో ప్రఖ్యాతిని సంపాదించుకుంది

స్వాతంత్ర సమరంలో ఉద్భవించిన వారపత్రిక చరిత్ర భారతదేశ చరిత్రతో ముడిపడ్డది కీ శే కాశీనాధుని నాగేశ్వరరావుగారి జాతీయ ఆశయాలు ఫలితంగా జన్మించిన వారపత్రిక తెలుగు జాతికి 70 సంవత్సరాల నించి వెలుగైంది తెలుగువారి రాజకీయ చైతన్యానికి, వారి సాంఘిక, ఆర్థిక పురోగతికి వారపత్రిక చేసిన సేవ మరువరానిది

తెలుగు సాహిత్యంలో నూతన అధ్యాయాలను తెరిచి, భాషలో కొత్త వరవళ్ళు సృష్టించి ప్రశంసనీయమైన సాంస్కృతిక సేవ చేసింది వేలమంది కొత్త నవలా కారులను, రాజకీయ, ఆర్థిక, సాంఘిక రచయితలకి ఒక కొత్త జన్మ ఇచ్చి, తెలుగుజాతి చరిత్రకే కొత్త మలుపులు దిద్దింది ఆంధ్రసచిత్ర వారపత్రిక కలకాలం తెలుగుజాతికి, వారి పురోగమనానికి వెన్నుపూసలా వుంటుందని, వుండాలని నా కోరిక

**కాసు బ్రహ్మానందరెడ్డి**



ఆంధ్రసచిత్ర వారపత్రిక వజ్రోత్సవం జరుపుకొనడం చాలా ఆనందకరమైన విషయం భారత స్వాతంత్రోద్యమంతోపాటు జన్మించిన వారపత్రిక జాతీయ పత్రికా రంగానికి నాంది పల్కి జాతీయ ఆశయాలను, ఆదర్శాలను అరమరిక లేకుండా ప్రచారం చేసి దేశాభ్యుదయానికి, బానిసత్వంనుండి భారతజాతి విముక్తికి దోహదం చేసింది

ప్రజల శ్రేయస్సు, దేశ పురోభివృద్ధి ఎల్లవేళలా దృష్టిలో వుంచుకుని, వివిధ రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయాలను పాఠకులకి విశదపరిచి ప్రజలు — పత్రికల మధ్య వుండవలసిన సామరస్యానికి, సంబంధానికి ఒక ఉత్తమ ఉదాహరణ అయింది

భారతదేశ ప్రజాస్వామ్యానికి పునాదులు వేసిన సంస్థలలో వారపత్రిక ఒకటి వివిధ దేశ, అంతర్జాతీయ భాషలలోని రచనలను తెలుగు పాఠకులకు అందచేసి, భాషా శైలికి మెరుగులు దిద్ది, తెలుగు సంస్కృతికి, సారస్వతానికి నూతన జీవం పోసింది వారపత్రిక

కీ శే కాశీనాధుని నాగేశ్వరరావు గారి ఆదర్శాలను, కలలను సఫలీకృతం చేసిన వారపత్రిక దేశసమైక్యతకూ, పురోభివృద్ధికీ ఎప్పటిలానే దోహదపడుతుందని ఆశిస్తున్నాను పత్రికని నడుపుతున్న శ్రీ రాధాకృష్ణ గారికి, వారి సంపాదక వర్గానికి, మిగతా కార్యకర్తలకు నా శుభాకాంక్షలు

**పి. వి. నరసింహారావు.**

**భారత విదేశాంగమంత్రి**



శ్రీ శివలెంక రాధాకృష్ణగార్కి,

నమస్కారములు

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" 1908లో ప్రారంభించబడి రాబోయే వినాయక చవితికి డెబ్బది అయిదు సంవత్సరములు పూర్తి చేస్కొనబోతున్న సమయంలో మీరు ప్రత్యేక సంచిక ప్రచురించుట చాలా సంతోషం

యీ సమయంలో యీ పత్రికను ప్రారంభించిన మహనీయులు దేశోద్ధారక, కళాప్రపూర్ణ, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగార్కి జోహార్లు అర్పించకుండా యే ఆంధ్రుడు వుండలేడు ఆ మహనీయుడు యీ పత్రిక ద్వారా, దినపత్రిక ద్వారా, ఆంధ్రజాతికి ఆనాటి జాతీయ పోరటంలో పాల్గొనుటలో, జాతీయ భావ ప్రేరేపణ కలిగించుటలో ప్రముఖ పాత్ర వహించినారు ఆ మహనీయుని యేనాటికీ ఆంధ్రజాతి మరవలేదు

వారి తరువాత మీ తండ్రిగారు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు యీ పత్రికల గౌరవము కాపాడుకుంటూ వచ్చినారు

యీనాడు, మీరు, మీ సోదరులు, మీ తాతగారు, మీ తండ్రిగారి వలెనే, యీ పత్రిక కీర్తి ప్రతిష్టలు పెంచగలరని, యీ పత్రిక యికముందు యింకా ఘనంగా, శత సంవత్సరము జరుపుకోవాలని ఆశిస్తూ పెద్దలు ప్రారంభించిన వరవడిని, మీరు కాపాడుకుంటూ వస్తున్నందుకు, నా అభినందనలు, శుభాకాంక్షలు తెలియచేస్తూ యున్నాను

ఇట్లు,

భవదీయుడు

**జలగం వెంగళరావు**



ప్రియమైన శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి,

మీ 30 జూలై తేదీ ఉత్తరం అందింది నిన్ననే శ్రీ పాపయ్యశాస్త్రి దానిని స్వయంగా తీసుకువచ్చి ఇచ్చారు

వినాయక చతుర్థి నాటికి ఆంధ్ర సచిత్ర వారపత్రికకి 75 సంవత్సరాలు పూర్తి కాగలవని తెలుసుకుని సంతోషిస్తున్నాను ఈ వారపత్రిక తోటి దినపత్రిక ఆంధ్రలో చాలా ముఖ్యమయిన

స్థానాన్నీ, గౌరవాన్నీ, మర్యాదనీ సంపాదించుకున్నాయి వాటి సంస్థాపకులు అప్పటి ఆంధ్రప్రదేశ్ అగ్రనాయకులలో ఒకరు ఆయన ఒక గొప్ప దాత జాతీయ జీవితానికీ, ప్రజాజీవితానికీ ఆయన చేసిన సేవ విశేషమయినది ధర్మ సంస్థలతో ఆయనకి ఉన్న సంబంధాలు ఎటువంటివో ఆంధ్రలో తెలియని వారు ఉండరు. ఆయనని విశ్వదాత అన్నారు, దేశోద్ధారకుడు అన్నారు, దాని పునాదులని అటువంటి మహామభావుడు వేశారు కాబట్టే ఈ పత్రిక 75 సంవత్సరాలలో ఎంతో ఉపయోగకరంగా, సమర్ధవంతంగా పురోగమించింది ఆంధ్ర సచిత్ర వారపత్రిక అభిప్రాయాలకి గౌరవం ఎక్కువ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవం సందర్భంలో నా హృదయపూర్వక మయిన ప్రశంసని అందజేస్తూ ఈ పత్రిక మరింత ఉన్నతమయిన స్థాయిని చేరుకోవాలని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను ఆంధ్రపత్రిక, ఆంధ్రపత్రిక వారపత్రిక దేశంలోనే కాదు ప్రపంచంలోనే అగ్రశేణి పత్రికలు నా శుభాభినందనలని ముఖ్యంగా ఈ మహామాత్రలో పాలుగొంటున్న నా స్నేహితుడు శ్రీ రాధాకృష్ణనీ, అసంఖ్యాకులయిన రచయితలకీ, మిత్రులకీ, సహచరులకి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా తెలియచేస్తున్నాను వారికి భగవదనుగ్రహం ఉండుగాక ! జై హింద్

**(డా) మర్రి చెన్నారెడ్డి**



ఆంధ్రపత్రిక చరిత్ర గత 75 సంవత్సరాలుగా తెలుగునాట స్వాతంత్ర్య సమరోద్యమ చరిత్రతోను, ఆంధ్రోద్యమ చరిత్రతోనూ ముడిపడి వున్నది వారపత్రికగా 1908లో వినాయక చవితినాడు స్థాపించబడిన ఈ పత్రిక దినపత్రికగా మారి వజ్రోత్సవాన్ని చేసుకొంటూ వుండడం ఎంతో ఆనందదాయకమైన సంగతి

విశ్వదాత, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు జాతీయోద్యమ సందర్భంలో ఒక వజ్రాయుధంగా ఉపయోగించిన ఈ పత్రిక వజ్రోత్సవ సందర్భంలో నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తూ, తెలుగు భాషా సంస్కృతుల పునరుజ్జీవన కృషిలో, ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖాభివృద్ధికై అందరం కలిసి కొనసాగిస్తున్న అభివృద్ధి ప్రయత్నంలో 'ఆంధ్రపత్రిక' తన సహాయ సహకారాలను అందజేయడంలో అగ్రశేణిలో వుండగలదని ఆశిస్తున్నాను

వజ్రోత్సవాలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను

**యన్. టి రామారావు**
**ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి**



మిత్రులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి

ఆంధ్రసచిత్ర వారపత్రిక 75 సంవత్సరాల విజయవంతమైన ప్రచురణ పూర్తి చేసుకుని రామన్న వినాయక చవితి సందర్భంగా వజ్రోత్సవ సంచికను వెలువరిస్తున్న సంగతి విని మిక్కిలి సంతోషించినాను

ప్రముఖ పాత్రికేయులు, దేశబంధు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు, శ్రీ శివలెంక శంభుప్రసాద్ వంటి మహనీయుల చేతిలో ఎంతో గణనీయంగా ప్రోది చేయబడి పత్రికా రంగానికే తలమానికమూ అలంకారమూ అన్నట్లు కీర్తి పొంది తెలుగునాట విశేష ప్రచారం పొందిన ఉత్తమ వారపత్రిక ఆంధ్రసచిత్ర వారపత్రిక. విమాత్నమైన శీర్షికలతో, విచిత్రమైన రచనలతో ఏడున్నర దశాబ్దాల విశిష్ట ప్రజాసేవ చేసిన ఆంధ్రసచిత్ర వారపత్రికను యీ వజ్రోత్సవ సందర్భంగా మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను రామన్న కాలంలో కూడ యీ పత్రిక విశేష ప్రజాదరణ పొందాలని ఆకాంక్షిస్తున్నాను

ఈ వజ్రోత్సవ సంచిక అందరినీ అలరిస్తుందని ఆశిస్తూ

భవదీయ

**వాదేండ భాస్కరరావు**
**రాష్ట్ర ఆర్థికమంత్రి**



తెలుగు పత్రికారంగంలో ఆంధ్రపత్రికకు ఒక ప్రత్యేకమైన పరిగణన, ప్రాముఖ్యతలు వున్నాయి తెలుగులో పెద్ద ఎత్తున వచ్చే నేటి వార్తాపత్రికలకు వరవడి పెట్టడమేగాక, జాతీయోద్యమాన్ని ప్రజల్లో ప్రచారం చేయడానికీ, స్వాతంత్రోద్యమాభిముఖంగా ప్రజల్ని సమాయత్తం చేయడానికీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి ఆధ్వర్యంలో ఆంధ్రపత్రిక వహించిన పాత్ర విస్మరించరానిది 1908 నుంచికూడా యీ పత్రిక ప్రజల్లో సామాజిక, రాజకీయ చైతన్యాన్ని వ్యాప్తి చేయడంలోనూ, సాంస్కృతిక విలువలను, కళలను పునరుద్ధరించడంలోనూ ప్రముఖ పాత్ర వహిస్తూ వున్నదని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు జాతీయాభిమానాన్ని ప్రజల్లో రేకెత్తించి, స్వాతంత్ర్య పిపాసను కలిగించి, భారత స్వాతంత్ర్య పోరాటకాలంలోనూ, తెలుగు భాషా సంస్కృతుల వైభవాన్ని చూపించి, రాష్ట్రగానాన్ని వినిపించి స్వరాష్ట్ర సాధనాకృషిలోనూ ఆంధ్రపత్రిక ఎంతో గణనీయమైన సేవచేసింది తెలుగునాట ఎందరో స్వాతంత్ర్యోద్యమ వీరులు, రాజకీయనేతలు, సాహితీవేత్తలు రూపొందడానికి పరోక్షంగా ఆంధ్రపత్రిక దోహదం చేసింది తెలుగు భాషా వికాసానికి, సంస్కరణకు ఉద్యమ స్థాయిలో ఆంధ్రపత్రిక చేసిన కృషిని తెలుగు ప్రజలు మర్చిపోలేరు

ఏడున్నర దశాబ్దాల సుదీర్ఘ చరిత్రగల యీ పత్రిక వినాయక చవితి సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను ప్రచురించ తలపెట్టడం ముదావహం భవిష్యత్తులో తెలుగు జన జీవితంలోకి మరింతగా యీ పత్రిక చొచ్చుకు పోగలదని, మరింతగా సాహితీరంగానికి సేవ చేయగలదని ఆకాంక్షిస్తున్నాను

భవదీయ

**చేగొండి వెంకటరామజోగయ్య**

సమాచార, పౌరసంబంధ శాఖామంత్రి

---

ప్రధానమంత్రి ఆంధ్ర సచిత్ర వారపత్రిక 75 సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకున్న సందర్భంలో తమ శుభాకాంక్షలు తెలియజేస్తున్నారు **వజాహత్ హబీబుల్లా**

డైరెక్టరు, ప్రధానమంత్రి కార్యాలయం

---

శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి

నమస్కారములు

ఈ శతాబ్ది తొలిదశకం రెండో పాదంలో ప్రారంభించబడిన ఆంధ్రపత్రిక వారపత్రికకు యీ ఏడాది వినాయక చవితి నాటికి డెబ్బయ్అయిదేళ్లు నిండిన సందర్భంగా వజ్రోత్సవాన్ని జరుపుకుంటూ ఒక ప్రత్యేక సంచికను మీరు వెలువరిస్తున్నందుకు చాలా సంతోషం

ఆంధ్రపత్రికకు సుదీర్ఘమైన చరిత్ర ఉంది స్వరాజ్య సాధనకోసం ఒక మహోద్యమం దేశంలో కొనసాగుతున్న రోజుల్లో, తెలుగు ప్రజల్ని రాజకీయంగా చైతన్యవంతుల్ని చేసి, ఆ ఉద్యమంలోకి ఆకర్షించవలసిన అవసరంవున్న సమయంలో శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు ఆనాడు ప్రారంభించిన యీ పత్రిక నాటినుండి రాజకీయ, సామాజిక, సాహిత్య రంగాలలో తెలుగు నాట విశేషమైన సేవ చేస్తున్నది ఇంటిల్లిపాదినీ ఆకర్షించే రకరకాల శీర్షికలతో, కథలతో, నవలలతో, కార్టూన్లతో కుటుంబ పత్రికగా వెలువడుతూ తెలుగువారిలో ముఖ్యంగా మహిళల్లో పఠనాసక్తిని పెంపొందించడానికి ఎంతగానో దోహదం చేస్తూ తెలుగు జీవితంలోంచి సునిశితమైన హాస్యం అదృశ్యమైపోకుండా కాపాడినందుకు ఆంధ్రసచిత్ర వారపత్రికను అభినందించక తప్పదు

భవిష్యత్తులో కూడా యీ పత్రిక తెలుగు పాఠకులలో ఉత్తమాభిరుచుల్ని పెంపొందిస్తూ, తెలుగు సాహిత్యానికి, తెలుగుజాతికి యిదే విధంగా సేవ చేయగలదని, ఉన్నత ప్రమాణాలను నెలకొల్పగలదని ఆశిస్తున్నాను

భవదీయ

**ఎ. వనజాక్షి**

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ



# పరిపూర్ణ పురుషుడు

## కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

డా॥ దివాకర్ల వెంకటావధాని

"శ్రీ నాగేశ్వరరావుగారి దివ్యనామము స్మృతికి రాగానే, ఒక మహాదాత — ఒక విజ్ఞాన మూర్తి — విజ్ఞాన వార్ధి — ఒక కళా ప్రపూర్ణుడు — ఒక సారస్వతోపాసకుడు — ఒక రాజకీయవేత్త — ఒక సంస్కర్త — ఒక భక్త పుంగవుడు ఏకమూర్తిలో సాక్షాత్కరింతురు

ఆంధ్ర దేశమందలి అన్ని ఉద్యములందు, అన్ని రంగములందు ఆ మహోదారుని ప్రభావము గోచరించును ఆ రోజులలో ఆ త్యాగమూర్తి చేయూత పొందని సంస్థ లేదు, ప్రోత్సాహము నందని ఉద్యమము లేదు నాటి ఆంధ్రదేశ జీవితమున కాయన చేకూర్చినవన్నీ ఇంతింతన రానిది

"వీడు నా వాడు వాడు పరుడు" అను గణన లఘుచింతకులకు, ఉదారచరితులకు వసుధ అంతయు కుటుంబమే అను సంస్కృత శ్లోకము నందలి ఉదారచరితులకు ప్రతినిధి శ్రీ పంతులు గారు లోకమున ననేకులకనేక బిరుదులున్నవి విశ్వదాత, కళాప్రపూర్ణ బిరుదములు శ్రీ పంతులు గారి యందువోలె మరి ఏవియు, ఎవరి యందును ఇంతగా సార్ధకము పొందలేదనుటలో అతిశయోక్తి లేదు ఆయన సర్వమును సర్వజనులకును దానమొనర్చి 'విశ్వదాత' బిరుదమునందలి విశ్వ శబ్దములకు అర్థద్వయమును సొసగించినారు ఆ కాలమున ఆయననడిగి నిరాశ పొందినవారు లేరు, అడుగక అంతస్సేవ మొందనివారు లేరు, లలిత కళలకు, అందున సాహిత్యమునకు — వారు చేసిన సేవ అపారమైనది

భారతమాతృ దాస్యశృంఖల విచ్ఛేదమునకై సర్వస్వమర్పించిన దేశభక్తి పుంగవులలో పంతులు గారగ్రగణ్యులు ఆంధ్రరాష్ట్ర సంపాదనముకై ఆయన కావించిన కృషి అమూల్యమైనది త్యాగము, సేవాధర్మము ఏకైక మూర్తిదాల్చిన మహనీయులు ఆంధ్ర పుత్రరత్నము

ఆంధ్రులలో ఆంధ్రపత్రిక నెఱుగని వారెవరూ యుండరు కష్టనష్టములకోర్చి ఆ పత్రికను స్థాపించి దానిని దినపత్రికగా వొనరించి, ఆంధ్రలోకమున పంతులుగారు కావించిన విజ్ఞాన ప్రచాలనము అమోఘమైనది. ఆంధ్ర దేశమునందలి అపార చైతన్యమున కా పత్రికా రాజమే ప్రధమ కారణమనుట సర్వవిదితము అనవసర దూషణ భూషణముల జోలికి పోక ఆవశ్యకములైన వార్తలను అతి సమరసభావముతో నందించు స్వల్ప సంఖ్యాకములయిన పత్రికలలో ఆంధ్రపత్రికమే అగ్రతాంబూలము 'భారతి' ఆంధ్రమునందలి మాసపత్రికకెల్లతలమానికము, ఆదికవులకు వ్యాసకర్తలకు నొక వంకను ఆంధ్ర వాఙ్మయమున కొకవంకను కావించిన అభ్యుదయ మింతంతనరానిది అది పద్యములు ప్రకటించినది విమర్శలు వెలయించినది వ్యాసములు విరజిమ్మినది శాసనముల నావిష్కరించినది చరిత్రములను చేతుల కందించినది విజ్ఞాన పిపాసువులకు వివిధరీతుల నానందముమీర నిచ్చినది

శ్రీ పంతులుగారు స్థాపించిన ఆంధ్రగ్రంధ మాల అమూల్యగ్రంధ రత్నముల కాంతుల నాంధ్రలోకమున ప్రసరింజేసింది శైవవాఙ్మయమున కవి చేసిన సేవ అప్రతిమానమైనది బసవపురాణ పండితారాధ్య చరిత్ర లామాలిక యందలి నాయకమణులు పంతులుగారి ప్రేరణమే లేనిచో సోమనాధుని యీ కావ్యకుసుములే తాళపత్ర సంపుటారణ్యముననో వాడి వత్తలై యుండెడివి ఆ మాలయందలి యొక్కొక్క కుసుమ మొక్కొక్క రత్నము వీనికి తోడిందు ప్రకాశితమైన ముద్రలూ ముద్రితాంధ్ర గ్రంధముల పట్టిక పరిశోధకుల కెన్నోవిధములతోడ్పడి ఆంధ్రవాఙ్మయ సమగ్ర స్వరూపమును సాక్షాత్కరింపచేసింది

పంతులుగారు రాయలవలె పండితులే కావ్యములు, గ్రంధములు వ్రాయించుటయే గాక స్వయముగా అమూల్యములైన గ్రంధములు వ్రాయించిరి వారి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర మపూర్వ రచనా భాసురమైనది, శ్రీ మద్భగవ

→

# "కుడిచేత నేమియిచ్చెనో యెడమచేతికి తెలియదు"

## మహదేవ దేశాయి

### విశ్వదాతకై ఆంధ్రుల సంతాపము

ఆంధ్రులు తను నాయకుని విశ్వదాత యని గౌరవించిరి ఆయన చేసిన ధర్మములు ఆంధ్రులకు దెలిసినటుల నితరులకు దెలియవు నేడు ఆంధ్రు లందరును విశ్వదాత పోయెనే యని విలపించు చున్నారు

### గుప్త ధర్మములు

ఆయన చేసిన ధర్మకార్యము లందరకును దెలియునా ? ఆయన కుడిచేతితో నేమియిచ్చెనో యెడనుచేతికి తెలియదు ఎంతమంది విద్యార్థులకో, ఆతురులకో గుప్తధర్మముల జేసెను ఆధర్మపరి గృహీత లందరును ఆ నాగేశ్వరరావు వంటి వారున్నారా యని మరచిపోకుందురు

### హరిజన సేవ

కాంగ్రెసు ఉద్యమము, హరిజనోద్యమము రెంగను వారికి చాల ప్రియమైనవి రెంటికిని ఆయన మిగుల నుదారభావముతో సాయముచేసెను ఆయన యెన్నియో సంవత్సరములు ఆంధ్ర హరిజనసేవక సంఘాధ్యక్షులుగ నుండిరి వారి జమీందారీలో హరిజనులకు నెన్నియో నివాసస్థలముల నొసంగిరి

### దరిద్రనారాయణ సేవ

దమ్మిడీ ఖర్చు లేకుండ గుప్తముగ నౌషధముల తయారుచేసి వేలకొలది రూప్యముల సంపాదించినా రెందరో కలరు శ్రీ నాగేశ్వరరావు తన 'అమృతాంజనం' మందు చేయుటకు ఖరీదు బహు స్వల్పమను విషయమును రహస్యముగ నుంచలేదు కాని ఆయన సంపాదించిన దంతయు దరిద్రనారాయణులకే అర్పణజేసిరి సూక్ష్మమగు వ్యాపారస్థుడు అయినను అత్యంతమగు దేశభక్తుడు 63 – వ యేట కారాగారమునకు జనెను తరువాత మరల రెండుసార్లేగిరి

### ఆంధ్రపత్రిక

''ఆంధ్రులసేవ, ఆంధ్రభాషాసేవయే ఆయనకు పరమముఖ్యము లోకమాన్య 'తిలకు' కేసరి నేవిధముగ పెంచెనో ఆ విధముగనే శ్రీ నాగేశ్వరరావు ఆంధ్రపత్రికను బెంచిరి మహారాష్ట్ర 'కేసరి' చేసినంతసేవను యీ ఆంధ్రపత్రిక ప్రజల విజ్ఞానము నభివృద్ధిచేయుటలో చేసెను

( హరిజన్ )

---

ద్గీతకు వారు కావించిన వ్యాఖ్య వారి ఆధ్యాత్మిక జ్ఞానమునకు, భక్తికి, లోకానుభవమునకు, పరిపక్వమైన ప్రవృత్తికి నిదర్శనమైన ఉత్తమ గ్రంధము

పంతులుగారు ఆస్తికవరేణ్యులు అవసర మైన సంస్కరణమున కడ్డుపెట్టువారు కారు ఈ గుణములు రెండు నెక్కడో కాని యొక్కచో పొత్తు కలిగియుండవు హరిజనులఎడను, దీనా నాథులఎడను వారు చూపిన కరుణ లోకాతీత మైనది, ఆర్తారావములు విన్నంతనే వారి ఆత్మ ద్రవించును ద్రవించి, ఎంతటి త్యాగమునైన నొడికట్టును వారి భక్తిభావ మపారమైనది శాంతికాంతులు వారి కలంకారములు

పంతులుగారి వాణిజ్యదృష్టికి వారి అమృతాంజనము పరమ నిదర్శనము అమృతాంజనము గాలివలె చూడని తావు ఉండదు పంతులుగా రాంధ్రభారతీ పత్రికల ద్వారమున ఆంధ్రగ్రంధ మాల కుసుమముల ద్వారమునను ప్రజల అజ్ఞానాంధకారమువలె అమృతాంజనము ద్వార మున వారి ఆంగిక బాధలను రూపుమాప యత్నించి కృతకృత్యులైరి

పంతులుగారు సమగ్ర మానవమూర్తి వారి శీల మతి నిర్మలమైనది, భావము పరమ పవిత్రమును, విశాలమును

వారు సాంఘిక, రాజకీయ సారస్వత మత రంగములలో కావించిన సేవ అపారమైనది పరోపకారార్థ మిదం శరీరమను నానుడికి వారు దృష్టాంతము, త్రికరణశుద్ధి, కార్యశూరత, నిరాడంబరత, నిత్యోత్సాహము వారికి పెట్టని సొమ్ములు వారి అడుగుజాడ లాంధ్రుల కానం దాభ్యుదయముల నొనగూర్చుగాక ●



## ఆంధ్రదేశమునకు నాయకమణి

నాగేశ్వరరావుగారియందు సహజమైన హృదయ మాధుర్యమును గంభీరమైన ఉత్తమ గుణాతిశయమును కలవు ఆయన భారతదేశమునకు చేసిన గొప్ప సేవకు వాని నైజ హృదయ స్వభావమొక వింత విలువను కల్పించెను ఆంధ్రదేశమునకు ఆయన నిస్సంశయముగా నాయకమణియై, రాజకీయవేత్తయై యుండెను అట్టివానిని గౌరవించుటకు ఆంధ్ర దేశ మిపుడు శిలాప్రతిష్ఠగాని, లోహప్రతిష్ఠ గాని చేసి ఆయనను సంస్మరించుట తగదు. ఆయన దేశ స్వాతంత్ర్యముకొరకై మనసార ఏ ఉద్యమములనుగూర్చి కలవరించుచుండెనో, ఏ సత్సంకల్పములకై నురపురాని మహోత్యాగములను ఆయన చేసెనో ఆ ఉద్యమమును, ఆ సంకల్పము లను యీడేర్చుటకే ఆంధ్రులు కృషిచేసి ఆయన పేరును చిరస్మరణీయ మొనర్పవలెను

ఆయన మన యందరిమధ్య నుండుటయే మనకు మంగళకరమైన మహాప్రసాదముగా నుండెను మన కందరకును ఆయన పేరు మాతృదేశారాధనకు తారకమంత్రముగా నుండ గలదు

— సరోజినీదేవి.

## "నా సహచరుడు, పూజనీయుడు"

"నా సహచరుడును పూజనీయుడును నగు నాగేశ్వరరావుగారు మృతినొందినందులకు మిక్కిలి విచారించుచు వారి కుటుంబమునకు సానుభూతిని తెలుపుచున్నాను''

— పండిత మదనమోహనమాలవ్యా

## తిలాంజలి

ఈ వసంత పూర్ణచంద్రబింబం పెద్ద బాష్ప బిందువైనది

అశ్రుతతి దెసలనుండి, విరసవాహినికటు జలాల పొంగి, ధూమ్రవర్ణము పొగలెగసి — కాలమే ఆగి హృదయాల్ని చేతులతో అణచికొని కూలబడినది

కవుల పాటలు గొంతుకలోనే యింకి పోయినవి వీణతీగెలు తెగిపోయినవి కుంచెల్లో

## కుడిచేత నేణుబ్బెనా...

రంగులు విరిగి — యెండి — పొడై రాలినవి

దరిద్రనారాయణుని దోసిలి జీవరహితమై వడిలి ప్రక్కలకు తూలి వీడిపోయింది

నీ కన్నులలో కరుణకాంతులు శిబిని చేరినవి నీ గొంతుకలోని "ఇస్తిని" అన్న పలుకు శివుని డమరుకాన కలిసిపోయింది నీ యాత్మ బలి దానము శివుని త్రిశూలమైనది నీ కుడిచేతిలో ప్రవహించే స్వర్ణకాంతి పురుషార్థదాయిని లక్ష్మి అభయముద్రలో భంగించినది

దేశదేశాల నువ్వు పెట్టిన దీపాలు కొడిగట్టి, కగ్గి మసమసక లయినాయి

నిన్ను కీర్తించి, నీ పాదాలు గాంధర్వమున నభిషేకించి, దేశమే ఒక పెద్ద అతిథి ఐ, నీ పంక్తిని అమృతము త్రాగినది నీ హస్తచిన్ముద్రలో తళుకు లీను జ్ఞానకాంతి హృదయాల మెరసినది

త్రివర్ణ పతాకం దిగజారి, దిగజారి ముడుచుకొని అర్ధభాగాన నిల్చింది అడుగున శేషుడే కదలి ఫణాలు ముడిచి, నిట్టూర్పువుచ్చి, వాలిపోయినాడు మహాత్ముని బోసి చిరునవ్వు ఎటకేనిపోయి, పెదవి కంపించి నాగేశునామాన ప్రయాగ చేరింది

నీ ముఖాన్ని వెలిగించే చింతామణి రోచిస్సులు నీ రూప చిత్రంలోనైనా చూడరావు నీ భ్రూయుగ్మంమధ్య జ్ఞానకిరణాల అమృతము వెన్నెల్లోనైనా లభింపదు దివ్యమైన నీ అడుగుల చప్పుడు, జగన్నాథుని రథచక్రఘోషలో కూడ వినబడదు

శకటాల నెక్కి, వేగాలు పోయి, నీ మహా మందిరము చేరి, మూలమూలల వెదకి వెదకి బెదరి వాపోవు బాలుని చూచి, బాలికను చూచి చూచి, వారి యశ్రువుల మా యశ్రులను కలిపినా నీవు తోచరావు దిగులుపుట్టి భయముపుట్టి నీకై యిటూ అటూ పరుగులెత్తేము

గురుసమాన! పితృసమాన! ఆర్తినిండిన మా కన్నులకు దీనుల హృదయాల కాపురమున్న నువ్వు మాపైన చిరునవ్వులు ప్రసరించెదవు కళావేత్తల జీవాల విహరించు నీ మాటలు మమ్ములను పులకింపజేయును

నీ కళేబరమును భూదేవి చల్లని కడుపున బెట్టుకొనియుండ, నీవు హంసవాహనుడవై దివ్యవీధుల అమర విహారము గావించుచున్నావు పృథ్వీ స్వర్గములు నీచే ఆరాధ్యములైనవి నీ పవిత్ర స్మృతికడ మోకరించి అశ్రుధారలు దోసిళ్లబట్టి తిలాంజలుల నర్పించుచు నీ పరమ శాంతమూర్తిని ధ్యానించెదము

— అడవి బాపిరాజు

## నిగర్వి - ఆదర్శపురుషుడు

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి మృతి నన్ను స్తబ్ధుణ్ణి చేసింది బ్రిటిషు యుగం ప్రారంభమైన తరవాత మన జాతిలో నాగేశ్వరరావు పంతులుగారిని బోలిన మరొక వ్యక్తి పుట్టినట్లు నిదర్శనాలేమీ లేవు ఇకముందు కూడా ఇంతలో అలాంటివారు పుడతారనడానికి ధైర్యం చాలదు

బొంబాయిలో కూచుని "మనకు ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలి" అని పంతులుగారు చేసిన శంఖనాదంవల్ల జాతికి జాతి అంతా ప్రబుద్ధ మయినది చివరిదాకా వారు ఆ విషయం జ్ఞాపకం చేస్తూ జాతిని మాటిమాటికీ ప్రబోధిస్తూనే వుండినారు

స్వయం ధనికుడై, పండితుడై, సహృదయుడై, భోగి — త్యాగి అయి, నిజంగా దేశోద్ధారకుడై, ఇంత అయిన్నీ నిగర్వి అయి, ఆదర్శభూతుడైన పురుషుడేడీ అంటే, ఆంధ్ర దేశ చరిత్ర ఒక్క నాగేశ్వరరావు పంతులుగారిని తప్ప మరొకరిని చూపించలేదు

విశాఖపట్నంలో జరిగిన మూడో ఆంధ్ర మహాసభలో, నాకు, మిత్రులు కౌతా శ్రీరామ శాస్త్రిగారు పంతులుగారి దర్శనభాగ్యం కలిగించినారు చివరిసారి 1937 జనవరిలో శ్రీబాగు భవనంలో ఒక్క అరగంట వారితో మాట్లాడినాను ఆ నెల భారతిలోనే ప్రకటించబడ్డ 'వాకిలెరిగినవాత'ను గురించి వారు చేసిన ప్రశంస నా కిప్పటికీ వింటున్నట్టే వున్నది

సుమారు ఈ 22 సంవత్సరాలలోనూ వారి వల్ల నేను పడసిన సాహాయ్యం నిజంగా పరిమితి చెప్పలేనంతగా వున్నది దేశంలో, వివిధాలైన వుద్యమాలు నడుపుతున్నవారి కందరికీ, భాషా వ్యవసాయుల కందరికీ, వాఙ్మయ నిర్మాతల కందరికీ ఒక్కొక్క చిక్కు తటస్థించి, మనస్సంతా చికాకయిపోయి, మెదడు చెదరిపోయే స్థితి వచ్చినప్పుడు — "ఏమిటి దిక్కు" అని కంగారు పుట్టినప్పుడు ఆంధ్రపత్రికా కార్యస్థానంలో కూచుని, "కాషియర్ దగ్గిరికి పట్టుకుపోండి" అని చీటీ అందిస్తూన్న నాగేశ్వరరావు పంతులుగారి సుప్రసన్నమూర్తి సాక్షాత్కరించి, మళ్లీ నవశక్తి సంఘటిస్తూ వుండేది

ఇవాళ, జాతి, అలాటి అవలంబాన్ని నష్టపడింది ఇలాగ, నాగేశ్వరరావుపంతులుగారి మృతి వల్ల కలిగిన దుఃఖం వ్యక్తులకు మాత్రమే సంబంధించినది కాక జాతికంతటికీ సంబంధించింది

నన్ను స్తబ్ధుణ్ణిచేసిన సన్నివేశం యిదీ

— శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## బందరు శైవసభశాఖ

బందరు, బుట్టాయిపేటలో కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడుగారి గృహమున బందరు శైవసభాశాఖా సంఘమువారు మల్లంపల్లి సోమన్నయ్యవారి యధ్యక్షతను సమావేశమై యీ దిగువ తీర్మానమును చేయడమైనది.

"శ్రీ లోకారాధ్యులైన విశ్వదాత, కళా ప్రపూర్ణ, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు శాశ్వత శివసాయుజ్యసిద్ధి నొందినందులకు వారి కుటుంబమువారికి సానుభూతిని చూపుచున్నారు"

శ్లో॥ శ్రూయంతే శిబికర్ణ ముఖ్యమనుజా
ధీశాః కృపాశాలినః
దాతృత్వాం బుదశాంత దైవహత వి
ర్భాగ్యక్షుధా పావకాః
తత్సర్వం కవికల్పనేతి హసితం
యున్నాస్తికైరద్యత
ప్రత్యాఖ్యాతు మివస్మ సంభవతికా
శీనాథ నాగేశ్వరః

— మల్లంపల్లి సోమన్నయ్య

## నాగేశ్వరరాయ స్మృతి

క. శశ్వద్గతి జగమును పర
మేశ్వర బుద్ధిన్ భజించి, యిహ లోకమునన్
శాశ్వత యశముం గవి నా
గేశ్వరుఁ డానందమయుత నీశ్వరుఁ జేరెన్

క. తన జీవిత సర్వస్వము
నమపమితోదాత్తపరణి నాంధ్రాభ్యుదయం
బున కట్టి ధారవోసిన
ఘనుడుంబడె నౌర కాలగర్భములోనన్.

సీ. కమ్మకమ్మఁగ మంచి కననమ్ముఁ జెప్ప నే
ర్చిన మేల్మికవుల లేఖినులయందు
జీవకళల్ దొల్క చిత్రసృష్టి యొనర్చు
చిత్రలేఖకుల కూర్చికలయందు
మొద్దుబండలకును మూర్తి కల్పనసేయఁ
గల శిల్పివరుల పోగడలయందు
మోదులు జివురింప మూర్ఛనల్ గూర్చు గం
ధర్వుల కలనాదములయందు

విశ్వమానవ మానస వీధులందు
తాండవించుచు నున్నాఁ డఖండలీల
శాశ్వతత్వంబునెవసి నాగేశ్వరుండు
ఆ మహాతేజమునకేమి అంతమేమి?

— దీపాల పిచ్చయ్యశాస్త్రి

ఆంధ్రపత్రిక 1938
ఏప్రిల్ 27 పంచిక మంచి




"ఏడుకొండలవాడా! వెంకటరమణా గోవిందా! గోవిందా" అనుకుంటూ తిన్నగా తిరుపతి చేరి ఎకాఎకిని ఆ ఊళ్ళోనే ఉంటున్న మా సోందేవమ్మత్తగారింటి కెళ్ళాను

బొత్తిగా తలమాసినవాడిలా ఉన్న నన్ను చూసి 'పరీక్ష క్షవరంకాకుండా కాపాడినందుకు స్వామి సమక్షంలో నున్నగా (అంటే దూరపు కొండలా) క్షవరం చేయించుకోడానికి వచ్చి ఉంటాడు' అనుకున్నారు మా సోందేవమ్మత్తా అండ్ ఫెమిలీ

కక్కు వచ్చినా, కల్యాణం వచ్చినా ఆగదన్నారు పెద్దలు క్షవర కల్యాణం విషయం కూడా అంతేనేమో!! 'కళ్యాణకట్ట' నేను వెళ్ళేసరికి చాలా హడావిడిగా ఉంది భక్తులంతా వరుసగా కూర్చుని 'గుండ్లు' చేయించుకుంటూంటే చూడముచ్చట వేసింది నా మట్టుకు నాకు గడ్డం మీసాలతో బూచాళ్ళల్లా వచ్చిన వాళ్ళందరూ 'సానపట్టిన వజ్రాల్లాంటి' గుళ్ళతో మెరుస్తూ వెళ్ళిపోతున్నారు

"ఆహా!" అని ఆనందతన్మయుణ్ణి అవుదామనుకునే లోపులో "ఏంది స్వామీ! అలా దిక్కులు చూస్తూవుండావ్?" అని నన్ను లాక్కెళ్ళి బలవంతాన కూర్చోపెట్టి గుండు గీసెయ్యడం మొదలు పెట్టాడు బీజపూర్ సుల్తానులా ఉన్న ఒకానొక "మంగలిమంత్రి"

నాకు చెడ్డ సిగ్గేసింది గుండు గీయించుకుంటుంటే తాళికట్టించుకునే పెళ్ళికూతురిలా సిగ్గుతో తలొంచేసుకున్నాను (అసలు ఆ మాట కొస్తే ఈ రోజుల్లో పెళ్ళికూతుళ్ళు కూడా నాలా వంచుకోరు అయినా మహామహావాళ్ళే మంగలి ముందు తల వంచాలిగా అని సరిపెట్టుకున్నా)

గుండు గీయడానికి అట్టేసేపు పట్టకపోయినా ఆ కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చోలేక —

"నువ్వు రోజుకి ఎన్ని గుళ్ళు గీస్తావు!!?" తల వంచుకునే అడిగాను

"ఎంత లేదన్నా మామూలు రోజుల్లో రెండు, మూడు డజన్లు గీస్తాను"

"ఏమిటి!? దీనికి మామూలు రోజులూ— ప్రత్యేక రోజులూ ఉంటాయేమిటి?"

"ఉంటాయండి పరీక్ష రిజల్ట్సు వచ్చే రోజులు చూడాలి ఇసుకవేస్తే రాలరు జనం తండోపతండాలు కదండీ"

ఇంకా ఏదో అడుగుతుంటే 'పూర్తయ్యింది' అన్నాడు

చెయ్యి అనుకోకుండా నెత్తిమీదకు వెళ్ళింది 'సొగసైన క్రాపు పోయిందని' తెలుసుకోడానికి క్షణంలో సగం సమయం పట్టలేదు

"నీటిబొట్టు ఆగదంటే నమ్మండి" అన్నాడు మంగలి.

అదెంత నిజమోనని ఓ రెండు నీటిబొట్లు 'గుండు'మీద వేయించాను అవి జారటం మాటెలాఉన్నా పుండుమీద కారం జల్లినంత మంట పుట్టింది. 'బాధ భరించలేక అమ్మో' అన్నాను.

"నేను నయమండి మిగతావాళ్ళయితే చిత్రవధ చేస్తారు. . నలభై ఏళ్ళ సర్వీసు" అన్నాడు.

రోజుకు రెండు డజన్ల చొప్పున నలభై ఏళ్ళకు ఎన్ని గుళ్ళు! గీశాడో!?

నిజమేనేమో! మరి అనుకుంటూ మరోసారి నా గుండును తనివితీరా చేత్తో రాసుకుంటూంటే వెనకనుంచి ఎవరో "సాక్షాత్తూ కుమారస్వామిలా ఉన్నాడు" అనుకుంటున్నారు. (కుమారస్వామికి గుండు అవునా, కాదా అని ఆలోచించండి. మరి)

'నున్నటి గుండు' చూస్తే ఎవరికైనా వరె ఒక్కసారి చెయ్యి వెయ్యాలనిపిస్తుంది. (వెనుకటికి ఒకరు (గుండాయన) ఎవరో మరొకర్ని అడిగారుట "నీ తీరని కోరిక ఏమిటి!?" అని అంటే రెండో ఆసామీ జవాబిచ్చాడుట "మీలాంటివాళ్ళ నున్నటి గుండు మీద 'ఐస్'మీద జారినట్టుగా జారాలనిపిస్తుంది' అని). పరమలు సంగీత పాతకులైతే 'రామ కీర్తన' పాడిస్తే!? అన్పిస్తుంది గుండు చూడగానే.

ఇంటికి రాగానే (కొండదిగి) సోందేవమ్మత్త నా గుండు 'చలిమిడి ముద్దలా ఉంది' అంది. అంతవరకూ 'నా గుండు తడిమి చూసుకున్నానేకాని— ఆ గుండు సౌందర్యాన్ని సరిగా తిలకించే భాగ్యం నాకు అప్పటివరకూ కలగలేదేమో. ఎదురుగా కనుపించిన నిలువుటద్దం ముందర నిలుచున్నాను.

గుండుకి కొంచెం మానెతడి తగిలింది కాబోలు. చుట్టుపక్కల్నించి సూర్యకాంతి కిరణాలు 'గుండు'మీద పడి ప్రతిఫలిస్తుంటే ప్రకృతి సౌందర్యం అంతా నా గుండు మీదే ఉందేమో! అనిపించింది. (దగ్గరగా ఎవ్వరైనా వచ్చి నా గుండువైపు చూస్తే తప్పకుండా వారి ప్రతిబింబం కన్పిస్తూంది— అనుకున్నాను)

బాబిగాడు "బోడిగుండు బొప్పాసిగుండు"

గుండు కథ....



అని లోలోపలే అనుకున్నాడు బొబ్బాసి గుండేమిటి!? గాడిద గుడ్డు

అంత అందమైన గుండుని ఎండవానలకు వదిలేస్తే దాని సొగసు తగ్గిపోతుంది కదూ !! అందుకని దానికి తగిన 'గుండురక్ష' ఏదైనా కొనడానికి బజారుకి బయలుదేరాను

స్వరాజ్యం సంపాదించిన రాజ్యంలా తల యొక్క ఉపరితలం స్వేచ్ఛా వాయువులు పీలుస్తోంది రోడ్డుమీద నడుస్తూంటే మనస్సు పరిపరివిధాల పోయింది రకరకాలైన ఆలోచనలు ప్రారంభమయ్యాయి

"అందుతే జుట్టు లేకపోతే కాళ్ళు పట్టుకునే వాళ్ళు కూడా మనల్ని ఏమీ చెయ్యలేరు ఎందుకంటే మనకి గుండు కాబట్టి మన పిలక వాడి చేతిలో ఉంటే' అనే భయం అసలే లేదు అసలు 'పిలక' అనేది భూగోళ పరిశీలకుల దృష్టిలో ఏ చెట్టూలేని ఎడారిలో ఆముదం చెట్టు లాంటిది మొన్న మొన్నటిదాకా ఉపనయనం చేయించుకున్న వాళ్ళకి ఈ పిలక బాధ తప్పేది కాదు అయినా ఒక పిలక అయితే ఫరవాలేదు ఒకడి చేతిలోనే ఉంటుంది పంచ శిఖలూ అయిదుగురి చేతుల్లో పడితే 'ద్రౌపది' లాగ బాధపడవలసి వస్తుంది.

మరీ పూర్వకాలంలో 'పతి'ని కోల్పోయిన 'సతి' ఈ బాధ భరించలేకనే కాబోలు 'సహగమనం' చేసేదట

రానురాను "ప్రజలు గుండు విలువ గుర్తించారు ఏకమత్యంతో పోనుపోను ఇంకా గుర్తిస్తారు దేశం అభివృద్ధిలోకి వస్తుందని అభిజ్ఞ వర్గాలవారు అనుకుంటున్నారు" అని ఆయనెవరో ఉద్ఘాటిస్తూ ఇలా అన్నారు—ఇంకా ఇలా అన్నారని ఇంకో ఆయనెవరో చెప్పారు.

"గండపెండేరాలు వేయించుకున్న గుండు కవులెందరో బ్రహ్మాండంలో ఉన్నా అందాన్నీ ఆనందాన్నీ పిండి—గుండకొట్టి 'గుండు'లాగ చేసి సదరు 'గుండు'కి 'చందమామ' అని చక్కగా పేరెట్టుకుని తమ కావ్యాల్లో వర్ణించుకున్నారు అటువంటి చంద్రుడిలోనైనా మచ్చలు ఉంటాయి గాని—సిసలైన గుండు మాత్రం వంకలేవి నెల వంకలాగ ఉంటుంది

అందుకనే కవి కుమారులు మన గుండుని కురిడీతో మిళాయించి ఉప్మాలంకారం చేసేస్తారు

కవిత్వం లాగానే కొంతమందికి గుండుకూడా సహజంగానే వస్తుంది అటువంటి గుండుని 'బట్టతల' అంటారు వాటిల్లో మళ్ళీ చాలా రకాలున్నాయి

కొంతమందికి చూడముచ్చటగా 'వరండా' లాగ కొంచెం బట్టతల — అదైనా కేవలం లాంఛనప్రాయంగా ఉంటుంది

మరికొందరిలో నుదురు ముదరి అంటు వ్యాధిలాగ, లేకపోతే విజయనగర సామ్రాజ్యంలాగ విస్తరించి, సముద్రంలాగ లోపలికి చొచ్చుకుని పోతుంది

కొందరికి "మండువా"లాగ తల మధ్యలో ఉంటుంది బట్టతల అరుదుగా కొందరికి పాత రాతి కోటలాగ మధ్యలో 'నిగనిగలాడే గుండూ'— ప్రహరీ చుట్టూ కందకంలాగ ఓ వరస వెంట్రుకలూ ఉంటాయి అటువంటి బట్టతలలున్న



వాళ్ళు శీతాకాలంలో పెళ్ళికి వెళ్ళినప్పుడు పన్నీరు జల్లితే చలివేస్తుంది

ఎండాకాలంలో తామరాకుమీద నీటిబొట్టుల్లాగ చెమట పడుతుంది అసలు ఈ బట్టతలలు స్థిరాస్తుల్లాగ తాతముత్తాతల దగ్గర మంచి సంప్రాప్తిస్తాయని జనన శాస్త్రజ్ఞు! అంటారు

అందుకనే కాబోలు—పురాతన వస్తుసామగ్రి మీద అభిమానం కలవారికి మన గుండు కొత్తగా గిలాబా చేయించిన 'సాంచీ' స్థూపంలాగ అన్పిస్తుంది

శాస్త్రజ్ఞులకి మటుకు కాంక్రీటు చేయించిన విమాన ఆశ్రయం జ్ఞాపకం వస్తుంది జీవశాస్త్రజ్ఞులకి గుండుని చూస్తే రకరకాలైన గుడ్లూ, గుండెలూ జ్ఞాపకం వస్తాయి వాటికీ, వీటికీ అవినాభావ సంబంధం — అదీ సంగతి

గుండుకి ఇంత ప్రత్యేకత ఉన్నా తిరుపతి




వీధుల్లో మనల్ని ఆట్టే పట్టించుకోలేదు ఎవ్వరూ ఎక్కడ చూసినా గుండూ, గుళ్ళూ, గోపురాలు, శతకోటి లింగాల్లో మనమూ ఓ బోడిలింగాలం అయితే మటుకు!? ఎవడి గుండు వాడికి ముద్దు (గిరీశంగారు చెప్పినట్లు 'సజీవ సాలగ్రామం' కదా )ఆలోచిస్తూ నడుస్తున్న నాకు గుండుతో స్నేహితుడొకడు ఎదురయ్యాడు వీధి మలుపులో అతి కష్టంమీద ఒకరినొకరు పోలిక పట్టుకున్నాం

ఇద్దరం కలసి పోతుంటే "జోడు గుండ్ల పిస్తోలు — హా" అన్నారు వెనుకనించి- ఎవరో వెనక్కు తిరిగి చూశాం

"గుండు డు, ము, వు, లు ప్రథమా విభక్తి" అనేసి పారిపోయా డొక హైస్కూలు విద్యార్థి

'ఏదో చాలాకాలానికి కలిసాం కదా' అని కూల్ డ్రింకు తాగడానికి ప్రక్కనే ఉన్న డ్రింక్ షాపులోకి వెళ్ళాం డ్రింక్ తాగుతూ తల ఎత్తేసరికి అన్నీ గుండ్లే చుట్టూ అద్దాలు ఎటు చూసినా, నా గుండూ లేకపోతే మావాడి గుండూ ఎదురుగా చూశాను పంపరపనస కాయల్లాంటి గుండుల పరంపర వెనకో అద్దం, ముందో అద్దం పైకి చూస్తే అక్కడా గుండ్లే మాకు గాభరావేసి బయటికి వచ్చేశాం

ఉన్నట్టుండి "ఏమిటాలోచిస్తున్నావ్ ?" అనడిగాడు వాడు "గుండు గురించి" అన్న నా జవాబుకి "ఇదొకటి కోతికి కొబ్బరికాయ దొరికినట్టు" అన్నాడు (అసలు నా గుండు చూస్తే ఆ గుండుకి అసూయ కాబోలు).

దగ్గర్లో ఉన్న కొట్టుకెళ్ళి "ఇక్కడ టోపీలు" అని అడగబోతూంటే

"మీకా సందేహం అక్కర్లేదు, దయచేయండి" అన్నాడు కొట్టువాడు

పైగా "మంచి పాకెట్టు దువ్వెనలున్నాయి ఇమ్మంటారా!?" అని వాడే అడిగాడు నాకు అరికాలు మంట నడిగుండు కెక్కింది (నడినెత్తికి అనడానికి — అప్పుడు నాకున్నది గుండే కదూ !)

ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వజ్రోత్సవ సందర్భంగా

మా శుభాకాంక్షలు!



SREE PUBS.

Bachi

లక్ష్మీ చిత్ర
విజయవాడ

శ్రీ లక్ష్మీ చిత్ర
సికింద్రాబాద్

''వెధవ్వెధవ్వేళ్లయ్యక టోపీలుంటే ఏడవ మన్నా''ను

వాడు ఏడుస్తూనే ముందు నా 'గుండు' ఉగరితలాన్ని పరిశీలించాడు 'టేప్'తో చుట్టు లత చూసాడు ఘనపరిమాణం లెక్కల్లో ఇంటి కప్పుకేసి చూస్తూ ఏదో మంత్రాలు చదువుతున్నట్లు మొహం పెట్టాడు దూలాలు లెక్క పెడుతున్నాడేమో! అనుకున్నా

''సైజు నెంబరు ఇరవై రెండు సరిపో తుంది'' అన్నాడు చివరికి ఏదో సాధించినవాడిలా

అక్కడితో ఊరుకోక టోపీ వెయ్యడం ప్రారంభించాడు

'గాంధి టోపీ పెట్టుకుంటే అచ్చు నెహ్రూగారిలాగ ఉంటానట సేట్‌జీ టోపి పెట్టుకుంటే అచ్చు హిందీ సినిమా యాక్టర్లా ఉంటానుట ఈవెనింగ్ హేట్ పెట్టుకుంటే సాక్షాత్తూ మన్మధుడు యూరోపియన్ డ్రెస్సులో వచ్చినట్టుంటానట,'

ఇంకా ఏదో చెప్పబోతుంటే ''గుండుతో ఉంటే, హాలీవుడ్ స్టార్‌లాగా ఉంటా, అయినా ప్రమాదమే ఎవరూ పోలికపట్టలేరు ఏం చేస్తాం!?'' అని కొట్లోంచి బయటికి వచ్చి అత్తయ్యగారింటికి వచ్చేసాను

సేమియా పాయసం తాగి సొందేనమ్మత్త దగ్గర సెలవు తీసుకుని సామాన్లు పట్టుకుని తిరుగుప్రయాణానికి సత్రం దగ్గర కొచ్చాను

అక్కడ ఒక అమాయకుడు వెర్రిగా నాకేసి (అంటే నా గుండుకేసి) చూడ్డం మొదలు పెట్టాడు 'పోనీలే పాపం నాలో ఏమైనా 'దలైలామా' పోలికలు కనిపిస్తున్నాయేమోలే' అనుకున్నాను

దగ్గరగా వచ్చి చెయ్యెత్తుతున్నాడు

ఇదేమిట్రా బాబూ! కొడతాడేమిటి చెప్మా కొంపతీసి —

మెత్తనిగుండు చూస్తే మొత్తబుద్ధి వేసిందేమో? అనిపించింది

తీరా చూస్తే చెయ్యెత్తి నమస్కరించాడు 'ఎందుకు నమస్కరించావ్?' అని అడుగుతే బాగుండదని – అర్థంలేని నవ్వు ఓటి నవ్వి ఊరుకున్నాను

''అయ్యా! మిమ్మల్ని చూస్తే నమస్క రించే బుద్ధి పుట్టింది నేను ఎన్నో గుండ్లు చూశాను కాని 'ఇంత విలువైన గుండు' ఎక్కడా చూడలేదండీ అన్నాడు తను మహా గుండు యొక్క నాణ్యం కట్టేవాడిలాగ

రాజకుమారులకి 'రాజఠీవి' అబ్బినట్లు మనకి 'గుండు ఠీవి' అబ్బి నన్ను చూసి ఏ 'క్షవర కళ్యాణానందస్వామి' అనుకున్నాడో అనుకున్నా

అంతలో బస్సు వచ్చింది లోపలికి ఎక్కి హాయిగా కూర్చుని గుండుమీద చెయ్యి వేసుకొని

# గుండు కథ

తడుముకుంటూ ''బస్సు ఎప్పటికి కదులుతుందో కదా?'' అని ఆలోచిస్తున్నా

అంతలో ఓ పడుచు యిల్లాలు వచ్చి వెనుక నించి ఎడ పిల్లాడ్ని ఎత్తి కుదేసింది నా ప్రక్కనే, చంటాణ్ణే పదిలంగా నా వళ్లో వదిలేసి ''జరగండి, అలా దిక్కులు చూస్తారేమిటి?'' అని నా మొహంవైపు చూసి ఆశ్చర్యపోయి నన్ను తోసి కూర్చున్న మనిషి అలాగే సిగ్గుపడిపోయింది

ఆవిడ భర్త కాబోలు వచ్చి ''అదేమిటే! నీ అఘాయిత్యం మండా'' అంటూ నోరు తెరుచుకుని ఉండిపోయాడు

తమాషా ఏమిటంటే ఆయనకీ గుండే !!! (నాకుమల్లే)

మొత్తానికి మరేం గొడవల్లేకుండా మరక్షితంగా ఇల్లు చేరుకున్నాను



నన్ను చూడగానే ''చచ్చి స్వర్గాన్ని ఉన్న బామ్మగారు లాగూ చొక్కా వేసుకుని వస్తేం దేమిటి చెప్మా!!!'' అనుకున్నారుట నాన్నగారు.

నాన్నగారికి ''నా గుండు'' బామ్మగారిని స్మరణకి తెచ్చిందంటే అందులో అతిశయోక్తి ఏమీలేదు బామ్మగారి 'గుండు' చూసే యోగ్యత భాగ్యం లేకపోయినా అందరూ చెబుతూంటే విన్నాను అసలు బామ్మగారి గుండే గుండుట

ఆవిడ నెలకొకసారి, మామిడి చిగురులా మొలకెత్తిన గుండుమీద మల్లిపందిరలాంటి తెల్ల వెంట్రుకల్ని, మంగలిని పిలిపించి అరగంటసేపు బేరమాడి నిమిషాల్లో తీయించి చేత్తో తడిమి చూసుకుని సంతృప్తి చెందిన తరువాతే డబ్బులిచ్చేదిట (ఆయనే ఉంటే నువ్వు పావలా అడుగుదువా!?'' అన్న జోకు మొట్టమొదట ఆవిడే వేసిందట)

ఆ రోజుల్లో బామ్మగారి 'గుండు' ముందు అన్ని గుండ్లూ బలాదూరేనట కాని ఆవిడ చాలా నిరాడంబరురాలు కాబట్టి గుండుకి ముసుగు వేసేదట ఆదీకాక పూర్వం ముసుగు లేకపోతే రాత్రిళ్ళు హరికధల్లో చీకట్లో లింగభేదం తెల్సేది కాదుట

మునుపు మునుపుగా గుండు చేయించు కోడానికి మొహమాట పడినవాళ్లు ముందు సగం గుండు చేయించుకుని మిగిలిన సగం జుట్టూ 'కొత్తిమీర కట్ట' లాగ ముడివేసుకునేవారుట (అంతకు ముందు జన్మలో ఆడవాళ్లయినవారు ఆ ముడిలో పువ్వులు కూడా పెట్టుకునేవారట)

కొన్ని కొన్ని రోజుల తర్వాత ఇది పూర్తిగా ''అవుటాఫ్ ఫేషన్ అయిపోయింది'' ఎంతైనా గుండు అందం గుండుదే !!!! ఏమంటారూ !!!?

మర్నాడు స్వామివారి ప్రసాదం యివ్వడానికి శాంతక్కా వాళ్లింటికి వెళ్ళాను నన్ను చూడగానే నవ్వు ఆపుకుంటూ ''ఏమిటి విశేషాలు?'' అని అడిగింది

''ఏం ఉన్నాయి! ఇదే ఓ విశేషం'' అన్నాను ఒక చేత్తో గుండు తడుముకుంటూ మరో చేత్తో లడ్డూ యిస్తూ

లడ్డూనీ – నా గుండునీ చూసిన పాప, ''అమ్మా రెండు గుండులు'' అది అసలే పిసిండ్రీవాటం అది అలా అంటే నాకు మహా పిగ్గేసింది.

''తప్పు, తంబు మామయ్యని గుండు అనొచ్చా?'' అని శాంతక్క వెంటనే పాపని కొప్పడేసింది

అది వింటేగా? మిరపకాయ సరుకు

''తంబు మామయ్య కాదు గుండు మామయ్య'' అంది తప్పట్లు కొడుతూ

శాంతక్క నవ్వుతూనే ''తప్పు గుండు అనకూడదు'' అని మళ్లీ వన్స్‌మోర్‌గా నవ్వింది నాకేమో ఉడుకుమోత్తనం వచ్చింది

''అమ్మా, మొన్న సినిమాలో ఈ గుండు గాడే కదే చాకు పట్టుకుని అందర్నీ ఏడిపించాడు?'' అని మళ్లీ మొదలెట్టింది పాప (దానికి వస ఎక్కువ పోశారేమో చిన్నప్పుడు?)

అర్థంటెగా ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ''ఫుట్‌బాల్ మేచ్‌కి వెళ్లాలి'' అని లేచాను పాప బాధ భరించలేక

''నేనూ వస్తాను తీసుకెళ్లవా!?'' మారాం చేసింది అది

తీసుకెళ్లనంటే ఇంకేమన్నా ఉందా? చచ్చినట్లు 'సరే' అన్నాను (దారిలో అల్లరి చెయ్యనని ముందరే దానిచేత వప్పించి)

మేం వెళ్లేసరికే చాలమంది జనం వచ్చి కూర్చున్నారు మేచ్ మొదలయ్యింది పాప అల్లరి కూడా మొదలయ్యింది

''గుండు మామయ్యోయ్'' అంది గట్టిగా జనం అంతా నావైపు చూశారు అసలీ గుండు నాకదోలా అనిపించింది అందులోనూ మా వెనక



ఏ.వి.యం. ప్రొడక్షన్స్ శ్రీ సారథి స్టూడియోస్ ప్రైవేట్ లిమిటెడ్

## మూడుముళ్లు

చంద్రమోహన్, రాధిక, గీత

జంధ్యాల కె.భాగ్యరాజ్

శశిభూషణ్

---

సురేష్ ప్రొడక్షన్స్

## సంఘర్షణ

చిరంజీవి, నళిని, విజయశాంతి

దర్శకత్వం మురళీమోహనరావు

నిర్మాత: డి.రామానాయుడు

కోస్తా జిల్లాలకు

---

మధు ఆర్ట్ ఫిలింస్

## మూగవాని పగ

మోహన్‌బాబు, కవిత

సత్యనారాయణ

దర్శకత్వం బోయిన సుబ్బారావు

నిర్మాత అబ్బాయినాయుడు

---

ఆండాళ్ ప్రొడక్షన్స్

## మానసవీణ కలర్

?? ??

దర్శకత్వం రేలంగి నరసింహారావు

నిర్మాత: రామ అరంగణ్ణళ్

సంగీతం: ఎమ్.ఎస్.విశ్వనాథన్

---

సురేష్ ప్రొడక్షన్స్

## తదుపరి చిత్రం కలర్

శోభన్‌బాబు, శ్రీదేవి

దర్శకత్వం కె.బాపయ్య

నిర్మాత డి.రామానాయుడు

(కోస్తా జిల్లాలకు)

---

అన్నపూర్ణ పిక్చర్స్ ప్రై.లి.,

## ప్రొడక్షన్ నెం. 17 కలర్

?? ?? ??

?? ?? ?? ??

నిర్మాత: డి.మధుసూదనరావు B.A.

---

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

## తదుపరి చిత్రం కలర్

?? ?? ??

?? ?? ?? ??

నిర్మాత: ఏ.వి.సుబ్బారావు

---

సురేష్ ఎంటర్‌ప్రైజెస్

## ప్రొడక్షన్ నెం.3 కలర్

కృష్ణ, జయప్రద

దర్శకత్వం: విజయనిర్మల

నిర్మాత: డి.సురేష్‌బాబు

(కోస్తా జిల్లాలకు)

---

వెంకటేష్ ఎంటర్‌ప్రైజెస్

## ప్రొడక్షన్ నెం.3 కలర్

మోహన్‌బాబు మొ॥

దర్శకత్వం: బోయిన సుబ్బారావు

నిర్మాత. డి.వెంకటేష్

(కోస్తా జిల్లాలకు)

---

రజతోత్సవం జరుపుకున్న

సురేష్ ప్రొడక్షన్స్

## ముందడుగు



దర్శకత్వం

కె.బాపయ్య

నిర్మాత

డి.రామానాయుడు

---

రజతోత్సవానికి పరుగులు తీస్తున్న

అమరావతీ ఆర్ట్స్

## డార్లింగ్ Darling డార్లింగ్

కలర్



కె.భాగ్యరాజ్

---

విజయవంతంగా నడుస్తున్న

అనంతలక్ష్మి ఇంటర్‌నేషనల్

## పండంటి కాపురానికి 12 సూత్రాలు

కలర్



నిర్మాత డి.భాస్కరరావు

దర్శకత్వం రాజాచంద్ర

---

# నవయుగ ఫిలింస్

విజయవాడ సికింద్రాబాద్

అంతా మా కాలేజీ అమ్మాయిలే కూర్చున్నారు

తను చేసే అల్లరికే అందరూ నవ్వుతున్నారు కదా అని ''గుండు మామయ్యోయ్'' అంది మళ్ళీ గొప్పగా — గట్టిగా

ఇదే సమయం అనుకుని నామీద పూర్వం కోపంగా ఉన్న అమ్మాయిలు కొందరు కష్టపడి చెమటోడ్చి మరీ నవ్వారు

నాకు నామోషీ అనిపించింది ''ఏమిటి?'' అని అడిగేశాను కోపంగా

''ఇక్కడ చీమలున్నాయి'' అని రెండో ప్రక్కకు వచ్చి కూర్చుంది

ఈ లోపులో ఒక 'గోల్' అయింది

ఉన్నట్టుండి ''గుండు మామయ్యోయ్'' అంది మళ్ళీ

ఇంక లాభంలేదు దీన్ని మంచితనంతోనే సాధించాలని అనుకుని మచ్చికచేసుకోడానికి వెంటనే చాక్ లెట్ ఒకటిచ్చాను

పాపం అది మంచిపిల్లే! అల్లరి చెయ్యకుండా చాక్ లెట్ తింటోంది మాచ్ మంచి పట్టులోకి వచ్చింది ''గోల్'' అవ్వబోయి, మానెయ్యబోయి మళ్ళీ అయిపోతుందేమో అనిపిస్తోంది నా ప్రక్కన ఉన్న ఆయన తుమ్మనా వద్దా అని చాలాసేపు ఆలోచించి చివరకు 'గోల్' అయ్యాక తుమ్ముదాం అని వాయిదా వేసుకున్నాడు

''గుండు మామయ్యోయ్ ''

నా నోటంపట మాట లేదు

బ్యాక్ గ్రౌండ్ లో నవ్వులు

''చాక్ లెట్ అయిపోయింది ''

# గుండు కథ

వెంటనే మరో చాక్ లెట్ తీసి పాపనోట్లో పెట్టేశాను

అంతలో ''టప్ టప్'' అని ఏమిటో చిన్న చిన్నవి నా గుండుమీద పడ్డట్టు నాకు అనుమానం వేసింది వెనక్కి తిరిగి చూశాను అందరూ మ్యాచ్ చూస్తున్నారు మళ్ళీ ఇటు తిరిగాను ఇంకో మూడు, నాలుగు పడ్డాయి ఏమిటి? అని పక్కల్ని చూశాను కనిపించినవి బటాణీలు

వెనక్కి తిరిగి చూశాను మా పక్కింటి అమ్మాయి 'సురేఖ' కూడా వచ్చింది మ్యాచ్ మంచి హుషారుగా చూస్తున్నారు అందరూను అదే గోలలో పాప 'గుండు మామయ్యోయ్' అంది కాని ఎవరికి వినిపించలేదు వెంటనే నా దగ్గరున్న చాక్లెట్లన్నీ ఇచ్చేశాను దాని బాధ పడలేక.

అంతలో మళ్ళీ జలజల రాలాయి నా గుండు మీద బటాణీలు — (బటాణీలే ఇంత బాధ పెడుతున్నాయి వడగళ్ళవాన పడుతే? అమ్మో! అనుకున్నాను) వెనక్కి తిరిగి చూశాను దొంగ దొరికిపోయింది మా పక్కింటి అమ్మాయి నన్ను బటాణీతో కొట్టడానికి రెడీగా ఉంది నన్ను చూడగానే ఎత్తిన చేతిలో బటాణి ఏమీ తెలియనట్లు తినేసింది

మళ్ళీ మ్యాచ్ చూస్తున్నాను బంతి ఆకాశంలోకి కొట్టేశాడెవడో సరిగా కావాలని నా మీద పడాలనే కొట్టాడేమో అనిపించింది బంతి నా గుండుమీద పడుతుందేమోనని అనుమానం వచ్చి గబుక్కున రెండు చేతుల్తో గుండు కప్పేసుకుని ఒక్కసారిగా తల వంచేశాను అయితే బంతి నా వైపు రాలేదు మా వెనుక కూర్చున్న కోమలాంగులు గొల్లున నవ్వారు ఇంక అక్కడ కూర్చోలేక బయటకు వచ్చేశాను

'గుండు' అంటే అందరికీ ఎందుకింత లోకువ అని నాకు ధర్మసందేహం వచ్చింది. ఎందుకైనా మంచిదని అద్దంలో మరోమారు చూసుకున్నాను

సినిమాల్లోలాగా అద్దంలో నా బదులు నా అంతరాత్మ కనుపించింది నన్ను చూసి నవ్వింది చిరాకేసి ''యూ టూ బ్రూటస్'' అన్నాను భారంగా.

''నాయనా అందంగా ఉన్నాననుకోవడం మానవుడి మొదటి పొరబాటు దానికితోడు అద్దాలు అబద్దాలు చెబుతున్నాయి పైపై మెరుగుల క్రాపింగులు తీసేస్తే విగ్గు తీసిన సత్యం నిగ్గు తేరినట్టు బయటపడుతుంది. హాఁ! హాఁ! ఇదీ నీ నిజస్వరూపం అందానికి అర్థంలేదు హాఁ! హాఁ!'' నన్ను చూసి పక్కున నవ్వేసింది నా అంతరాత్మ

అయినా నాకు నమ్మకం కుదరలేదు అదీగాక అంతరాత్మ మాట విన్నవాళ్ళు ఎవరూ (నాకు తెలిసినంతవరకూ) బాగుపడలేదు నిక్షేపం లాంటి 'నా గుండు' అందంగా లేదుట

అసలు అందం అనేది లేదుట ఏడిసింది అంతరాత్మ అనుకున్నాను ఏమయినా గుండు మీదికి మళ్ళింది నా ఆలోచన ''అసలు యీ దేవుడికి గుండు సరదా ఏమిటి చెప్మా!'' అని సందేహం వచ్చింది ఎంత ఆలోచించినా అంతు చిక్కలేదు

ఒకవేళ భక్తుల ''గుండుల'' మీద జలతరంగిణిలాఏదైనా వాయిద్యం వాయిస్తాడేమో అనుకున్నాను.

''ఏడిశావ్'' అంది అంతవరకూ నిశ్శబ్దంగా ఉన్న అంతరాత్మ

ఇంతకూ ''గుండు'' అనేది అందంగా ఉంటుందో ఉండదో తెల్సుకోలేక పోతున్నాను ఈ వెధవ అంతరాత్మతో!

ఏమైనా మీరే చెప్పండి—గుండు అందంగా ఉండదూ!!!?

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
1962 జూలై 6 సంచిక నుంచి

## బ్రాహ్మణ పట్టభద్రుడు
## చెప్పుల పని చేయుట

షికార్పూర్, జనవరి 16

దత్తు అనునతడు కాశ్మీర బ్రాహ్మణుడు పంజాబు విశ్వవిద్యాలయంలో బి ఏ చదివి ఉత్తీర్ణుడయ్యెను చేతి పనులు చేసి జీవించుటలో ప్రతిష్ఠకు వచ్చే లోపము లేదనిన్ని అట్టి చేతిపనులే చాల గౌరవప్రదములనియు చేతిపనులనే విద్యావంతులలో ప్రోత్సహించుటకును నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటకును ఏర్పాటు చేయబడిన ఒక సంఘంలో యీ దత్తుగారు సభ్యులు ఈయన ఒక చిన్న సంచిలో నల్లరంగు గోధుమ రంగు కాటుక డబ్బీలను రెండు బ్రష్‌లను మాత్రము ఉంచుకొని వీధులవెంట తిరుగుచుండెను ఎవరికయినా బూట్సులకు మెరుగు పెట్టవలసియున్నయెడల మెరుగుపెట్టి ఒక అణా డబ్బులు తీసికొనును ఇటీవల ఒక డా॥ తన బూట్సులకు మెరుగు పెట్టినందులకై ఆ బి యే పట్టభద్రునకు ఒక రూపాయి యిచ్చెను. పాదరక్షలకు మెరుగు పెట్టుచు ఊళ్ల వెంట తిరుగుటకై పైజెప్పిన సంఘము ఇటువంటి యువకులను 6 గురిని తయారు చేసినది దత్తుగారు పెద్ద ప్రముఖులవద్దకు వెళ్లి చందాలను వసూలుచేయుచున్నారు ఈ చందాలతో కుట్టుపని, వడ్రంగం, కమ్మరం వగైరా చేతి పనులను నేర్పెడి ఖార్కానాలను ఏర్పాటు చేసెదరు వీరిటీవల పశ్చిమోత్తర రాష్ట్రములందును పంజాబునందును పర్యటనము చేసి యీ నెల 14 తేదీని షికార్పూరా వచ్చిరి ఇచట పగలంతయును పాదరక్షల మెరుగుపెట్టి కూలి డబ్బులను గడించుకొని నిన్న సాయంకాలము బహిరంగసభలో నుపన్యసించిరి (ఆ ప్రె)

ఆంధ్రపత్రిక 1934
జనవరి 16 సంచిక నుంచి

ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

సంపుటము 45
సంచిక 18
24.12-52



ఆంధ్రరాష్ట్రం కోసం ఆత్మబలిదానం చేసిన మహాపురుషుడు శ్రీ పొట్టి శ్రీరాములుగారు.

ప్రజ్ఞాశాలి
దేశభక్తుడు
శ్రీ॥ శే॥ డా. పట్టాభి

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

30-12-59



ఆంధ్రకేసరి అస్తమయం




కురుక్షేత్రంలాంటి జీవిత క్షేత్రంలో తను నమ్మిన ఆదర్శాలకోసం ఎడతెగని పోరాటం సాగించి, సుఖంలో, దుఃఖంలో, కలిమిలేముల్లో, జయాపజయాల్లో ఎన్నడూ ఎత్తిన తల దించకుండా, వేసిన అడుగు తీయకుండా, బతికి నన్నాళ్లూ కర్మయోగిలా బతికిన ఒక మహాపురుషుడు ఆంధ్ర రాజకీయ రంగంనుంచి నిష్క్రమించారు.

ప్రకాశం అంటే తెలియని ... ఆయన చేసిన సాహసకా...

విశ్వదాత, కళాప్రపూర్ణ

**కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు**

గారిచే స్థాపించబడిన

**'ఆంధ్రసచిత్రవారపత్రిక'**

తెలుగు ప్రజల మన్ననలు పొంది

**75** వసంతాలు నిరాటంకంగా వెలువడుతూ

'వజ్రోత్సవం' జరుపుకుంటున్న

శుభ సందర్భంలో యాజమాన్యానికి

మా శుభాకాంక్షలు!

**విజయా పిక్చర్స్**

విజయవాడ-గుంతకల్.

S.Balaji



# చలం స్మృతి

శ్రీ ఆర్.ఎస్.సుదర్శనం

మొన్న దేనికోసమో వెదుకుతూంటే చలం గారు నాకు 1961–66 మధ్య వ్రాసిన ఉత్తరాలు బయటపడ్డాయి 1979లో ఆయన పోయినప్పుడు నేనేమీ వ్రాయలేదు ఈ ఉత్తరాల మాట మరచిపోయాను చలంగారిని గూర్చి నేను వ్రాసిందీ ఒక్కసారే – ఫిబ్రవరి 1965 'భారతి'లో అది ఆయన రచనల్లో నాకు కనిపించిన చలం ఇప్పుడు వ్యక్తిగా నాకు తెలిసిన చలాన్ని గూర్చి వజ్రోత్సవ సంచికలో చలం స్మృతి ఉండటం అవశ్యమని నా అభిప్రాయం

1961 ప్రాంతాల్లో చలం పారిస్‌లో ఈశ్వరుణ్ణి దర్శిస్తూ, చాలమందిని అరుణాచలం రమ్మని ఆహ్వానిస్తూ ఉండేవారు బదిరీ నారాయణగారనే మా కొలీగ్ అశాంతితో బాధ పడుతూ చలంగారితో ఉత్తరప్రత్యుత్తరాలు సాగిస్తూ వుండేవారు అప్పట్లో కొత్తగా వచ్చిన నా నవల 'మళ్ళీ వసంతం' చలంగారికి పంపుతూ, ఆస్పెన్‌స్కీ – నలుగో పరిమాణం – కాలం గూర్చి ఉత్తరం వ్రాశాను దానికి ఆయన – ''ఊస్‌పెన్‌స్కీ ది పెద్ద వాల్యూమ్ తిరగవేశాను కాని స్టడీ చెయ్యలేదు, నాకు బి పి కావడంతో ఏ స్ట్రెనువస్ స్టడీ నాకు యిప్పుడు వీలుపడదు అంతకుముందే జె పి ప్రీస్ట్‌లీ నుంచీ అతని 4త్ డయిమెన్షన్ థియరీస్, ఎట్సెట్రా అవగతం చేసుకోడానికి ప్రయత్నించాను మీకూ బద్రీగారికి ఇప్పటినుంచే చేస్తున్నాను ఇంత దూరంనుంచే ''(16–7–61) అని వ్రాశారు తర్వాత నా నవల చదివారు అభిప్రాయం వ్రాస్తానని పై ఉత్తరంలో మాట యిచ్చారు కాని ఆయనకా నవల నచ్చలేదు! ఆ విషయం తెలుపుతూ ఓ కార్డు వ్రాశారు ఏమని? ''నేను బీదవాడిని పైగా కొన్నాళ్ళమట్టి అసలు ఇంట్లో డబ్బు లేదు అందుకని కవరు రాయలేను ఒక కథకుడు యింకో కథకుడి రచనల్ని విమర్శించడంగాని అభిప్రాయం వెలిబుచ్చడంగాని 'ఎటికేట్' కాదని ఉద్దేశ్యపడే నేను, మీ పుస్తకంపై అభిప్రాయం రాస్తానని వొప్పుకోడం తప్పు ఇంతకీ మీ నవల నాకు నచ్చలేదు డయి ఇంటలెక్ట్ ఏ మీ నవలనీ నడిపింది అది పర్సనల్‌గా నాకు ఎడదు'' (23–7–61) దీనికి జవాబుగా నేను ఒక కవరు పంపుతూ, ఏమేమిటి నచ్చలేదో విపులంగా వ్రాయమన్నాను ''కవరు పంపారా జవాబు కోసం ఇప్పుడు నేను మళ్ళీ సాల్వెంట్ కవరు కొనగలను మీ ఉత్తరం చూసి నేను బాగా మువ్ అయ్యాను'' అంటూ ఆరు పేజీల ఉత్తరం వ్రాశారు చివరి వాక్యం ''వీలుకాగానే రండి'' (28–7–61) ఆయన వ్రాసిన అబ్జెక్షన్స్‌కి నేను విపులంగా ప్రత్యుత్తరం వ్రాశాను దానికి ఆయన ''మీ నవల ఈసిలీ రీడబుల్ కాదు,దాని సయికలాజికల్ బాక్‌గ్రవుండ్ వల్ల మీరు చాల యోచించి ఒక కొత్త ఎక్స్‌పెరిమెంట్ తలపెట్టారు తెలుగు వాఙ్మయంలో అది నాబోటివాళ్ల దృష్టిలో ఇట్ మే నాట్ బి ఎ గుడ్ నావెల్ ఎకార్డింగ్ టు అవర్ కన్సెప్టస్ ఆఫ్ ఎ నావెల్'' అని సర్దుకున్నారు (4–8–61)

చలంగారి కథలే కాదు, ముఖ్యంగా 'మ్యూజింగ్స్' చదివీ, ఆయన ఈశ్వరుణ్ణి కనుగొని ఉత్సాహంగా లేఖలు వ్రాస్తుండడం గమనించీ, జిజ్ఞాసతో ఆయనకు ఉత్తరాలు ప్రారంభించాను నేను అందువల్ల అంతటితో ఊరుకోకుండా ఏవేవో విషయాలు, నన్ను వేధిస్తున్నవి, నేను మళ్ళీ వ్రాశాను దానికి ''మీ ఉత్తరం చదివాను ఎక్కువ చదివినవాణ్ణి కాను గనుక, మీరు రాసేవి నాకు పూర్తిగా అర్థం కాలేదు ఏమైనా మన మార్గాలు వేరు ఇద్దరమూ ఈశ్వర పాదపద్మాల ముందే కలుసుకోడం ఈశ్వరాశీర్వాదాలతో'' (14–8–61) అని ఒక కార్డు వ్రాశారు చలం నాకు డబ్బు లేదుకాబట్టి కవరు రాయడం లేదని ఆయన అనడం ఎంత షాక్ యిచ్చిందో, 'నేనేమీ చదివిన వాణ్ణికాను గనక' అని చలం అనడం, అంత కంటే ఎక్కువ షాక్ యిచ్చింది నాకు! ఆయన మా కరస్పాండెన్స్‌ని అంతటితో త్రుంచి వెయ్య దలచుకున్నట్లు అర్థమైంది

1964 మార్చి ఆఖరులో ముగ్గురు మిత్రులతో కలిసి తిరువణ్ణామలై వెళ్ళాను చలంగారి ఆతిథ్యం, ఆదరణ, ఆయన బ్రహ్మ సమాజ సభ్యత్వంనాటి స్మృతులు మమ్మల్ని ముగ్ధుల్ని చేశాయి 1962'ప్రళయాన్ని గూర్చి కార్డు ఆయన బదరీ పేర మాకూ వ్రాశారు దాన్ని గూర్చి అడిగితే, అది ఈశ్వరాజ్ఞగా భావించి వ్రాసినట్లూ, పారిస్‌లో ఈశ్వరుణ్ణి దర్శిస్తూ తాను సరెండర్ అయినట్లూ చెప్పారు తర్వాత 2–4–1964 తేదీ చలం నాకు వ్రాసిన ఉత్తరంలో ''మొన్న మనం మాట్లాడుకున్నట్లు ఆలోచనలు లేకుండా మాట్లాడుకుంటే, మధ్యాన్న మప్పుడు కొమ్మనీడల్లో కూచుని, సోమరిగా వుండుండి, కిచకిచమనే పిట్టల మల్లే మాట్లాడుకుంటాము, నాలోని నేనూ, మీలోని మీరూ, ఏ తెరలూ లేకుండా చేతులు కలుపుకుంటాం ఈ సృష్టికి అర్థం ఆనందం అదే కదండి – ఆ వొక్కడూ అనేక ఆకారాల్లో తనని తాను కలుసుకొని జాయస్ సర్‌ప్రయిజ్ ఫీల్ కావడం ఆ వుత్సవంలో మనమూ పాల్గొంటాము, పార్టింగ్ ఎండ్ మీటింగ్ ఆ సింపిల్ జాయిని ఫీల్ కాకుండా అభ్యంతర పెట్టేది మన పొరలు, మన ఆశలు, ప్రెజుడిసెస్ అసలు మనం బైట పడకుండా, భయంతో మనం కప్పుకునే ఈ ముసుగులు కాని నా పుస్తకాలు నా మిత్రులు, ఎమనేషన్స్ ఆఫ్ మయిసెల్ఫ్ వాటిని నేను డిస్‌ఓన్ చేసుకోను చలమ్ ఈస్ ఎ గ్రియటెస్ట్ ఇన్‌స్పయిట్ ఆఫ్ హిస్ ఫ్రెండ్స్ అన్నట్టుంటుంది ''అని ఆత్మీయంగా వ్రాశారు

1965 ఫిబ్రవరిలో చలం రచనల్లో దృక్పథ పరిణామాన్ని గూర్చి నేను 'భారతి'లో వ్రాసిన వ్యాసం అందుకుని ఏమన్నారో చూడండి ''ఇప్పటికే యిద్దరిపైగా నాకు రాశారు, మీ వ్యాసం ఎంతో బావుందని ముఖ్యంగా మీరు అమీనాపై రాసిన భాగం నాపై నాకు వేరే అపోహలూ, భ్రమలూ ఎందుకు? ఓ చలం అనేవాడు ఒకడు సీరియస్‌గా తానో రచయిత నను కుంటూ తిరిగాడనేది ఓ పెయిన్‌ఫుల్ మెమరీ - ఓ పెద్దభ్రమ, అనేది స్పష్టంగా నాలో తేలిపోయిందాకా సారీ, యూ ఆర్ టూ లేట్'' (18–2–1965) ఇక్కడ తన పుస్తకాల్ని డిస్‌ఓన్ చేస్తున్నట్లా? లేనట్లా?

చలంగారు చివరి ఉత్తరం (4–9–66) నా నవల 'అసుర సంధ్య' చదివి వ్రాశారు ''అంతటికీ మీ నవల పేరు ఎంతో బావుంది నాకు నవలా బావుంది నాకు ముందు మీరు నాకు పంపారు నవల, దానికన్న ఇది చాల మెరుగు మెంటల్ ఎనాలిసిస్ మీ ఫోర్ట్ కొన్ని కొన్ని చోట్ల మీ చర్చలు నాకెంతో యిష్టమైనాయి మీరు చాలా విషయాలపై చాలా డీప్‌గా థింక్ చేశారని స్పష్టం నవలగా కాక, ఈనాటి ఇంటలెక్ట్యువల్ థట్ ప్రాసెస్‌పైన, విశ్వాసాలపైన, దేశ ప్రజల పోకడలపైన చక్కని ఎనలిటికల్ లయిట్ వేస్తోంది మీరు దేశాన్ని సమగ్రంగా చూసి రాశారు ఈ నవల'' చలంగారికి కొంతైనా నచ్చిన నవల వ్రాయగలిగానన్నమాట!

1969లో అనుకుంటాను చలంగారిని రెండోసారి చూశాను సకుటుంబంగా వెళ్ళాను మేడమీద గదిలో ఉన్నాం మేము జిల్లెళ్లమూడి అమ్మ ప్రసక్తి రాగా, ఆమెను గూర్చి చాల సందేహాలు వ్యక్తం చేశారు చలం అప్పట్లో బహుశా పళుమలై స్వామితో అనుభవం గుర్తుండి కాబోలు మనస్సుల్ని ప్రభావితం చెయ్యగల స్వార్థపరులు ఉంటారని అభిప్రాయపడ్డారు కాని చలం మరణించే ముందు ఆమె రమణ స్థాన్

(262 పేజీ చూడండి)

**75 యేండ్లు**

పాఠకలోకాన్ని అలరిస్తూ

సాహిత్య సేవలో

కొంగ్రొత్త బాటలు వేసిన

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**వజ్రోత్సవ సంవత్సరములో**

అడుగిడిన

శుభతరుణంలో

మా అభినందనలు

ఇట్లు

**విజయా కంబైన్స్**

విజయవాడ - గుంతకల్లు

S.Balaji

# ఆంధ్ర బ్రాహ్మణేతరుల సమావేశం

**ఆంధ్రపత్రిక 1917 సెప్టెంబరు 5వ తేదీ సంచిక నుంచి**

గోదావరి జిల్లా రామచంద్ర పురములో ప్రొఫెసరు రామమూర్తి నాయడుగారి విందు సందర్భమున జరిగిన బ్రాహ్మణేతరుల సమావేశపు వృత్తాంతమువేరొకచోట ప్రచురించి నారము ఆ సమావేశమునకు గౌరవనీయులగు రావు బహద్దూర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణ మూర్తి నాయుడుగారగ్రాసనాధిపత్యము వహించిరి త్వరలో నుత్తరసర్కారుల బ్రాహ్మణేతర సభ జరుపుటకు నిశ్చయింప బడింది ఆ సభను సమకూర్చుటకై ప్రయత్నముల సలుపుట కొక తాత్కాలిక సంఘ మేర్పడినది హనుమంతరావు నాయుడుగారును, కొమ్మిరెడ్డి కేశవమూర్తి నాయుడుగారును ఆ సంఘమునకు సంయుక్త కార్యదర్శులుగ నియమింపబడిరి సభను దసరా పండుగలలో కాకినాడ పురియందు జరుపుటకు ప్రయత్నముల జేసెదరని తెలియుచున్నది పై సంఘటన కాకర్లపూడి రామచంద్రరాజు బహదూర్‌గారును, రావుబహద్దర్ వెంకటరత్నము నాయుడుగారును, రావు బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారును, ప్రొఫెసరు కోడి రామమూర్తినాయుడుగారు మొదలగు బ్రాహ్మణేతర ప్రముఖులు సభ్యులుగ నెన్నికొనబడిరి ముందు జరుగనున్న బ్రాహ్మణేతర సభ జయప్రదమగు గాక యని కోరుచున్నారము

బ్రాహ్మణేతరోద్యమము శాఖోద్యములకన్న విశాల దృష్టిని గలిగియున్నది కమ్మ, రెడ్డి, వెలమ, వైశ్య, విశ్వబ్రాహ్మణాది సాంఘికుల సభలు ఆంధ్రదేశమున ననేకదినముల నుండియు జరుగుచునే యున్నవి ప్రతి శాఖయు తమ సాంఘికుల యభివృద్ధికి పాటుపడ మొదలిడినపుడు జాతీయాభివృద్ధి శీఘ్రకాలమున జయప్రదముగ గొనసాగునని యూహించియే, శాఖాసభల ననేకమారులు అభినందించి యుంటిమి కాని ప్రతి శాఖయు తన యభివృద్ధికి మాత్రమే కృషి సలుపుచు, జాతీయాదర్శమును మరచిన యెడల, జాతీయైకమత్యమునగు బదులు జాతీయ వైషమ్యములు ప్రబలగలవని యూహింపవచ్చును ఈ సత్యమును మునగాల జమీందారుగారు నెల్లూరిలో జరిగిన రెడ్డి మహాసభ ముందు దృక్ప్రదర్శనము గావించి యున్నారు అందుచే నీ శాఖాసభ లన్నిటికిని కూడలిస్థానమగు నొకసభ నేర్పాటు గావించిన యెడల, విశాలాశయములు లక్ష్యమునందుండి జాతీయైక్యతకు బలము కలిగింపగలవు అట్టి మహాసభ ఆంధ్రమహాసభయే యని యూహింపబడినది కాని ఆంధ్రమహాసభ యన్ని మతముల వారికిని అన్ని శాఖల వారికిని సమానవేదిక యగుటచే, బ్రాహ్మణేతర శాఖలకు మాత్రము కేంద్రస్థానముగ నుండుటకు ప్రత్యేక సభ యవసరమని కాన్పించుచున్నది అందుచే బ్రాహ్మణేతరశాఖలకన్నిటికిని కేంద్రస్థానముగనుండుటకు బ్రాహ్మణేతర సమావేశము వాంఛనీయమని వేరుగ నొక్కివక్కాణింప నవసరములేదు బ్రాహ్మణేతర మహాసభలో పాల్గొనుటకు క్షత్రియులు మొదలు పంచమజాతుల వరకును హక్కు గలదు బ్రాహ్మణులు స్వల్పసంఖ్యాకులు వారి ప్రత్యేకావసరముల జర్పించుటకై బ్రాహ్మణ మహాసభ నేర్పఱచి, బ్రాహ్మణులలోని యంతఃశాఖాసమ్మేళనమును గావించుటకును బ్రాహ్మణుల ప్రస్తుత స్థితి నుత్తేజవంతముగ గావించుటకును ప్రయత్నములు సలుపవచ్చును బ్రాహ్మణుల వదలివైచిన బ్రాహ్మణేతరసభ మిగిలిన హిందూజాతి కంతకు నుపకరించును కోయంబత్తూరు సభయందువలె క్రైస్తవులకును, మహమ్మదీయులకుగూడ యందు ప్రాతినిధ్య మొసగినచో, దాదాపు హైందవజాతి యంతయు దేశాభివృద్ధికై గలసి పనిచేయుటకు నవకాశము లేర్పడును ఇట్టిఫలిత మొనగూడినచో, జాతీయాశయములు ఫలప్రద మగుననుటకు సందియములేదు జాతీయ వైషమ్యముల ప్రసిద్ధి జేయుట కేర్పడినదని తలచిన దక్షిణదేశ బ్రాహ్మణేతరోద్యమము, కోయంబత్తూరు మహాసభలో జాతీయాధర్శ మంగీకరించినది

ఆంధ్రదేశమున, బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములు తీవ్రత జెందలేదు ఉభయ సాంఘికులును ఉద్యమము లన్నిటియందును గలసి మెలసి

**సరసచిత్ర కల్పనము: ఆంధ్రపత్రిక : 1913 జూలై 16**

ఎల్లిగుడ్డను జూచిన ఆబోతులు అంకెలు వేయుచు తోకలు జాడించి పారిపోవును అట్లే ఆంధ్ర నాయకులలో గొందఱు ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునకు వెఱగొంది తోకలు జాడించి పోవుచున్నారు మఱికొందరు అంకెలు వేయుచు నాంధ్రబాలను పొడుచుచున్నారు ఆంధ్రబాల మాత్రము నిర్భయముగను, సంతోషముగను నిలువబడి ఆంధ్రరాష్ట్ర పతాకమును బైకెత్తు చున్నది



# ఆంధ్ర బ్రాహ్మణేతరుల సమావేశం

భ్రాతృభావముతో బనిచేయుచున్నారు అందుచే, నాంధ్రదేశమున దక్షిణదేశమునందువలె జాతీయోద్యమమునకు వైషమ్య చిహ్నము లేమాత్రము బొడసూపదని నిశ్చయింపవచ్చును సంఘసంస్కరణోద్యమము ఆంధ్రదేశమున వర్ణవిభేద తీవ్రత దగ్గించుటకు దోడ్పడినది బ్రాహ్మణ బ్రాహ్మణేతరులలో నొకరిపై వేరొకరికి ఈర్ష్యా భావములు ప్రబలలేదు ఆంధ్రోద్యమము అన్ని వర్ణములకును సమానవేదిక నొసగి సమరస భావమును వ్యాపింపజేసినది! అందుచే, బ్రాహ్మణేతరోద్యమము నాంధ్రదేశమున జాతీయ సౌష్టవమును పెంపొందించుటకు దోడ్పడునని విశ్వసించుటకు అవకాశములు గలవు ఈ సభ జరుగుట కేర్పడిన సంఘమునందు ప్రొఫెసరు రామమూర్తి నాయుడుగారు సభ్యులు వీరు జాతీయవాదులు దేశీయ మహాజన సభా పక్షపాతులు ఆంధ్రోద్యమమునందు పట్టుదల గలవారు ఆంధ్ర మహాజనసభచే గౌరవింపబడిన, సుప్రసిద్ధాంధ్రులు వీరికిగల యాంధ్ర రాష్ట్రాభిమానము నెల్లూరిలో జరిగిన ఆంధ్ర మహాజన సభయందు సువ్యక్తమయినది రావు బహద్దూరు ఆర్ వేంకటరత్నమునాయుడుగారు మరియొక సభ్యులు వీరి నామమును ఆంధ్రదేశమునందు దెలియనివారు లేరు ఆంధ్ర విద్యార్థులకు సత్ప్రవర్తనము నలవడజేయుటయే వారి జీవితాశయము వీరి ఆదర్శము, మానవ సౌభ్రాతృత్వము వీరి యభిమానము దేశకాలముల నతిక్రమించి, విశ్వమానవ సోదరత్వమునకై ముందంజవేయును అట్టి యదార్థాశయములు గల నాయుడుగారు బ్రాహ్మణేతరోద్యమమును సంకుచిత మార్గముల నడపుట కంగీకరింపరని యూహింపవచ్చును మానవాభివృద్ధికి, విశాల విశ్వమానవ సోదరభావమును కార్యప్రారంభమునకు ప్రాతిపదికగ దీసికొనక, శాఖోద్యమముల మూలమున మానవాభ్యుదయమును గొనసాగించుట యవసరమని నాయుడుగారిపుడు గమనించుట శుభసూచకము రావు బహద్దూరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, శాసననిర్మాణ సభ్యులు ప్రజాపక్షపాతులు దేశీయ మహాజన సభాభిమానులు ఇట్టి యుదార భావ సమన్వితులగు నాయకులచే నడుపబడు బ్రాహ్మణేతరోద్యమము జాతీయ మహా ప్రవాహమున కడ్డుగలిగించునని నమ్మజాలము

ఈ సందర్భమున నొక విషయమును వీరు గుర్తింపవలసి యున్నది సభను ఉత్తరసర్కారులకు మాత్రమే నిర్దేశించుటకన్న, ఆంధ్రదేశమున కంతకును గలిపి బ్రాహ్మణేతర సభను జరుపుట యుక్తమని తెలుపుచున్నాము శాఖాసభలు ఆంధ్రదేశము నంతకును ప్రాతినిధ్య మొసగుచుండ, వీనికన్నిటికిని కేంద్రముగ నుండదలచిన బ్రాహ్మణేతర మహాసభ ఆంధ్రదేశమున కంతకును వర్తింపకపోవుట సమంజసముగ గన్పట్టదు ఆంధ్రులకు, బ్రాహ్మణులయినను బ్రాహ్మణేతరులయినను, ఆంధ్రదేశము మాతృభూమి మాతృభాష వీరందరికి ఆంధ్రభాషయే ఉత్తరసర్కారులనియు, దత్తమండలములనియు, అవాంతరములగు కారణములచే గలిగిన నామములుగాని, యివి సహజమగు భేదముల నేమాత్రము సూచింపవు ఆంధ్రవ్యక్తిత్వమును కాపాడుట బ్రాహ్మణేతరుల విధియై యున్నది కావున కాకినాడలో జరుపబోవు నుత్తరసర్కారుల బ్రాహ్మణేతర సభను ఆంధ్ర బ్రాహ్మణేతరసభగ మార్చి, యాంధ్ర జాతీయభావమును ప్రస్ఫుటము గావించుట యవసరమని దెలుపుచున్నారము

ఆంధ్రబ్రాహ్మణేతర సమావేశము జాతీయ జీవనమునకు ప్రబోధము గలిగించు గాక! ★

# అన్యాయపు బ్రాహ్మణులు

**ఆంధ్రపత్రిక 1913 జనవరి 29వ తేదీ సంచిక నుంచి**

పోలీసు కమ్మిషన్ విచారణలో ఆనరబిలు కార్ద్యుగారిట్లు చెప్పిరి —

విద్యాధిక్యతయు, బుద్ధి విశేషమును లేని జాతులవారికి పెద్ద ఉద్యోగములిచ్చుట పోలీసు శాఖయొక్క సామర్థ్యము లేమికొక కారణముగా నెంచుచున్నాను దక్షిణాది మహమ్మదీయులు హిందువులకంటే నిపుణులైనప్పటికి, సామర్థ్యము నందుమాత్రము చాల తక్కువ ఇక బ్రాహ్మణులన్ననో, వీరి తెలివికిని, సమర్థతకును జాలిన వారు మఱియొకరు లేరు అయినప్పటికి, పోలీసుశాఖయందు మహమ్మదీయులకే అధికముగా నుద్యోగములిచ్చి, బ్రాహ్మణులను కేవలము విసర్జించకపోయినను, ధారాళముగా జేర్చుకొనుట లేదు దేశీయులలో నౌకరిని హెచ్చుగను, నౌకరిని తక్కువగను జూచుట అనగత్యము విద్యాధిక్యతని ముఖ్యముగా నిర్ణయింపవలసి యున్నది ఇట్లు చేసినచో నూటికి 75 వంతులితర జాతుల వారలనెల్ల బ్రాహ్మణులు త్రోసి వేయుగలరు అప్పుడు పోలీసుశాఖ యందును సబు మేజిస్ట్రేటులలోవలె తెలివిగలవారు ప్రవేశించి దీని ఫలితము వెంటనే కనిపించును ఇతరులకంటె బ్రాహ్మణులెక్కువ అక్రమ ప్రవర్తకులని చెప్పుటకు నాకు కారణము గనుపట్టుటలేదు వీరు విద్యాధికులు గావున నితరుల కంటె యోగ్యులుగ నున్నారు ధైర్యము విషయము నను దీసిపోజాలరు ఏదైన పెద్ద తిరుగుబాటులయందు, కొన్ని సమయములందు తగిన ధైర్యము చూపకపోవచ్చును కాని, యిట్టి తిరుగుబాటు లెప్పుడోగాని తరుచు సంభవించవు

**ఆంధ్రపత్రిక 1913 ఫిబ్రవరి 12వ తేదీ సంచిక నుంచి**

I

**తణుకు తాలూకా నుండి యొకరిట్లు వ్రాయుచున్నారు:**

బ్రాహ్మణోద్యోగస్తులు బ్రాహ్మణుల కొక న్యాయము, యితర జాతుల కొక న్యాయము చేయ చున్నారా? తప్పకుండా చేయుచున్నారు రయితులు చెప్పుకొను కష్టములు సరిగా విందురా? లేదు రయితులు బ్రాహ్మణేతరులగు నధికారులను కోరుట నిజమా? నిక్కము బ్రాహ్మణ ఉద్యోగియులకు శూద్రుల యందు దయలేదా? యెంతమాత్రం లేదు

II

**గంజాం జిల్లా వరసన్నపేట నుండి యొకరిట్లు వ్రాయుచున్నారు —**

ఈ నెల 22 వ తేదిని గల తమ పత్రికా ముఖమున రావు సాహెబు బాలాజీరావు నాయుడు గారు పబ్లికుసర్వీసు కమీషన్ యెదుట నిచ్చిన సాక్ష్యముపై తమరడిగిన ప్రశ్నలకు నా జవాబును వ్రాయుచున్నాను

1 వ ప్రశ్నకు — మూడువంతుల ముప్పాతిక బ్రాహ్మణోద్యోగస్థులు బ్రాహ్మణుల కొక న్యాయము, ఇతరుల కొక న్యాయము చేయుచున్నారు ఈ పక్షపాతపు పరిపాలన యితరజాతి యుద్యోగస్థులలో సయితము కలదు కానీ, బ్రాహ్మణులలో నున్నంత అధికముగా లేదని నా అభిప్రాయము,

2 వ ప్రశ్నకు — రయితులు చెప్పుకొను కష్టములను సరిగా వినరు సరికదా, వారిని కసిరి బంట్రోతులచే సాగనంపెతురు

4 వ ప్రశ్నకు— బ్రాహ్మణోద్యోగియులకు బ్రాహ్మణేతర జాతుల యందు దయలేదు బ్రాహ్మణేతరులను అనాదరణ చేయుదురు

III

**నెల్లూరి జిల్లా ముత్తుకూరు నుండి యొకరిట్లు వ్రాయుచున్నారు :-**

1 బ్రాహ్మణోద్యోగస్థులు బ్రాహ్మణేతరుల విషయములో న్యాయముగా ఉండరు బ్రాహ్మణులే చాల హెచ్చయిన వారనియు, వారిని సమానముగ ఆదరించుటవలన వారి గౌరవములు తగ్గునని వారి అభిప్రాయము కనుక బ్రాహ్మణుల కొక తీరుగను, బ్రాహ్మణేతరులకు మరియొక తీరుగను, ఆదరణలు ఉండును

2 ఈ చెన్నరాజధానిలో 8/10 వంతు బ్రాహ్మణేతరులు రయితులు కావున, బ్రాహ్మణోద్యోగస్తులు వారి మనవులు అంతగా అంగీకరించరు

3 8/10 వంతు రయితులు బ్రాహ్మణేతరులు గాన బ్రాహ్మణేతరులగు నధికారులకు రయితుల కష్టములు బాగుగా తెలుసును అందు వల్ల ఏలాటి సందేహముండదు

4 బ్రాహ్మణోద్యోగియులకు శూద్ర జాతుల యందు దయలేదని చెప్పుటకు ఏలాటి సంశయము లేదు దయలేక పోవుటవల్లనే విశేష బాధలుండవు అయితే అసూయత ఎక్కువ బ్రాహ్మణులు పూర్వకాలమున గురువులుగా ఉండి శూద్రులచేత పరిచారములు చేయించుచు, ఇప్పుడు సమాన ఆదరణమునకు లోనగు కాలము తటస్థపడినదని చింతించుచు సమయము కొలది బాధింతురు

చదువరులారా! మ రా శ్రీ, రావు సాహెబు బాలాజిరావునాయుడుగారు అన్ని మతముల వారికి సమానముగ నుద్యోగము లియ్యుడని పబ్లిక్ సర్వీసుకమిషన్‌లో సాక్ష్యమిచ్చినందులకే అనేక బ్రాహ్మణులోర్వలేక పలు తెరంగుల ఆక్షేపించుచున్నారు ఇక బ్రాహ్మణులెంత మాత్రం బ్రాహ్మణేతరుల మీద దయగా నుందురో చదువరులే యోజింపవలసి ఉన్నది

మ రా శ్రీ, రావుసాహెబు బాలాజిరావు నాయుడుగారు పోలీసు రివిన్యూ డిపార్టుమెంట్లలో చాల అనుభవము గలవారు వారు నెల్లూరు జిల్లాలో డిప్యూటి కలెక్టరుగా ఉండినప్పుడు వారి ఆదరణమును గూర్చి రయితులు యింతవరకు కొనియాడుచున్నారు చదువుకున్న వారిలో బ్రాహ్మణులకన్నా బ్రాహ్మణేతరులు తక్కువ సామర్థ్యము గలవారు కారని నొక్కి చెప్పగలను మరియు బ్రహ్మణులకన్న, బ్రాహ్మణేతరులు ఎక్కువ ధైర్యసాహసములు గలవారు ★



"వర్షం వచ్చేట్టుగా వుంది. రెండణాలు వుంటే యిస్తావా? ట్రాము మీద యింటికి పోతాను."
"నా వద్ద చిల్లర లేదే!"
"పోనీలే! రెండు పావలాలు యివ్వు. కారు మీద వెళ్తాను!"

**ఆంధ్రపత్రిక 1938 జూన్ 1 వ తేది సంచిక నుండి**



చిత్తూరు వి. నాగయ్య



గూడవల్లి



17-4-1941

# ఫిలిం గెలిచిన వారికి

## ఆంధ్రపత్రిక 1941 ఏప్రిల్

**20** ఏప్రిల్ ఆదివారం సాయంకాలం 5గంటలకు ఆంధ్రపత్రికా కార్యాలయంలో ఫిలిం బాలెటులో గెలుపొందినవారికి సన్మానం జరిగింది అనేకమంది పత్రికా సంపాదకులూ, సినిమా పారిశ్రామికులూ, ఇతర పెద్దలూ విచ్చేశారు

సభకు శ్రీ పిఠాపురం యువరాజాగారు అధ్యక్షత వహించారు వారి చేతిమీదుగానే సన్మానాలు కూడా జరిగినై

సభకు శ్రీమతి కాంచనమాలగారు రాలేదు ఆమె రాకపోవటం సభికులకు ఆశాభంగం కలిగిఉండవచ్చును ఆమె రాని కారణం

రామబ్రహ్మం

కాంచనమాల

# బ్యాలట్‌లో సన్మానం

## 23 సంచిక నుంచి *

కూడా తెలియదు ఆ విషయం ఎత్తి శ్రీ యువరాజాగారు కాంచన మాలగారు ఇటువంటి అపూర్వ అవకాశాన్ని పోగొట్టుకున్నదనీ, ఇదే ఇతర దేశాల్లో అయితే అవతల ఎంత పని ఉన్నావరే ప్రాణం పోతున్నాసరే రాకుండా ఉండరనీ, అయినా ఆమె రాకపోవటానికి ఎవరికీ తెలియని కారణం ఏదో ఉండి ఉండవచ్చుననీ అన్నారు

సభలో చాలామంది ఉపన్యసించారు

మొదట శ్రీ నీలంరాజా శేషయ్యగారు లేచి ఈ బ్యాలటు యొక్క ఆశయాలు సభకు నివేదించి, ఇందులో కలిగిన పొరబాట్లను ముందు సర్దుకోగలమని చెప్పారు

## ఫిలిం బాలటులో గెలిచినవారికి సన్మానం

తరువాత శ్రీ గిడుగు సీతాపతిగారు, శ్రీ సముద్రాల రాఘవాచార్యులుగారు ఆంధ్ర పత్రికను బాలటు తలపెట్టి నెరవేర్చినందుకు ప్రశంసించుతూ, అందులో ఉత్తీర్ణులైనవారినీ, పత్రికాధిపతులైన శ్రీ శివలెంక శంభుప్రసాదు గారినీ అభినందించారు

శ్రీ తాపీ ధర్మారావునాయుడుగారు మాత్రం కొంత శీతలోదకం చల్లారు బాలటువల్ల సరి అయిన ప్రజాభిప్రాయం రాదనీ, ఒకరు ఉత్తమ నటులని రుజావయినందువల్ల మిగిలినవారికి నష్టం ఉందనీ అభిప్రాయపడ్డారు

శ్రీ రామబ్రహ్మంగారు బాలటులో లోపాలుండవచ్చుననీ, ఇల్లాలు కంటె సుమంగళి ఉత్తమ చిత్రమని తమ అభిప్రాయమని, చెబుతూ అనేక విధాలయిన బాలటు విధానాలు సూచించారు కానీ అవేవీ పాప్యులారిటీ వోటు తీసుకోటానికి పనికివచ్చేవి కావు.

శ్రీ చిత్తూరు నాగయ్యగారు మాట్లాడుతూ ఉత్తమ సినిమా నటుడి ఖ్యాతిని అతని కంపెనీ వారు కూడా పంచుకోవలసి ఉంటుందనీ, తమ కీర్తి ఆ విధంగా వాహినీ వారిదనీ చెప్పారు

శ్రీ పిఠాపురం యువరాజావారు అధ్యక్ష పన్యాసంలో ఈ విధంగా చెప్పారు

ప్రతి మనిషియొక్క నిజోద్దేశం కనుక్కోవటం అసంభవం ఇటువంటి ప్రయత్నాలలో చిన్నచిన్న లోపాలున్నవంటే పెద్ద విషయం కాదు బాలటు పెట్టడానికి ఆంధ్రపత్రికకు గల హక్కును ప్రశ్నించడంలో స్వారస్యం కనిపించటంలేదు. ప్రజాభిప్రాయాన్ని ప్రకటించటం పత్రికల లక్షణం ఇట్లాంటి సదుద్యమం ప్రారంభించిన శ్రీ శంభుప్రసాద్‌గారికి చాలా కృతజ్ఞత చూపించాలి ఇది నిజంగా చాలా మంచి కార్యం పత్రికా నిర్వహణ ఎంత కష్టమో నాకు తెలుసు శ్రీ నాగేశ్వరరావుగారు ఆంధ్రపత్రికను దేశీయ పత్రికల్లో అగ్రస్థానానికి తెచ్చారు ఈ సందర్భమున శ్రీ శంభుప్రసాదుగారు ఉత్సాహముతో పని చెయ్యడం చాలా సంతోషం

తరువాత శ్రీ యువరాజాగారు ఫిలిం బాలటులో విజయం పొందిన వారిని అభినందించి ఫిలిం పరిశ్రమ యొక్క ప్రాముఖ్యతను నిరూపించారు

శ్రీ శివలెంక శంభుప్రసాదుగారి అభినందనాలతో సభ ముగిసింది



# టెన్నిస్ టూర్నమెంట్

సి. రామచంద్రరావు

ఆంధ్రసచిత్రవారపత్రిక 1959 ఫిబ్రవరి 11 సంచిక నుంచి

టెన్నిస్ ఆటలకని నాలుగు మూలలా తిరిగి అలసిపోయి, మిగిలిన సెలవు వారంరోజులూ ఇంటిపట్టున విశ్రాంతిగా గడుపుదామనుకుంటున్న సమయానికి గిరి ఉత్తరం వచ్చిపడింది కరూరులో తన ఆధ్వర్యాన కాస్మాపాలిటన్ క్లబ్బు టెన్నిస్ టూర్నమెంటు నడుపుతున్నదనీ, నేడు తప్పండా పాల్గొనాలనీ రాశాడు రాకపోకల ఖర్చులూ, దిన వెచ్చాలూ మొదలైన టూర్నమెంటు ఆటగాళ్ళ మామూళ్ళు బాగానే ముడతాయని కూడా ఒక్కముక్క ఇరికించాడు ఇండియన్ రేంకింగ్‌కి లెక్కకిరాని కరూరు టూర్నమెంటు వంటి ఆటల్లో పాల్గొనేటప్పుడు మేం ముఖ్యంగా గమనించేది ఖర్చులూ ఇత్యాదికని రాబట్టుకొనే సొమ్మే అయినా, ఈసారి నన్నాకర్షించింది అది కాదు ఈ టూర్నమెంటు గెలవడంవల్ల రేంకింగ్‌కి పాయంట్సురావు పోనీ గత మాసాల్లో నన్ను జయించిన ముగ్గురిలో యెవరితోనైనా తిరిగి ఆడి గెలవడానికి ప్రయత్నించే అవకాశముందనుకున్నా ముగ్గురూ కూడా వింబిల్డన్‌లో ఆడడానికి ఇంగ్లండు వెళ్ళిపోయారు ఇంక కరూరులో ఆడేవారు ఇంతకుముందు నేను జయించిన వారైనా వుండాలి లేదా నన్ను గెలవగలిగిన శ్రేణికి చెందినవారు కాకనైనా పోవాలి అంటే ఈ టూర్నమెంటు గెలవడంవల్ల నాకు ఒరిగేది ఏమీ లేకపోగా, ఏ కారణం చేతనయినా ఓడిపోతే టెన్నిస్ లోకంలో చెప్పలేని నామర్దా కలుగుతుంది కానీ ఈ విషయాలన్నీ నన్నంతగా బాధించలేదు ఇన్నేళ్ళ తరువాత గిరినీ, కమలనీ చూసే అవకాశం నేను ససేమిరా వదలదలుచుకోలేదు అసలు ఉత్తరం వచ్చింది మొదలు యెప్పుడు వెళ్ళి వాళ్ళింట్లో వాల్దామా అని మనసు ఒకే ఆరాటపడడం మొదలుపెట్టింది ఆనాడే బయలుదేరుతున్నట్టు గిరికి తంతి యిచ్చాను కరూరు వెళ్ళడానికి ఒక పగలు మద్రాసులో యెలాగూ ఆగవలసి వుంటుంది కనుక, వీలుంటే మర్నాడు సాయంత్రం యెగ్జిబిషన్ టెన్నిస్ ఏర్పాటు చేయవలసిందని నా మిత్రుడు రామకృష్ణకి కూడా ఒక తంతి పంపించాను

మద్రాసులో అనుకోని సంఘటన జరిగింది యెగ్జిబిషన్ ఆట ముగించి, స్నానంజేసి బట్టలు మార్చుకోడానికని క్లోక్ రూమ్‌కి వెళుతున్న సమయంలో రావుగారు వచ్చి పలకరించారు రావుగారు, కమల తండ్రి అక్కడ వుండడం నన్నాశ్చర్యపరిచింది నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చడానికి ముందే ఆయన తొందరగా మాట్లాడడం ప్రారంభించారు, క్లబ్బులో నేను యెగ్జిబిషన్ ఆడుతున్నట్లూ, తరువాత కరూరు వెళుతున్నట్లూ పొద్దుటి పేపర్లో చదివి నా సహాయం అర్థించడానికి వచ్చారట 'కాదనడానికి వీల్లేదు' అన్నారు ఇంకా ఏదో అదే ధోరణిలో చెప్పకుపోతున్నారు నేను ఆయన మాటలు వినడంలేదు

ఆయన రీతిలోని మార్పు, ఆయన మూర్తిలోని నలత నన్ను కలవరపెట్టాయి రావుగారిని చూసి సుమారు ఆరేళ్ళయింది అప్పటికీ, యిప్పటికీ ఆయన ముదురురంగు లౌంజ్ సూటులోనూ, స్టార్చి పెట్టిన షర్టు కాలరులోనూ, స్వహస్తాలతో ముడివేసిన 'బౌ' టైలోనూ, లక్షణంగా మెరుగుపెట్టిన 'కే' షూస్‌లోనూ ఏమీ తేడాలేదు కాని గంభీరమైన ఆకారం, కించిత్తయినా తొణకని ఆత్మ విశ్వాసం ఏమైపోయాయి? ఆయనలో నిలువెల్లా విషాదచ్ఛాయలు కనిపించాయి నాకు బట్టలు మార్చుకొని వచ్చి మాట్లాడదామని చెప్పి,

# టెన్నిస్ టూర్నమెంట్

ఆయన్ని క్లబ్ లాన్‌మీద కూర్చోపెట్టి నేను క్లోక్ రూమ్‌కి వెళ్ళిపోయాను

స్నానాల గదిలో షవర్ కింద నుంచున్నా నన్నమాటే కాని నా మనస్సు అక్కడ లేదు రావుగారికి నేను చెయ్యగలిగిన సహాయం ఏముంది? కమల కేదైనా కబురు చెప్పడమో, కాకపోతే ఆమె కేదో తీసుకు వెళ్ళడమో అయివుంటుంది అయితే తండ్రీ కూతురూ మన స్పర్థలు మర్చిపోయి తిరిగి కలుసుకున్నారన్న మాట కమలా, గిరీ ప్రణయం, పెళ్ళీ ఆ రోజులన్నీ జ్ఞాపకం వచ్చాయి

ఆరేళ్ళ క్రితం కమలా, గిరీ మొదటిసారి కలుసుకున్నారు ఆ యేడాది గిరీ, నేను యూనివర్శిటీ టెన్నిస్ పోటీలలో నెగ్గి కొంత పేరు సంపాదించుకోడంవల్ల చాలా టూర్నమెంట్లకి మాకు ఆహ్వానాలు వచ్చాయి పరీక్షలు అయిపోయిన తర్వాత మైసూరు, బెంగుళూరు, కొళ్ళిగాల్, మదనపల్లి మొదలైన చోట్లంతా ఆడి చివరకి లాలీ ఇన్‌స్టిట్యూట్ టూర్నమెంటులో ఆడడానికి ఊటీ చేరుకున్నాం యెండాకాలం కొండల్లో గడపడానికి వచ్చిన రావుగారూ, కూతురు కమలా లాలీ ఇన్‌స్టిట్యూట్‌లోనే వుండడం వల్ల మాకు వారి పరిచయం కల్గింది నా పరిచయం పరిచయంగానే వుండిపోగా కమలా, గిరీ స్నేహం ప్రణయ కలాపంగా మారి కూర్చుంది నిజానికి అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు గిరి అప్పట్లో బాగానే ఆడేవాడు మంచి భవిష్యత్తు వుందని పేపర్లు రాసేవి పైగా అందగాడనే చెప్పుకోవాలి కాలేజీలో ఆడపిల్లలు అతని స్నేహానికి యెంతగానే ప్రాకులాడేవారు అసలు ఆడవాళ్ళని ఆకర్షించే శక్తి యేదో అతనిలో వుందని నా ఊహ అయితే గిరిని పెళ్ళాడడం రావుగారికి సుతరామూ యిష్టంలేదు

రావుగారు శ్రీమంతుల కుటుంబంలో పుట్టారు కుటుంబ సాంప్రదాయం, ఆర్థిక స్తోమతు మొదలైనవాటి ఆవశ్యకత ఆయనలో కరడుగట్టుకుపోయింది గిరికి చెప్పుకోదగ్గ ఐశ్వర్యంలేదు అతని తల్లితండ్రులు సమాజంలో అనామకులు, అంటే రావుగారి తరగతికి చెందిన సమాజానికి వారు చెందరు పోనీ, గిరికి ఉద్యోగమైనా లేదు. రెండు మాసాల క్రితం ఎం ఏ పరీక్ష రాసివచ్చాడు అతి గారాబంగా, సమస్త ఐశ్వర్యాలతో పెరిగిన తమ ఏకైక పుత్రిక ఇటువంటివాడిని పెళ్ళాడడానికి రావుగారు అంగీకరించలేకపోయారు కమలా, గిరీవాళ్ళతోపాటు నేనూ ఆయన్ని ఒప్పించడానికి సకల ప్రయత్నాలు చేశాం కాని లాభం లేకపోయింది చివరికి ఆయన యిష్టం లేకుండానే పెళ్ళి జరిగిపోయింది రావుగారు పెళ్ళికి రాలేదు కూతురుకీ, తనకీ యింకేం సంబంధం లేదనీ, తన డబ్బులో చిల్లిగవ్వకూడ ఆమెకి రాదనీ మధ్యవర్తుల ద్వారా కబురు చేశారు కమల తొణకలేదు

కమల కొంచెం తెలివిగా ప్రవర్తించి నట్లయితే ఇంత రాద్ధాంతం జరిగి వుండక పోనేమో అనిపిస్తుంది నాకు అప్పుడప్పుడు "నేను గిరిని ప్రేమిస్తున్నాను, పెళ్ళి చేసుకుంటా నాన్నా?" అని ఆమె రావుగారిని ఎప్పుడూ అడగలేదు పెళ్ళి చేసుకోడానికి నిశ్చయం చేసుకున్న తర్వాత "మేం పెళ్ళి చేసుకోబోతున్నాం" అని తండ్రితో చెప్పింది ప్రాణ సమంగా చూసుకుంటున్న కూతురు తన ప్రసక్తి లేకుండా పెళ్ళి నిర్ణయించుకోడం రావుగారి ఆత్మాభిమానాన్ని గాయపరచి వుంటుంది బాగా డబ్బున్నవాడూ, ఉన్నత కుటుంబంలో పుట్టిన వాడూ కమలకి భర్త కావాలని ఆయన కోరుకున్నా, "గిరిని పెళ్ళి చేసుకుంటే నా జీవితం ఆనందంగా వుంటుంది నా కోసం ఈ పెళ్ళికి అనుమతి ఇయ్యి" అని కమల అడిగివుంటే తప్పకుండా ఆయన ఒప్పుకునేవారని నా అభిప్రాయం

షవర్‌లో నీళ్ళవేడి ఎక్కువయి, ఒళ్ళు చుర్రుమన్న తర్వాతగాని ఈ ఆలోచనలోనుంచి నేను బయటపడలేదు త్వరగా స్నానం ముగించి, బట్టలు మార్చుకుని, రావుగారి దగ్గరికి వెళ్ళాను

రావుగారు చెప్పింది విని విస్తుపోయాను రావుగారికి కూతురుమీద కోపం ఆట్టేకాలం నిలవలేదు కమల తనని నిర్లక్ష్యం చేసినందుకు కోపంవచ్చి అన్ని మాటలన్నారేకాని, కమల వాటి నంతగా పాటిస్తుందని అనుకోలేదు పెళ్ళయిన తర్వాత వచ్చి క్షమాపణ కోరుతుందని ఆయన అభిప్రాయం కమల రాలేదు ఆర్థికంగా గిరి స్తోమతు అంతంతమాత్రమే అని ఆయనకు తెలుసు కొంతకాలానికైనా క్లిష్టపరిస్థితులు ఏర్పడి కూతురు తమ దగ్గరికి వస్తుందని ఆశించారు కాని పెళ్ళయి నెల తిరగకుండానే గిరి గవర్నమెంటులో మంచి ఉద్యోగం సంపాదించాడు గవర్నమెంటు జీతంతో కమల అవసరాలు గడవవని కూడా ఆయనకి తెలుసు ఇంకా కమల వస్తుందనే ఆశ ఆయనకి పోలేదు తనంత తాను వస్తే కూతుర్ని క్షమించడానికి ఆయన కాచిపెట్టుకుని వున్నారు అది పడలేదు కమల తన అవసరాలను తగ్గించుకుంది కూతురు తిరిగి రానందుకూ, అంతకంటే తనుకున్న ప్రకారం ఒక్కటీ జరగనందుకూ ఆయనకి పట్టరాని కోపం వచ్చింది ఇంక కమలను గురించి ఆలోచించనని భీష్మించి కూచున్నారు కాని ఆమెను మరచిపోవడం ఆయన తరం కాలేదు తల్లిపోయిన నాటినుంచి తనే తల్లీ, తండ్రీగా ఆమెని సాకుతూ వచ్చారు, ఆమెకోసం తిరిగి పెళ్ళి చేసుకోడం మానేశారు కమల ఆయన జీవితంలో ఒక భాగమైపోయింది ఆత్మాభిమానం దిగమింగి కూతురిని రమ్మని ఉత్తరాలు వ్రాశారు కమల జవాబియ్యలేదు డబ్బు పంపించారు తిరిగి వచ్చేసింది చివరకి వుండబట్టలేక కూతురి ఇంటికి వెళ్ళారు కమల ఆయన్ని పలకరించనైనా లేదు, ఆయన్ని చూసిన మరుక్షణమే స్నేహితుల ఇంటికి వెళ్ళి కూచుంది చేసేదిలేక తిరిగి మద్రాసు వచ్చేశారాయన

"ఇంక నేం చెయ్యగలిగిందేమీలేదు భారం మీ మీద వేస్తున్నాను ఏం చెప్పి దాని మనస్సు మారుస్తారో!"

రావుగారు దగ్గరగా జరిగి నా రెండు చేతులూ తమ చేతుల్లోకి తీసుకుని అన్నారు ఆయన దీనస్వరం నన్ను కలిచివేసింది శాయశక్తులా ప్రయత్నిస్తానని చెప్పి సెలవు తీసుకున్నాను

* * *

స్టేషనుకి కమల ఒక్కతే వచ్చింది

"గిరి ఎక్కడ?" అని అడిగాను

"ఒక పక్కన టెన్నిస్ వుండగా ఆయన గారికి తీరిక ఎక్కడుంటుంది?" నవ్వింది

"అయితే గవర్నమెంటు ఉద్యోగం కూడా ఇతని టెన్నిస్ పిచ్చి వదలగొట్టలేక పోయిందన్న మాట?"

"ఉద్యోగానికి కాదుగదా, దేనికీ సాధ్యం కాదు"

ఇద్దరం నవ్వుకున్నాం

కార్లో ఎక్కుతూ కమల చెప్పింది "బట్టలు మార్చుకుని నిన్ను క్లబ్బుకి రమ్మన్నాడు"

ప్రయాణ అలసట మీద నాకు ఆడబుద్ధి కాలేదు

"నాకు పొద్దున్న 'మేచ్' వుందేమో తెలుసా?" అని అడిగాను

"ఇప్పుడు కాదు గాని సాయంత్రం సింగిల్సూ, డబుల్సూ కూడా ఆడాలి ఇప్పుడు కొంచెం ఆడితే కోర్టుకీ, బంతులకీ అలవాటవుతుంది కదా!"

"మొదటి రెండు రోజులూ బహుశా కష్టమేమీ వుండదు అయినా, ఇంటికి వెళ్ళి బట్టలు మార్చుకునివచ్చి ఈ ఎండలో గంతులెయ్యడం నావల్లకాదు"

"నిజమే" ఒప్పుకుంది కమల

# టెన్నిస్ టూర్నమెంట్

''దార్లో ఒక నిముషం క్లబ్బు దగ్గిర ఆగి గిరిని పలకరించి పోదాం'' అన్నాను

కాస్త కూస్త సేపటికి గిరి ఇంటికే వచ్చేస్తాడు అయినా వెంటనే అతన్ని చూడకుండా వుండడానికి మనసు ఒప్పలేదు ఒకసారి పూర్వం మాదిరి వీపులు చరచుకుని ఆప్యాయంగా అరుచుకుంటే కుతి తీరిపోతుంది. కమలకి క్లబ్బు దగ్గిర ఆగడం ఇష్టంలేకపోయింది

''నన్ను ఇంటిదగ్గిర దింపేసి నువ్వు వెళ్లు'' అంది

క్లబ్బుకి వెళితే ఒక పట్టాన ఊడిపడనేమో నని ఈవిడ భయమేమోనని నేను అన్నాను — ''ఒక్కనిముషం అంటే ఒక్క నిమిషమే అలా తొంగిచూసి వచ్చేద్దాం ఎంతకాదన్నా ఒకప్పుడు ప్రాణస్నేహితులం కదా !''

''నన్ను దింపేసి వెళ్లు నీకు పుణ్యం వుంటుంది నే వెళ్లేవరకూ ఇంటిదగ్గర పనులన్నీ కూచుంటాయి ''

ఆమె వైఖరి నన్ను పట్టుబట్టనియ్యలేదు

గిరి వచ్చేలోగా కమలా, నేనూ పిచ్చాపాటి మాట్లాడుతూ కూచున్నాం ఇదే మంచి సమయం అని రావుగారి విషయం కదిపాను కమలలో చెప్పలేనిమార్పు వచ్చింది ఆమె నవ్వూ, చిలిపితనం ఒక్కసారిగా మాయమైపోయాయి మొహం జేవురించింది గొంతు జీరపడింది శరీరం కోపంతో ఒణుకుతున్నట్లనిపించింది

రాత్రి రైల్లో నా కంటికి కునుకుపట్ట లేదు రావుగారి తరఫున కమలని ఎలా ఒప్పించాలో, ఎన్నివిధాలుగా నచ్చచెప్పే అవకాశాలున్నాయో ఆలోచించడంలోనే తెల్లవారిపోయింది కాని ఇప్పుడదంతా వృధా అయిపోయింది ఆమె ఎదురుగా కూర్చుని ఈ విషయమై నోరు విప్పగల సాహసం నాకు లేకపోయింది అప్పటికీ ఒకటి రెండుసార్లు రైల్లో వర్ణించిన పాంం అప్పచెప్పడానికి పూనుకున్నాను కాని ఒక్క మాటలో ఆమె నా నోరు కట్టేసింది ఇంకొక్కసారి నేనీ ప్రసక్తి తెచ్చినట్లయితే నాతో మాట్లాడడం మానేస్తానని బెదిరించింది తన కవసరమైనప్పుడు చూపించలేని ప్రేమ, వాత్సల్యం అనవసరమైనప్పుడు అంగీకరించ లేనంది ముసలితనంలో ఒంటరితనం భరించలేక సహవాసం కొనుక్కుందామనుకునే వాళ్ళకి అమ్ముడుపోడానికి తను బజారులో సరుకు కానంది ఇన్నేళ్ళ తరవాత ఆమెలో ఈ కాఠిన్యం నన్నాశ్చర్య పరచింది నేను మారుమాట్లాడలేక పోయాను

గిరి క్లబ్బునుంచి వచ్చి ఆదరాబాదరాగా రెండు మెతుకులు నోట్లో వేసుకుని ఆఫీసుకి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు ''నేను క్లబ్బులో దిగి నీకు కారు పంపిస్తాను'' అన్నాడు

''ఇంటికి వచ్చి బట్టలు మార్చుకుని వెళ్ళవా ?'' అని అడిగాను

''నాలుగు మైళ్ళు ఇంటికి వచ్చి వెళ్ళే లోపున రెండు సెట్లు ఆడుకోవచ్చు నా టెన్నిస్, బట్టలు క్లబ్బులోనే వదిలేస్తాము'' అన్నాడు

నాకు నవ్వొచ్చింది అతని టెన్నిస్ పిచ్చి చూసి

''అయితే కారు నాలుగున్నరకి పంపించు'' అన్నాను

''అంత ఆలస్యంగా వస్తే ఎలా ? మూడున్నరకైనా అక్కడుండాలి'' అన్నాడు

''మూడు గంటలకి కమల సిద్ధం అవగలదా ? నాకోసారి, తనకొకసారి కారు రావడం ఎందుకని నాలుగున్నర అన్నాను ''

''కమల వస్తుందా ?'' సంతోషంగా ప్రశ్నించాడతను

''కమల కీవాళ మేచ్ లేదా ?'' అన్నాను

''నువ్వు ఆరేళ్ళక్రితం కమల గురించి మాట్లాడుతున్నావ్ ?'' ఆమెవైపు కొంటెగా చూసి నవ్వాడు గిరి ''పెళ్ళి కావడంతో ఆడవాళ్ళ జీవితాశయం ఫలించినట్టే దాంతో మునపటి తళుకు బెళుకులన్నీ వదిలిపెట్టి ముసలమ్మలై కూర్చుంటారు ''

తన మాటల్లో హాస్యం అతనికైతే తృప్తి నిచ్చినట్టుంది కాని, కమలకి రుచించలేదు

''కమలా ! నువ్విలా ముభావంగా వుండడం బాగాలేదు టూర్నమెంటులో ఆడనన్నావు, కమిటీ మెంబరుగా వుండనన్నావు ఆట చూడ్డానికి కూడా రావడంలేదు క్లబ్బులో అందరూ నొచ్చుకుంటున్నారు తెలుసా ?'' అన్నాడతను మళ్ళీ

''నొచ్చుకునే వాళ్ళంతా వొచ్చి ఈ యింటెడు పనీ చేస్తారా ?'' అని అడిగింది కమల

''నీ కెప్పుడూ ఒకే సాకు ఎవరైనా వింటే నేను పనివాళ్ళని పెట్టననుకుంటారు'' గిరి వెళ్ళిపోతూ అన్నాడు

*   *   *

నేనెంతో పట్టుబడితేకాని కమల క్లబ్బుకి రావడానికి ఒప్పుకోలేదు నా కాశ్చర్యం వేసింది ఒకప్పుడు ఆవిడ టెన్నిస్ అంటే చెవి కోసుకునేది

''ఈ క్లబ్బంటే నీ కిష్టంలేదా ?'' అని అడిగాను ఇక్కడి మనుష్యులు ఆవిడికి సరిపడ లేదని నా అనుమానం

''ఇష్టంలేకపోడం కాదు నాకు నిజంగా తీరిక వుండదు'' అంది

---



నవలా రచయిత

## 'శారద'

మంచీ కాదూ!, 'అపస్వరాలు' నవలల ద్వారా 'శారద' గా ఆంధ్రవారపత్రిక పాఠకుల ఆదరాభిమానాలకు పాత్రులైన శ్రీ యస్ నటరాజన్ గారు తెనాలిలో 7-8-55 బుధవారం రాత్రి స్వర్గస్థులైనారని తెలియపరచడానికి చింతిస్తున్నాము. తమిళులైనప్పటికీ తెలుగు నేర్చి, హోటల్లో సర్వర్‌గా పనిచేస్తూ జీవితంలో పలుకష్టాలకూ లోనైనప్పటికీ రచనా వ్యాసంగంలో అధిక శ్రద్ధ, ప్రజ్ఞలు చూపగలిగిన శ్రీ నటరాజన్ గారి అకాల మృతికి సంతాపం ప్రకటిస్తున్నాము. —సం

ఆంధ్రపత్రిక 1955 ఆగస్టు 31 సంచిక నుంచి



ఆంధ్రపత్రిక 1912 ఏప్రియల్ 17 సంచికలోని ఒక ప్రకటన

# టెన్నిస్ టూర్నమెంట్

"యేమిటంత పని ?"

"సంసారం చూసుకోవాలిగదా ! అన్నీ పని వాళ్ళమీద వదిలిపెట్టేమంటే ఇల్లు గుల్లయి నట్టే పోనీ, తోట చూశావా? మాకు ముందు ఇక్కడవున్న మహానుభావులెవరో కాని ఒక్కరోజు కూడా చెట్లకి నీళ్ళు పోసినట్టులేదు అంతా సరిచేసుకుని వచ్చేటప్పటికి నా పనవుతూంది"

ఆమెడ గొంతులో యేదో ధ్వని ఈ కారణం నిజంగాదని చెపుతూంది నా కసలు కారణం తెలుసుకోవాలని వుంది, కాని సంభాషణ ఎలా సాగించాలో తెలియలేదు

"నాతో మిక్సెడ్ డబుల్సు ఆడతావా ?" అని అడిగాను

"ఇంకా టెన్నిస్ ఆడుతూ కూచోడానికి నేనేం చిన్నపిల్లనికాదు"

"అయితే మేమంతా చిన్నపిల్లల మంటావా ?"

"నీ సంగతి వేరు,నువ్వింకా బ్రహ్మచారివి"

"దానికీ టెన్నిస్‌కీ సంబంధం యేమిటి ?"

"పెళ్ళయిం తరువాతకూడా దేశదిమ్మరిలా టెన్నిస్ టూర్నమెంట్లచుట్టూ తిరుగుతా నంటావా యేం ? పెళ్ళాం కావాలో, టెన్నిస్ కావాలో నిర్ణయం చేసుకుని మరీ పెళ్ళాడు" నవ్వింది

"నవ్వులకేగాని, కమలా ! నువ్వు తప్ప కుండా నాతో ఈ టూర్నమెంటులో ఆడాలి"

"అది మాత్రం అడక్కు నేను రేకెట్ ముట్టుకుని మూడేళ్ళ పయినయింది"

"అయితే మళ్ళీ మొదలుపెట్టు"

"మా ఇద్దరికీ సరిపడా తను ఆడు తున్నాడుగా, చాలు"

మళ్ళీ నవ్వింది కమల

* * *

రాత్రి భోజనం ముందు డ్రాయింగ్ రూమ్‌లో కూచుని గిరి, నేనూ పాతముచ్చట్లు నెమరువేసుకుంటున్నాం కమల కొంచెం దూరంలో వరండాలో కూర్చుని యేదో అల్లు కుంటూంది

"నువ్వింకా ఇంత బాగా ఆడుతున్నావనుకో లేదు" అన్నాను గిరితో గిరి మొహం సంతోషంతో వికసించింది

"మునుపటికంటే బాగా ఆడుతున్నాను కదూ ?" అన్నాడు

నిజానికి నా కలా అనిపించలేదు ఈ ఆరేళ్ళల్లోనూ అతని ఆట బాగా దెబ్బతిని వుంటుందనుకున్నాను కాని ఆ సాయంత్రం చూసిందాన్నిబట్టి అనుకున్నంత దిగజారిపోలేదని పించింది అంతే అయినా, నిజం చెప్పి అతన్ని నొప్పించడమెందుకని "ఔను" అన్నాను దానితో అతని ఉత్సాహం ఎక్కువయింది

"ఆ ఊటీ టూర్నమెంటులో మానెయ్య కుండా వుంటే ఈపాటికి ఇండియన్ రేంకింగ్‌లో వుందును ఏమంటావ్ ?" అన్నాడు

"లేనందుకు విచారించవలసిన పనిలేదు అదృష్టవంతుడివి మంచి భార్యనీ, ఉద్యోగాన్నీ కూర్చి పెట్టుకున్నావ్ !"

"అందరూ అదృష్టవంతుణ్ణనే వాళ్ళేకాని నా టెన్నిస్ ధ్వంసం అయిపోయినందుకు విచా రించే వాళ్ళెవరూ కనిపించరు"

"నామట్టుకి టెన్నిస్‌కంటే ఉద్యోగమే ముఖ్యం అనిపిస్తుంది రేంకింగ్ మూన్నాళ్ళ

ముచ్చటా, ఉద్యోగం,సంసారం బతికున్నన్నాళ్లూ అంటిపెట్టుకుని వుండేవీను.''

''నే నొప్పుకోను టూర్నమెంటు టెన్నిస్ నాకిచ్చే ఆనందం ఇంకేమీ ఇవ్వలేదు. అంత కంటే జీవితంలో కోరగలిగిందే ముంటుంది ? నిజానికి గతిలేక నే ఉద్యోగం చేస్తున్నాను ''

''ఉద్యోగంలో పదిలంగా కూర్చుని వున్నావు కాబట్టి అలా మాట్లాడుతున్నావు.''

''కాదు నిజం చెప్తున్నాను నేనంత తొందరగా పెళ్ళి చేసుకుని వుండకపోతే యే గొడవా వుండేదికాదు ఉద్యోగంలో వెంటనే ప్రవేశించవలసిన అగత్యం వుండకపోను. ఇంకా టెన్నిస్ ఆడివుందును.''

కమలకి వినిపించే అంతదూరంలో ఈ చర్చ సాగించడం నాకు నచ్చలేదు బయట చల్లగాలి సాకుచెప్పి అక్కడనుంచి లేచిపోయాను

ఫైనల్సు నాడు రాత్రి ఆటగాళ్ళకీ, మెంబర్లకీ క్లబ్బు డిన్నర్ యేర్పాటు చేసింది నేనెంతో పట్టుబడితేకాని కమల రావడానికి ఒప్పుకోలేదు మేం వెళ్ళేసరికి క్లబ్బు కోలాహలంగా వుంది ఇద్దరు ముగ్గురు జట్లుగా జనం విడిపోయి అరుచుకుంటూ, నవ్వుకుంటూ ఆనందిస్తున్నారు సెక్రెటరీ చేతిలో డ్రింక్ పట్టుకొని అందరినీ నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించాడు ''ఈ డ్రింక్ టూర్నమెంట్లో గెలిచిన వ్యక్తుల ఆరోగ్యానికి'' అని 'టోస్ట్' చెప్పాడు అంతా చప్పట్లు చరిచారు కొందరు గెలిచిన వ్యక్తుల ఆట గురించి వివరంగా మాట్లాడారు తరువాత ఒక వ్యక్తి లేచి గిరికి 'టోస్ట్' చెప్పాడు ''ఇది ఇటువంటి టూర్నమెంట్లు ఎన్నో గెలవగల సామర్థ్యంగల వ్యక్తి ఆరోగ్యానికి'' అని అరిచాడు క్లబ్బంతా చప్పట్లతో మారుమ్రోగిపోయింది ఇంకొక వ్యక్తి లేచి గిరి ఆటని ప్రశంసించాడు

''ఈయనకూడా పేరుపొందిన ఆటగాళ్ళ లాగా దేశం అంతటా తిరిగి ఆడితే నేషనల్ ఛాంపియన్‌షిప్ప గెలవడానికి సందేహంలేదు ''

హాల్లో గొంతులు ''హియర్, హియర్'' అన్నాయి ఇంకొక వ్యక్తి లేచాడు ఇంతలోనే కమల వచ్చి తన్ని ఇంటికి తీసుకువెళ్ళమని అడిగింది.

''తలనొప్పిగా వుంది'' అంది

''గిరితో చెప్పి వస్తాను'' అన్నాను

''తను గొడవలో వున్నాడు ఎందుకు కదపడం తాళాలు కారుకి వుంటాయి పద'' అంది

కారు కొంతదూరం వెళ్ళాక కమల అడిగింది

''నిన్నొకటడుగుతాను, నిజం చెప్తావా ?''

''తెలిస్తే తప్పకుండా చెప్తాను ''

ఆంధ్రపత్రిక 1924-వ సం॥ అక్టోబరునెల 22-వ తేది



ఇ. వి. రామస్వామినాయకరుగారు

తమిళ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు

మద్రాసుప్రభుత్వమువారు వీరిపై గావించిన ప్రాసిక్యూషనును వదలుకొనిరి.

''గిరి టెన్నిస్ గురించిన ఆ మాటలన్నీ నిజమేనా ?''

నాకేం చెప్పాలో తెలియలేదు

''ఇక్కడి వాళ్ళందరికీ అతని ఆటంటే చాలా అభిమానం ఉన్నట్టుంది'' అన్నాను

''నీ ఉద్దేశం ఏమిటి ? నువ్వు దీనిలో ప్రవేశం వున్నవాడివి ''

''నువ్వేమీ అనుకోవుగదా ?''

''అనుకోను ''

''అయితే విను గిరిని గెలవగలవాళ్ళు ఇండియాలో ఊరి ఊరికీ వుంటారు ''

''ఇక్కడ ఎవరూలేరు ''

''ముక్కకి ముక్క అర్థం తియ్యకు కమలా ! నేనవేది ప్రస్తుతం అతని ఆట టూర్నమెంట్లు గెలవడానికి చాలదు ''

''ఉద్యోగంవల్ల తనకి ఆడడానికి ఎక్కువ టైముండదు ''

''ఔను''

''టైముండి ఆడగలిగితే రేంకింగ్‌లోకి రాగలడంటావా ?''

''మధ్యలో మానెయ్యకుండా వుంటే ఎంతవరకూ వచ్చేవాడో చెప్పలేను కాని, ఇప్పుడెంత తంటాలుపడ్డా ప్రయోజనంలేదు ''

''ఎంచేత ?''

''గిరికి ఇప్పుడు ఇరవై ఎనిమిదేళ్ళు, ఔనా ?''

''ఔను''

''అంటే టెన్నిస్ ఛాంపియను రిటైరయ్యే వయస్సు ''

''ఉఁహుఁ''

''రెండవది పెళ్ళికీ, ఇప్పటికీ ఇరవై పౌన్ల బరువైనా ఎక్కువయ్యా డంటావా ?''

''ఏమో !''

''పోనీ, యూనివర్సిటీలో ఆడేకాలంలో కూడా అతను ఏమంత పెద్ద ఆటకాడు కాదు కృషి మంచి ఫలితాలు ఇచ్చి వుండేదేమో కాని

# టెన్నిస్ టూర్నమెంట్

అతను చెయ్యలేదు ఆ కాస్త ఆటకూడా ఇప్పుడు మర్చిపోయాడు ఇక్కడ క్లబ్బులో నలుగురినీ గెలిచి ఇండియా అంతా గెలవగలనను కొంటున్నాడు ''

''ఈ ఉద్యోగం బెడద లేకపోతే ఇప్పటికైనా డేవిస్ కప్పుకి ఆడగలనని తన ధైర్యం ''

''ఇంకా గిరికి టెన్నిస్‌మీద మమకారం తగ్గలేదు పాత కలలు మర్చిపోలేకుండా వున్నాడు ''

''అంతే అంటావా ?''

''అంతేనేమో కమలా !''

ఇంటికి వెళ్ళే వరకూ మే మింకేమీ మాట్లాడుకోలేదు

* * *

తరువాత నాలుగు నెలలకి మద్రాసు కెళ్ళవలసివచ్చింది. మౌంట్ రోడ్‌లో గిరి తటస్థపడ్డాడు

''నువ్వెప్పుడొచ్చావ్ ?'' అన్నాను

''ఇప్పుడిక్కడే వుంటున్నాను మీ రేంకెడ్ ప్లేయర్స్ పని పడతామలే'' నవ్వాడు గిరి నాకేమీ అర్థం కాలేదు

''ఉద్యోగం వదిలేశాను'' అన్నాడు మళ్ళీ

''అంత మంచి ఉద్యోగమా ?''

నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చకుండా వుండలేక పోయాను

''అసలు కథ చెప్తాను పద !''

ఇద్దరం పక్కనున్న టీ సెంటరుకి నడిచాం కూర్చుని రెండు కోల్డ్ టీ తెమ్మని చెప్పి గిరి మొదలుపెట్టాడు

''ఇదంతా కమల పని కరూర్ టూర్నమెంటు తన్ని బాగా కదిపినట్టుంది ఆ డిన్నర్ రాత్రి నా ఆట గురించి స్నేహితులు మాట్లాడారు జ్ఞాపకం వుందా ?''

''ఉంది'' అన్నాను

''అప్పటినుంచీ నా ఆట వృథా పోనియ్యకూడదని ఒకటేపట్టు మద్రాసులో వ్యాపారం పెట్టి, టెన్నిస్ ఆడమని తన ఉద్దేశం ''

''డబ్బు ?''

''తండ్రి వున్నాడుగా !''

''తండ్రి డబ్బుతో వ్యాపారం పెట్టమందా కమల ?'' నా చెవులు నేనే నమ్మలేకపోయాను

''ఆశ్చర్యంగా లేదూ ! ఆయన సొమ్ము దమ్మిడీ అయినా ముట్టనన్నది ఇప్పుడు తనే వెళ్ళి డబ్బు అడిగింది ''

''అకస్మాత్తుగా ఎందుకు మనసు మార్చుకుంది ?''

''నా టెన్నిస్ కోసం, నేను ఏ వింబిల్డన్ ఛాంపియనో అవుతాననుకొంటుంది'' సంతృప్తిగా నవ్వాడు గిరి

కమల అలా అనుకోడంలేదనీ తనకి పోటీగా గిరిని ఆకర్షిస్తూవచ్చిన టెన్నిస్‌లో అతని అసమర్థత నిరూపించడం కోసం కరడు గట్టిన ద్వేషాన్ని సహితం మర్చిపోయి తండ్రి పంచ జేరిందనీ నేను గ్రహించాను కాని నా స్నేహితుడికి చెప్పడానికి నోరు రాలేదు ★

# బొంబాయిలో ప్రొ॥ రామమూర్తి నాయుడుగారు: వారితో సంభాషణము!

**ఆంధ్రపత్రిక 1911 ఏప్రిల్ 19వ తేదీ సంచిక నుంచి**



హిందూదేశమున ప్రసిద్ధిగాంచిన ప్రొఫెసర్ రామమూర్తినాయుడుగారు ఏప్రియల్ నెల 15వ తేదీనాడు బొంబాయిలో ప్రథమ ప్రదర్శనమును జూపినారు ఆనాడా ప్రదర్శనము గౌరవనీయులగు సర్ ఫిరోజిషా మెహతా వారి యాధిపత్యముక్రింద జరిగినది ఆ దినము సుమారు రూ 2000 లు॥ జమ యయియుండ వచ్చును రామమూర్తినాయుడుగారు ఇంగ్లండులో దమయద్భుత మల్ల కౌశలమును జూపుటకై వెళ్ళుచున్నారు ఇంగ్లండులో వీరేమి చేయుచున్నారో ఆ విషయములను గురించి విచారించుటకయి ఆంధ్రపత్రికా ప్రతినిధి యొకరు మలబారుకొండలోనున్న వారి నివాసమునకు వెళ్లియుండిరి

"ఓహో, తమరాంధ్రపత్రికా ప్రతినిధులా, మిమ్ము జూచుటవలన చాల సంతోషమయింది మీ పత్రిక ఆంధ్రలోక ప్రసిద్ధిని గాంచుటయే గాక బర్మాలోను, మధ్య పరిగణాలలోను నాంధ్రులనేకులు చదువుచున్నారు మీ వార్తలు ఆంధ్రపత్రికలో బ్రచురించినయెడల మాకు బాగుగ దెలియునని యనేక స్నేహితులు నా పేర వ్రాసినారు రెండున్నర సంవత్సరములలో ఆంధ్రపత్రిక యిట్లు విజృంభించుట పత్రికాధిపతిగారగు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి దేశభక్తిని, నిరంతర కృషిని వెల్లడి చేయుచున్నది అని యనుచు హస్త ప్రదర్శనముచేసి ఒక కుర్చీమీద కూరుచుండబెట్టిరి

ప్రతినిధి — మా పత్రికయందు మీకున్న వాత్సల్యతకెంతయు కృతజ్ఞులము మీరు భారతమాతకును, ముఖ్యముగా ఆంధ్రదేశమునకును గొప్ప కీర్తిని దెచ్చినారు ఇంగ్లండులో దిగ్విజయమును బొందుటకయి వెళ్లుచున్న సమయమందు భరత భూమికి మీరు పంపు సందేశమేది?

రామ — గడచిన నాలుగు సంవత్సరములలో నేనెచ్చటికి వెళ్లినను భరతభూమిలో నా దేశీయులమితముగ గౌరవించినందుకు నా కృతజ్ఞతను దెలుపుటకయి నాకు మాటలు చాలకున్నవి భరతమాతకు నేను గొప్ప ఋణములో బడియున్నాను

ప్ర — (నవ్వుచు) ఆ ఋణమును ఎట్లు తీర్పగలుగుదురు ?

రా — మున్ముందు చెప్పెదను రామమోహనుడు భారతీయుల యసమాన మేధాశక్తిని పాశ్చాత్యులకు వెల్లడి చేసెను వివేకానందుడు, అభేదానందుడు ప్రభృతులు వేదాంతము యొక్క యుత్తమ వార్తను వారికిచ్చిరి దాదాబాయినౌరోజి, గోఖలే, మెహతా, బెనర్జీ, పాల్, లజపత్రాయి మొదలగు భారతీయులు రాజ్యాంగ కళావైరశాద్యమును జాటి వచ్చిరి వారివలెనే నేను నొక భారతమాత దూతను నా సందేశము భారతదేశ దేహ పరిశ్రమౌన్నత్యమును జాటుట

ప్ర — అందుకిప్పటికి మీరేమి ప్రయత్నములను జేసినారు ?

రా — గొప్ప ప్రయత్నములే జరిగినవి 42090 రూ॥ నిచ్చి నా వద్దనున్న మల్లులలో ముఖ్యులను పదిమందిని సర్వప్రయత్నములును ముందుగాజేయుటకు పంపినాను నా రాకను వారచ్చట ప్రచురించుచున్నారు వారమునకు 15,000 రూ లిచ్చెదమనియు, ఖర్చులన్నియు, మావనియు, మీరు మీ స్వవిద్యలను మాత్రమే జూపినం జాలుననియు నొక సంఘము వారు అమెరికా నుండి నాకు తంతివార్త పంపినారు గాని నేనా ప్రార్థన నంగీకరింపదలచుకొనలేదు

ప్ర — (అమితాశ్చర్యముతో) ఏమి నెలకు 60,000 రూ లను నిరాకరించినారా ?

రా — "అయ్యా. అంతకంటె నే నచ్చట నే నెక్కువ సంపాదించగలనండి" అని శాంతముతో బలికిరి

ప్ర — అటుతరువాత ?

రా :— తరువాతనా ! జపాను నుండి 28 మల్లులను నాకు సహాయముగా పిలిపించినాను. మేమందరమును, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, రష్యా మొదలకు యూరపుఖండ దేశము లందును, అమెరికా యందును సంచారము చేసి, హిందూదేశ వాస్తవ్యులు బియ్యపన్నమును, శాకాహారమును దినువారే యయినను బలహీనులు గారనియు, దేహబలమునందు భూలోకమునందే దేశము వారితోనయినను (క్రమమయిన శిక్ష బడసిన యెడల) సరితూగుదురనియు వెల్లడి చేసెదము

ప్ర . — అనగా మనము బుద్ధిబలము గలవారమని యిదివరకే స్థిరపడి యున్నదిగాన దేహబలము గూడా గలవారమని మీరు లోక ప్రసిద్ధిజేసెదరు

రా — నిశ్చయముగా.

## రామమూర్తినాయుడుగారు

ప్ర .— లోకప్రసిద్ధి యెట్లున్నను సంచుల నిండ లక్షల కొలది ధనమును మాత్రము కుమ్మరించుకొని వచ్చెదరమట నిజమని మీ మాటలంబట్టి కానంబడుచున్నది అదియే మీ ముఖ్య సంకల్పము.

రా — కాదు కాదు ధనార్జనము చేయ వచ్చును. గొప్ప కీర్తినచ్చట సంపాదించవచ్చును గాని నా ముఖ్యాభీష్టము మనదేశ పద్ధతి ననుసరించి దేహవ్యాయామము చేయు శాలల పాశ్చాత్యదేశములలో స్థాపించి మన పరిశ్రమ మార్గములు వారి పద్ధతుల కంటె నుత్తమ మయినవని స్థాపింపవలయుననుట.

ప్ర :— అనంగా పాశ్చాత్యులు వారి దేహ బలమును వృద్ధి చేసికొనుటకు క్రొత్త మార్గము లను జూపి పుణ్యము కట్టుకొనెదరు

రా :— నాయర్థము అంతేగా వచ్చును.

ప్ర :— పాశ్చాత్యదేశ దిగ్విజయ యాత్ర సలిపి స్వదేశము వచ్చిన పిమ్మట మీరేమి చేయుదురు.

రా హిందూ విశ్వవిద్యాలయమప్పటికి స్థాపింపబడవచ్చును. ఆ విద్యాలయమునకు జేరిన పాఠశాల లన్నింటిలోను దేహపరిశ్రమా పద్ధతు లను ప్రవేశపెట్టించజేసి నేను తత్ప్రధాన విచారణ కర్తగ నుండవలయునని యున్నది నా పరిశ్రమ లను పంజాబు సంయుక్త రాష్ట్రములలో జేయుచు చాల మంది జనులు బాగుపడినారు నేను తత్సంబంధమున కొన్ని పుస్తకములను వ్రాసినాను

ప్ర —మీరేమి చేయుదురు

రా — భారతదేశ దేహ పరిశ్రమాభ్యసన ప్రధాన కళాశాల అను దానిని స్థాపించి ప్రధానో పాధ్యాయుడుగ నుండి హైందవ యౌవనులను శిక్షితులనుగ జేయవలయునను మహాసంకల్ప మొకటి కలదు

ప్ర — ఇందలి విద్యార్థులెట్టివారు ?

రా — మొదటి తరగతి వారు మల్లులు వారిని తరిపీదు చేసి దేశదేశములలోను శాలలను స్థాపించుటకయి పంపుదును మరి కొందరిని భూలోక సంచారము చేయుచు ప్రతి దేశములోను మన పరిశ్రమ పద్ధతులను బోధించి శాలలు స్థాపించుటకు పంపెదను రెండవ తరగతి వారు దేహారోగ్యము కొరకు పరిశ్రమను చేయువారు, ఈ విధమయిన సేవను చేసి భారతమాత ఋణమును దీర్చుకొనెదను

ప్ర — మీ సంకల్పములన్నియు బాగుగ నున్నవి భవిష్యత్తు మన చేతిలో లేదుగదా ? మీరు తిరిగి ఇండియాకే కారణాంతరముల వలననో రారనుకొనండి. అప్పుడు భారత భూమికి మీరు పంపునట్టి సందేశమేవిధముగ నుండును

రా మూడు ముక్కలలో జెప్పవచ్చును "దేహబలములేని బుద్ధిబలమూ నిరర్థకము నా ప్రియ దేశీయులారా ! దేహబలమును దేహ పరిశ్రమవలన వృద్ధి చేసికొనుడు దినదినమును ఉదరభరణ ప్రయాస మధికమగుచున్నది ఈ ప్రయాసములో దేహబలము గలవారే నానా దేశ ములు తిరిగి యయినను ధనమార్జించెదరు బలహీనులు అష్టకష్టముల పాలగుచుందురు మీకు దేహబలము వలననే పరిశ్రామికౌన్నత్యము గలుగును దేహబలమే సర్వసంపదలనిచ్చును అదిలేని బ్రతుకు కొరగాని బ్రతుకు" "శరీర మాద్యంఖలు ధర్మసాధనం" అను నీతివాక్యమును త్రికాలములయందు నిజమని చెప్పెదను" అని చెప్పి తమ సంభాషణను ముగించిరి

నాయుడుగారు పాశ్చాత్యదేశ యాత్రకయి పువ్విళ్ళూరుచున్నారు. ఆంధ్రపత్రిక యందు వారు పశ్చిమ దేశములలో నున్నప్పుడు వారిని గురించిన వార్తలప్పుడప్పుడు ప్రచురింపబడును. ★

# దక్షిణ హైదరాబాదు దుర్దశ

**ఆంధ్రపత్రిక 1912 జనవరి 3వ తేదీ సంచిక నుంచి**

మహాశయులారా ! నైజాముగారి ముఖ్య పట్టణ మగు హైద్రాబాదులో నతిభయంకరమైన (ప్లేగు) మహామారి జాడ్యము గతించిన నైజాముగారి కాలముననే యంకురించి తిన్న తిన్నగా నిప్పుడు "అగ్నిదేవునికి గాలిదేవుడు సాయ పడినట్లు" మురికి గుంటలు, మూఢవిశ్వాసకుల ముడుపులు అనగా (మహమ్మదు సుభానిజెండాలు, గడ్డలమ్మయను దేవీపూజలు, వీధుల వెంబడి భజనలు, గండాలు మొదలగునవి) ఈ దుష్ట జ్వరమునకు మరింత తోడ్పడి నగరమంతయు వ్యాపించి దినమునకు నూరిన్నూరుమందియము నిలయమునకు నేగుచు న్నారు. ఈ వ్యాధి యీ పురమునకు నిదియే ప్రథమము గనుక పామరు లేమి, విద్వాంసులేమి దిగులొంది ప్రాణరక్షణార్థం నల్దిశలకు వెడలిపోవుచున్నారు దైవికమో ప్రారబ్ధమోకాని యట్టివారిలో సహాయనేకులను నా మారి తన వాత పెట్టుకొనుచున్నది ఇట్టి స్థితిలో రోగుల పరామర్శించువారుగాని, మృతకుల కంత్యేష్టి చేయ వారుగాని లేక యనేకుల పాటు జూడ ఒహు విచారకరముగానున్నది దొరతనము వారు తొలుదొలుత గొన్ని యేర్పాట్లు చేసిరి, కాని జనులకా యేర్పాట్లు సరిపడనందున వారును నేమియు జేయదోచక యున్నారు పరమేశుడు, పరమ దయాళువుకాన నసాయమునకు ను సాయము సహా కలిగించియున్నాడు విద్వాంసు లెందరో యీ వ్యాధికి దగిన ప్రతిక్రియ చేయ నెలిగియున్నారు. దీనుల బరామర్శించు వారును యున్నారు. ప్రస్తుతము ఆర్య సమాజమువారు తమ విధియని యెరిగి రోగగ్రస్తులకు నౌషధము లిచ్చుటకును, ననాథులగు మృతకులకు దహన సంస్కార మొనర్చుటకను గట్టి బద్ధులై యున్నారు. అట్టి వారికి సకల ధర్మాత్ముల సహాయము విశేషముగా గావలసియుండును కావున మనుజులందరు మీ సోదరులేయనిభావించి సాధ్యమైనంతవరకు సహాయకులై యుండ ప్రార్థితులరు.

పై ఆర్య సమాజమువారి ప్రయత్నమువల్ల నిదివరకు మూడు నాలుగు వాడలలో ననేకులకు నాదరము కలిగినది. ఇకను వారికి దగినసహాయము లభించిన క్రమక్రమముగా నంతట బనిజేయ గలరు. దీనికి సహాయకులై యుండగోరువారు,

మంత్రి ఆర్యసమాజము, దక్షిణ హైద్రాబాదు అని వ్రాయవలయును

— మా. వె. భాగారెడ్డి

# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!





## నైసిల్ వాడండి

## చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి.




నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్ ఇది దురదను మంటను, చిరచిరను వెంటనే ఉపశమింపజేస్తుంది టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది

నైసిల్ – చెమటకాయల బాధనుండి ఉపశమనానికి నమ్మకమైన, నిరపాయకరమైన మార్గం

1 అతిగా వచ్చే చెమటను ఆపుతుంది 2 చెమటను పీలుస్తుంది
3 దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది 4, శరీరానికి హాయినిస్తుంది

2 ప్యాక్ లలో లభిస్తుంది–'బ్లూ' మరియు 'శాండల్ వుడ్'

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

HTB GLL'88U8

ఆంధ్రపత్రిక 1913 ఏప్రిల్
16వ తేదీ సంచిక నుంచి

# కాపు మహాసభ

ఇక్కాలమున ఆర్యావర్తనమునందుగల శాఖలన్నియు నూతనాదర్శములచేత పురికొల్పబడి నవ జీవనమునకై పాటుపడుచున్నవి గమ్యస్థానమును జేరుటకు యత్నించుటలో సంఘమున కవసరములగు మార్పులనుగూర్చి భిన్నాభిప్రాయము లుండవచ్చును గాని గమ్యస్థాన మొకటి యగుటచే మనము అభివృద్ధి జెందుటకు సదుపాయములను దెలిసికొని వానిని యాచరించుటకు మార్గములు యోచించి చర్చించుట కర్తవ్యంబు సంఘ సంస్కారము సఫలము నొందవలెనన్న శాఖాసంఘములవలననే కావలెను ఆర్యులలోని యగ్రవర్ణములవారికి గల భేదములు పెక్కులు అందుచేత వివిధ వర్ణములవారు చేరి కావించు సభలలోని తీర్మానములు విశేషముగా ఆదర్శములను నెలకొల్పుచున్నవి ఆయా యాదర్శములను యనుభవములోనికి ఆచరణలోనికిని తీసికొని రావలయునన్న యీ శాఖా సంఘములే యవసరము మరియు ఒక్కొక్కశాఖలో ఒక్కొక్క దురాచారము నాటుకొని యున్నది. వాని నెరింగి సంస్కరణములు నాచరించదలచినప్పుడు మన బంధువులు స్నేహితులు మొదలగువారి వాదిని సోధించి వానిలో సాధ్యమయినంత యెక్కువ మందిని మనపట్టున జేర్చుకొనినగాని ముందంజ వేయుటకు వీలుపడదు కాని యిట్టి సభలుగలవారును కలసి కావించు మండల సభలకును దేశీయ మహాజన సభలకును దోడ్పడు ఉపకరణములేగాని వానికి వ్యతిరేకముగావు ఈ సభల వల్లనే ఉపసంఘములన్నియు వృద్ధియై వికసించి సమాన గౌరవమును పొందును. భవిష్యత్కాల గర్భమునున్న దేశీయ మహాజన సంస్కారసభయై పరిణమించును

ఆంధ్రదేశమిప్పుడు కాపు మహాజన సభను సమకూర్చుటకు సంసిద్ధమై యున్నదగుట నిర్వివాదాంశము ఈ యుద్యమము ప్రతి జాతీయుని హృదయమును మేల్కొల్పుచున్నది. రెండు సంవత్సరములకు పూర్వము యీ భావమునే యొక మహనీయుడు ఆంగ్లేయ వార్తాపత్రికలద్వారా వెలిబుచ్చినప్పుడు మిన్నకుండుటచే అది యంతటితోనే నంతరించె.

శూద్రజాతియన బహు బాహుళ్యమైనది. ద్విజులును పంచములును గాక యితర హిందువులలో రమారమి యావన్మంది శూద్రజాతి యనబడుచున్నారు. శూద్రులలో ననేక తెగలు గలవు అందులో కాపు కమ్మ వెలమరెడ్డి అను వారు ముఖ్యులు. ఇక తక్కిన కుమ్మరి, గొల్ల, కమ్మర, పెరికి, మంగలి, చాకలి మొదలగువారును శూద్రజాతిలోని వారెగదా ! కావున శూద్రులను నామమొక తెగకు నన్వయించునది కాదు. అనేక శాఖలు గల యొక వర్ణము పేరు. శూద్రులలో నెల్ల కాపుల సంఖ్య యెక్కువగుట చేత శూద్ర శబ్దమె కాపులకు వ్యవహార భాషలో వాడుచున్నారు. మరియు "తెలగాలు" అని కూడ యిప్పుడిప్పుడు వాడబడుచున్నది. కాపు అని ఉత్తర సర్కారులలోను బల్జి అని వినుకొండసీమ మొదలు దక్షిణదేశము వరకును వాడబడుచున్నవి కాబట్టి యీ సభ కాపు మహాజన సభయని పిలువబడవలెననియె మా మతము. ఏలయన తక్కిన శూద్రులగు కమ్మవారు రెడ్డివారు యిదివరకే తమ తమ కులసభలు గావించి యున్నారు. దీని వలన శూద్రులు ద్విజులకన్న ప్రతి విషయమునను వెనుకబడి అభివృద్ధి గోరుచున్నట్టు స్పష్టపడుచున్నది కాన యిది కాపుల కొరకే యేర్పాటు చేయబడవలసి యున్నది

ఈ కులము వారు నాగపూరు మొదలు మధురవరకు వ్యాపించియున్నారు సుప్రసిద్ధులు జాతీయ ధురంధురులు నవీన పరిజ్ఞానమును తోడ్పాటు చేసికొని ప్రతి పట్టణమందును కార్యనిర్వాహకుల సభల నేర్పరచి కార్యదర్శులను నియమించి అచ్చటను ఆ చుట్టుప్రక్కల గ్రామాదులలోను పల్లెలలోను ధనమును వసూలు చేసి, ఒక నిధిని నేర్పాటు చేయవలెను ఆ నిధిని వసూలు చేయుట విద్యకై వెచ్చించుట మొదలగు కార్యములు సభవారే చేయుదురు వర్ణ సభలన్నియు కలసి యొక అధ్యక్ష సంఘమును నియమించి వారి వలన గొంతపని జరుపవచ్చును అందుచేత ఎచ్చటి వారు అచ్చటనే ఎక్కువ బట్టుదలతో పని చేయగలుగుదురు కాపుజనులు వారి వారి నివాసములను బట్టి కాపులనియు బల్జిలనియు తెలగాలనియు పిలువబడుచున్నారు ఈ రాజధానిలో కాపులు 2678925, బల్జిలు 1041246, తెలగాలు 498762 గలరు మొత్తము 4218933 రాజధాని మొత్తము జనాభా 41870160 వీరిలో చదువు నేర్చిన వారు పురుషులు 257808, స్త్రీలు 18943. ఇంత సంఖ్యగల ఈ మహావృక్షము ప్రస్తుతము ఎండి నిర్జీవమై పడియున్నది ఇంత మహా సంఘము నొక చోటగలిసి నేకగ్రీవముగా ఒక భావమును వెల్లడి చేసినచో అది దేశమంతయు ప్రతిధ్వనించక మానదు సంఘమంతయు కదలినగాని వ్యక్తులు వృద్ధి నొందరు

చలికొండ నారాయణస్వామి,
బందరు
ఆరా కృష్ణారావు



ఆంధ్రపత్రిక 1912 జనవరి 3వ తేది సంచిక నుంచి

# ఆంధ్ర జాతీయ వేదనము

ఏబది సంవత్సరముల క్రిందట నిపుడు లోకము నెల్ల విస్మయమును గొల్పుచున్న జర్మనీ, యమెరికాదేశములయందు వాని జీవన పద్ధతులను బూర్ణముగ మార్చివేసిన విద్యా పద్ధతులను, తన్మూలమున వచ్చిన సంపదయు, లేవు సముద్రములమీదను, భూమిమీదను, రణవీథి యందు నిరుపమానమగు ప్రజ్ఞను ప్రకటించి, ఆర్థిక భాగ్యమునందు పాశ్చాత్య రాష్ట్రములను సహితము వెనుక ద్రొక్కుచున్న జపాను రాష్ట్రమున కాకాలమున పేరులేదు ఇంతేల నిపుడు సూర్యుడు సహితము అస్తమించనంత విశాల రాజ్యముగల ఆంగ్లేయుల యభివృద్ధి సహితము కడచిన శతాబ్దములోనే జరిగినది. ఏబది మొదలు నూరు సంవత్సరములలోగా నీ రాష్ట్రములన్నియు వానికి సహజముగాగల ప్రకృతి సంబంధమగు నాటంకములనెల్ల జయించి, కేవలము శాస్త్ర సహాయముచేత నప్రతిహతమగు శక్తిని, సంపాదించినవి. లోకానుభవమంతయు సులభముగ లభించు కాలమున మనము జన్మించి నందుకు ధన్యులము మనము ప్రాచీనుల జ్ఞానమును, ఆధునికశాస్త్ర పరిశోధనాఫలితమును గరతలముగ లభించు కాలములో జన్మించినందు నకు ధన్యులము. శాస్త్రములు, చరిత్రలు, పరిశ్రమలు, సర్వము మనకొఱకు నిరీక్షించు చున్నవి వీనిని మనము సరిగా నుపయోగ పఱచుటయందే మనభౌతిక యభివృద్ధియంతయు నాధారపడియున్నది ఈ యావశ్యకతను మన యాంధ్రులు గ్రహించినందునకు సంతసించు చున్నారము ప్రాచీనకాలమున మన దేశీయు లెంత యప్రతిమ ప్రభను సంపాదించినను, ప్రకృతమున మనము మిక్కిలి దైన్యస్థితి యందున్నామనుట నిర్వివాదాంశము. ఎచ్చట జూడ దారిద్ర్యము, విద్య లేని పసితల్లులే గానవచ్చుచున్నారు అజ్ఞానము దేశమంతయు వ్యాపించినది. వాణిజ్యము నశించినది పరిశ్రమాభిలాష తగ్గినది. రాజ్యాంగ విషయములయందు నిర్లక్ష్యము హెచ్చినది అంతయు నిరుత్సాహమే. అంతయు నాటంకమే అంతయు దుఃఖమే. ఈ స్థితినుండి మనకు ముక్తిలేదా? ఆంధ్రజాతి నశించవలయునా? ఇట్టి నిరుత్సాహ స్థితి నుండియే పాశ్చాత్య రాష్ట్రములవారు దృఢ సంకల్పముబూని, నిరుపమాన త్యాగమును ప్రకటించి ఆధునిక శాస్త్రసహాయముచేతనే తమ దేశీయుల దుఃఖములను బారద్రోలి, సుఖావహులుగ నొనర్చియున్నారు. ఇట్టి నిరుత్సాహ స్థితి యందే ఆంధ్రదేశీయులకును, సందేశమువచ్చినది.

మన యాంధ్రదేశమునందిప్పు డెటజూచినను జాతీయోదయ వేదనమే గానవచ్చు చున్నది. రాజిక, సాంఘిక, పరిశ్రామిక, ధార్మిక, విషయముల యందెల్లను నూతనజీవము కన్పట్టుచున్నది. కాని, వీనియన్నిటిలోను భాషాభి వృద్ధికిని, విద్యాభివృద్ధికిని జేయబడుచున్న యత్నములు ప్రశంసనీయము వర్ణభేదమును సహితము మఱచి, అంత్యవర్ణములవారి యభివృద్ధికై రాత్రిపాఠశాలలు స్థాపించి, పనిచేయుచున్నారు. విద్యార్జనకై ఆంధ్రయౌవనులు ధారాళముగ విదేశముల కరుగుచున్నారు. ఇంతవఱకు రహస్యముగ బడియున్న ప్రకృతిశాస్త్రములు, చరిత్రలు సామాన్యజనులకు భాషాభివృద్ధి సంఘములచే సులభముగా లభింప జేయబడుచున్నవి వార్తాపత్రికలు మూలమూలలనున్న గ్రామములకు సహితముబోయి జ్ఞానాభివృద్ధికి దోడ్పడుచున్నవి. కడచిన యారేండ్లలోను భాషోద్ధారణకు గావింప బడినంత యత్నమిది వఱకెన్నడు జరగియుండ లేదు. ఈ భాషోద్ధారణయత్నమే మన భావి యభివృద్ధి సాధనములలో ముఖ్యమైనదై, అనేక లాభములతో గూడియున్నది ఎచ్చటజూచినను, జాతీయోదయమునకు భాషోద్ధారణమే దారిచూపి నది. కవీశ్వరులు, చరిత్రకారులు, దేశమును గుర్తించి భక్తిని బురికొల్పుచున్నారు ఈ భాషోద్ధారణ ప్రయత్నముయొక్క ప్రథమ ఫలితము జాతీయ విద్యాభిలాషయందు గానవచ్చును. ఈ మధ్యకాలమున మన యాంధ్రదేశమున సంకల్పింపబడిన యుద్యమములలో నేదియు జాతీయవిద్య యంతగా మనదేశీయుల ధర్మమును, త్యాగమును ప్రకటించియుండలేదు మన భావి భాగ్యమంతయు నాధారపడియున్న యీ జాతీయ విద్యాభివృద్ధికి దోడ్పడినట్టియు, తోడ్పడుచున్నట్టియు మహాపురుషులెల్లరు వంద్యులు. ఆంధ్రుల భక్తిత్యాగములు లోకమునకు వెల్లడియగుచున్నవి. ఈ మాత్ర దేశాభివృద్ధి దీనికి దోడ్పడి, స్థిరోప కారమును లభింపజేయునను నాశయముతో నున్నారము జాతీయాభివృద్ధియంతయు మనము చేయు త్యాగమునే ఆశ్రయించియున్నది. ఈ జీవ సంగ్రామమునందు మనమెంత అధోగతి యందు బడియున్నామో గ్రహించి, జాతీయోద్ధారక సాధనములనెల్ల బూనుటయందే మన భావి దశ ఆధారపడియున్నది





కీ శే కట్టమంచి రామలింగారెడ్డి



కీ శే కడప కోటిరెడ్డి



కీ శే డి ఎస్ రెడ్డి

# రెడ్డి మహా సభ

## నెల్లూరిలో సమావేశమగుట

గత నెల 28 వ తేది యుదయమున నే సభాధ్యక్షులగు శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహదరు మునగాల జమిందారుగారు వచ్చిరి ఆహ్వాన సంఘాధ్యక్షులును మరికొందరు రెడ్డి ప్రముఖులను రైలుస్టేషను యొద్ద వారి కెదురేగి గౌరవించి, పుష్పమాలల నొసంగి, మోటారు బండిపై ఉత్సవముతో దీసికొని వచ్చిరి

29 వ తేది యుదయము సభాధ్యక్షుని వేంకటగిరి నుండి ప్రత్యేకముగా దెప్పింపబడిన అంబారి ఏనుగుపై సభామందిరమునకు ఉత్సవ ముతో దీసికొనివచ్చిరి వారితో గూడ మునగాల కుమారరాజాగారును వచ్చిరి ప్రతినిధుల సంఖ్య అంత అధికము లేదు నెల్లూరు నుండియు చుట్టుప్రక్కల గ్రామముల నుండియు గుంటూరు మండలము నుండియు రెడ్డికులజు లనేకులు వచ్చిరి సభామందిరపు బయటగాని లోపలగాని పోలీసు ఉద్యోగి ఒకడైనను లేకుండు టయే ఈ సభ యందు గమనింపవలసిన విషయము ఉదయము 9–30 గంటలకు సభ సమావేశమయ్యెను

డి వెంకటరామిరెడ్డి, నాయని వెంకట్రంగ రావు బహదరు, రేబాల సుందర రామిరెడ్డి, కో■ చంద్రారెడ్డి, తిక్కవరపు రామిరెడ్డి, దామవరపు వెంకట సుబ్బారెడ్డి, కాటంరెడ్డి ఆదినారాయణరెడ్డి, పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి, దొడ్ల వరదారెడ్డి, బలరామరెడ్డి, రామిరెడ్డి, కృష్ణారెడ్డి, బి రామచంద్రారెడ్డి, బారిస్టరు కోటిరెడ్డి, బెజవాడ సుందర రామిరెడ్డి, పొన్నగారు ■క్ష్మీనరసారెడ్డి, హెచ్ రామిరెడ్డి, మన్నెం శేషారెడ్డి, బత్తుల నరసారెడ్డి, జెట్టి బలరామిరెడ్డి, ఆనం సుబ్బారెడ్డి, వెంకటసుబ్బా రెడ్డి, పొనకా వీరారెడ్డి, గోవిందరెడ్డి, గున్నపాటి ఏనాదిరెడ్డి, దొడ్ల వెంకటరామరెడ్డి, ■క్ష్మీనరసారెడ్డి, పెల్లి నారాయణరెడ్డి, వి వీరరాఘవరెడ్డి, అన్నదేవుల గోవిందరెడ్డి, సి నారాయణస్వామిరెడ్డి, రేబాల గోపాలరెడ్డి, ఉగ్గకూడి సుబ్బరామిరెడ్డి, దొడ్ల రామిరెడ్డి, బెజవాడ చంద్రశేఖరరెడ్డి, పొనకా పట్టాభి రామిరెడ్డి, పెళ్లేటి పెంచలరెడ్డి, కట్టమంచి శివారెడ్డి, ఓరుగల్లు రంగారెడ్డి గార్లను ఇంక ననేకులును సభ నలంకరించిరి

పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారిచే చదవ బడిన ప్రార్థనతో సభ యుపక్రమింపబడెను అనంతరము బాలకవి వేంకటసుబ్బారెడ్డిగారు స్వాగత పద్యములను జదివిరి అటుపిమ్మట ఆహ్వాన సంఘాధ్యక్షుల యుపన్యాసమును బెజవాడ రామచంద్రారెడ్డిగారు చదివిరి

అందుపన్యాసకులు నెల్లూరు శబ్దోత్పత్తిని గూర్చి నుడివి విశబ్దములో సమన్వయముచేసి మండలమున ప్రసిద్ధికెక్కిన రెడ్డిజాతిని గూర్చి విశేషముగా నుడివి, రెడ్డిజాతి పూర్వీకుల గుణగణ ములను, దేహ పాటవము మున్నగువానిని గొని యాడి విద్యను గూర్చియు ధనార్జనమును గూర్చియు ఐకమత్యమును గూర్చియు హితోప దేశమును జేసిరి

కట్టమంచి రామలింగారెడ్డి (మైసూరు) సుబ్బరాయలు రెడ్డియార్ (గూడలూరు) రావుబహదూర్ లక్ష్మీనరసారెడ్డి, బయ్యపరెడ్డి (అనంతపూరు) మున్నగు రెడ్డి ప్రముఖులు సభకు రాజాలమికి నగుచు పంపిన తంత్రీ వార్తలు చదువబడెను అనంతరము బారిస్టరు కోటిరెడ్డిగారు మునగాల జమీందారుగారి గుణ గణముల గొనియాడుచు నుపన్యసించి వారి నధ్యక్షపదవికి ప్రతిపాదించిరి ఈ ప్రతిపాదన మును బలపఱచినపిదప కోవ్వూరు వాసులగు గురవారెడ్డిగారు అధ్యక్షులను ప్రశంసించుచు ప్రసంగించిరి అనంతర మధ్యక్షులు ఉత్తమాస నము నధిష్టించిన వెనుక వారిని పుష్పమాలాలం కృతుల జేసిరి పిమ్మట అధ్యక్షులు తమ యుప న్యాసమును జదివిరి ఈ యుపన్యాసము భావ గర్భితమై ప్రశంసాపాత్రముగ నున్నది దాని

ఆంధ్రపత్రిక 1917 జూలై




కీ॥ శే॥ సుంకవరం ప్రతాపరెడ్డి



కీ॥ శే॥. కొత్వాల్ వెంకటరామారెడ్డి



శ్రీ నీలం సంజీవరెడ్డి

లోని కొన్ని ముఖ్య భాగములను ఈ క్రింద వివరించుచున్నాను

ఉపన్యాసానంతరము విషయ నిర్ధారక సంఘము వారి పేర్లు చదువబడి మధ్యాహ్నము 2—30 గంటలకు ఈ సంఘమువారు సమావేశమై తీర్మానాదులను నిర్ణయించుదురని తెలుపబడెను సాయంత్రము 5 గంటలకు మహాసభ మరల సమావేశమాయెను

## మన ప్రాచీన చరిత్ర

'రెడ్డి' శబ్దము 'రాట్' శబ్దము నుండి పుట్టినదనియు 'ఱేడు' 'రెడ్డి' సమానార్థకములనియు 'రాష్ట్ర కూటులు' అను క్షత్రియ రాజులనుండి రెడ్లు పుట్టిరనియుఁ గొందఱి యభిప్రాయము కాని, యివియన్నియు నూహలు నిశ్చయములైన చరిత్రాంశములుగావు ఇంకను నిందును గుఱించి భాషా పండితులు పరిశోధింపవలసి యున్నది

రెడ్లు నిన్న మొన్నటివారు కారు సుప్రసిద్ధమైన ప్రాచీన చరిత్రగల మహామహులు ఆంధ్రదేశముయొక్క పలు భాగములందు శిధిలములై పరిఖావృతములై దుర్గమంబులగు దుర్గములచేత శిల్ప నైపుణ్యంబుచేతఁ జూపరుల కాశ్చర్యంబు తెలుపు దేవాలయంబులతోడను, వ్యవసాయాభివృద్ధికరంబుగు కాసారంబులతోడను, వీరపురుష రక్త చిహ్నియంబులగు విచిత్ర స్థలంబులతోడను, జాతీయ ప్రబోధకంబులగు వాఙ్మయంబుతోడను, జాతీయ చిత్రరూపంబుల జిత్రించియున్నవారము వీరభద్రారెడ్డిచే విరివిగాంచిన గౌతమీ పరిసరంబులును, కొండవీటి రెడ్లచేఁ బ్రఖ్యాతివడసిన కృష్ణ కెలంకులును వీర పురుషుల చరిత్రంబులచేఁ జిత్రింపబడిన కాల ఫలకంబును మన యసమాన గౌరవమును నిరూపింపఁగల పాత్రయంబని చెప్పవొప్పును మన ప్రాచీన చరిత్రను సింహావలోకనంబుగ తమకుఁ గొంత వినిపింప ప్రయత్నించెదను



మన మిప్పటి కెఱింగినంతవఱకు ౧౩—వ శతాబ్దమున ఓరుగల్లు నేలిన కాకతీయుల కాలమున ప్రాముఖ్యము నొందినట్లు కన్పట్టుచున్నది ఓరుగంటి చక్రవర్తుల కాలమున రెడ్డి రాజులు వారికి సామంతులుగా నుండినట్లు శాసన ప్రమాణములు గలవు క్రీ॥ శ॥ 1336 వ ప్రాంతమున ద్వితీయ ప్రతాపునకు సామంతుఁడైన అన్నయరెడ్డి, మునగాల ప్రాంతమున రాజ్యము చేయుచుండినట్లు 'తాడువాయ' యను గ్రామములోని శిధిలమైన మల్లికార్జున దేవాలయమందలి రెండు శాసనములవలన స్పష్టపడుచున్నది, కావున నాఁటినుండి నేఁటివరకును మునగాల సంస్థానము రెడ్డిరాజుల స్వాధీనమందే యున్నదని యూహింపవచ్చును రెడ్డివారు రాజులుగ నుదాహరింపబడిన శాసన మింతకంటెఁ బురాతనమైనది మఱొక్కటి లేదని శాసన శోధకుల యభిప్రాయమై యున్నది

ఇట్లు 14 వ శతాబ్ద ప్రారంభమున సామంత రాజులుగ నుండుటకు రెడ్డివారంతకుఁ బూర్వము రెండు మూడు శతాబ్దములైనను నాంధ్రదేశమందు రాజకీయౌన్నత్యము నంది యుండిరని మన మూహింపవచ్చును. అంతకును బూర్వము వీరిస్థితి యెట్లుండెనో యూహించుటకు వేఱు సాధనములు లేవు ద్వితీయ ప్రతాపుని కాలమునుండి 16—వ శతాబ్దమున విజయనగర సామ్రాజ్య మంతరించువఱకు వీరు ప్రాముఖ్యమును వహించియే యుండిరి రుద్రమదేవి ప్రతాపరుద్రుల కాలమున పలువురు రెడ్లు సేనాధిపతులుగను సామంతులుగను బ్రతాపవిస్తరణమునకుఁ దోడ్పడిరి గుంటూరి మండలములోని పల్నాటి ప్రభువుల కడ మంత్రి పదవి నలంకరించి తన మంత్రసామర్థ్యమునను ఖడ్గకౌశలమునను, అశ్విక చమత్కృతివలనను, పేరెన్నికగాంచి ఆహవపాండిత్యమునను రణవ్యూహకౌశలంబునను జూపిన అప్రతిమాన సామర్థ్యంబు వలన 'నాయకురా'లను బిరుదునామము వహించిన నాగమ్మ మన రెడ్డివంశ సంజాతయే

కాకతీయుల తరువాత సామంతులుగ నున్న రెడ్లు స్వతంత్రులై కొండవీడు, అద్దంకి, రాజమహేంద్రవరము మున్నగు పట్టణములను రాజధానులుగ నేర్పఱచుకొని రాజ్యపదమునంది ఆంధ్రదేశమున బాలించిరి సుమారు రెండు మూఁడు శతాబ్దములు రెడ్ల చరిత్రయే ఆంధ్రదేశచరిత్రగఁ బరిణమించెను కాకతీయ వంశము నశించి విజయనగర రాజ్యము ప్రబలువఱకు కొండవీటి రెడ్లే ఆంధ్ర రాజ్యరమణిని తమ భుజస్కంధమున ధరించియుండిరి ఈ కాలముననే ఆంధ్రదేశము మిగులఁ బ్రఖ్యాతిగాంచెను ప్రోలయ వేమారెడ్డి, అనవేమారెడ్డి, అల్లాడ రెడ్డి, వీరభద్రారెడ్డి, మొదలైన శూరాగ్రేసరుల నామము లాంధ్రదేశ చరిత్రమునందు సువర్ణాక్షరములతో లిఖింపఁబడినవని యొక్క రెడ్డి



ఖచ్చితంగా గ్రోమోర్
ఎరువులే కొనండి
ఇది గ్రోమోర్ గుర్తు
GROMOR
PHOSPHATE
28-28-0
GROMOR
N-P-K
14-35-14
గ్రోమోర్
28-28-0
గ్రోమోర్
14-35-14
చేనుకు చేవ, రైతుకు రొక్కం – గ్రోమోర్
FDS CFL 783 TEL



డా॥ బెజవాడ గోపాలరెడ్డి



శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి



డా॥ మర్రి చెన్నారెడ్డి

# రెడ్డి మహాసభ

వారేగాక ఆంధ్రు లెల్లరును నొప్పుకొనకతప్పదు వేమభూపాలీయమను నామాంతరముగల 'వీర నారాయణీయ'మను కావ్యమునకు నాయకుఁడైన పెదకోమటి వేమారెడ్డి యశస్సు గూడ మిక్కిలి కొనియాడఁ దగియున్నది కేవలము శౌర్యము నందుఁగాక విద్యాది బుద్ధివైభవములందుఁగూడ రెడ్డిరాజులు తమ సామర్థ్యముం జూపిరి కుమారగిరిరెడ్డి నాట్యశాస్త్రమును రచించెను అతని మేనమఱందియు మంత్రియునైన కాటయ వేమారెడ్డి కాళిదాస కృతమగు నాటక త్రయంబునకు 'కుమారగిరి రాజీయ'మను పేరిట టీక వ్రాసియున్నాఁడు సంస్కృతాంధ్ర వాఙ్మయమీ కాలముననే విస్తరిల్లెను రెడ్లు తాము స్వయముగా గ్రంథముల వ్రాసియు బండితులఁ బోషించియు, కవుల నాదరించియు భాషాభివృద్ధికై తోడ్పడిరి కవిసార్వభౌముఁడను బిరుదు గాంచిన శ్రీనాథ సుకవి కుండిన రాజ్యమున విద్యాధికారియై వాసికెక్కెను మల్లారెడ్డి పండిత కవియై గ్రంథముల రచియించి కీర్తి గాంచెను నీతికోవిదుండును పరమ భక్తాగ్రేసరుండును నగు వేమారెడ్డి తన పద్య శతంబులచే నద్వైత విజ్ఞానమును నాంధ్రదేశమంతటను వెదఁజల్లి ఆంధ్రుల హృదయసీమలయందు శాశ్వత పట్టంబుఁగట్టుకొని యున్నాఁడు

మన ప్రాచీనచరిత్ర మన భారతమాతకు కడుంగడు గౌరవము గలిగించునదియేగాని మఱొండుగాదు ఇంతవఱకు నామె తన ధీర సంతానములలో నొక్కనిగ మనలను బరిగణించుచున్నది ఇక ముందును బ్రిటిషుసామ్రాజ్యమున మన పూర్వ చరిత్రకు దగిన విధానమున వర్తించుచు మాతృదేశరంజకములగు కొన్ని రమ్యాంకములను మన భావిచరిత్ర ప్రదర్శింప వలసియున్నది తత్ప్రదర్శనములకు వలయు సాధన సామగ్రిని సముపార్జించు నిమిత్తమే మన మిచ్చట చేరి యున్నాము మన మిచ్చట చేయ నుద్దేశించిన పనులు మన మవలంబించు మార్గములు మన ప్రసిద్ధ చారిత్రమునకును మన భారతమాత యొక్కయు భారత సోదరుల యొక్కయు భావ్యభివృద్ధికిని ఎంతవఱకుఁ దోడ్పడునో మనము యోచింపవలసి యున్నది

## శాఖా సభలు

భారతీయులందఱు మేలు గోరువారి శాఖ లన్నియు నశించి, అందఱనేక శాఖీయులుగా జేయుటయే కర్తవ్యముగా నెంచవలయును దేశాభిమానము కంటె శాఖాభిమానమే ప్రబలమై అది పెడదారిబట్టినచో దేశమునకు మహోత్పాతము గలిగించునని నా దృఢ విశ్వాసము శాఖోద్యమ ప్రేరకులగు మహాశయు లెల్లరును, ఈ విషయమును ముఖ్యముగ గమనింపవలయును ఈ యుద్యమములయొక్క యాదర్శములును పరివ్యాప్తియును అవలంబించు పద్ధతులును ముందుగ నిర్ధారణ చేసికొనవలసియుండును

భరతఖండము, భారత జాతి, భారతీయాభ్యున్నతి ఇది మన యాదర్శత్రితయము మన శాఖా సభలయొక్క దయార్శములన్నియు నీ మాత్రమున నణఁగియుండవలెను శాఖా సభలు, ఆయా శాఖలయొక్క జ్ఞానాభివృద్ధికి బాటుపడి తమ్మొలమున వైషమ్యములను ఎంత రింపజేయునవిగ నుండవలయును సక్రమముగ నడిపిన యెడల గొంతకాలమునకు శాఖా సభల యావశ్యకమే లేకపోవచ్చును అట్టి యుత్కృష్ట కాలమెప్పుడు వచ్చునాయని పై శాఖా సభ లెదురు చూచు చుండవలయును దేశీయ మహాసభ యొక్కయు తదాదర్శములు గల యితర ప్రతిష్ఠానముల యొక్కయు గమ్యస్థానములకు బ్రతిబంధకములగు నుద్యమములకీ యభినవ భారతరంగమున స్థానములేదు, దేశాభ్యుదయము గోరు ప్రతిభారతీయుడును, శాఖా సంఘములును, భారతజాతియొక్క క్షేమమే తమ క్షేమమనియు, భారతజాతియొక్క యభివృద్ధియే తమ యభివృద్ధియనియు, భారతజాతియొక్క యాదర్శమే తమ యాదర్శమనియు, భావించుకొనవలయును ఇట్టి పవిత్రాదర్శములులేక, యితర సంఘములయెడ ద్వేషము, ప్రత్యేక వ్యక్తులయెడగల యమాయు, శాఖోద్యమముల నాయకులయొక్క స్వలాభములు, నీయుద్యమములకు ప్రోత్సాహకరములును నాధారములు నయ్యేనేనియవి పెడత్రోవలం బట్టకమానవు విద్యాభివృద్ధికంటె శాఖా సభలు చేయఁదగిన మహత్కార్యము మఱియొక్కటి గానరాదు దేశీయుల కందఱకును సంబంధించిన విషయము లన్నిటియందును వివిధశాఖలును తమ శాఖా భేదముల బాటింపక కృషి చేయుచుండవలయును ఇట్లు శాఖా సభలు తమ కార్యముల నిర్దేశించుకొని పని చేయుచుండినచో దేశీయ మహాసభల సంకల్పములకుఁ బ్రతిఘటింపక దాని యుద్దేశ్యములకుఁ దోడ్పడి జాతీయైకమత్యమునకు సోపానములగును

## విద్యాభివృద్ధి

రెడ్డికుటుంబం దుద్భవించిన ప్రతివ్యక్తికిని మనము విద్య గఱపఁగలిగితిమేని మనము ధన్యుల మయ్యెదము ఇతరముగా నేమిచేసినను చేయ కున్నను గూడ మనకంత చింతలేదు దొరతనము వారు ప్రజలకు నిర్బంధముగను, ఉచితముగను, విద్య నొసంగువఱకు మన మెదురుచూచు చుండుట యనావశ్యకము అట్టికాల మెప్పుడు వచ్చునో మనమిపుడు చెప్పఁజాలము కాన ఏ జాతివారా సంఘమందలి జనుల యొక్క విద్యను, అభివృద్ధిచేయు కార్యము తమమీఁదనే వైచికొని, బీదవారలకుచితముగను, తదితరులకు వారి వారి శక్తినిబట్టితగు సాయముచేసి, సులభసాధ్యముగను విద్య లభించునట్టి సదుపాయములను చేయ వలయును అట్లుచేయని మనమితర సంస్కరణ ములకై ప్రయత్నము లొనర్చితిమేని పునాదిలేక గృహమును గట్ట నారభించువాని గతి మనకు పట్టగలదు. కాన మన ధనమును, సామర్థ్యమును, పరోపకార చింతను, స్వార్థత్యాగమును, విద్యాభి వృద్ధికై మొదట వెచ్చింపవలయును

ఇంగ్లీషు భాషయందుండు జ్ఞాన సంగ్రహమునకు పరిమితిలేదు గనుక సాధ్యమగు వఱకు మనవారింగ్లీషు నభ్యసించుట యోగ్యమే కాని, ప్రస్తుత స్థితిలో మన దేశీయులందఱు నింగ్లీషు నేర్చుట సాధ్యమెన్నటికినిగాదు కాన వారివారి దేశభాషలయందే వారికి విద్యాదానము చేయవలయును అఖిల భారతదేశమునకుఁజెల్లు, ఈనియమమే మన సంఘమునకును దప్పక వర్తించును కావున మనము చేయు విద్యావ్యాప్తి చాలమట్టుకు నాంధ్రములోనే యుండవలయును కుగ్రామ వాసులకు రైతులకు దేశభాషలలో విద్యను నేర్చుకొనుటకు సులభ సాధ్యమగును మఱియు నిదివఱకు ప్రచారములోనున్న విద్యా విధానములందు భాషావిషయక జ్ఞానమే యధిక ముగా బోధింపబడుచున్నది భౌతికశాస్త్రములు, కళలు, వృత్తులు, మొదలైన వానిని గుఱించిన జ్ఞానము సున్నయనియే చెప్పవలెను ప్రస్తుతము చదువుకొనిన వారికి నౌకరియొద్ద సేవకవృత్తి చేయుటతప్ప నన్యవృత్తి లేకున్నది ఇదియే యిప్పటి విద్యా పద్ధతులయందలి ప్రబలమైన దోషముగ నెంచఁబడుచున్నది సేవక వృత్తి య్యైనను నందఱకును లభింపకున్నది అందునఁనే ద్వేషములు, నూతనోద్యమములు, నుద్భవించి పెక్కు అనర్థములు పొసగుచున్నవి కాన మనము



కీ శే. కె.వి. రంగారెడ్డి

## రెడ్డి మహాసభ

క్రొత్తగ మన సంఘమునకు విద్యాదానము చేయఁ బూనినపుడీ దోషముపాలు గాకుండ చదువువచ్చిన ప్రతి వ్యక్తియు సేవకవృత్తినే యపేక్షింపక స్వతంత్ర జీవనము చేయనగు కళలను నేర్పినట్లు చేయవలయును

### ఉపశాఖా సమ్మేళనము

హిందూ దేశమునందలి యితరజాతులవలెనే మన సంఘమునందును నుపశాఖలు విరివిగా నున్నవి పంటరెడ్లు, పాకనాటిరెడ్లు, దేసూరి రెడ్లు, మోటాటిరెడ్లు, పెడకంటిరెడ్లు, రేనాడు రెడ్లు, కొడితిరెడ్లు, గోనెరెడ్లు, మున్నగు నంతశ్శాఖలన్నియు నొక్కటియై రెడ్లందఱు నేకకులము వారనియు, వారిలో నొక్కొక్కరికి నేవిధమైన భేదములేదనియుఁ జూపునట్టి నైక్య భావము సిద్ధించినంగాని యీ రెడ్డి మహాసభ యొక్క పరమోద్దేశ్యము సఫలమైనదని చెప్ప టకు వీలులేదు

## వ్యవసాయాభివృద్ధి

మన సంఘమునందుఁ గొందఱు జమీం దారులుగను గొప్ప భూస్వాములుగ నున్నను, వేయింటికిఁ దొమ్మిదివందల తొంబదిమంది వ్యవ సాయమువలననే జీవించువారుగా నున్నారు ఆంధ్రదేశమందలి పెక్కుభాగములలో 'కాఁపు' శబ్దము రెడ్డిశబ్దమునకుఁ బర్యాయపదముగ నుపయోగింపఁబడుచున్నది ఇది మనకొక యభి మాన విషయముగాని నింద్యవిషయము గాదు అనఁగా నాంధ్రదేశమునందు విశేషముగ భూమిని బాగుపఱచి వ్యవసాయము నభివృద్ధిచేసి గ్రామముల నేర్పఱచిన మొదటి కాఁపులు మన రెడ్డివారు. వీరికి వ్యవసాయ శాస్త్రమందుండిన నైపుణినిబట్టి వ్యవసాయాభివృద్ధి చేయవలసినపుడెల్ల పెక్కు రాజులు వీరి నాహ్వానించి భూములనొసంగి మన్నిం చెడివారు. ఈ కారణముచేతనే ద్రావిడ దేశములో గూడ బెక్కుగ్రామములు నేటికిని రెడ్డివారితో నిండియున్నవి కాన నీ వృత్తిని వృద్ధిచేయుట మన ప్రథమకర్తవ్యము

బీదకాఁపుల సాహాయ్యార్థమై పరపతి సంఘముల స్థాపించుట ముఖ్యము

వ్యవసాయ శాస్త్రవిషయములను నెప్పటి కప్పుడు తజ్జ్ఞులచే నందఱకు సులభముగాఁ దెలియు నట్లు తెలుఁగున కరపత్రములు వ్రాయించి వ్యవసాయదారులకందఱకుఁబంచిపెట్టవలయును అనుభవమును శాస్త్రీయజ్ఞానమును గలబోధకుల కొందఱను ప్రతి గ్రామమునకుఁ బంపి యుప న్యాసముల నిప్పించి సోదాహరణముగ నూతన పద్ధతులను నేర్పవలయును ఇందు కొన్ని విష యము లితరసంఘముల తోడ్పాటుతో మనము చేయవచ్చును

మనమిట్లు సంవత్సరమున కొకపర్యాయము కేవలము సభలుచేసి యానందించినంత మాత్ర మునఁ బ్రయోజన మావంతయు నుండఁబోదు శాశ్వతమును, ఫలప్రదాయకమునగు కార్యక్రమ మెంతయో నిరంతరము చేయవలసియున్నది మన దేశమునందున్న రెడ్డిమహాశయుల బాగో గులను పురోభివృద్ధిని విచారించుట కనువగునట్లు మన మొక మహాసంఘమును స్థాపింపవలయును ఇందున మహారాష్ట్రము ద్రవిడ దేశమునైజాము రాష్ట్రమునందున్న రెడ్లకును, ఉత్తర సర్కా రులు దత్తమండలములందున్న రెడ్లకును, రెడ్ల కునికి పట్టనదగు మీ సింహపురమండలములోని వారికిని, సమానబాధ్యతయు, నాదరమును, హక్కును నుండవలయును. ఇదియే మన కేంద్ర స్థానము




# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన సూపర్ 777 డిటర్జెంట్ బార్

## నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి  మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

Shilp DM 2/83 Tel

ఆం(ధప(త్రిక 1941 జూన్
4 సంచిక సంపాదకీయం

# పత్రికా స్వాతంత్ర్యము

సిమ్లాలో సమావేశమైన అ భా ప(త్రికా సంపాదకవర్గ స్థాయిసంఘ సమావేశమునందు ప(త్రికా స్వాతం(త్ర్యమును గాపాడు నుద్దేశముతో గొన్ని తీర్మానములు చేయబడినవి భారత (ప్రభుత్వమునకు మరియొకసారి తనుతో జేసుకొనిన ఒడంబడికయొక్క ఆర్యత్వమును గురించి హెచ్చరిక చేయబడెను ఈ సమావేశమున (ప్రాముఖ్యము వహించిన 'సైనిక్' 'నేషనలు హెరాల్డు' ప(త్రికల విషయములో (ప్రభుత్వ ధర్మమెట్టిదో స్పష్టము జేసిరి (ప్రభుత్వమువారును ఈ తీర్మానములకు త్వరలోనే సమాధానమును (ప్రకటింపవచ్చును కాని (క్రిందటి మార్చి సమావేశములో సైనిక్, నేషనలు హెరాల్డు ప(త్రికల విషయము చర్చించి యీ ప(త్రికలు చెల్లించిన ధరావతులను తిరిగి యిచ్చివేయుట కనీసధర్మమని తెలిపిరి సం రా(ష్ట్ర(ప్రభుత్వము ఆ సలహాను ఆచరణలో బెట్టునటుల భారత (ప్రభుత్వము ఛీఫు (ప్రెస్ అడ్వైజరును గోరిరి ఈ కార్యములను చేయజాలక పోయినయెడల యీ సంపాదక మహాసభ యిచ్చు సలహాల కేమా(త్రమును విలువ లేకుండ పోవుచున్నటుల దలంపవలసి యుండును

'సైనిక్' ప(త్రికనుండి (ప్రథమములో ఆరువేల ధరావతును గోరుట కాప(త్రిక చేసిన తప్పేమియును లేదు (శ్రీ వినోబా భావే ఉపన్యాసమున కిచ్చిన శీర్షిక లుప(ద్రవకరముగ నుండెనని తలంచి ధ రా వ తు ను గో రి రి (ప్రచురించిన ఉపన్యాసమునందు లోపమేమియును లేదు శీర్షికలందు ఉపన్యాస భాగములలో ముఖ్యమని తలంచిన వానిని జేర్చుటయే తప్పనుచు, (ప్రభుత్వము వారా మా(త్రము స్వాతం(త్ర్యమైనను లేకుండ చేయుటను హర్షింపజాలము సం॥ రా(ష్ట్ర(ప్రభుత్వము వారెట్లో ధరావతు మొత్తమును వేయి రూపాయలకు తగ్గించిరి అది యే మా(త్రమును తృప్తికరముగ లేదు ప(త్రికా సంపాదక మహాసభా స్థాయిసంఘ తీర్మానమున దెల్పినటుల యీ ప(త్రిక విషయమున ఒక (ప్రధాన ధర్మసూ(త్రము నిర్ణయము గావలసియున్నది ప(త్రికల కామా(త్రము స్వాతం(త్ర్యముండరాదా యను విషయము నిర్ణయము గావలసియున్నది సం॥ రా(ష్ట్ర(ప్రభుత్వమువారు యికమీదనైనను యేమా(త్రమును ఆలస్యముజేయక ఆ వేయిరూపాయల ధరావతును గూడ తిరిగి యిచ్చివేయుచు తాము (ప్రథమములో జేసిన యుత్తరువును రద్దుజేయుట భావ్యము అప్పుడే ప(త్రికాసంపాదకుల సభయొక్క సలహాలకు కొంతవిలువ యున్నట్లును లోకము తెలుసుకొనగలదు అప్పుడే ఢిల్లీ ఒడంబడిక (ప్రకారమేర్పడిన యీ స్థాయి సంఘము ప(త్రికా స్వాతం(త్ర్యమును గాపాడుటలో (ప్రయోజనకారిగా నుండగలదు

ఇంకను లక్నో నేషనలు హెరాల్డు నుండి సం॥ రా(ష్ట్ర ప(త్రికా సలహాసంఘ మేర్పడకముందే ఆ(త్రముతో ధరావతును గట్టించిన వైఖరి విమర్శింపబడెను ఆ యుత్తరువునుగూడ రద్దు చేయవలెనని కోరిరి ఇప్పటికైనను అటుల నీ ప(త్రికనుండి ధరావతు కోరుట న్యాయమా యను విషయమును ఆ రా(ష్ట్రపు ప(త్రికా సలహా సంఘము నెదుటనుంచి నిర్ణయింప గోరవచ్చును

సం॥ రా(ష్ట్ర (ప్రభుత్వము వారైనను యీ ప(త్రిక విషయమున పునరాలోచన జేయవచ్చును ఇందేమార్గమును గాని అనుసరింపకున్న యీ స్థాయి సంఘనిర్ణయములయెడ లక్ష్యమును జూపుటలేదని చెప్పవలసియుండును భారత (ప్రభుత్వమువా రిప్పటికైనను సం రా(ష్ట్ర (ప్రభుత్వము యీ తీర్మానములను లక్ష్యముతో నాచరణలో బె ట్టు న టు ల జే యు న ని సమ్మోదము ●

# వీరేశలింగము ఒక అగ్ని పర్వతము

శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి

ఆం(ధప(త్రిక 1948
ఏ(ప్రిల్ 14 సంచిక నుంచి

నేడు అత్యుత్సాహముతో ఆం(ధదేశమునందెల్లెడ ఏ మహానుభావుని 100 వ జన్మదినోత్సవము జరుపుటకై యత్నములు జరుగుచున్నవో ఆతడు విప్లవకారి వీరేశలింగం దుర్బల శరీరుడయ్యు, అతి స్వల్పమైన ఆంగ్ల పాండిత్యం కలవాడయ్యు, ఆం(ధదేశమున ఆ మూలా(గముగ అన్ని శాఖలలో (ప్రచండ పరివర్తనము కలిగించి, తుఫానువలె, భూకంపమువలె, అగ్నిపర్వతమువలె జడిపించి, కంపమొందించి, గాఢని(ద్ర నుండి మేల్కొలిపి సత్య స్వరూపమును జూపి కన్నుల మిరుమిట్లు గొలిపి, అ భ్యు ద య మార్గమున అధిగమింప జేసి, ఆనంద పారవశ్యము గల్పించిన, అకుంఠిత (ప్రజ్ఞాధురీణు డాతడు ఎన్నరాని కష్టములను తానెదుర్కొని ధిక్కరించి, ధైర్య సాహసోపేతులగు సైనిక బృందముల తయారుచేసి, సాంఘికములు, నైతికములు, మత విషయకములు, ఆధ్యాత్మికములు, రాజకీయములు ఏ పేరు ఏ రూపు దాల్చినా, ఎట్టి దూరాచారా పిశాచములనైనా చండాడుటకు రణరంగమున కురికి, వాటిని భూస్థాపితము చేసిన, విజయ పరంపరా సంశోభిత వీరసేనాని ఆతడు హింసా రహితమైన సౌమ్యమైన మార్గమున వేయి కదనరంగముల గెలుపొందిన ఆం(ధ కంఠీరవు డాతడు భాషాసేవలో అనన్యమైన మార్గముల (ద్రొక్కి, గద్య పద్యరచనలలో పద్యముకన్న గద్యములో, నిరుపమాన మాధుర్యం గల (ద్రాక్షాపాకము కురిపించి, ఆం(ధ హృదయము ఆకర్షించిన వ్యాసలేఖవరేణ్యు డాతడు స్వార్థము వీడి, సం(గహపరచిన దంతయు ఆం(ధదేశమున కర్పించిన అనాసక్తయోగ పుంగవు డాతడు

మహాత్ముడు వెదజల్లిన అమోఘ త్యాగ బీజములు సత్వరమే మొలకెత్తి స్వరాజ్యపు పంటలుమిక్కుటముగా పండుటకు వీలగునట్లు, ఆం(ధభూమి నంతయు లోతుగా దున్ని, కల్పును జంపి సారవంత మొనర్చిన తీ(వ్ర కృషీవలు డాతడు పీడాకరమగు ఉబ్బసమును నిర్లక్ష్యముచేసి, మనోదార్ఢ్యముచే, నైతిక (ప్రాబల్యముచే, ఆత్మశక్తిచే అవ్యాహతమగు వరవిహారము సల్పిన విప్లవ వీరుడగు వీరేశలింగమునకు వినయవిధేయతలతో ఈ విరిదమ్మిని అర్పించుకొందును నా జీవితారంభదశలో నన్నొక నూతన మార్గమునకు నెట్టిన ఆ నాయకునకు కృతజ్ఞతా పూర్వకంగా వేసంగించు నూలుపోగు ఇది

మూడు
రకములుగా
ఉపయోగపడుతుంది.

# చంద్రిక
సబ్బు






జిడ్డు కారకుండ చర్మాన్ని సౌందర్యవంతం చేస్తుంది



జుట్టును శుభ్రపరచి చుండ్రునుండి పరిరక్షిస్తుంది



చర్మాన్ని పొట్టు రాలకుండా చేసి నల్ల మచ్చలు మరియు ఇతర చర్మ వ్యాధుల నుండి కాపాడుతుంది

ఇతర ఏ సబ్బులందు లేని పై ఉపయోగాలు
కల్గిన సాటిలేని సబ్బు – చంద్రిక !
వర్ణ సౌందర్యానికి, ఆరోగ్యదాయకమైన
కేశసంపదకొరకు అయుర్వేద శాస్త్ర ప్రమాణాల
ననుసరించి ఎక్కువమొత్తంలో కొబ్బరి నూనె
నుపయోగించి తయారు చేయబడిన
సబ్బు – చంద్రిక సబ్బు.

# చంద్రిక

అన్ని ఋతువులలోను ఉపయోగించే సబ్బు
భారతదేశములో మరియు ప్రపంచవ్యాప్త
ముగా ప్రశస్తి గాంచినది.

# కాశేశ్వరరావుగారి

## దత్తమండల సంచారానుభవములు

ఆంధ్రపత్రిక 1921 జూన్ 15 సంచిక నుంచి

నేను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ తరఫున కర్నూలుజిల్లాలో తిరిగిన స్థలముల పేర్లు ప్రచురించి యుంటిని కర్నూలు జిల్లాను 18 మే తేదీన వదలి అనంతపురంజిల్లాలోని అనంతపురం ధర్మవరం హిందుపురం కదిరి గ్రామములను దర్శించితిని 29వ తేదీన చిత్తూరు జిల్లాలో ప్రవేశించితిని పెదతిప్ప సముద్రం, క్రొత్తకోట, మదనపల్లి, చిత్తూరు, కాళహస్తి గ్రామములలో నుపన్యసించి త్రిలింగములలో నొకటగు శ్రీ కాళహస్తీశ్వరుని దర్శించి గూడూరు మీదుగా 8న జూన్ ఉదయమునకు బెజవాడ చేరితిని నేను చూచిన పై మూడు జిల్లాలలో చిత్తూరుజిల్లాలో పని బాగుగా జరుగుచున్నది దొరస్వామి అయ్యంగారు, రాజగోపాలాచార్యులు ఆనందశయనంగార్లు మొదలగు కొందరు పేరు వడసిన వకీళ్ళు తమ వృత్తి విదుపుదలచేసి ప్రచారమునకై గ్రామములవెంట బాగా తిరుగుచున్నారు, గావున సంతృప్తికరముగా నుంటున్నది కర్నూలుజిల్లాలోగాని,అనంతపురంజిల్లాలోగాని న్యాయవాదులు వృత్తిని నిలుపుదల చేసినవారు లేకపోబట్టి వెనుకబడియున్నవి అయినను అనంతపురంజిల్లాలో అనంతరగిరి పేరనార్య కవిగారను నొక యువకుడగు కవీశ్వరుడు బాలభారతి శ్రీకృష్ణ ప్రచురించియు గ్రామముల వెంట తిరిగి ఉపన్యాసములనిచ్చియు కొంతవరకు పనిచేసియున్నారు ఈ మధ్య గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అనంతపురం జిల్లాలోని తాడ్పత్రిలో నివాసమేర్పరచుకొని అటూ ఇటూ తిరుగుచు సంచలనమును కలుగజేసినారు చిత్తూరు తరువాత దత్తమండలములలో అనంతపురంజిల్లాయే అగ్రస్థానము వహించియున్నది ఇచ్చట జిల్లా కాంగ్రెసు కమిటీ ఏర్పడింది. దానికి పేరనార్యకవియే అధ్యక్షులు. చాలామట్టుకు ముఖ్యమైన ప్రదేశములలో కాంగ్రెసు సంఘములు ఏర్పడినవి ఈ సంవత్సరం అనంతపురంజిల్లాలో ప్రత్తి పండలేదు అందువలన రాట్నముల పని సరిగా జరుగుటలేదు అని నాతో అక్కడి మిత్రులు చెప్పిరి అనంతపురం జిల్లా కాంగ్రెసు కమిటీవారు పాఠశాలలు వదలిన కొందరు విద్యార్థులను తమ జిల్లానుండియేగాక ఉత్తర సర్కారులనుండి పిలిపించుకొని వీరి చేత ప్రచారము చేయించుకొనుచున్నారు త్వరలో అనంతపురం జిల్లాలోకూడ మంచిపని జరుగగలదని నమ్మకముగా నున్నది. కర్నూలుజిల్లాలో రాట్నములు బాగా పనిచేయుచున్నవి నంద్యాలలో అందరు వకీళ్లు, మ్యునిసిపలు, చైరుమను ప్రజలంగరు కాంగ్రెసు పార్టీలో చేరినవారే బిసెంటు వర్గముగాని, జస్టిసువర్గముగాని నాకు కనపడలేదు, మ్యునిసిపలు స్కూళ్ళలో రాట్నములు పెట్టినారు తాలూకాబోర్డు స్కూళ్లలోను మ్యునిసిపలు స్కూళ్ళలోని వందేమాతరం కీర్తనలు నేర్పుచున్నారు మ్యునిసిపాలిటీ తరఫున గాంధిమహాత్మునికి సన్మానపత్ర మియ్యవలెనని కుతూహలముతోనున్నారు నంద్యాలలో ఉత్సాహము బాగా యున్నది. కాని వకీళ్లెవరును వృత్తిలోనుంచి బయటకు రాకపోబట్టి సెలవులు వచ్చిన తరువాత మే నెలలో చుట్టుపట్ల ప్రచారము చేయుట ప్రారంభించినారు మార్కాపురములో మొన్న కొంతమంది వకీళ్లు కాంగ్రెసులో చేరినారు. ప్రజలవల్ల ఎన్నుకోబడిన వారు తాలూకాబోర్డు ప్రెసిడెంటు నేను వెళ్లినప్పుడు కాంగ్రెసు సంఘములో చేరి ఇతరులను ప్రోత్సాహము కలుగచేసినారు. అధివరకే కాంగ్రెసు సంఘము లేకపోయినప్పటికిని సామాన్య ప్రజలు రథోత్సవమునాడు స్వామివారి

ఆంధ్రపత్రికానుబంధము 1928 నవంబరు 14 సంచిక నుంచి



ప్రభుత్వము వారి సవతితల్లి ప్రేమ

ఆంధ్రబాలుడు:- అమ్మా! నన్ను మాడ్చి, నాసోదరుని కన్నియు బెట్టుచుండుట న్యాయమా ?

రథముమీద గాంధీమహాత్ముని పటమును కట్టిరి పోలీసుగారును డిప్యూటీ కలెక్టరు గారును బెదిరించి తీసివేయించిరి పలుకుబడి గలవారు తటస్థులుగా నుండుటవలన అర్చకులు భయపడి తీసివేసిరి. గిద్దలూరులోను కంభంలోను కల్లు సారాయి త్రాగకుండా కట్టుబాట్లు జరిగినవి కంభంలోని శాసన సభ్యుని యొక్క ప్రోత్సాహము. వలన ఒక మహమ్మదీయుడు తాను త్రాగినందుకు కొట్టినట్లు కొందరిమీద చార్జి ఇచ్చిరనియు తరువాత ఖిలాఫతు కమిటీవారి బలమువలన చార్జిని వదులుకొనెననియు నాతో కొందరు చెప్పిరి కొన్నిచోట్ల బండ్ల వాండ్లును టోలు గేట్లకు సుంకము చెల్లించకుండా నుంటున్నారు అందువలన కంట్రాక్టులు వదులుకొని డిపార్టుమెంటు యిలాకాను పెట్టుకొన్నారు నన్ను ప్రజలు అడుగగా టోలుగేట్లు చెల్లించకుండా బండ్లు బలవంతముగా తోలుకొని పోవుటవలన దౌర్జన్యమునకు దిగుట గావున ఇక సహాయనిరాకరణము క్రిందికి రాదనిన్నీ చెప్పి దీనిని నిరుత్సాహపర్చినాను కర్నూలులో ప్లీడర్లలో ఎక్కువమంది తటస్థులు కొంతమంది మితవాదులు కొంతమంది జస్టిసు వర్గమువారు తక్కువమంది మాత్రమే కాంగ్రెసునం దుత్సాహము కలిగియున్నారు. వీరును శెలవులిచ్చిన తరువాత చుట్టుపట్టులకు వెళ్లి ప్రచారము చేయుయత్నములో నున్నారు. కర్నూలులో త్రాగుడు మాన్పుటకు కాంగ్రెసు పార్టీ ప్లీడర్లలో వర్తకులలో చాలా ధనికులును ఉత్సాహవంతులు నగు మేడం వెంకయ్యశ్రేష్ఠి గారున్ను ఇంకా కొందరు యువకులున్ను కలిసి గట్టి ప్రయత్నములు చేసినారు కొన్నాళ్ళకు దుకాణములు మూసివేయబడినవి చాల రోజులు గడచినతరువాత సర్కారువారొక దుకాణము తెరిపించగా, వాని కెదురుగా పుస్తక భాండాగారమును పెట్టి త్రాగకుండా బోధించుచుండిరి డెప్యూటీ కలెక్టరుగారు వచ్చి యొక సాయంత్రము పుస్తక భాండాగారములు అక్కడనుండి తీసివేయవలసినదని సలహా ఇచ్చినట్లును కార్యదర్శి ఒప్పుకొనట్లును నాకు చెప్పిరి. ఆ మరునాడు త్రాగినందుకు కొట్టినారని ఒక మహమ్మదీయుడున్ను ఒక మాలతన్ని మేడం వెంకయ్య శ్రేష్ఠి గారిమీదకు పుస్తక భాండాగారి కార్యదర్శి బసప్పగారిమీదకు ఇంకను కొందరిమీదకు డెప్యూటీ కలెక్టరుగారివద్దకు సబుమేజిస్ట్రేటు గారి వద్దకు రెండు కేసులు దాఖలు చేసిరి. వెనుకటి కలెక్టరు మెకోనిగారు త్రాగుడు మానుట మంచిదేనని సానుభూతి చూపినట్లును ఇప్పటి కలెక్టరుగారు రెవిన్యూ తగ్గునను హేతువుచేత త్రాగుడు మాన్పు ఉద్యమమునకు బొత్తిగా వ్యతిరేకియనియు వాడుకగానున్నది. పై కేసులు అబద్ధములనియు అధికారుల కుట్రవలన తేబడినవనియు ముద్దాయీలు స్టేటుమెంటు దాఖలు చేసిరి. ప్రతి వాయిదాకు దుకాణములన్నియు మూసి వేలకొలది జనులు కచ్చేరికి హాజరగుచున్నారు ప్రజలలో గట్టి యైకమత్యము ఉత్సాహము సహాయ నిరాకరణము నందు దీక్ష బాగా ఏర్పడింది ముద్దాయీలు నిరుత్సాహపడుటకు మారుగా యుద్యమము నందు ఎక్కువ పట్టుదల గలిగియున్నారు కర్నూలులో కాంగ్రెసుద్యమము బాగా పాతుకొన్నది నేను అక్కడి స్నేహితులతో చెప్పి సరియైన జిల్లా కాంగ్రెసు కమిటీ ఏర్పడునట్లు ప్రయత్నించితిని 31వ మే తేదీన క్రొత్త నిబంధనల ననుసరించి కర్నూలుజిల్లా కాంగ్రెసు సంఘ మేర్పడెను శంకరరెడ్డిగారు బి. ■ విద్యార్థి పరీక్షకు పోకుండ మాని గ్రామములలో ప్రచారము చేయుచున్నట్లు చెప్పిరి వారిని దర్శించవలెనని ప్రయత్నించితినిగాని నేను అక్కడుండగా వారు రాలేదు. ప్రతిచోటను సామాన్య ప్రజలందరును గాంధిని మహాత్ముడనియుఅవతారపురుషుడనియూ నమ్ముచున్నారు గాంధిగారి యాజ్ఞానుసారముగా ప్రవర్తి■చి స్వరాజ్యము సంపాదించవలెనని కుతూహలులై యున్నారు దత్తమండలాలలో కరువుబాధ ఎక్కువగానున్నది నాలుగు సంవత్సరముల నుండియు పంటలు లేవు కఱవు బాధను నివారణ చేయుటకై స్వరాజ్యం కొరకు గాంధిగారు బీదవాళ్ల కొరకు కష్టపడుతున్నారని ప్రజలు నమ్ముచున్నారు గాంధిగారు ఎప్పుడువచ్చెదరని ప్రశ్నించుచున్నారు వారు దర్శించి తమ జన్మ సార్థక్యము చేసికొనవలెనని ఆతురపడుచున్నారు దత్తమండల ప్రజలు అమాయకులు ధైర్యవంతులు నిలవబడువారు విశ్వాసముగలవారు కుయుక్తులు కుశంకలూ లేనివారు ప్రజల లోపము లేదు నాయకుల లోపము. అక్కడ నాయకులు వెళ్లి బాగా ప్రబోధలు చేసిన, ఉత్తరసర్కారుల కంటె దత్తమండల ప్రజలు ముందంజవేసి కాంగ్రెసు ఏ తీర్మానములు చేసినా వాటినన్నిటిని గట్టిగా ఆచరణలోకి తెచ్చి స్వరాజ్యము సాధించుట నిశ్చయము. కావున ఆంధ్రనాయకులు ఆంధ్ర యువత వెంటనే దత్తమండలములలో సంచారము చేసి బాగుగా పని చేయుదురు గాక మని కోరుచున్నాము.

— అ. కాళేశ్వరరావు ●

## శ్రీ హరిసర్వోత్తమరావు కాలధర్మం



ప్రముఖ దేశభక్తులు, కాంగ్రెసు కురువృద్ధులు, ప్రసిద్ధ రచయిత, వక్త శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఫిబ్రవరి 29వ మద్రాసులో కన్నుమూశారు ఆయన వయస్సు 77

జననం 1888లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపకులలో ఒకరు తొలి రోజులలో ఆంధ్రపత్రిక సంపాదకులుగా ఉన్నారు 1908-11లో దేశభక్తి పూరితుడై వ్రాసిన వ్యాసానికి రాజద్రోహ నేరం క్రింద శిక్ష ననుభవించారు 1920లో ఆంధ్ర మహాసభ అధ్యక్షులు

రాజకీయక్షేత్రంలో అగ్రగామి అయినా నిష్కర్షకులు కావడంవల్ల ఫలసాయం పొందలేదు కావచ్చుగాక కానీ సాంస్కృతిక రంగంలో ఆయన కృషి ఫలించి పట్టింది బంగారం అయింది అందుకే ఈ తరంవారికి హరిసర్వోత్తమరావుగారు ఒక గ్రంథాలయం గాని, పత్రికగాని జ్ఞాపకం తెస్తారు రాజకీయ నాయకుడుగా ఆయన ఈ శతాబ్ది తొలి రోజులలో లబ్ధప్రతిష్ఠులు

శ్రీ రావుగారు అబ్రహాం లింకన్ చరిత్ర, ఢిల్లీ దర్బారు, చైనా— జపాన్ ప్రళయము, గ్రీస్ చరిత్రవంటి చరిత్ర గ్రంథాలు రచించారు సూటిగా, ధాటిగా మాట్లాడడంలో ఆయనకు ఆయనేసాటి. వ్యక్తిగా పూర్ణాయుష్కుడు పదహారణాల ఆంధ్రత్వం మూర్తిగొన్న తెలుగుబిడ్డ ఆయన జీవితం ఒక వికాసవీచిక, నిరంతర కృషి ఆయన ఉత్తమ పురుషులు ★

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1960 మార్చి 16 సంచిక నుంచి

# తరతరాల వార పత్రిక



## శ్రీ ఆరుద్ర

నాకు బాగా జ్ఞాపకం!

విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు నవల ఆంధ్ర వార పత్రికలో వారం వారం ధారావాహికంగా వస్తూ వుండేది! ఇక నాగలింగం పువ్వు దాని తరువాత వేయి పడగలు అనే అక్షరాల వ్రాతా ఒక బ్లాకుగా వుండేది!

అప్పట్నుంచీ నేను ఆంధ్ర వార పత్రికను చూస్తూ వుండేవాడిని అప్పుడు నాకు పది పన్నెండేళ్ళ వయస్సు బడి పుస్తకాల్లోని పాఠాల కన్నా పత్రికల్లో వ్యాసాలూ, కథలూ చదవడం లోనే నాకు శ్రద్ధ ఎక్కువగా ఉండేది

నా చిన్నప్పుడు ఆంధ్ర వార పత్రిక సైజు చాలా పెద్దది. మామూలుగా మడతపెడితే దినపత్రిక ఏ సైజులో ఉంటుందో ఆ సైజులో వుండేది పత్రికను విప్పి రెండు చేతులా పట్టుకొని చదువుకొనేటంత విశాలంగా వుండేది ఆ రోజుల్లో వార పత్రికలో చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రి గారి వ్యాసాలుకూడా వరసగా వస్తూ వుండేవి. వాటిని ఆ చిన్న తనంలో చదివితే బోధపడేవికావు గానీ చదవకుండా వుండలేకపోయేవాణ్ణి.

చెళ్ళపిళ్ళ వారంటే నాకు చిన్నప్పుడే గురి కుదరడానికి కారణం వుంది. మా విశాఖపట్నం టౌనుహాలు దగ్గర కాంగ్రెసు ఎగ్జిబిషన్లు జరిగేవి నేను వాలంటీరుగా పని చేసేవాణ్ణి. ఒకసారి ఎగ్జిబిషనప్పుడు ఒక చాలా పెద్దహాలంత పాకలో జరిగిన సాహిత్య సభలో చెళ్ళపిళ్ళ వారు ఉపన్యసించడం విన్నాను బుట్టలాంటి పేము కుర్చీలో కూర్చొని గంటల తరబడి ఆయన అనర్గళంగా మాట్లాడేస్తున్నారు ప్రేక్షకులు నవ్వుకున్నారు చప్పట్లుకొడుతున్నారు చెయ్యెత్తి దండం పెడుతున్నారు. ఈయన చాలా గొప్పవాడు అన్న భావం నా మనస్సులో పాతుకుపోయింది అందుకే ఆయన పేరుతో పత్రికలో పడే వ్యాసాలను విధిగా చదివేవాడిని

మా వూళ్ళో మా యింటికి అరమైలూ, మైలున్నర పరిధిలో చాలా పఠన మందిరాలు ఉండేవి అన్నీ దమారమీ ఉచిత పఠన మందిరాలే టౌన్ హాలులో మాతాతగారు మెంబరు నన్ను వెంటపెట్టుకొని మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతాలకే ఆయన టౌన్‌హాలుకు వెళ్ళేవారు నాకు అక్కడకు వెళ్ళడం ఇష్టం అయేది కాదు. ఏమంటే టౌనుహాలు చాలా పెద్ద హాలూ, ఆ హాలంతా పెద్ద టేబిలూ, ఆ టేబిలుమీద ఎన్నెన్నో పత్రికలూ అవీ వుండేవి అయితే అన్నీ ఇంగ్లీషు పత్రికలే ఆంధ్రవారపత్రిక లాంటివి అక్కడ ఉండేవికావు అందుచేతచల్లగా జారుకొనేవాడిని

హిందూ రీడింగ్ రూములో ఆంధ్ర వార పత్రిక విధిగా ఉంటుంది అయితే ఒక్క చిక్కు రీడింగ్ రూము మేడ మీదనే పత్రికలూ అవీ వుండే పెద్ద టేబిల్ ఉంటుంది కింద లైబ్రరీలో పుస్తకాలు ఎన్నయినా పొద్దుట ఎనిమిది నుంచి సాయంత్రం అయిదు గంటల దాకా కూర్చొని చదువుకోవచ్చు గాని మెంబర్సు కానివాళ్లు పైకి వెళ్లకూడదు చిన్న కుర్రాళ్లు సరేసరి మెట్లుకూడా ఎక్కకూడదు. అయినా నేను చాలా చాకచక్యంగా బంట్రోతులను తప్పించుకొని, వాళ్ళ కళ్ళుగప్పి మెరుపులాగ మేడ ఎక్కేసేవాణ్ణి.

ఒక్కసారి మేడమీదకి చేరుకొంటే మరి ఇబ్బంది ఉండేదికాదు మా నాన్నగారి స్నేహితులు చాలామంది మెంబర్లే ద్వారం జగన్నాథరావు నాయుడుగారు చాలా కాలం హిందూ రీడింగ్‌రూంకు సెక్రటరీ. ఆయన శ్రీశ్రీకి ప్రాణమిత్రుడు మా నాన్నగారికి ఆత్మీయుడు. మా నాన్నగారిని 'ఒరే మామా!' అని పిలిచే వారు. నేను నాయుడుగారిని 'బావగారు?' అని పిలిచేవాడిని. మేడమీద బావగారు కనబడితే మరి బంట్రోతుల భయం ఉండేది కాదు. చక్కగా పత్రికలన్నీ చదువుకొనేవాడిని

ఇంకొంచెం విజ్ఞానం మొచ్చాక ఆంధ్రవార పత్రిక బాగా అర్థమవుతూవచ్చేది నా అభిమాన రచయిత కొడవటిగంటి కుటుంబరావుగారూ, నాకు నచ్చిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి వారపత్రిక సంపాదక కార్యవర్గంలో వుండేవారు పత్రిక బలే పసందుగా వుండేది శ్రీశ్రీ 'మాటల మూట', 'మహాకవి ఆశ్చర్యం!' మొదలైనవి ఆ రోజుల్లోనే వారపత్రికలో అచ్చయి వచ్చాయి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వడ్లగింజలు నవలా, రుక్మిణీనాథశాస్త్రి 'దేవయ్య స్వీయ చరిత్ర' అనే చాలా చక్కని స్వీయ చరిత్రాత్మకమనిపించే నవల కూడా అప్పుడే సీరియల్‌గా వారపత్రికలో చదివాను

ఆ రోజుల్లో సినిమా విషయాల కోసం పత్రికలు చదువుకొనేవాళ్ళ నిమిత్తం 'తెలుగు సినిమా, రూపవాణి' మొదలైన పత్రికలు వుండేవి శ్రీరంగం నారాయణబాబు అప్పుడప్పుడు 'తెలుగు సినిమా' పత్రికలో రచనలు చేస్తూ వుండేవాడు అందుకోసం అది చదివేవాడిని గానీ సినిమా పత్రికలు నాకు రుచించేవికావు అటువంటప్పుడు ఆంధ్ర వారపత్రికలో 'నా అభిమాన తార' అనే శీర్షిక కొన్నివారాలు రావడం నాకు ఆశ్చర్యం కలిగించింది శ్రీశ్రీ తన సహజ ధోరణిలో "ఎవరా? లక్ష్మీరాజ్యం! ఎందుకా? నటనలో చిత్తశుద్ధికి!" అని ముక్తసరిగా రాశాడు సినిమా కూడా మన జీవితంలో ఒక భాగమని గుర్తించిన సీరియస్ పత్రికలలో ఆంధ్ర వార పత్రిక బహుశా, ప్రథమమేమో

నా మొట్టమొదటి రచన 1939 సెప్టెంబరు తొలివక్షం 'చిత్రగుప్త' లో అచ్చయింది అప్పట్నుంచీ అడపాదడపా మద్రాసు పత్రికల్లో నా రచనలు పడేవి. అయితే ఆంధ్ర వారపత్రికకు రాసి పంపే ధైర్యం మాత్రం నాకు ఆ రోజుల్లో ఉండేది కాదు పత్రిక స్థాయికీ, తన స్థాయికీ కొలుచుకోగలిగిన రచయితే రాణిస్తాడు

1942 లో నా స్వంత గొంతుకను నేను వెతుక్కున్నట్టు శ్రీశ్రీ, చాగంటి సోమయాజులూ రోణంకి అప్పలస్వామిగారూ చెప్పాక కూడా నాకు స్వక్రమమైన వాణి బాణీ ఏర్పడ్డాయన్న నమ్మకం కుదరలేదు నేను రాయల్ విమాన దళంలో చేరి దేశానికి దూరంగా వుండి నా రచనలు నేను చేసుకుంటూ రాసినవన్నీ శ్రీశ్రీ పంపాక, వాటిని శ్రీశ్రీ వివిధ మద్రాసు పత్రికల్లో అచ్చు వేయించాక, వాటిని కుటుంబరావుగారి వంటి రచయితలు మెచ్చుకున్నాక ఆంధ్ర వారపత్రికకు రచనలు రాసి పంపవచ్చుననే దమ్ములు నాకు నమ్మకంగా వచ్చాయి నిజం చెప్పొద్దూ విమాన దళంవిడుదల అయ్యాక ఆంధ్ర వార పత్రికలో చేరి ఉద్యోగం చేద్దామనే ఆశో, అత్యాశో నాలో వుండేది ఆంధ్ర దినపత్రికలో నీలం రాజశేషయ్య గారు చాలాకాలం పనిచేశారు ఆయన బయటకు వచ్చి 'నవోదయ' అనే స్వంత పత్రికను పెట్టుకొన్నారు నేను నా సైనిక జీవనానికి స్వస్తి చెప్పాక వచ్చి తమ పత్రికలో చేరమని ఆయన నన్ను ఆహ్వానించారు అయితే అందులోకూడా నేను పని చేయలేదు కారణం జీతాలవల్ల, 1947లో ఆనందవాణిలో చేరాను

# హిమాలయం

వఝల కాళిదాసు

ఈ మహోన్నత గిరి పథాలన్
హేలగా పయనించు చుండగ
ఏ విమానము మీదనో పై
కెగురుచున్నట్లో !
హిమాలయ శిఖరాలపై
నవోదయ కిరణాంగుళుల్
రచించున్ రమణీయ మౌ
హిరణ్మయ రాగ గీతుల్ !
ఆకాశంలోకి దూసుకుపోతున్నది
ఆ కొండ కొసన పెరుగుతున్న చెట్టు,
పాతాళం లోతులకి
పారుతున్నది మందాకిని
అవల అనంతం, ఈవల అగాధం
ఇదీ జీవితం, జీవన్ జీవనం !
నురగల్లు క్రక్కుతూ, పరవళ్లు త్రొక్కుతూ
పర్వత శిఖరాగ్ర భాగ సీమల నుండి
పరుగులు తీస్తూంది మందాకిని
ఉరకలు వేస్తూంది మందాకిని !!
శివ జటా జూటాల చిందులాడే వేళ
హిమవన్మస్తకాగ్రాన అధివసించే వేళ
చిలువ రేడులు చూచి ఏ కొట్టెనో యేమొ
హరిణాంకుడే చూచి హసియించెనో యేమొ
చిలవలై పలవలై చిన్నారి వాకలై
చిందుల్లు వేయుచూ చిత్కృతుల్ సేయుచూ
పరుగులు తీస్తూంది మందాకిని
ఉరకలు వేస్తూంది మందాకిని !!
విరాట్ శివస్వరూప మీ విశ్వం
విరాజిత జటా జూటం హిమాలయం !!!

(నా 'కేదార దర్శనం' నుండి)

## తరతరాల వారపత్రిక

ఆనందవాణి ఆఫీసు తంబుచెట్టి వీధిలో పన్నెండో నెంబరు ఇంటి మేడమీద వుండేది ఆంధ్రపత్రిక కార్యాలయం అదే వీధిలో ఏడో నెంబరు భవనంలో వుండేది చాలాకాలం 'నెంబరు ఏడూ తంబుచెట్టి వీధి.' ఆంధ్రసారస్వత లోకానికి రాజధాని — చెన్నపట్నానికి వచ్చిన ఏ సాహితీపరుడైనా సరే ఆంధ్రపత్రిక కార్యాలయాన్ని కనీసం ఒక్కసారి సందర్శించు కోకపోతే అతడు చెప్పుకోదగ్గ సాహితీపరుడు కాదన్నమాట. నేను ఆనందవాణిలో పని చేస్తున్నంత కాలం లంచ్ టైములో ఆంధ్ర పత్రిక మూడో అంతస్తులో కనీసం ఒక గంట గడిపేవాడిని. దినపత్రికలో, వారపత్రికలో, భారతిలో పనిచేసే అందరూ నా సాహిత్య బంధుకోటిలోవారే !

అప్పటికే కుటుంబరావుగారు వారపత్రికలో ఉద్యోగం మానేసి బొంబాయి వెళ్లి ఏవేవో ఉద్యోగాలుచేసి మళ్ళీ మద్రాసు కొచ్చారు. ఈసారి ఆంధ్ర దినపత్రికలో చేరారు. రుక్మిణీనాథ శాస్త్రి రేడియోలో చేరాడు వార పత్రిక సంపాదక కార్యవర్గంలో నారంపూడి సీతారాం, నండూరి రామమోహనరావుగార్లు ఉండేవారు ఉత్సాహంతో కొత్త కొత్త శీర్షికలు పెట్టారు శంభుప్రసాద్‌గారు సిబ్బందికి ఎంతో ప్రోత్సాహం ఇచ్చారు. తాము స్వయంగా 'తెలుగు వెలుగు' శీర్షికను చూచి కొన్ని వ్యాసాలును తానే రాశారు శంభుప్రసాదుగారు వాటిని రాసినట్టు చాలా మందికి తెలియదు. రెండు మహా నగరాలు, కాంచనద్వీపం, టాప్‌సాయర్ వగైరా సీరియల్ అనువాదాలు ఆకర్షణీయంగా వుండేవి. పంచ తంత్రం కార్టూన్ బొమ్మలూ, వాటికి కవితాత్మక సంభాషణలూ, వివరణలూ, బాపూ కార్టూనులూ, ఉత్తరోత్తరా కార్టూన్లూ వారం వారం వారపత్రిక పండుగే

తరువాత ముళ్లపూడి వెంకటరమణ వార పత్రికలో చేరాడు. తనదైన శైలిలో పాఠక జనాన్ని ఆకట్టుకొన్నాడు ఆ రోజుల్లోనే నేను వారపత్రికలో కుర్చీలో కూనిరాగం అనే ఫీచర్ కొన్నాళ్ళు రాశాను, 'క్రీడి' అనే మారుపేరుతో చదరంగం ఫీచర్ నడిపాను గళ్ళ నుడికట్టు అని కొత్త పేరు పుట్టించి క్రాస్‌వర్డ్ పజిల్స్ కొన్ని వారాలు నిర్మించాను సినిమా పనుల్లో తీరిక దొరక్క ఇటువంటి సాహిత్య వ్యాసంగం సన్నగిల్లింది మళ్ళా 1964 లో 'ఇంటింటి కజ్జాలు' పేరుతో 64 హాస్య కవితలు 52 వారాలకు సరిపోయేటట్టు రాసి శివలెంక రాధాకృష్ణగారికి ఇచ్చాను. అవి జనాన్ని ఎంతో ఆకర్షించాయి వేలూరు శివరామశాస్త్రిగారు సామాన్యులు ఫేన్ మెయిల్ రేఖ రాసినట్టు నాలుగు ముక్కలు రాసి నన్ను అభినందించారు

తర్వాత సమగ్రాంధ్ర సాహిత్య రచనలోపడి పత్రికా వ్యాసంగం ఆగిపోయింది రామలక్ష్మి ప్రశ్నావళి శీర్షిక వార పత్రికలో ప్రారంభించాక ఇంటికో కంట్రిబ్యూటర్ చాల్లే అనిపించింది. ఆదినుంచీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక కుటుంబ పత్రికే ! అంటే కుటుంబ సభ్యులంతా చదివి ఆనందించే పత్రికేగాని కుటుంబ సభ్యులు ఒకరికి మించి ఒకేవారు రచనలు చేసేది మాత్రం కాదని నా నమ్మకం. నాతో చాలా మంది, బహుశా రాధాకృష్ణగారే ఏకీభవించకపోవచ్చు.

ఆసక్తిచూపే అభిమానిగా, ఆత్రుతగా చదివే పాఠకునిగా అడపా దడపా రచనలు పంపే రచయితగా, కొన్నాళ్ళపాటైనా శీర్షికలు నడిపిన కాలమిస్టుగా, నాకు ఆంధ్ర వార పత్రికతో నలభై ఆరు సంవత్సరాల పైచిలుకు అనుబంధం ఉంది. వీటన్నిటికన్నా సాహిత్య పరిశోధకునిగా మరొక ప్రత్యేకమైన బాధ్యతకూడా వుంది. ఆంధ్ర పత్రిక సంస్థ నుండి వెలువడే వివిధ పత్రికా ప్రచురణలు నేను విధిగా చదువుతాను. పాత వార పత్రికలూ, భారతి సంపుటాలు,

సంవత్సరాది సంచికలూ ఎన్నెన్నో ఎన్నిసార్లో పరిశీలనగా తిరగేశాను నా స్వంత (గంధాలయంలో భారతి సంపుటాలూ, ఉగాది సంచికలూ చాలా వున్నాయి

ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలు సాధారణ నామ సంవత్సరంలో 1910లో (పారంభమైన అది చాలా అసాధారణ కార్యాలను సాధించడానికి విఘ్నేశ్వర పూజ చేసింది ఆ సంచికలో వార పత్రిక విశేషాలు చెప్పే వివరాలు కూడా వున్నాయి. వార పత్రిక 1908లో స్థాపించారు. తర్వాత రెండేళ్ళకి ఉగాది సంచికల (పచురణ (పారంభమైంది. ఆ రోజుల్లో నైతే అన్నీ పద్యాలలోనే రాసెయ్యడానికి మన కవులు (పయత్నించేవారు భోగరాజు నారాయణమూర్తి గారు తొలి వారపత్రికలను ఇలా ఒక మత్తేభంలో మెచ్చుకొన్నారు రక్షణ భావం పుచ్చుకోమన్నారు

వెల యత్యల్పము,
లాభ మత్యధికమా
విన్నాణమా ? మేల్ ?
పదంబుల ముద్దాడగ నొప్పు,
చక్కరములా ? ముత్యాలు ?
వ్యాసంబులా ? యొలుకుందేనెలు !
వింతలా ? హృదయ మందుత్సాహ
మొందించు,
వింపలరంగ మన యాంధ్రు లెల్లరు
దోడై దీని గాపాడరే !

సంపాదక లేఖలు సైతం ఒకప్పుడు మన వాళ్ళు పద్యాలలో (వాసేవారు ఇటువంటి పద్ధతులు ఆంధ్రపత్రిక సంస్థాపకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారికి కిట్టవు. అందుకే ఒక సంవత్సరాది సంచికలో ఇలా రాశారు "విద్యా వ్యాప్తిని గాంచిన పాశ్చాత్య దేశముల యందు, వచన (గంధములధికముగను పద్య(గంధములూ స్వల్పముగను రచించబడుచుండును" అదే వ్యాసంలో "పూర్వము నుండియును వాడుక భాషకును (గాంధిక భాషకును సన్నిహిత సమావేశమేర్పడి యుండలేదు ముందెప్పుడైన గలుగ మన్నదేమో తెలియదు !" అని రాశారు. అయినా "కొండమీద గూర్చున్న (గాంధిక భాషకును పల్లపు భూమియందు నిలబడియున్న వాడుక భాషకును విద్యా వ్యాసన వలన సమాన (పదేశమున సమావేశ మేర్పడగలదు" అనే అచంచల విశ్వాసాన్ని (పకటించారు

మన పత్రికలే ఆ సమాన (పదేశం కావడం చారి(తకసత్యం. ఆ పత్రికల్లో తరతరాలుగా తన మీద సత్య ధర్మాన్ని నేరవేరున్నున్న ఆంధ్ర సచి(త వారపత్రిక ఎన్నో విజయాలను సాధిస్తూంది దేశోద్ధారకులు ఆదిలోనే చెప్పినట్టు "అర్జున విజయమునకు (శీకృష్ణులు గారకులు ఆంధ్రపత్రికా విజయమున కాంధ్రులు గారకులు—!" అయితే ఆంధ్రుల అభ్యుదయానికి ఆంధ్రపత్రిక చేసిన సేవ తక్కువదేం కాదు

## ఆంధ్రపత్రిక 1914 జూన్ 17 సంచిక నుంచి



## దుఃఖము

ఆంధ్రనాయకులు :— ఇదేమి అన్యాయము! మనము హైకోర్టు జడ్జీలుగా పనికిరామట. మనలో నాయకులు లేరట! ఇదివరకు శక్తిగలదని చేసిచూపిన కాంగ్రెసు సెక్రెటరీపనికి ఈ సంవత్సర మనర్హులమట! యూనివర్శిటీ రీడర్లుగా నుండుటకు తగమట! మనది అరణ్యరోదనమట! ఈ స్థితి దుస్సహనీయమయినదట!

ఒకరు :— ఆంధ్రరాష్ట్రోద్యమమే అన్నిటికిని మందు ఆంధ్రదేశాభివృద్ధి, ఆంధ్రుల స్వాభిమాన గౌరవములు దానిమీదనే నాధారపడియున్నవి. మనము మన ఆదర్శానురూప కాందోళనమును ద్విగుణపఱచవలయును.

(ఈమధ్య సంభవించిన కొన్ని విషయములు ఆంధ్రుల కనేక విధముల విషాదకారణము లయినవి)

# 10 వ కమ్మ మహాజనసభ

## 15 వ తేదీని అంగలూరున ప్రారంభమగుట

### బొల్లిని మునుస్వామి చౌదరి బి ఏ బి ఎల్, ఎం ఎల్ సి గారి

### అధ్యక్షోపన్యాసము



బొల్లిని మునుస్వామిచౌదరిగారు ఎం ఎల్.సి.
అంగలూరున సమావేశమగు
10–వ కమ్మ మహాజనసభకు అధ్యక్షులు

సోదర సోదరీమణులారా !

#### ఐకమత్యావశ్యకత

మీరీ సమావేశమునందు జరుపు చర్చలును, చేయు తీర్మానములును, మన సంఘ భావిభాగ్యోదయమునకు సోపానములై, ఐకమత్య భావ సముద్ధరణకుఁ బట్టుగొమ్మలై, పరస్పర సుహృద్భావ ప్రకాశమునకు మూలకందములై, వెలయవలయునని నా కోరిక మన సాంఘిక చరిత్రయందలి యొకానొక విషమ సమయమున మనమిపుడున్నారము మన మాతృ దేశమునకు సంబంధించిన రాజకీయ విషయములందు పాల్గొనవలయుననియు, స్థానిక ప్రభుత్వ సంస్థలయందు తగు ప్రాతినిధ్యము వహింపవలయుననియు, మన సాంఘికులకొక సదాశయ ముదయించియున్నది అద్దాని ఫలముగ, స్వక్రమ సూత్రములచే విభజింపఁబడినట్టియు, న్యాయబద్ధమైన విధానములమీఁద నాధారపడినట్టియు, ద్వివిధకక్షలేర్పడినవి కమ్మ సంఘ జనితు లనేకప్రదేశములందు రెండు కక్షలుగా నీ యభిప్రాయభేదములచే విభజింపఁబడి యున్నారు అది సక్రమమే అట్లు విభజింపఁబడవలసినదియు నవసరమే కాని రాజకీయాభిప్రాయ భేదములను, సాంఘిక విషయములందును, తదితర వ్యక్తిగతమగు పరస్పర సంబంధముల పట్టునను చొప్పించి, దుర్భరమును దుస్సహము నగు ఫలితములను దెచ్చిపెట్టుచుండుట కడుంగడు శోచనీయము అందువలన మన కులముయొక్క గౌరవమును, కీర్తియు, నైశ్వర్యము, నన్నియు నశించుచున్నవి ఇట్టి విషమ ఫలితముల నూహింపవలయుననియు, మన సాంఘికుల కొక సదాశయ ముదయించి యున్నది అద్దాని ఫలముగ, స్వక్రమ సూత్రములచే విభజింపఁబడినట్టియు, న్యాయబద్ధమైన విధానముల మీఁద నాధారపడినట్టియు, ద్వివిధకక్ష లేర్పడినవి కమ్మ సంఘజనితులనేక ప్రదేశములందు రెండు కక్షలుగా నీ యభిప్రాయభేదములచే విభజింపఁబడి యున్నారు అది సక్రమమే అట్లు విభజింపఁబడవలసినదియు నవసరమే కాని రాజకీయాభిప్రాయ భేదములను, సాంఘిక విషయములందును, తదితర వ్యక్తిగతమగు పరస్పర సంబంధముల పట్టునను చొప్పించి, దుర్భరమును దుస్సహము నగు ఫలితములను దెచ్చిపెట్టుచుండుట కడుంగడు శోచనీయము అందువలన మన కులము యొక్క గౌరవమును, కీర్తియు, నైశ్వర్యము, నన్నియు నశించుచున్నవి ఇట్టి విషమ ఫలితముల నుత్పన్న మొనరించి సంఘమును మూలచ్ఛేద మొనరింపఁ జూచుట మిక్కిలి యన్యాయము రాజకీయములకు సాంఘిక విషయములలో తావులేదు నాగరిక ప్రపంచ మందలి రాజకీయ పక్షముల యెడ మన మొకతూరి సింహావలోకన మొనర్చినచో రాజకీయ పక్షములకును, సాంఘిక విషయములకును సంబంధము లేదనుయుదంతము చక్కఁగ విదితము కాఁగలదు సంఘమును విడిచి విహరించుటయన "నేలవిడిచి సాముజేయుట" వంటిది సంఘ బల మన్నివిధముల సౌష్ఠవంతముగ నుండిననేగాని రాజకీయ ప్రపంచ మందుగాని, మరేక్షేత్రమందు గాని, మనము ప్రకాశింపజాలము సంఘ సత్వమును వినాశనమొనరించి రాజకీయ ప్రపంచములో స్వేచ్ఛావిహార మొనర్పఁజూచుట "మట్టి గుఱ్ఱమును నమ్మి గంగావతరణము"నకుపూనుట వంటిది కాన మహాశయులారా ! మీలో రాజకీయముగగాని, సాంఘికముగ గాని యభిప్రాయ భేదములున్నచో, వానిని సంఘాభ్యుదయము కొఱకు పాటుపడుట కుపయోగింపుడు సంఘోద్ధరణ కుపకరించు మార్గముల నను గమించుటయందా యుద్రేకమును లీన మొనర్పుఁడు ఇచ్చట సమావేశమైయుండు ప్రతి కమ్మ సోదరునకును, సోదరికి, నా దీనాతిదీన ప్రార్థన మిదియే సంఘమం దైకమత్య మెప్పుడు చేకూరునా ? సంఘమెప్పుడు పూర్వోన్నత్యమును బడయునా ? యనునదియే నా సంపూర్ణాశయమై యున్నది "యద్భావ్యం తద్భవత"ని యూరకుండిన జరుగున దొక్కటియు లేదు అభిప్రాయ భేదములన వ్యక్తిపరముగను, సాంఘికముగను, వినియోగింపక విశాల భావముతో సంఘోద్ధరణ విషయమున నుపయోగింపుచు కమ్మవీరుల ప్రాచీన రక్తము నొకమాటు స్మరించి, రాజకీయ పక్షములను తాత్కాలికముగ విస్మరించి సంఘజాల కృతజ్ఞతకును, దేవుని కృపాకటాక్షమునకును పాత్రులగుదురు గాఁక తమని కోరుచున్నాను మీమీ విభేద సత్వమంతయు సంఘోద్ధరణాదుద్యమములతో విలీనమగుగాక యని యాశించుచున్నాఁడను సాధ్యాసాధ్య సంఘటితా ప్రజ్ఞుఁడగు శ్రీమన్నారాయణమూర్తి మనయాశయములను నెరవేర్చుగాక !

ఆంధ్రపత్రిక 1929
జూన్ 19 సంచిక నుంచి

ఇది మన సంఘ సమావేశములలో పదియవది మొట్టమొదటి కమ్మ మహాజనసంఘము కౌతవరములో సరాసరి 1910 సంవత్సరములో సమావేశమైనట్లు తెలియుచున్నది మన సంఘజాలయందు "అభిమానప్రసూనములు" తొలకరింపఁబడి యిప్పటికి పందొమ్మిదివత్సరములైనది అప్పటి నుండియు తిరునల్వేలి, రామనాథపురము, కోయంబత్తూరు మున్నగు మండలములలో స్థిర నివాసమేర్పరచుకొనిన కమ్మవారచ్చటచ్చట కొన్ని స్థానిక సమావేశములను జరిపి యున్నారు అట్టి సమావేశములకు రెండింటికి నే నధ్యక్షత వహించియుంటిని ఆ సమావేశము లందును, మరికొన్ని చిన్న సమావేశములందును, కేంద్రసంఘ నిర్మాణము లేని కొఱత బాగుగనగపడినది కేంద్రసంఘ మొకటి యున్నచో రాష్ట్రమందంతటను వెదజల్లబడియుండు కమ్మ మహా

జనులొకచోట సమావేశమగుటకును, ఒకరినొకరెఱుంగుటకును, అందు మూలమున సంఘ సుహృద్భావము లుదయించుటకును, అవకాశము గలుగును ఈ విషయమే యెచ్చట జూచినను ప్రాముఖ్యముగ వ్యక్తీకరింపఁ బడుచున్నది ఈ యుదంతమును తమ కెఱిఁగించితిని. దానికి వలయు నుపాయముల నరసి కేంద్ర సంఘ నిర్మాణమునకు బూనుకొను బాధ్యతను మీకే వదలుచున్నాను

### ప్రత్యేక కుల సభల యావశ్యకత

మన దేశమునందు ప్రత్యేక కుల సభ లనేకములు జరుగుచున్నవి ఇట్టి ప్రత్యేక కుల సభలకు యావశ్యకత కలదా ? యని కొందఱు ప్రశ్నించెదరు. ఇట్టి ప్రత్యేక కుల సభలు భారత జాతీయతకు భంగము గలిగించవా ? యని గూడ

## 10వ కమ్మ మహాజన సభ

కొందఱనెదరు. కాని యిట్టి ప్రత్యేక కుల సభల వలన మిక్కుటమగు ప్రయోజనమున్నదని నిస్సందేహముగ వారికి ప్రత్యుత్తర మిచ్చుచున్నాను అసంఖ్యాకములగు కులములును లెక్కకు మీరిన యంతశ్శాఖలునుగల మనదేశమునందు నిజమైన జాతీయాభ్యుదయమునుబడయ వలయునని యన్ని సంఘములును సమాన ప్రతిపత్తిని బడసియుండవలయును ఒక గ్రామమునందెట్లన్ని కుటుంబములవారును తమ తమ యభ్యుదయము నాశించి ముందుకు నడిచిన గ్రామమంతయు నౌన్నత్యమును బడయునో యట్లే యొక దేశమందలి వివిధ సంఘముల వారును తమతమ యభ్యుదయమునకై కృషి సల్పుచు వచ్చినచో దేశమంతయు నద్దతిని

ప్రకటించగలదు అందులకిట్టి సమావేశము లెంతయు నవసరములు ఇట్టి సమావేశము లందాయా సంఘముల వారొక్కచో సమావేశమై తమ సంఘాభ్యుదయమునకు వలయు నుపకరణములను సమాలోచించుకొనుట కనువగుచున్నది పరస్పర సోదర భావమును ఐకమత్యమును పెంపొందించుటకొక విధముగను, అభ్యుదయ మార్గను వంక నేకవిధముగ నడచుటకు మరి యొక విధమునను, యిట్టి సమావేశము లుపకరించుచున్నవి. జయాపజయముల పరిజ్ఞానమును సహకార సంపాదనావశ్యకతయు, నెప్పటికప్పుడు మనకు గోచరించుచుండిననేగాని ఎన్నదగినంత లాభమును మనము పొందజాలము ఇతర జాతులతోబాటు తమ కులమును గూడ యన్ని విధముల నున్నతస్థితికి తేవలయుననెడి యుద్దేశముతో నుపక్రమింపబడు నిట్టి సమావేశములు జాతీయతకు విరుద్ధమొకప్పుడును కాజాలవు. కాని యీర్ష్యాసూయలచే నొక సంఘమువారు మరియొక సంఘమువారిమీద దౌర్జన్యమును నెరపుట గర్హ్యనీయమైనది అనేక వ్యక్తులును, యనేక సంఘములును చేరి యొక సంఘ మగుచున్నది అట్టి సంఘములయు, వ్యక్తులయు నభ్యుదయమనగా జాత్యభ్యుదయమేయగును అభ్యుదయ మార్గము నన్వేషించుటయే యిట్టి ప్రత్యేక సాంఘిక సమావేశముల యాశయమైయుండి జాత్యభ్యుదయమున కెంతేని యుపకారి యగుచున్నది

### సంఘ పరిస్థితులు — వలయు సంస్కరణములు

మనలో నిప్పుడు వినాశకరమైనట్టియు, అజాతీయములగునట్టియు, నాచారము లెన్నియో ప్రబలి దినదినమును ప్రవర్ధమానమగుచున్నవి వీటి సక్రమవర్ధనకు మతమొక మరుగుగా దీసికొనబడుచున్నది కాని ప్రస్తుతము మతము భ్రమోత్పాదకమైయున్నది ఇట్టి భ్రమోత్పాదకమగు మతసూత్రములే మన దేశ సోదరులలో నారింట నొక భాగముగనుండు విస్పష్ట భారతీయులను అస్పృశ్యులనుగా నొనర్చియుండినది మాన్యపురుషుఁడగు మహాత్మ గాంధిగారు మన కండ్ల నావరించికొనియుండిన యంధకార బంధురత్వమును తొలగించి, మతము పేరిట జరుపబడు నాయమానుష, యనర్థదాయక కృత్యముల కంతరాయ మాత్రమును గలిగించి పుణ్యమును గట్టికొనిరి. మదనమోహన మాలవ్యాగారి వంటి పూర్వాచార పరాయణుడగు సద్బ్రాహ్మణుడే అస్పృశ్యత మన మత విధానమునందు విధింపబడియుండలేదని నుడివియున్నాడు అస్పృశ్యులనబడువారు సకల హిందూ దేవాలయములలోనికి గూడ నిరాఘాటముగ వెళ్లవచ్చునని

---

## "ప్రత్యేకాంధ్ర ఒక్కటే పరిష్కార మార్గం" - రేలంగి



ప్రముఖ హాస్య నటుడు రేలంగి యిలా రాస్తున్నారు.

'నేడు ఆంధ్రలో అల్లకల్లోలంగా వుంది. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర సాధన కోసం ఆబాలగోపాలం ఉద్యమంలో దూకారు. తమ ప్రాణాలను బలి పెట్టి పోరాటం సాగిస్తున్నారు. ఇది ప్రజా వుద్యమం. ఇందులో ఎట్టి తేడాలు లేకుండా అంతా పాల్గొనవల్సి వుంది. లక్షలాది ఆంధ్రప్రజల అభిమానాన్ని చూరగొన్న కళాకారుడుగా నేను ఈ వుద్యమాన్ని హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను. ప్రత్యేక రాష్ట్రం కోసం ప్రాణాలు బలి యిచ్చిన వారికి నా జోహార్లు అర్పిస్తున్నాను.

కేంద్ర ప్రభుత్వం యిప్పటికైనా ప్రజా వెల్లువను గుర్తించి ఎంత మాత్రం ఆలస్యం చేయకుండా ప్రజల కోర్కెలను మన్నిస్తుందని ఆశిస్తున్నాను అటు తెలంగాణా సోదరులు యిటు ఆంధ్ర సోదరులు కూడా వేర్పాటునే కోరుచున్నపుడు యిట్టి సొరపొచ్చాలు లేకుండా విడిపోయి సోదరులుగా రెండు వేరు వేరు రాష్ట్రాలలో జీవించటమే శ్రేయోదాయకమైన విషయం. ప్రత్యేకాంధ్రరాష్ట్ర ఉద్యమానికి నా సంపూర్ణ సహకారం వుంటుందని ఇందుమూలంగా హామీ యిచ్చుచున్నాను జై ఆంధ్ర!'

ఆంధ్రసచిత్ర వారపత్రిక 1973 మార్చి 2 సంచిక నుంచి

మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్

Imageads-M-1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

ప్రచురించియున్నాడు ఇట్టి సంస్కరణములను ప్రవేశపెట్టుట కిట్టి ప్రత్యేక సాంఘిక సభలే మిక్కిలి యావశ్యకముగనున్నవి. అందువలన అంటరానితనమును మంటగలుపుటకు వ్యవసాయిక జీవనులగు మనబోటి సంఘములు ముందంజ వేయవలసియున్నది. అందులకు ప్రజాదృష్టి తన పథమును మార్చవలసియున్నది. ప్రజాభిప్రాయ ప్రాబల్యము లేనిదే ఏ సంస్కరణయు కొనసాగదు. అట్టి ప్రజాభిప్రాయ పథమును మార్చుట కిట్టి కులసభ లెంతేని యుపకారు లగుచున్నవి. ఇట్టి కులసభలలో నట్టి పావన రూపకములగు సంస్కరణ పద్ధతు లామోదింప బడినచో నానాట దేవాలయ ప్రవేశము, అస్పృశ్యతా నివారణము, మున్నగు సంస్కరణము లాదరణ రూపమును దాల్పగలవు. ఈ మహాసభ వారీ ప్రాముఖ్య విషయమును తీవ్రముగ నాలోచించి తమ సదభిప్రాయమును వెలిబుచ్చ దురుగాక! యని సంపూర్ణముగ విశ్వసించు చున్నాను.

అస్పృశ్యతవలెనే మతముపేరిట నక్రమాభివృద్ధిని గాంచిన ఆచార శృంఖలములచే భద్రముగ బంధింపబడి, దేశాభ్యుదయమునకును, జాతీయ భావసముద్ధరణకు అంతరాయములుగ నుండు వినష్ట పద్ధతులింకను కొన్ని మన సంఘము

## 10వ కమ్మ మహాజనసభ

నందు నెలకొనియున్నవి. దేవాంకిత రూపమున ఘోరరూపమును దాల్చియుండు దేవదాసీ వృత్తియు బాలవితంతువుల నిర్బంధ వైధవ్యమును వ్యభిచార వ్యాపారగృహముల యునికియు చిల్లర దేవతల కమాయికములగు ప్రాణుల బలియొసగుటయు అంతర్జాతీయ వివాహములు అంతశ్శాఖా వివాహములు విరోధింపబడుటయు ఒక కులమువారు మరొక కులమువారితో గూర్చుండిన స్నేహముగా భుజింపరాదనుటయు దేవారాధనయందు దేవునికిని భక్తునికిని అనర్థ మాధ్యస్థమును వహించియుండు అర్చకసంస్థయు వివాహములు మున్నగు శుభకార్యములందు పురోహితుడను యొక నామధారకుడు తలదన్ను చుండుటయు ననువిషయములు మన తీవ్రాలోచనకును సముచిత తీర్మానములకును గురియగు చున్నవి. ప్రస్తుతము అట్టి సంస్థ లుండవలసినది యవసరమా కాదా యను హద్దుమీరి యీ సంస్థలయునికి యక్రమముకాదా యను నంతవరకు వివాదము పెరిగియున్నది. ఇందును గురించి దీర్ఘపరిశ్రమయు యనల్పాలోచనయు నవసరముగ నున్నది. ఇట్టి యాచారములను యే వేదములు పురాణములు, విధించుచున్నవని మనము నమ్ముచున్నారమో ఆ వేద పురాణము లొసొంగియే యిట్టి యాచారములకు విరుద్ధముగ నుదాహరణములు పేర్కొనబడుచున్నవి. ఈ సమావేశమువారు పైన పేర్కొనబడిన విషయములనుగూర్చి సమాలోచించి తమ యభిప్రాయములను వెలిబుచ్చి తుదకీ సంఘము వారనుగమింపదగిన మార్గమును నిర్దేశించు టెంతయు నవసరము.

మఱియు నీ ప్రత్యేక సాంఘిక సభా సమావేశములు తమ తమ సంఘములలోనున్న లోపాలోపముల నెరిగి వానిని సవరించుకొనుటకును అభ్యుదయమునకై తగు పోరాటమును నెరపుటకును యితర కులములతోబాటు సమాన ప్రతిపత్తి నార్జించుటకు వలయుసాధన సంపత్తిని సమకూర్చుటకును యుపకరించుచున్నవి. సర్వ మానవ సోదరభావమును పరస్పరానురాగ సూచిక మిత్రత్వమును వివిధ సంఘముల మధ్య నేర్పరుచుట కిట్టి ప్రత్యేక సాంఘిక సమావేశము లుపకరింపగలవని నా నమ్మకము.

ఇక మనసంఘములోనిమేలు కీళ్ల నరయుదము. కావలసిన మార్పులను గూర్చియు చేయవలసిన పనులను గూర్చియు, నింతకుముందు జరిగిన సమావేశములందు అనేక తీర్మానములు గావింప బడినవి. అట్లు కావింపబడిన తీర్మానము లెంత

వరకాచరణకు గొనిరాబడినవి ? అందులోని కొన్ని తీర్మానముల నింకను ఆచరణ రూపమునకు గొనిరాకుండుటకు కారణము లేవి వాని నన్నిటిని కార్యరూపమున ప్రదర్శించుట కిపుడు మన మొనర్పవలసినదేమి యను విషయములను మీరు చక్కగ నాలోచించి తీర్మానింతురని నమ్ముచున్నాను నాకుదోచిన కొన్ని విషయములను తమ ముందట బెట్టితిని వానినన్నిటిని తాము బాగుగ నాలోచించి తీర్మానింప వలయునని కోరుచున్నాను

## వి ద్య

మన సంఘమునందు విద్యాభివృద్ధిని గలిగించుటను గూర్చి మీతో మొట్ట మొదట ముచ్చటింప దలచితిని ప్రభుత్వపు రికార్డులలో గూడ మన సంఘము విద్యా విషయమునందు వెనుకబడియున్నదని నమోదు పఱచి యుండుటను మీరెరింగియేయున్నారు అట్టి నామము వలన మనలో కొందరు బీద విద్యార్థులకర్ధ జీతముతో విద్యాదాన మొనర్చుటకు ప్రభుత్వము వారంగీకరించియున్నను ఒకానొక ప్పుడు విద్యాపోషక స్థానమును వహించియుండిన మన కులమునకట్టి నామధారణ ముండుట సహింపదగినది కాదు మీ మండలములలో విద్యాభివృద్ధి కొంతవరకు నెగ్గియున్నదని నేనేఱుగుదును కాని విద్యాభివృద్ధిని గలిగించుకొనుట కార్ధికముగ ననువులేని చోట్లను విద్యా విషయమున చాల వెనుకబడియున్న ప్రదేశములను లెక్కకు మిక్కిలిగనున్నవి ఇట్టి ప్రదేశములందు విజ్ఞానాభివృద్ధియు విద్యాభివృద్ధియు గలిగించుట కనునగు మార్గముల నన్వేషించుట యీ సమావేశము వారి ధర్మమై యున్నది తగు ప్రదేశములయందు విద్యాశాలల నెలకొల్పునట్లును గ్రామసీమలందుండు వారు అందు వసతులను కలిగించునట్లును మనము ప్రయత్నములు సల్ప వలసియున్నది.

ప్రాథమిక విద్యయందే మనవారు వెనుకబడియుండనింక ఉన్నత విద్యాభివృద్ధిని గూర్చి చెప్ప నవసరము లేదు. మన సంఘ మన్నిసంఘముల కంటె విద్యా విషయమున వెనుకబడి యుండుట కొక ముఖ్యముగ గ్రామ సీమలందు నివసించుట బట్టి పట్టణములందు నెలకొల్పబడియుండు విద్యాశాలలు వారికందుబాటులో లేకున్నవి బీదలకు తల్లిదండ్రులు తమ పుత్రులను దూరప్రదేశములకు విద్యాభ్యాసమునకై పంపుట కార్థికముగ శక్తి లేకను ధనవంతులగు వారు మొనమొన్నటి వఱకు తమ పుత్రుల విద్యాభివృద్ధి విషయమున యుదాసీనత వహించి యుండుట చేతను యిట్టి విషమ పరిస్థితులేర్పడినవి ఇప్పుడిప్పుడే చిన్ని పట్టణములందు గూడ మాధ్యమిక ఉన్నత పాఠశాలలు గ్రామ ప్రదేశములందు నివసించువారి కనుకూలముగ నుండు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## అమర వీరుడు కాకాని

"రైతు సేయుస్సే నా లక్ష్యం. ఏళ్లుగా పేస మంత్రిగా ఉన్నప్పుడు గాని, అంతకుముందు గాని రైతులను ఉద్ధరించడానికి నా జీవితం అర్పించాను" అన్నారు కీ. శే. కాకాని వెంకటరత్నంగారు రెండునెలల క్రింద ఆంధ్రపత్రిక విలేఖరితో మాట్లాడుతూ. అర్థ శతాబ్దంగా రాజకీయ జీవితంలో వారు కృషిచేసినదంతా భారతదేశానికి, అందులోను ఆంధ్రదేశానికి వెన్నెముకవంటి వారైన రైతుల కోసమే. వారి కృషి సాధించిన అభి



వృద్ధికన్నా ఉత్తమమైన స్మృతి చిహ్నం కాకాని వెంకటరత్నంగారికి ఉండబోదు. వారిని ప్రజలు ఉక్కు కాకాని అని పిలిచేవారు; వీర కాకాని అని పిలిచేవారు. జీవితంలో చివరి క్షణందాకా ఉక్కువంటి దృఢ సంకల్పంతో, తమ ప్రజల క్షేమున్ను కోసమే పాటుపడిన కాకాని వెంకటరత్నంగారు వీరమరణం పొందారు. అందరితోపాటు మేమూ వారి ఆత్మ శాంతికోసం భగవంతుని ప్రార్థిస్తున్నాము.

వినే దిక్కు ... హఠాత్తుగా ... ంగారు, "పిల్లల్ని ... తో సోమవారం ... స్వాసవిడిచారు.

... కాకాని ... వెంకట అనే ఆవేదన ... ఆగిపోయిన ... అని జనప్రసిద్ధ ... కాల్చివేస్తున్నారు తెల్లవారుజామున

## జై ఆంధ్ర నినాదాలతో

## అశ్రుధారలతో ప్రజల వీడ్కోలు

26 - 1 - 73 ... 50

**కీ. శే. కాకాని వెంకటరత్నం స్మృతి సందర్భంగా**
**ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1973 జనవరి 26 సంచిక ముఖచిత్రం**

నట్లు నెలకొల్ప బడుచున్నవి. కాని అంత మాత్రముచే మనము సంతృప్తి బొందియుండ వీలులేదు. విద్యాప్రచార విషయమున మన మొనరింప వలసిన దింకను యెంతయోగలదు.

ప్రస్తుతము విజ్ఞానావశ్యకత యెల్లెడలను గుర్తింపబడుచున్నది. తల్లిదండ్రులు తమ తమ పుత్రులను విద్యాభ్యాసనాసక్తులుగ చేయుటకు వెనుదీయుట లేదు. కాని ధనాభావమునలన ప్రతిభావంతులగు యువకులనేకులు తమ చదువులకు స్వస్తి చెప్పవలసి వచ్చుచున్నది. రెడ్లు, మహారాష్ట్రులు మున్నగు నితర కులముల వారు తమ కులస్థులగు బీదవిద్యార్థుల సహాయార్థము "విద్యార్థి వేతన నిధు"లను నెలకొల్పి తమ తమ సంఘముల కమూల్యసేవను గావించు చున్నారు. కాని మన సంఘ మా మార్గముగ యెన్నదగిన కృషి యొనరించి యుండలేదు. అచ్చటచ్చట కొన్ని ప్రయత్నములు సల్పబడుచున్నవిగాని యవి యెంతమాత్రమును చాలవు. మీమండలమునందించుమించుగ నిరువదివేల రూప్యముల నొక నిధిగ నేర్పరచి విద్యార్థి వేతనముల నొసగుచున్నారని వింటిని. కాని దినదినమునకు విద్యాభ్యాసనాసక్తులగు కమ్మ బీద విద్యార్థులెక్కువగు చుండుటచే నీ యిరువది రూప్యములమీది రాబడి నుండి యొసగు సాయమంత యుపకారిగా

నుండజాలదు గుంటూరు నం॥ కీ॥ శే॥ శాఖమూరి లక్ష్మీబాయమ్మగారిచే నొక విద్యార్థి వసతిగృహము నెలకొల్పఁబడి యున్నది ఇటీవల నా వసతిగృహము శ్రీయుత జాగర్లమూడి కుప్పస్వామిచౌదరి ప్రభృతులవలన పునరుద్ధరింప బడి, యభివృద్ధి గావింపబడినదని విని సంత సించితి కోయంబత్తూరు మండలము నందలి పీలమేడు కాపురస్థులగు శ్రీయుతులు పి యస్ గంగయ్యనాయుడు ప్రభృతుల ఔదార్యముచేత, నొక గొప్ప విద్యాశాల సర్వజనోన్నత పాఠశాల యను పేరుతో నెలకొల్పఁబడి కమ్మ విద్యార్థుల పాలిటి కల్పవృక్షమై తనరారుచున్నది వారు విద్యార్థి వసతిగృహమునకొక గొప్ప నిధి నేర్పరచి, గొప్ప కట్టడము నొకదాని నొసఁగి యుండిరి ఇప్పటికిని వారి సంవత్సరాదాయములో నైదింట నొక భాగమును విద్యా వ్యాపకమునకుగాను ప్రత్యేకించు చున్నారు శ్రీ గంగయ్య నాయుడు ప్రభృతులు మన సంఘమున కా ప్రాంత్యములందు సల్పుచున్న సేవ యపారము ఇదిగాక తిరునల్వేలి మండలమునందు శ్రీఖళయరశనూరు జమిందార్లు

## 10వ కమ్మ మహాజన సభ

కొండల రాయిసామి నాయుడుగారు రావిళ్ల అప్పసామి నాయునింవారు ప్రభృతులు శాశ్వత నిధుల నేర్పరచి తన ప్రాంత్యముల విద్యార్థుల కమూల్యమయ మొనరించుచున్నారు ఈ సందర్భము శ్రీయుత యస్ రామ స్వామినాయుడు. బి యే (ఆనర్సు) బి యల్ గారి యమూల్య సేవా సంపత్తి నిగూఢ బేర్కొన కుతూహల పడుచున్నాను వీరు ప్రస్తుతము మధురయందు న్యాయవాది వృత్తి నవలంబించి యున్నారు వీరు గత వత్సరము రు. 500తో నొక విద్యానిధిని నెలకొల్పి, 4గురు కళాశాల విద్యార్థులకు సాయమొనర్చుచున్నారు. వీరి యుద్యమములన్నియు జయప్రదముగ నెరవేరు గాక వీరికి సర్వమంగళ సంధాయకుండగు శ్రీమన్నారాయణమూర్తి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి యింకను సంఘాభ్యుదయమునకు సాయపడునట్లొనర్చుగా తమని యర్థించు చున్నాడను

బీద కమ్మ విద్యార్థులకు తోడ్పడుచున్న వారిని నాకు తెలిసినంతవరకు బేర్కొంటిని ఇంకను నాకు తెలియని సందర్భము లెన్నియో యుండవలెను సంఘమునకు తమ శక్త్యనుసారము చేయూత నొసఁగుచుండు సోదర సోదరీ మణులకు నా హృదయపూర్వక వందనముల నర్పించుచున్నాఁడను.

పైన పేర్కొనఁబడిన సందర్భములనుబట్టి యా విషయమై జరుగవలసిన కృషి యెంతయో గలదు సంఘమందలి విద్యార్థుల కందఱికిని యుపకరించునట్లు కేంద్ర సంఘ విద్యార్థి నిధి నొకదాని నేర్పరచుట మిక్కిలి యావశ్యకము మన సంఘమందుద్భవించిన ప్రతిభాశాలురకు యువకులు, యువతీమణులెవ్వరునుగాని ధనాభావముచే తమ యున్నత విద్యాభ్యాసమునుండి విముఖులు కాగూడదనునది మన ముఖ్యాశయమై యుండవలెను. మన సంఘము యొక్కగాని లేక మనదేశము యొక్కగాని భావి భాగ్యోదయము మన యువకులయందే ఆధారపడియున్నది యువతీ యువకులు విద్యావంతులైననేగాని వారు సమకాలిక రాజకీయములందు పాల్గొనజాలరు ఒక్క రాజకీయములందేగాక మరే యభ్యుదయ సూచక యుద్యమమునందుగాని జొరవీలులేదు! కొంతమంది పట్టభద్రులతోను, మఱికొంత మంది ప్రవేశ పరీక్షల నిచ్చినవారితోను మనము సంతృప్తి బొందియుండ వీలులేదు అట్టివారనేకు లొక్కొక్క సంఘమునందునుగలరు వివిధ శాఖలయందును, వివిధ వృత్తులందును ప్రతిభను గాంచగల యువకులను మన సంఘ ముత్పత్తి జేయవలసియున్నది భావికాలములో నెక్కువ ప్రతిభావంతులకేగాని యితరులకు ప్రభుత్వపు టుద్యోగములందు స్థలములేదు! అట్టిచో మన సంఘ యువకులను ప్రతిభావంతులను గావించి, వారును మన దేశ ప్రభుత్వ నిర్వహణమునందు పాల్గొనుట కవకాశమును కలిగించకుంటిమేని మనము ఘోరాపరాధ మొనరించినవారమగుదుము

మనది గొప్ప సంఘమనియు, మనసంఘము ధనవంతమైనదనియు మనము గర్వపడుచున్నాము అట్టియెడ తక్కువ పక్షము రెండు లక్షల రూప్యముల విలువగల విద్యార్థినిధినైనను యేర్పఱచవలయునని కోరుట యత్యాశగాదని తలచెదను ఆ నిధికి తా మందఱును తమతమ శక్త్యనుసారము సాయపడవలెను ఆ నిధిని వసూలు చేయుటకును, నిర్వహించుటకును సక్రమ పద్ధతులతో నిర్మింపబడినట్టియు, న్యాయమగు సూత్రములచే బంధింపబడినట్టియు నగునొక కార్యప్రణాళికను తయారుచేయవలసి యున్నది మన మీ ప్రణాళికను విశాల భావముతో నిర్మించవలసి యున్నది భూరివిరాళము

# కృష్ణవేణి

## మధురాంతకం రాజారాం

బిరబిరా చరచరా ముందునకు సాగేవు
చివరకా మున్నీట మాయమై పోయేవు
పరుగులిక చాలునే మా కృష్ణవేణి!
కరుణించవే మమ్ము నిత్యకల్యాణి!
తెలియదటవే నీకు మున్నొక్కనాడు
కలిమిలో పేరొందె మా తెలుగునాడు
తొలగిపోయిన వెనుక ఆ గొప్పసిరులు,
అలముకొన్నవి తల్లి చీకటుల తెరలు!
పారతంత్ర్యము బాపి మొన్ననేగదనే
స్వాతంత్ర్యభానుండు వెలుగసాగినది!
తనవారి మేలుకై విన్ననే గదవే
తెనుగన్న వేరుకాపురము పెట్టినది!
ముంగారుపంటలో బంగారుసిరుల
సింగారములు మరల సంతరింపంగ
నిలిచాడు కార్యరంగమున వాగ్భాత
నిరుపమానందాన ఈవె! కేలూత!
భీమానదీ తుంగభద్రలం గూడి
భీషణార్భటులతో గట్టులనొరసి
ప్రవహించి జలధిపాలైన దికచాలు
నవజీవనానంద మొసగి మమ్మేలు!

ఆంధ్రపచిత్ర వారపత్రిక 1956 ఫిబ్రవరి 15 పంచిక మంచి

## సరసచిత్ర కల్పనము



ఆంధ్రబాల:— ఆంధ్రనాయకులారా! మీరు నామీద పిస్తోళ్ళను గాల్పుడు. తుపాకులను గాల్పుడు ఫిరంగులను వేయుడు. పుట్టినప్పుడే వజ్రశరీరముతో బుట్టినదాననగుటచే మీ బాణములు నాకు హానిని జేయవు నేను మృతినొందుదాననుగాను ఆంధ్రుల సంకల్పము లీడేరునంతవఱకు నాకన్నిచోటుల జయమగును.

(ఆంధ్రనాయకులలో గొంద రాంధ్రోద్యమమును, ముఖ్యముగా నాంధ్రరాష్ట్ర నిర్మాణమును బనికిరావని పత్రికలకు వ్రాసి వారి యాగ్రహమును వెడలగ్రక్కుచుండగా నీయుద్యమము దేశమంతటను జనసామాన్యములో నతిశీఘ్రముగా వ్యాపించుచున్నది)

**ఆంధ్రపత్రిక 1913 జూలై 30 సంచిక నుంచి**

లొసంగువారికి మన కృతజ్ఞతా వందనములు సమర్పించుటతోబాటు కొద్దిపాటి మొత్తమును గూడ స్వీకరించుట కనువగు నేర్పాటు గావింప వలయును అట్లు చేసిననేగాని మన యత్యాశ తీరదు మన మీ సమావేశమును ముగించులోపు గనే కమ్మ టీద విద్యార్థి నిధి నిర్మాణమునకు వలయు నుపాయముల నారసి మనము రాబోవు సత్సరమున మరల నిట్లొకసారి గూడునప్పటికి మన యూప్సితార్థము నెరవేరియుండునట్లు జూడవలయును ఈ నా ప్రార్థన మీయందఱి చేతను ఆదరింపబడునని యాశించుచున్నాను. నేను యేయొక ప్రత్యే■ వ్యక్తియొక్కగాని లాభము, కొఱకు ప్రార్థించుచుండుటలేదు మనము మన యువకులయెడ నిర్వహించవలసిన ధర్మమొకటియున్నది అది సర్వోత్కృష్టమును అత్యవశ్యాచరణీయమునై యున్నది ఆ ధర్మము ననుసరించి మన యువకుల పక్షమున నేని ప్రార్థనమును మనము నెరవేర్చినచో మన సంఘమునకేగాక దేశమునకును అందుమూలమున భారతజాతికిని అమూల్య సహాయ మొనర్చినవార మగుదుము "స్వధర్మే నిధనం శ్రేయః పర ధర్మోభయా వహః" అను శ్రీ కృష్ణభగవాముని గీతా ప్రవచన ప్రకారము మన ధర్మమును మనము నెరవేర్చవలసియున్నది. మన భాగమగు "పౌరుషము"ను మనము నెరవేర్చినచో 'దైవము" మనకు సాయపడక మానడు ప్రపంచ మాత్రము పరిణామము ఈ పరిణామమును సౌలభ్యపఱచుటకు పాటుపడు మనకు భగవంతుఁడు సాయపడకపోడు

### నిరుద్యోగ సమస్య

విద్యావిషయమై మన మింకను ఎంతయో కృషి సల్పవలసియుండగా, నిప్పటివరకు విద్యావంతులై యుండువారి మనములను సంక్షుభిత మొనర్చుచున్న "నిరుద్యోగ సమస్య"ను గూడ మన మొకవిధముగ పరిష్కరింపవలసి యున్నది ఇప్పుడు చదివిన వారందరును సర్కారుద్యోగమునే వాంఛించుచున్నారు అది సహజమే వారు నేర్చు కొనువిద్యయు, పొందిన విజ్ఞానమును సర్వతో ముఖవికాసమున కాకరమైనది కాదు అందువలన వారి విద్యాభ్యసనకాలము ముగిసినవెంటనే మన గ్రామములకు మరలవెళ్ళ స్వతంత్రజీవనమును గడపుట కశక్తులగుచున్నారు ఇప్పటి విద్యావిధానము స్వతంత్రజ్ఞానమును ప్రసాదించుటలేదు

## ప్రభుత్వం ఏర్పాటు చెయ్యమని శ్రీ చరణ్‌సింగ్‌కు రాష్ట్రపతి పిలుపు

జనతా (యస్) నాయకుడు శ్రీ చరణ్‌సింగ్, జనతా నాయకుడు శ్రీ మొరార్జీలు తమ తమ జాబితాలను సమర్పించిన తరువాత జులై 26 మధ్యాహ్నం శ్రీ చరణ్ సింగ్‌ను రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి పిలిచారు.

ఈ సంచిక అచ్చు అవుతూవుండగా శ్రీ చరణ్‌సింగ్ రాష్ట్రపతిని కలుసుకునేటందుకు వెళ్తున్న వార్త అందింది. శ్రీ చరణ్‌సింగ్, శ్రీ రాజ్‌నారాయణ్‌ల రాజనీతికి యిది ఘనవిజయం. సుస్థిర ప్రభుత్వం ఏర్పడగలదన్న ఆశతో భారత ప్రజలు అంతా వున్నారు. [★★★]



ఆంధ్ర పత్రిక వారపత్రిక 1979 ఆగష్టు 10 సంచిక నుంచి

తక్కువవడ్డీమీద నొసగఁబడుటయు, ఆ ఋణములను స్వల్పస్వల్పముగా కొన్ని సంవత్సరములలో చెల్లించివేయు పద్ధతి నవలంబించుటయు, ప్రతిదిన వ్యాపారమునకు నగదు ఋణముల నొసంగుటయు, మున్నగు పద్ధతులను ప్రవేశ పెట్టుట, యాధునికకాలమం దత్యవసర విషయముగ గుర్తింపఁబడు చున్నది సక్రమ పద్ధతులమీద నెలకొల్పబడిన బ్యాంకింగు పద్ధతి యిప్పటికాలమున యత్యవసర విషయముగ తలంపఁబడుచున్నది ప్రతి దినమును గ్రామ పునరుద్ధారణోద్యమము ప్రవర్ధమాన మగుచున్నది ఆయుద్యమమునందు విద్యావంతులును ఉత్సాహవంతులునగు యువకులు పాల్గొనిననేకాని యెన్నఁదగిన లాభము పొడకట్టజాలదు

గ్రామ పునరుద్ధారణకు సహకారోద్యమము గూడ నొక ముఖ్య విషయముగ గమనింపఁబడు చున్నది అందుచే దినదినాభ్యుదయమును గాంచుచున్న సహకారోద్యమముగూడ మన యువకుల కాశ్రయమై యుండదగినది. ఇంకను ■ యుద్యమమునందు వ్యాపారతత్త్వము మొదలు, వ్యవసాయ ఫలితమువరకును సహకారులుగ నిర్మింపవలసిన శాఖలెన్నియో గలవు ఈయన్ని విధానములను నిర్వహించుటకును ఉత్సాహవంతులగు ఉద్యోగులు కావలసియున్నది అందునను ముఖ్యముగ నాయాశాఖలందు ప్రత్యేక విద్యను బడసినవారు కావలసియున్నారు కాఁబట్టి ప్రతి యుత్సాహపూరితుఁడగు యువకుఁడును ఆ యా యుద్యమములందు కృషిసల్పి తాము లాభమొందుటయేగాక, సంఘమునకును, అందు మూలమున దేశమునకును లాభ మొనరింతురు గాక యని కోరుచున్నాను "విద్యానిధి నిర్వాహకులే" ఉద్యోగ ప్రసాదక సంఘముగా గూడ నేర్పడి మన సంఘ యువకులకు సముచిత విద్యను గఱపుటతోఁబాటు వివిధ శాఖలయందు దుద్యోగస్థానములకు వీరిని బంపుట కుద్యమింపవలయునని నా ప్రార్థన వ్యవసాయమునందు నూతన విధానములను ప్రవేశపెట్టుటయు, ఇద్దరు మున్నగు గృహపరిశ్రమలను నెలకొల్పుటయుగూడ మన సంఘమును సంపత్కర మొనరింపగలవు

మన సంఘమును సజీవ మొనరించుటకింకొక మార్గముగూడ గలదు అయ్యది "మార్గము" మాత్రమేగాక "అవశ్యాచరణీయము" గూడ నైయున్నది మన సంఘములోని ప్రతిభాశాలురనేకులు చెన్న రాష్ట్రమునందంతటను వెదజల్లఁబడి వివిధ ప్రతిపత్తులలో మన్నారు వీరందఱు నొకరి నొక రెరుఁగకపోవుటచే సంఘాభ్యుదయ విషయమై యందఱు పనిచేయుట కనువుగాకుండ నున్నది వివిధ ప్రాంతములం దుండువారి కందఱికిని, కమ్మవార

## 10వ కమ్మ మహాజన సభ

దేశకాలముల నెరింగి విద్యావిధానమును మార్పు చేయవలసియున్నది. కాని యట్టిమార్పు చూపు మేరదూరములో నున్నట్టుగానరాదు. అట్టిచో మనయువకులకు ప్రభుత్వోద్యోగములు లభించుట యెంతకష్టమో మన మెరుగనిదికాదు. అందుచే మన యువకులకు ప్రభుత్వేతరోద్యోగములకు మార్గము జూపవలసియున్నది. సహకారసంస్థలు, పారిశ్రామికాలయములు, యంత్రశాలలు, నిర్మాణ పద్ధతి మున్నగు శాఖలయందు మన యువకులు ఉపదేశమునుపొంది ఉద్యోగార్హులు కావమ్మును. మన విద్యావిధి నిర్వాహకులుగా నుండువారు వివిధ వృత్తి విద్యాశాఖలకును మన యువకులను పంపి విద్యను బడయునట్లొనర్చుట ముఖ్యము.

భావికాలమున సహకారోద్యమము దేశాభ్యుదయమున కుపకరించునని తలంపబడు చున్నది. భావిస్థితి యీ యుద్యమముపట్ల సుఖముగి నున్నట్లే యగపడుచున్నది. ఈ శాఖయందు వ్యాపార ప్రవృత్తియు, ఋణముల పద్ధతియు రానురాను మిక్కిలి యభ్యుదయ సూచకముము గన్పరచుచున్నవి. భూతకాలపు ఋణములపద్ధతి ఆధునిక ప్రపంచపరిస్థితుల కనువుగాలేదని యెల్లెడలను గుర్తింపఁబడు చున్నది. ఋణములు

## కీ॥ శే॥ వేమూరి గగ్గయ్య

సుప్రసిద్ధ నటుడు శ్రీ వేమూరి గగ్గయ్య గత మాసం 30 వతేదీన స్వర్గస్థులయినారు. వీరి మృతి నాటక, సినిమా అభిమానులకు చాలా విచారకారణం. వీరు స్టేజి నటుడుగానూ, సినిమా నటుడుగాను తెలుగువారి మన్ననలను చూరగొన్నారు. అనేక పౌరాణిక చిత్రాలలో నటించి ఒకప్పుడు అసంఖ్యాక ప్రేక్షకులను రౌద్ర భయానకరస వివశులను చేశారు. పౌరాణిక చిత్రాలపై జనుల మోజు తగ్గిన తరువాత వీరు సినిమాలనుండి విరమించుకున్నారు. కాని నాటకాలు వేస్తూనేవచ్చారు. పక్షవాతంతో బాధపడుతూ కాలధర్మం చెందారు.

ఆంధ్రపత్రిక 1956 జనవరి 1 సంచిక నుంచి

# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్



**కేవలం కాంప్లాన్®**

**లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి**

పెరిగే పిల్లల పోషణకి, ప్రత్యేకంగా కొన్ని ఆహార పదార్థాలు అవసరమవుతాయి ఎందుకంటే సామాన్యంగా వారి పెరుగుదల 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది గనక

అందుకే, మీ పిల్లలకు అవసరం కాంప్లాన్— యిప్పుడే కాంప్లాన్‌లో ప్రోటీన్లు (20%) వుండటమేగాకుండా, పిల్లలకు లభించగల అత్యుత్తమమైన ప్రోటీన్లు (పాల ప్రోటీన్లు) ఉన్నాయి మరి పెరిగే వయస్సులో వారికి అవసరమయ్యే 22 యింకా యితర కీలక ఆహార పదార్థాలున్నాయి కూడాను గుర్తుంచుకోండి, కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం

కాంప్లాన్ రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదా)గా కూడా




GLC/6-2314-TL (R)

**ఉచితం!**

32 పేజీల పుస్తకం

"కుటుంబానికంతటికీ శరీర పోషణకు సలహాలు"

50 పైసల స్టాంపును జతపరిచి వీరికి రాయండి :

పోస్ట్ బ్యాగ్ నం. 19119 (కాంప్.) G-94

బొంబాయి—400 025

# కాంప్లాన్®

**—సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం**

మను నభిమానమును, కమ్మ సంఘమువట్ల నత్యంత భక్తియు నెలకొనియున్నది. కాని యాయేక రూపమగు నాశయెల్లానములను కేంద్రీకరించి యేక ముఖముగ నడుపుట కనువు గాకుండ నున్నది కాన వీరి నందఱిని పరస్పర మెరుకపఱచుటకు మొదటి మార్గము "కమ్మ ప్రముఖుల నామరూప పట్టిక" నొకటి తయారుచేయుటయే యని నా నమ్మకము మన కమ్మ సంఘమునకు ప్రత్యేకించి యొక కుల పత్రికను నెలకొల్పుట గూడ మిక్కిలి యావశ్యకము. ఆ పత్రిక సాంఘిక విషయము లకే యెక్కువ ప్రాముఖ్యము నొసగుచు సాంఘికుల నందఱిని బద్ధైయిక భావులనుగా జేయుటయే తన కర్తవ్యముగ నెంచవలెను ప్రస్తుతము అరవభాషలో 'కమ్మబాలన్' అనునొక మాస పత్రికగూడ ప్రకటింపబడుచున్నది కాని మన మాతృభాషలో ప్రకటింపబడి యఖిల ప్రాంతముల కమ్మమహాజనులకు నుపకరించు నొక పత్రిక యెంతేని యావశ్యకము. ఈ విషయములగూడ మహాసభవారు పర్యాలోచింతురని విశ్వసించు చున్నాను

మహాసభ మరల సమావేశమగువరకు సాంఘిక విషయములగు కార్యములను నిర్వ హించుటకును సంఘమందు తాత్కాలికముగ నుత్పన్నమగు సమస్యలను పరిష్కరించి తీర్మా

## 10వ కమ్మ మహాజన సభ

నించుటకును, కార్యనిర్వాహక వర్గము నొకదాని నేర్పరుపవలసిన యవసరమని నాకు తోచుచున్నది రాష్ట్రమంతయు సంఘ ప్రచారమొనర్చి కమ్మ కులజులందఱిని ఉదాసీనతాంధకారము నుండి విడివడజేయుటకు ప్రచారకులను గూడ మన సంఘమువారు నియమింపవలసియున్నది ఆ ప్రచారకులు వివిధ ప్రాంతములందు సంచార మొనర్చి స్థానికముగ దాము తెలిసికొన్న యను భవములను మహాసభవారి పరిష్కారార్థము నివేదింతురు

### జయంత్యుత్సవములు

సంఘాశయ ప్రచారములతోబాటు మన సంఘపు పూర్వోన్నత్యమును మనవారికి బాగుగ నెఱుకపఱచవలసియున్నది ఇందులకు "కమ్మ సంఘ చరిత్ర" గూడ నొక సాధనము గాకపోదు ఇందుతోబాటు మన ప్రాచీన వీరుల జయం త్యుత్సవములను ప్రతి వత్సరమును జరుపవలసి యున్నది. మహాపురుషుల కథలును, మహా పురుషుల నడవడులును, ప్రజాసామాన్యము కనూల్యాదర్శప్రాయములు. ఆత్మీయ సంరక్షణ కొఱకును, తమ కులగౌరవ మును నిలబెట్టు టకును తమ జీవితములను ధారవోసిన మహా

మహాత్ముల సంస్మరణ మత్యంతాభ్యుదయదాయకము. మన కమ్మ సంఘమునందు జన్మించిన వీరు లెందరో గలరు. వారు చేసిన సత్కార్యము లెన్నియో నివురుగప్పిననిప్పుమాదిరి నామమాత్రా వశిష్టములై యున్నవి. వీని నన్నింటిని సమత దీర్ఘపరిశ్రమను సల్పి చరిత్ర రూపముగ సంపుటీకరింపక పోయినచో కాలప్రవాహమున నవియన్నియు లీనమై మనము దాని రూపముల లేనివార మగుదము. ఇప్పటి పరిశోధనల వలన తెలిసినవారిలోనల్వురేవురు ప్రాచీనవీరులు గలరు వీరిలో ప్రథముడు ఓరుగంటి ప్రతాప రుద్రుడు ఇతఁడు కమ్మ సంఘమునకు చెందిన వాడని చారిత్రక విమర్శకులచే నిరూపించబడినది ఇతడు యవనవీరుల తాకిడి కోర్వలేక నుత్తర హిందూ దేశము నుండి హాహాకారములతో నాశ్రయమునకై దక్షిణాపథమునకు పరుగెత్తి వచ్చిన హిందూ రాజ్యరమకాశ్రయ మొసంగి యవనవాహిని నడ్డగించి దక్షిణ హిందూదేశమునేక ఛత్రిని పరిపాలించి కమ్మవారల కదనపాండితిని సోదర దేశీయుల కెరింగించి మన సంఘము యొక్క గౌరవము నినుమడింజేసినాడు పెమ్మసాని రామలింగభూపాలుని చారిత్రము తమ కెరుంగనిది కాదు. వాసిరెడ్డి వేంకటాద్రి నాయనింవారి యౌదార్యమటిను "కమ్మత్యాగంబు నిలలోన నమ్మకమ్మ" యని కారులాడిన ధూర్త కవి మాటలను సత్యదూరము కావించి కమ్మవారి దానగరిమను ప్రపంచమునకు మరొకమాటు వ్యక్తీకరించినది వీర వనితామణుల కెల్ల తల మానిక మనదగు నోరుగంటి రుద్రమాంబ యొక్క వీరశౌర్యముల నెరుగనివారుండరు. ఆ వీరమాత యొక్క పరిపాలనాదక్షత కదన నిర్వహణా సామర్థ్యము, ఆత్మగౌరవ సంరక్షణా చతురత, పట్టుదల మున్నగు నుత్కృష్ట గుణములు సాచ్యములు. కమ్మవడతి చరిత్రమును దాసరులు తంబుర్రాశ్రుతితో గలిపి యానందమున నృత్యమాడుచు పాడుచుండునపుడు యే కమ్మ యువకుని వీరరక్తముపొంగి పారలకుండునా? ఇట్టి వీరపురుషుల యొక్కయు జయంత్యుత్సవములను జరుపుట తప్పనిసరి యగుచున్నది. తమ దేశ గౌరవమును నిలబెట్టుకును తమ మాతృభూమిని దుర్భర దాస్యశృంఖలములనుండి విడిపించుటకును ఆత్మగౌరవమును నిలబెట్టుకొనుటకును తమ సర్వసమును ధారవోసి తుదకమూల్యములగు తమ జీవితములనుగూడ సంతుష్టాంతరంగముతో నర్పించి మనకింత నామ రూపములు, గౌరవ ప్రతిపత్తులు, గలుగజేసిన యా వీరాతివీరులను వత్సరమున కొక తూరి స్మరించుటకంటె వారికి మనము చేయదగు ప్రతిభ మెద్దియునులేదు. ●

---

## ఆంధ్రపత్రిక 1911 ఫిబ్రవరి 22 సంచిక 'లేఖలు' శీర్షిక నుంచి

అయ్యా,

నేటి దినమున గుడివాడ తాలూకా మాజిళ్ల గ్రామములో కమ్మ మహాజన సభలోని తీర్మానము ననుసరించి, ఎడ్వర్డు మెమోరియల్ ప్రైమరీ పాఠశాల యని నామ మొసగి యొక పాఠశాలను స్థాపించిరి ఈ గ్రామమున కొక ఫర్లాంగు దూరంలో చిరిచింతలయను గ్రామ మొకటి కలదు. ఈ రెండు గ్రామములలో నుండు బాల బాలికల కొరకీ పాఠశాల నేర్పచిరి దీనికగు వ్యయము పిల్లల జీతముల మూలమున సమాలగు నదిగాక, మిగత యావత్తును, మాజెళ్ల వాస్తవ్యులు పర్వతనేని మల్లికార్జునుడు, ఇ వేంకటామయ్య, పిన్నమనేని సోమయ్యగార్లు భరించుటాగున నొక వడంబడిక తగు కట్టుబాట్ల ములతో, వ్రాసికొని యున్నారు. దీనికి సంబం ధించిన పనులన్నియు నెరవేర్చుటకు 3 ట్రస్టీలు గలరు. వీరి సలహా ప్రకారము పై ముగ్గురు పెద్ద మనుష్యులు నడుచుకొనవలసి యున్నారు ప్రస్తుతము పాఠశాలలో 30 బాల బాలికలు గలరు. పిన్నమనేని సోమయ్యగారి గ్రామమున కట్టించిన సత్రములో నీ పాఠశాల నుంచినారు

మన కమ్మ మహాజనులు నివసించు చోట్ల ప్రైమరీ పాఠశాలలయినను లేవు అట్టి చోట్ల పాఠశాల నెలకొల్పుట ప్రతి సంఘాభిమాని యొక్క విధియనదని, మీకు తెలియనిదా ! కాదు గాన ఉపేక్ష చేయకుడు, సంఘోద్ధరణయే మన గమ్యస్థాన మనునది మరువకుడు.

—బొబ్బా పద్మనాభయ్య,
కమ్మ మహాజన సంఘ కార్యదర్శి, కౌతరం.

# ఆం. ప్ర. విద్యుదుత్పత్తిలో ప్రగతి

**విద్యుత్ వుత్పత్తి**
ఇరవైఐదు రెట్లు పెంపు

**విద్యుత్ లైన్లు**
ఇరవైనాలుగు రెట్లు పెంపు

**వినియోగదారులు**
పందొమ్మిది రెట్లు అభివృద్ధి

**పంపు సెట్లు**
నూటఇరవైరెండు రెట్లు అభివృద్ధి

**పారిశ్రామిక సర్వీసులు**
ముప్పయిరెండు రెట్లు అభివృద్ధి

**గ్రామీణ విద్యుద్దీకరణ**
ముప్పయిరెండు రెట్లుఅభివృద్ధి

**తలసరి వినియోగము**
పదిహేడు రెట్లు అభివృద్ధి

**హరిజనులు & గిరిజనులు**

**అభివృద్ధి సూచిక :**
100 మె వా నుండి 2500 మె వా

**విద్యుత్ ప్రసారవాహకములు**
9120 కి మీ నుండి 227589కి మీ.

**గృహ అవసరాలకు :**
1 5 లక్షల నుండి 28 74 లక్షలు

**ఆహార వుత్పత్తి కోసం :**
4300 నుండి 5.26 లక్షలు

**ఉపాధి పెంపుదలకు :**
2000 నుండి 63,888

**గ్రామీణాభివృద్ధికి చేయుట**
630 నుండి 19,999

**అభివృద్ధికి సూచన :**
7 యూనిట్ల నుండి 199 యూనిట్లు

**అభివృద్ధి పథంలో :**
90%కు మించి హరిజన వాడలు
మరియు 1356 గిరిజన గ్రామాలకు
విద్యుద్దీకరణ జరిగింది
32572 బలహీన వర్గాలవారి
గృహాలకు యింటింటికి ఒక బల్బు
పథకం అమలుచేయబడినది.



## ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలెక్ట్రిసిటిబోర్డు

# ఆదిమాంధ్ర అంటుదోష నివారణసభ

## ఏలూరులో 19వ తేదీన జరుగుట

ఈనెల 18 తేదీ ఉదయము 6 గంటలకు మా పురమందిరమున మహారాజశ్రీ గూడూరి రామచంద్రరావుగారి యధ్యక్షత క్రింద అంటుదోషమును నివారించుటను గురించి విమర్శించి తీర్మానించుటకై నొకగొప్పసభ జరిగినది గూడూరు రామచంద్రరావుగారగ్రాసనము నలంకరించిరి కేవలమగ్రకులముల వారేమో యన్యాయమును గావించి పంచముల నణగద్రొక్కిరని నిందించుటవలన ప్రయోజనములేదు మనలో పూర్వాచారపరాయణు లనేకులు తమ శిష్టాచారములనే నమ్మి జపతపాదులతో కాలము బుచ్చుచుండు వారినందరిని మనము నిర్బంధించి మాలవాండ్రను తమతో సమానముగ కూర్చుండ బెట్టుకొనుడని బాధించుట చాల పాతకము రాజకీయకముగ ఆదిమాంధ్రులను నన్ని పక్షముల వారిని తమ తమ పక్షములకు చెందుడని చెల్లించుట గూడ నిపుడాచారమైనది క్రైస్తవ మిషనరీలు గొప్ప గొప్ప యాశలను చూపించి వారిని తమ వైపున కాకర్షింపుచున్నారు. అట్టివారు క్రైస్తవమతము నవలంబించి మన యొద్దకు వచ్చినపుడు వారికి షేక్‌హాండిచ్చి మనతో సరిసమానులనుగ జూచుచున్నాము మన మతమునందుండి మన దేవతలనే కొలుచుచు, మన వేషభాషల వేసికొనుచు, మనలోవారమేయని చెప్పకొనునపుడు వారిని నిర్లక్ష్యముచేసి అన్య మతావలంబకుడైనంత మాత్రమున మనము చేయుచున్న మర్యాదలు గ్రహించి, వారు చాల మంది యితర మతావలంబకు లగుచున్నారు ఇందుచే మన సంఘ బలిమి చాల తగ్గిపోవు చున్నది కావున మనమందర మీసంఘ క్షయము నరికట్టవలయును. దీనికి ముఖ్యసూత్రము వారికి గల యస్పృశ్యతను తొలగించుటయై యున్నది ఈ యస్పృశ్యమెట్లు కలిగినదని విచారించవలసిన యవసరము మనకులేదు. దానిని తీసివేయుటకు మన శాస్త్రము లెవ్వియైన యడ్డుపడువాయని మాత్రము మనము విచారింపవలెను. వాల్మీకి! నారదుడు మున్నగు వారు నిమ్నజాతుల వారయ్యును అగ్రకులస్థులైరి. అరుంధతి మాల జాతి స్త్రీయైనను వశిష్ఠుని భార్యయైనది పన్నిద్దరాళ్వారిలో నొకరు మాలవాడు కావున నిట్టి నిదర్శనములనేకములు గలవు ఇట్టి విపరీత విషయములకే తావు కలిగినపుడు, మాలవాండ్ర యస్పృశ్యత్వమును తొలగించుటకు నావకాశము లేకపోలేదు అటులు చేయకుండ వారిని దూరముగ నుంచిన మహాపాపము మనయందే యుండి యున్నది గాంధి మహాత్ముడు గూడా నీ విషయమును గురించి స్పష్టముగ ననేకపర్యాయములు ముచ్చటింపుచు మనము వెంటనే వీరి యస్పృశ్యత్వమును తొలగించి స్వరాజ్య సంపాదనమునందు వీరి సహాయమును పొందవలయుననియు, నుడివి యున్నారు స్వరాజ్య మేడుమాసములలో రావలయునని కోరుచున్న నిక్కాలములో వీరి యస్పృశ్యత్వమును బాపుటను గురించి జాగుచేయుట తగదు మన మనేక పర్యాయములీ విషయమై యనేక తీర్మానముల చేసితిమిగాని, యీ స్థలమును దాటిన వెంటనే వానిని మరచుచుంటిమి. కావున మనోద్రఢిమను చూపుటకై ఆదిమాంధ్రులము మన మందరము రేపటి నుండి యిండ్లలో నౌకర్లుగ నుంచుకొనవలయును భోజనగృహముల లోనికిని, వంటశాలల లోనికిని వీరిని రానియ్యకపోయినను, యిండ్లలో ప్రక్కలు వేయుట, గృహములు చిమ్ముట, బట్టలుదుకుట, నీళ్లుతోడుట మున్నగు పనులకు వారి నుపయోగించుకొనవచ్చును. వారు, మన మామూలు నౌకర్లుకన్న పెక్కుడు పరిశుభ్రముగను, నమ్మకముగను నుండుటయందు లోపముండదు అట్టి వారెదైన స్వామిద్రోహకార్యము చేయకుండ సద్వర్తనము కలిగియుండుటకై నేను హామీ నిచ్చెదను మా మిత్రులగు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు రమారమి 15 సం॥ల నుండి ఒక మాల నౌకరును తమ యింటిలోని పనులు చూచుటకై యుంచుకొని యున్నారు ఒక్క భోజనగృహములోనికి తప్ప, యింటిలోని నన్ని భాగములయందు నీతడు తిరుగుచు, అతి నమ్మకముగ సంచరించుచున్నాడు వేయి రూపాయిల సంచినిచ్చినను అతడు జాగ్రత్తగ తిరిగి నప్పగించుచున్నాడని పట్టాభిగారే నాతో చెప్పియుండిరి కావున సభాసదులందరు యిట్టి పనులను వారల కొసంగి, వారి యంటుదోషమును బాపి దేశోద్ధరణమును గావించవలయునని ప్రార్థింపుచున్నాను ''

**ఆంధ్రపత్రిక 1921 మార్చి 30 సంచిక నుంచి**

అధ్యక్షకోపన్యాసానంతరమున ఉమ్మే ఆలీషా కవిగారు గంభీరోపన్యాసమును గావించిరి ఆరంభము నుండి అంత్యము వరకు వీరి వాక్కు అమృతపు ధారలుగా గ్రహింపబడినవి ఉపన్యాససారము నిచట పొందుపరచుచున్నాము.

## ఆలీషాగారి ఉపన్యాససారము

అగ్రకులములవారేమో అన్యాయమును గావింపు చుండిరని వారిని నిందించుటవలన ప్రయోజనము లేదు ఎవరి కాళ్లమీద వారు నిలువబడి, ఎవరి వికాసమును వారు సంపాదించుకొనవలసిన కాలములో యొకరు తమకుసహాయము చేయలేదనుట కన్న వ్రేజీతనము మరొకండుకను పింపదు ఒకరి సహాయ మపేక్షించినచో నేడు కుర్చీపై కూర్చుండ బెట్టవచ్చును. కాని నిత్యమును నెవరు వాని నటుల కూర్చుండబెట్ట గలరు? కావున ఘనత కావలయుననిన దానిని పొందుటకు తగిన యర్హత యుండి తీర వలయును ఆ యర్హతను సంపాదించుకొని నపుడే ఎవనికైన ఆధిక్యత కలుగకలదు అది ఒకరు కలిగించిన కలుగునదిగాదు విశ్వామిత్రుని నెవరు బ్రహ్మ ఋషిని గావించిరి చండాలుడైన వాల్మీకికి నెవరు మహాజ్ఞానమును తెచ్చి పెట్ట గలిగిరి? మాలజాతి స్త్రీయగు అరుంధతిని నెవరు వశిష్ఠుని భార్యగా చేయగలిగిరి? కావున వీరందరు నెటుల జ్ఞానమును సంపాదించి, అంత్య జాతి వారయ్యారు, అగ్రజాతుల వారిచే గూడా నెటుల పూజనీయులయిరో, అటులనే మన పంచమ సోదరులును తమ విజ్ఞానముచే పైకి లేవవల యును వెక్కిరింపుకై జంజములు వేసికొందు మనినను, బ్రాహ్మణులను బలవంతముగ తాకుదుమనినను, కుర్చీలపై దౌర్జన్యముగ కూర్చుందు మనినను ప్రయోజనములేదు జ్ఞానమే ముఖ్యసాధనము దాని నలవరచు కొనుటకు వలయు శక్తులను యీశ్వరుడే సృష్టి యందమిడ్చియున్నాడు పూర్వమొక మహాఋషి జ్ఞానబోధ చేయువారు లేక ఒక పామునుండియు తేనెటీగ నుండియు బ్రహ్మజ్ఞానము నంతను తెలిసి కొని యున్నాడు తేనెటీగ తేనె నెంతయో శ్రమ పడి కూడబెట్టియును, దాని ననుభవింపకయే నితరులచే తరిమి వేయబడి తన సర్వస్వమును కోలు పోవుచున్నది పాము అట్లుగాక దొరికిన యాహారమును భుజింపుచు, దొరకని దినము వాయుభక్షణమునే గావించునుగాని ఆహారమును కూడబెట్టుట యెరుగదు కావున కూడబెట్టిన తేనెటీగకు యనుభవింప నవకాశము లేక పోవుటయు, కూడబెట్టకపోయినను పాము గూడ జీవించుచుండుటయు, దీనిని బట్టి చూచినచో యీ ప్రపంచమునందు బడు శ్రమల యొక్క ఫలితము శూన్యమని గోచరించి, వెంటనే బ్రహ్మజ్ఞాన ముదయించెను కావున జ్ఞానసంపత్తి కలుగువారికి కలుగుచునేయున్నది ఒక

## అంటుదోష నివారణ సభ

రుపదేశించుటలేదు గనుక కలుగుట లేదనుమాట విశ్వాస పాత్రము కాదు కలిగిన వారందరు యాదరింపబడుచునే యున్నారు శంకరులవారు గూడ నొక చండాలునెంతయో సన్మానించి నటుల మన గ్రంధము ఉద్బోధింపు చున్నది కాళిదాసు బ్రాహ్మణేతరుడైనను నేటికిని స్మరించ బడు చుండలేదా? వేమకూర వెంకటకవి మన ఆంధ్ర కవిమండలి యందెంతయో స్తుతింప బడుచుండలేదా? కావున మన మనవసరముగ కువాదముల బెట్టుకొని శాస్త్రకారులు చండాలుర నెందుకు నిషేదించిరని లేనిపోని విమర్శనమునకు గడంగి, 'షడ్డకః షడ్డకశ్చైవ ముష్టియుద్ధః పునః పునః'' అన్నట్టు తగవులాడు చుండుట యసమంజసము మనము విమర్శనములకు గడింగిన నంతముండునా? హేతు వాదమునకు మొదలు తోకగలవా? మిరపకాయ వగరగా నుండుననిన తియ్యగా నుండునని యింకొకడును, తియ్యగా నుండు ననుటకు దృష్టాంత రమేమయ్యా అంటే "పంచదారను చీమలు బట్టును, మిరపకాయకు చీమలు పట్టును" మిరపకాయ తీపి యని దొమ్ములాడ సాగినచో ఆద్యంతములెవ్వి? చండాలురను తాకరాదను నియమము బహుకాలము నుండి వచ్చుచున్నది గావున దానిని నివారించుటెట్లుయని మనము విచారించవలెనే గాని, కుబుద్ధిని నాధారము చేసి కొనినచో ఎర్ర అద్దముల బెట్టుకొనిన వానికి ప్రపంచ మంతయు నెర్రగనే కనిపించునటుల అన్నియు కుయుక్తులతోనే నిండినట్టు కనుపించును మతాంతరులగు మహమ్మదీయులతోనే సఖ్యతడి ఐకమత్యము కలిగించుకొనిన హిందువులకు వారి యంతశ్శాఖాది వాదమును పరిష్కరించుకొనుట యొక లెక్కలోనిది కాదు. కాని అందుకు తగిన యర్హతను గూడ చండాలుడు సంపాదించుట గూడ యవసరమని నేను మనవి చేయుచున్నాను చచ్చినగొడ్లను తినుట, గొడ్డు మాంసమును భక్షించుట, కల్లుతాగుట, మురికిగ నుండుట, జ్ఞానహీనత, యివియన్నియు వారి నావహించి యున్నవి. వాని నన్నిటిని వారు తొలగించుకొనినచో "అంటుదోషము" మాయము కాకుండ నెట్లుండును? చచ్చిన గొడ్లను తినుట మానక, గొడ్డు మాంస భక్షణము మానక, అపరిశుభ్రత వీడక, భుజము మీద చేయివేసి భాయి భాయి యనవలెనన నెటుల సాగును? కావున వీనిన్నిటిని వీరు విడువవలయునని కోరుచున్నాను. పిదప జ్ఞానాభివృద్ధికై వీరు పాటుపడవచ్చును, అది వచ్చినను రాకున్నను యిది నూతన శకము గనుక అంటుదోషము నశించును ఇదివరకు భారతభూమి కేవల జ్ఞానభూమి యన బిరుదము నందినది. కాని పాశ్చాత్య సాంకర్యము చేత ఇపుడట కేవలము ఆర్థిక సాంఘిక మర్యాదలకు ఆటపట్టైనది ఈ మార్పును బట్టి సాంఘిక బల మత్యావశ్యకము గాన గాంధీ మహాత్ముడు గూడ యీ యంటుదు దోషమును వెంటనే నివారించుకొనవలసిన దనియు, ఏడు మాసములలో స్వరాజ్యమును సంపాదింప వలయునుగాన వారి సహాయము మన కత్యవసర మనియు, చెప్పుచున్నాడు పందిని, కుక్కను, నక్కను, పిల్లిని గూడ ముట్టుకొను వారలకు మనిషిని ముట్టుకొనుట దోషములోనిది కాదు కావున, యీ యీషద్భేదములను సరకుచేయక వెంటనే దానిని సంస్కరించుటకు అందరును తోడుపడవలెను.

"అస్పృశ్యతను తొలగించుటకై" నొక తీర్మానమున మహరటా స్వాముల వారు ఆపాదించిరి దానిని డి నారాయణరాజు గారు, ధర్మసాధని పత్రికాధిపతులగు కామేశ్వరరావు గారు, అళ్యం సుబ్బారావుగారు, గ్రంధి రామమూర్తిగారు ఉమ్మే అలీషాగారు ఆమోదించిరి సభ వారందరిచే నది యామోదింపబడెను ●

1948 సెప్టెంబర్ 1వ తేదీ
సంచిక నుంచి

# కూచిపూడి నాట్యకళ

## గౌరవనీయులైన శ్రీయుత కళా వెంకట్రావుగారు

ఆంధ్ర సంస్కృతికి ఉండే విశిష్ట సంపత్తిలో కూచిపూడి భరతనాట్యం అగ్రగణ్యం భావరాగతాళముల సమర సమ్మేళనమే భరత మన్నారు ఈ కళాస్రష్ట భరతుడనే వో ముని పుంగవుడని ఒక సంప్రదాయం ఆర్య సంప్రదాయం ప్రకారం శివుడు, పార్వతి, విఘ్నేశ్వరుడు, నారదుడు, హనుమంతుడు ఇత్యాదులు పదహారుగురు మన దేశంలో నృత్యకళకి పునాది వేసిన వారు ఇటువంటి సనాతన నృత్యశాస్త్రం కాక, ఆధునిక కాలంలో జయదేవుడు, నారాయణ తీర్థులు, సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్య మొదలైన వారు కొత్త పంథాలు తొక్కినవారు. ఈ కొత్త పంథాగో ముఖ్య విషయం ఏమంటే, ఈ నృత్యం అంతా కూడా శ్రీకృష్ణ పరంగా సృష్టించ బడినది

జయదేవుడు వంగదేశస్థుడు. ఈయన గీత గోవిందం నృత్యసంగీతం రాధామాధవుల ప్రణయమే గీతగోవిందం వస్తువు ఈ గీత గోవిందం ముద్దుపళని తెనుగులోకి భాషాంతరీకరణం చేసింది ఈమె జన్మవల్ల మహారాష్ట్ర యువతి ఉనికివల్ల ద్రావిడాంగన. కవిత్వం తెనుగులో అది తంజావురాంధ్ర నాయకుల యుగం. విజయనగరం నుంచి ఆంధ్ర సంస్కృతి, ఆంధ్ర కళలు, దక్షిణాపథం అంతా వ్యాపించిన మహాయుగం. త్యాగరాజస్వామి అవతారానికి మార్గం చూపిన మంచివేళ ఈ నాటికీ కూచిపూడి వంటిదే తమిళులకి ఉకుకుడి గ్రామం ఉన్నది. ఇక్కడి వీధి నాటకాలన్నీ అరవ లిపిలో వ్రాసిన తెనుగులో వుంటవి. దక్షిణ దేశంలో దేవాలయాలలో నృత్యం చేసే దేవకన్యకలు తెనుగు పదాలే వాడతారు. రీతులన్నీ తెనుగు రీతులే మలయాళంలో కథాకళి కూడా నంబూద్రీల ద్వారా అక్కడికి వెళ్ళింది. నంబూద్రీలు గోదావరి తీరం నించి వలసపోయిన ఆంధ్ర బ్రాహ్మణులు. ఆంధ్ర మహాసామ్రాజ్య కాలంలో వలసపోయిన ఆంధ్రులు ఆగ్నేయ ఆశియాలో నాట్యకళా సంప్రదాయం ప్రచారం చేశారు.

భారతదేశంలో జయదేవుడి తర్వాత కృష్ణ పరంగా నృత్యసంగీతం చెప్పినవాడు నారాయణ తీర్థులు. ఈయన కృష్ణుడికీ గోపికలకీ మధ్య వుండే అనురాగం వస్తువుగా తీసుకున్నాడు

ఇక మిగిలిన ఆధునికులు సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్య. వీరిద్దరూ పదహారణాల ఆంధ్రులు క్షేత్రయ్య కృష్ణాజిల్లా మొవ్వ గ్రామ కాపురస్థుడు మువ్వ గోపాల పదాలు వినని ఆంధ్రులుండరు

సిద్ధేంద్రయోగి కూచిపూడి సంప్రదాయానికి వంశపురుషుడు ఈయన గోలకొండ తానీషా కాలంలో ప్రస్తుతం గుంటూరుజిల్లా ప్రదేశ వాస్తవ్యుడు అద్దర్ని అత్తవారు ఒక శుభముహూర్తమందు పునస్సంధానానికి ఏరుదాటి వెడుతూ వుండగా వరద వచ్చి ప్రాణాపాయం కలిగింది ఇష్టదేవతను ప్రార్థించగా ఆ దేవత నీవు పునస్సంధానానికి వెళ్లవమ్మగాని భార్యని స్పృశించకూడదని వరం ఇచ్చెను ఆ విధంగా సన్యాసి కావలసిన సిద్ధయ్య తపశ్శక్తి చేత సిద్ధేంద్ర



కూచిపూడి నాట్య కళానిధి
వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు

యోగిగా మారి భామకలాపం, అనగా సత్యభామా కృష్ణుల ప్రణయం వస్తువుగా వీధి భాగవతం రచించినాడు ఈ నాటకం ప్రదర్శించడానికి ప్రయత్నిస్తుండగా కూచిపూడి సమీపంలో ఇద్దరు బ్రాహ్మణ కుర్రవాళ్లు చెట్లమీద కూచుని కూనిరాగాలు తీస్తున్నారు కంఠం మధురంగా వుంది. అంగసౌష్ఠవం ఉంది వెంటనే ఒకరికి భామవేషం, మరొకరికి కృష్ణుని వేషం తయారు చేసి, తానీషా ముందు ప్రదర్శించాడు. తానీషా మెచ్చుకుని ఈ కళ పోషించడానికి కొన్ని గ్రామాలు ఇనాం ఇచ్చినాడు అప్పట్నించి, ఈ కుటుంబీకులు భాగవతుల వార్నై, చింతావారితో, వేదాంతం వారితో సంబంధాలు చేసుకుని, నృత్యకళ ఆరాధిస్తున్నారు ఆనాడు భామవేషగాడి పరువు మర్యాదలు, ఈనాటి ఫిలుము తారల్ని మించి వుండేవి ఒక భామ వేషగాణ్ణి మరో భామ వేషగాడు వోడించడానికి, చేతబళ్ళు చేయించడానికి ప్రయత్నించేవారు అందుకే వీరు మంత్రశాస్త్రం కూడా పఠించి, శత్రువులకై ప్రతి ప్రయోగం చేసేవారు భామ వేషగాడు జడ వేశాడంటారు అంటే, తక్కిన వాళ్లందరి మీద సవారీ అన్నమాట ఇవన్నీ తెలుసుకుంటే అనాది తెనుగుసీమలో ఈ కళకి ఎంత ప్రాముఖ్యం వుండేదో తెలుస్తుంది

నాటకకళ, సంగీతం, నృత్యం కలిసిన కొత్త కళ సృష్టించాలన్నాడు రవీంద్రకవి, వోహారి ఆటువంటి కళ కూచిపూడి భాగవతం ఇదివరకే ఆంధ్రులు సృష్టించారు కానైతే దీనికి ఉత్తర దేశంలో ప్రచారం లేదు. ఇందులోంచి వచ్చిందే, కొత్తగా తంజావూరు నాట్యం అని పేరు పెట్టారు. కూచిపూడిలో దీనికి సంబంధించిన తాళపత్ర గ్రంథాలు చాలా వున్నాయని విన్నాను. అవి పైకితీసి సారస్వత సంఘాలకిగాని, విశ్వ విద్యాలయానికిగాని, నాట్యకళా పరిషత్తుకిగాని, ఇస్తే ప్రకటించడానికి వీలవుతుంది ప్రభుత్వం కూడా సహాయం చేస్తుంది. ఆ కర్తవ్యం మహానుభావులు చింతావారిమీద, వేదాంతంవారి మీదా వున్నదంటాను. వందు వయస్సులో దార్ఢ్యంగా వీరు అభినయిస్తూంటే మహదానందంగా వుంటుంది. ఎంతమందినో శిష్య వర్గాన్ని సృష్టించి కళారాధన చేసినవారు. వారు పూజ్యులు. ఈ కళ ఎన్నటికీ మరుగుపడక, దినదినాభివృద్ధి అయ్యేటట్లు ఆంధ్రులు కాపాడు కోవాలి

నందికేశ్వరుడి నాట్యశాస్త్రం ఆంధ్రుల సొమ్ము. ఇది భరతశాస్త్రానికి ముందుదని వో మతం మన శిల్పం మన పూర్వ నృత్యకళా వైభవాన్ని చాటుతోంది ఆ ఉత్కృష్ట కళారాధన కోసం వో ప్రత్యేక పరిషత్తు నిర్మించాలని నా సలహా.

# HANUMAN BRAND CEMENT

## STANDS THE TEST OF TIME

Strength. That is what every wise builder looks for in the cement brand he chooses. And Hanuman Brand Cement knows their insistence right. That is why it makes high quality ordinary portland cement with sophisticated technology, to suit their needs and build confidence in them.

Select Hanuman Brand Cement for any kind of construction. You will be happy many years later.




**SOMESWARA CEMENTS & CHEMICALS LIMITED**

Regd. Office: No. 6-3-609/15, Anandnagar Colony, Khairatabad, Hyderabad— 500 004. Andhra Pradesh.






**Hanuman Cement stands for Strength**

Mayura

# ఆది ఆంధ్ర మహాసభ

ఆంధ్రపత్రిక 1942
జూలై 1వ తేది

శ్రీ డి. గోవిందదాసుగారి అధ్యక్షతన, తెనాలి యందు సమావేశమైన రాష్ట్రీయ ఆది ఆంధ్ర మహాసభయందు నిమ్నజాతుల అభ్యున్నతికి సంబంధించిన విషయము లనేకము చర్చకు వచ్చినవి. వానిలో ముఖ్యమైనది అస్పృశ్యతా నివారణ. గాంధిమహాత్ముడును కాంగ్రెసును గావించుచున్న కృషివలన, ప్రజాహృదయమున అస్పృశ్యతాభావము చాలవరకు తొలగిపోయినది. వేలకొలది సంవత్సరములుగ వచ్చుచున్న ఆచారము ఒక్కమారు పూర్తిగ అదృశ్యమైపోవుట దుస్సాధ్యము. ఈ విషయమున సవర్ణ హైందవులయందు గల్గుచున్న మానసిక పరిణామముతో బాటు, హరిజన ప్రజాబాహుళ్యమునందుగూడ ప్రబోధము వ్యాపించుచుండునెడల, ఇంతకంటెను సత్వర ఫలితములు లభించును. ఇందుకొరకే, గోవిందదాసుగారు హరిజనులయందుగల "మాల, మాదిగ మొదలగు వేరులను తొలగించుకొని సంఘమును ఏకోదరముగ నభివృద్ధిపరచుకొనవలె"నని యుద్బోధించి యుండిరి. ప్రతిగ్రామము నందును ఆది ఆంధ్ర సంఘముల నెలకొల్పుకొని తమ హక్కులకొరకు పోరాడవలెనని శ్రీ బి. ఎస్. మూర్తిగారు గావించిన సూచనను ఆది ఆంధ్ర ప్రజాబాహుళ్యము అనుసరించుచో, ఏ సంస్కరణమును సత్వరముగ సాధించుకొనవచ్చును. సాధారణముగ సాంఘిక ప్రత్యేక సంస్థలు, జాతీయతకు భంగకరమైనను, నిమ్నజాతుల ప్రస్తుతస్థితియందిట్టి సంఘముల ప్రయోజనమును కాదనుటకు వీలులేదు.

ప్రజాహిత జీవితమున, ఇతర వర్ణముల వారితో సరిసమానమగు అవకాశములు, నిమ్నజాతులకుగూడ లభింపజేయుటకుగాను, స్థానిక సంస్థలయందు అధ్యక్ష ఉపాధ్యక్షపదవులకు ఎన్నుకొనుటలో, నిమ్నజాతులవారికిగూడ ప్రాతినిధ్యమొసగవలెనని ఈ సభయందొక తీర్మానము గావింపబడెను. న్యాయమగు ఈ కోరికను దేశమునందున్న పక్షములవారును అంగీకరించెదరని నమ్మవచ్చును. చెన్నపురి కార్పొరేషనునందును, బొంబాయి కార్పొరేషనునందును, ఈ పదవులను సంఘములవారీగా వేర్వేరు సాంఘికులకు లభింపజేయునట్టి సంప్రదాయము ఇదివరకే అమలునందున్నది. అవసరమగు మార్పులతో ఇట్టి ఆచారమును, ఈ రాష్ట్రమునందలి ఇతర స్థానిక సంస్థలకుగూడ వర్తింపజేసుకొనవచ్చును. మహాసభవారి సందర్భమున, జనాభానుబట్టి ప్రభుత్వోద్యోగములయందు ప్రాతినిధ్యమొసగవలెననిగూడ కోరిరి. ఉద్యోగశాఖలయందిపుడు నిమ్నజాతులసంఖ్య చాల తక్కువ. విద్యా విషయములయందు వీరు వెనుకబడియుండుటయే ఇట్టి స్థితికింతవరకును కారణము. ప్రభుత్వము వారి లోపమును సవరించుటకు, సాంఘిక ప్రాతినిధ్యమాత్రమును అమలుజరుపుచున్నారు. నిమ్నజాతులయందు విద్యార్హతలు అభివృద్ధిపొందిన కొలదియు, వారికి న్యాయమగు ప్రాతినిధ్యము నొసగుట కెవరును ఆక్షేపింపజాలరు. భారతీయులయందు, సాంఘిక విభేదము లంతరించి, ఏకజాతీయ భావము పూర్తిగ వ్యాపించువరకును ఇట్టి సాంఘిక ప్రాతినిధ్యాందోళనము తప్పించుకొనుట సాధ్యముగాదు.

ఆది ఆంధ్రులు, సాంఘికముగను, ఆర్థికముగను, ఎంత వెనుకబడి యున్ననుగూడ, భారత స్వాతంత్ర్యాశయమున మాత్రము, ఇతర వర్ణములవారి కేమాత్రమును వెనుకంజ వేయకుండుట ప్రశంసింపదగియున్నది. వెంటనే భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యము నంగీకరింపవలెననియు, భావి భారత రాజ్యాంగము ప్రజాప్రతినిధి పరిషత్తుచే నిర్ణయింపబడవలెననియు ఈ సభవారు తీర్మానించిరి. ఎవరో కొందరు వ్యక్తులు నిమ్నజాతుల పేర స్వాతంత్ర్యోద్యమమును దిగనాడుచున్నను, నిమ్నజాతుల ప్రజాబాహుళ్యము మాత్రము, సత్వర స్వాతంత్ర్యసిద్ధినే గాఢముగ వాంఛించుచున్నదని ఈ తీర్మానమువలన స్పష్టపడగలదు.

## ఆదిమ భూగోళపుటంచుల్లో...?

### నిఖిలేశ్వర్

సూక్ష్మక్రిములోంచి తొలుచుకుని
నేల నాలుగు చెరుగులా వ్యాపించి
ఇప్పటికి అదుపుచేయాలనే కొందరు
ఎదురులేని అధియంతం మనుకొని
అక్షరాలా భస్మాసుర హస్తంలా పెరిగి
అణ్వాయుధాల చావు గొడుగులు విప్పి
తాను నొక్కిన మీటకే మట్టికరుస్తూ
అంతా బూడిద భస్మం ధూళి దుర్భరణం
బాక్టీరియాను బానిసగా మలుచుకొంటూ
సూక్ష్మజీవుల అదృశ్య మరణాన్ని పెంచి పోషించి
గొట్టాలలోకి కుదించిన జీవితంలా
వెనువెంటే నీడలా నడిచే మృత్యువులా
అల్లుకుపోయే వైరస్ క్రిముల పూర్వీకులకే
మానవ మేధస్సు మహాసంక్రమణం
ఖండాంతరాల బలాబలాల ప్రదర్శనం
శీత యుద్ధం అతి చల్లని రాక్షస ద్వేషం
ఇప్పుడు ఎలాంటి సామ్రాజ్యవాదమైనా
వర్గ పోరాటాల అంతులేని సమరమైనా
అందరూ అంటించే మందర మథోగ్ర సమాజాలైనా
తరతమ భేదాల్లేని విధ్వంసంలో
భూమి రొమ్ముపై, లోపలి చొచ్చుకుపోయి
మనిషి జీవం క్రిమిగానైనా మిగల్చక
నిముకల పోగుగా
కాలగర్భంలో శిలాజాలుగా
తిరిగి ఆదిమ భూగోళపుటంచుల్లో
కలిసిపోతోంది అంతులేని మంటల్లో !!

("అసంపూర్ణ మానవ కావ్యం" నుంచి)




కొండల మీద విందుగా కురిసిన వాన గంగల మంటూ శివమెక్కి శివ తాండవంతో నేలకి (వాలి అడవులను అణుస్తూ తోటలను కూల్చ్రదోస్తూ చెట్లను చీల్చుకుంటూ పల్లానికి ప్రవహిస్తుంది. అదే ఏరు—దానితో వరద వడికి మంచి గంధవు ప్రమానులూ ముండ్ల తుప్పలూ కూడా కొట్టుకువస్తూ ఉంటాయి ఆ నదిలో దిగినవాడు ముండ్లతుప్పల్ని విడిచి మంచి గంధవు ప్రమానుల్నే తీసుకుంటాడు ప్రవాహ లక్షణం, మానవస్వభావం ఇలా ఉంటాయి ఎంచి ఎంచి ముండ్లతుప్పలను ఏ మతిమాలిన వాడూ తీసు కోడు ఆ నదిని ఎవడూ దూషించడు

'ప్రవాహినేదేశ్యా' అన్నాడు మన తొలి గురువు దేశ్యభాష ప్రవహిస్తూన్న ఏటిలాంటిది దానితో అనాదిగా వస్తూన్న మంచి గందవు ప్రమానులు సామెతలు— ఈ సామెతల్లో సంప్రదాయం కూడా ఇమిడి ఉంది అలాగే మనోజ్ఞము లైన చిన్న చిన్న కథలు కూడా

'గూటిలో దీపం — నోటిలో మెతుకు' — చక్కని సామెత. ఇది జైన మతస్థుల ఆహార సంప్రదాయాన్ని చెబుతుంది

దీపం పెట్టే సందెవేళ అయేసరికి జైన మతస్థులు రాత్రి తీసుకునే ఆహారం ముగించే స్తారు. దీపం పెట్టాక అయితే దాని చుట్టూ పురుగులు చేరడం, దాని సెగకి అవి మంగళం పాడడం కావచ్చు దానివల్ల వారి అహింసా సిద్ధాంతానికి దెబ్బ తగులుతుంది ఆ లాటి అరిష్టం పట్టకూడదని గూటిలో దీపం పెట్టే వేళకే వారు ఆ కాస్తా అయిందనిపిస్తారు.

ఇంకో విశేషమేమిటంటే — ఆ పురుగులు వారు తీసుకునే ఆహార పదార్థాల్లో పడవచ్చు కీటక మిశ్రితమైన ఓగిరం దోషజుష్టం కనక దానిని విసర్జించవలసి వస్తుంది. దాని ఫలితం అరచేత కడుపు పట్టుకుని పస్తు పడుకోడం ఈ విధంగా రెండు ప్రయోజనాలు సాధించడానికి జైనులు గూటిలో దీపం పెట్టే వేళకే రాత్రి భోజనాలకి మంగళహారతి పట్టుతారు

ఇలా చేసే గృహస్థులు జైనులు కానివారు కూడా యీనాడూ కొందరున్నారు, ఉంటారు అలాటి వారిని చూసి ఇరుగుపొరుగు వారు

'వాళ్లింట గూట్లో దీపం — నోట్లో మెతుకు. ఇంకా పడమటని ఎర్రలు గుంకలేదు వాళింట భోజనాలయిపోతాయి' అని అంటారు. కాని యీ జైనమతం పద్ధతి అంతశ్లాఘ్యం కాదనవలసివస్తుంది ధర్మసూత్రాలు పోయి చాలా కాలమయింది ఏ అతిథో అభ్యాగతుడో గృహ స్థింటికి వస్తాడుగాని సన్న్యాసి మఠానికి వెళ్లడు కదా! గూట్లో దీపం పెట్టి నోట్లో మెతుకు వేసేసుకుని చటుక్కున ఆ దీపం నొక్కేసి పక్కమీద వాలితే ఆ వచ్చినవాని గంతేంకాను ? మనింటికి వాడు రావాలా ? మనం వాడికెందుకు పెట్టాలి ? అని ప్రశ్నలు వేస్తే సమాధానం చెప్పడం సులభమే మనం గ్రామాంతరం వెళ్లా మనుకోండి కడుపుకి పిడికెడన్నం, గొంతుకి పుడికెడు మంచినీళ్లూ కావాలంటే ఏ ఒక గృహస్థు ఇంటికే కదా వెళ్లాలి ఆ గృహస్థు పై నియమాన్ని అనుసరిస్తే మన గతి ఏమికాను? అదే పై ప్రశ్నలకి సమాధానం అందుకే అన్నారు పెద్దలు —

'ఈ వూరికి ఆ వూరెంతో
ఆ వూరికి ఈ వూరూ అంతే' — అని

మనింటికి వచ్చిన పరాయి వూరు ఆసామీకి ఆప్యాయంగా పలకరించి మనకి ఉన్నదానిలో కలో, గంజో ఇంత ఇచ్చి ఆదరించడం గృహస్థ సంప్రదాయం అలా చేస్తే కాలక్రమాన మన మెప్పుడేనా అతని ఊరు వెళ్లితే ఆ ఆసామీ పూర్వ పరిచయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని కాస్త ఆశ్రయ మిస్తాడు మనింటికి వచ్చిన పొరుగూరు మనిషికి మనం మొండి చెయ్యి చూపించామనుకోండి, ఏనాడేనా మనం ఆ వూరు వెళ్లితే తామూ మనకి ఆ పనే చేస్తాడు దీనికే

'ఎరుక పిడికెడు' — అని చిన్నారి సామెత




పుట్టింది పాతకాలపు పరిచయం సమయానికి పిడికెడన్నం పెట్టిస్తుంది పుడికెడు జలం దానితోపాటే అనుకోండి కనుక -- ఈ వూరికి ఆ వూరెంతో ఆ వూరికి యీ వూరూ అంతే అంటే — మర్యాదా ఆదరం మనం పైవారికి ఎంత చూపితే అది వారివల్ల అంతా తిరిగి మనకి వచ్చేట్టు చేస్తుంది — అని గ్రహించాలి లోక సామాన్య దృష్టిలో ఈ వూరుకి ఆ వూరెంత దూరమో ఆ వూరుకి యీ ఊరు అంతేదూరం ఉంటుందని అర్థం కాని మనకిక్కడ ఫర్లాంగులూ మైళ్లూకాదు కావలసింది మానవ జీవితంలో పరిచయాలూ, ఆదరాభిమానాలూ, కలిసికట్టుతనం, సంఘ మర్యాద — అదే పై సామెత అంతర్యార్థం

ఇలాటిదే 'తల విలువ నోరు చెప్తుంది' అనే సామెత చీటికీ మాటికి ఇరుగు పొరుగు వాళ్లని జణజణలాడిస్తూ ధూంధాంమని దువ్వ లాడిస్తూ పిశాచకృత్యాలు చేసే ఇల్లాలికి ఒక కూతురు ఆ బిడ్డ పెరిగి పెద్దదయింది బంగారు బొమ్మలా ఉండే ఆ పిల్లని ఇరుగు పొరుగు వాళ్లు చూసి దీనికేనా మంచి నోరు వస్తే బాగుణ్ణమ్మా! కట్టుకునేవాడు సుఖ పడతాడు అని అనేవారు ఆ పిల్లకి ఈ మాటలు అర్థం అయేవి కావు యుక్త వయసు వచ్చింది సంప్రదాయం, కులం, గోత్రం చూసి అన్ని లక్షణాలూ కుదిరి ఉన్న ఒక కలవాడి కొడుక్కి ఇచ్చి పెళ్లి చేశారు అప్పగింతలే తరువాయిగా పెళ్లి శోభకరంగానే జరిగింది అప్పగింతలయాయి కూతురు అత్తవారి గడప త్రొక్కి కాపురం వెలగబెట్టుతూంది తల్లి గొంతుకే వచ్చింది కూతురికి ఆ తల్లి నోటవడి తనం యీ కూతురికి ముద్దగట్టినట్టు సంక్ర మించింది తల్లి సంగతి చూచాయగా తెలిసిన అమ్మలక్కలు ఇరుగు పొరుగు వారు వినిపించేట్టు గానే అనేశారు

'ఆ తల్లి కూతురే మూడు మూర్తులా' అని మరేమంటారు పూజిస్తారా ముద్దు పెట్టు కుంటారా ? యతి అంటే ప్రతి అని చదీమంటే పెడీమని నోరు జార్చేవాళ్లకి సంప్రదాయ సూచకాలయిన యీలాటి సామెతలు సమన్వ యిస్తాయి

'నీ అబ్బ సొమ్మేమైనా తిన్నానా ? మా వాళ్లిచ్చిన కట్న కానుకలతో మీ యిల్లు వెళ్లుతూంది — అనే యిల్లాలిని ఇల్లాలుగా ఎవ్వరూ పరిగణించరు అప్పుడే అంటారు 'తల విలువ నోరు చెప్తుంది'— అని అలాటివాళ్లకే

'శునకంబా! కనకంపు గద్దెపయి
కూర్చుండంగ సామాన్యమా ?—

అనేది వర్తిస్తుంది

ఒకడు చుట్టరికానికి కాలినడకన పయని

స్తున్నాడు యీ యంత్ర యుగంలో రైళ్లూ బస్సులూ విమానాలూ అమిరాయిగాని పూర్వం రెండెడ్ల బళ్లలోనో లేక కాస్త కాళ్ల బింకం ఉన్న వాళ్ళయితే నడిచో ప్రయాణాలు చేయడం ఆనాటి ఆచారం కాశీయాత్ర కూడా కాలినడకనే జరిపేవారని ఆనాటినుంచీ వస్తూన్న సమాచారం. ఆది నానా శ్రమదమాదులకూ దారితీసేదట! ఆ సంప్రదాయంలోదే 'కాశీ కావడి'

ఆ ప్రయాణాలు అంత కష్టతరంగా కారడవుల్లోంచి జరిగేవన్నమాట కనుకనే కాశీ వెళ్ళినవారు తిరిగి సురక్షితంగా ఇల్లు చేరడం బ్రహ్మప్రళయంగా ఉండేదట! దానికో సామెతకూడా సృష్టించారు

కాశీ వెళ్ళినవాడు — కాటికి వెళ్ళినవాడూ ఒకటే—అని మొదటికి వస్తే. మన బాటసారి పూర్వ సంప్రదాయం ప్రకారం నడక సాగిస్తూ ఒక పల్లె పొలిమేరలో కడవూ పేడా ఎత్తుకుంటూన్న ముసలమ్మను చూసి 'అవ్వా! ఈ వూరు మంచిదేనా' అని అడిగాడట! అతగాడి మాట విని ఆ అవ్వ తడుపుకోకుండా 'నాయనా! నీ నోరు మంచిదేనా?' అని ఎదురు ప్రశ్న వేసిందట బోసినవ్వుతో ఆ ప్రశ్నకి బాటసారి మొగం మాడిన కందిగింజలా అయిపోయి మంచిది మంచిది వస్తాను — అంటూ వెళ్ళిపోయాడట! ఆ అవ్వమాటకి చిత్తయిపోయాడంటారా! లేదంటారా? అతను ఏ వూరువాడో! ఎక్కడికో పోతున్నాడు ఏ మాత్రమూ పరిచయంలేని దారిని వెళ్తున్నాడు పేడకడి యెత్తుకుంటూన్న ముసలమ్మను చూసి అలా అడగడం మాటకారితనమా? తెలివి తక్కువతనమా? ఏ తనమైనా ఫలితం ఒక్కటే తన నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది ఊరి మంచితనం సంపాదించడానికి తన నోరు మంచిగా ఉండాలికదా! తన దారిని తాను పోతూఉంటే ఊళ్ళోవాళ్లు కోరి కయ్యానికి

# సామెతల తోరణం

వస్తారా? వీడితో కయ్యానికి కాలు దువ్వడమే వాళ్ళపనా? తిని తూర్పోలేకనా తగవులు తెచ్చుకోడం! అలాటి మాటకారులే గోతులో పడతారు కనుకనే—

'ప్రియవక్తృత్వం' ఉండాలన్నారు పెద్దలు ఎదుటి మనస్సు ముగ్ధమయేట్టు ఇంపుగా మాటాడడం మనిషికి అవసరం

ఈ సామెతలలో కొన్ని కొరడాతో కొట్టినట్టు చురుగ్గా తగుల్తాయి

ఇందమ్మా! అనేది పండుగ పబ్బాలలో ఇచ్చి పుచ్చుకోడం సందర్భాన్నేకాక నిత్య వ్యవహారాల్లోకూడా ఒక విధమైన మన్ననని ఆప్యాయమూ తెలుపుతుంది అలా అని భర్త ఏదో వస్తువు ఇస్తూ భార్యతో 'ఇందమ్మా!' అని అంటాడా? అని ఏ బుద్ధిమంతుడూ అనడనుకుంటాను తండ్రి యేదేనా వస్తువు తెచ్చి కూతురికి ఇస్తూ ఇందమ్మా! అంటే అందులో ఎంతో వాత్సల్యం ధ్వనిస్తుంది

ఇలా వచ్చిన సామెతల్లో కొన్ని చక్కని కథలు కూడా స్ఫురిస్తాయి కొన్ని సంప్రదాయాలను చెప్తాయి కొన్ని ప్రాచీన సహజీవనాన్ని తెలుపుతాయి కొన్ని చుర్రున తగిలి మనసును మంచి దారికి తీసుకు వచ్చేవవుతాయి చాలా పరిశ్రమ చేసి ఏ సామెత ఏ జాతికి (కులం కాదు) చెందుతుందో చేర్చి దాని అర్థాన్ని వివరించి నేటి విద్యార్థినీ విద్యార్థుల నిత్య పాఠశాల జీవితంలో పరిచయం చెయ్యడం మన భాష మౌలిక వ్యక్తిని బొమ్మ కట్టినట్టు చూపించడం అవుతుంది ఆ పనికి ఉపాధ్యాయులు ప్రశంసనీయమైన పరిశ్రమ చెయ్యవలసిందని సలహా ఇస్తున్నాను పాతికేళ్ల నా ఉపాధ్యాయ జీవితంలో సాధ్యమైనంతవరకు ఆ పని చేశాను దీనికి నా శిష్యరాండ్రు తగిన సాక్ష్యం ఇచ్చేవారున్నారు

'గాలికి పుట్టి ధూళికి పెరగడం' అనే సామెత గొప్పదనాన్ని వివరిస్తాను చూడండి దానిని అంత తేలికగా తోసివేయరాదు.

అంజనాదేవి కీకారణ్యములో కఠిన నియమాలతో తపస్సు చేస్తూంది ఆమె అదృష్టమే అనాలి వాయుదేవుడు నిత్యమూ తీయని పళ్ళూ నీళ్ళూ తెచ్చి ఆమె ముందుంచి వెళ్లిపోతూ ఉండేవాడు ధ్యానంలోంచి ఆమె బాహ్యజగత్తుకి వచ్చి కళ్ళు తెరిచి చూడగా ఆరపండి నవనవలాడుతూన్న పళ్ళు, ముత్యాల్లాగా మిల మిల మెరుస్తూన్న మంచినీళ్లు ముందు కనిపించేవి ఎలా వస్తున్నాయి ఇవి రోజూ సామాన్యంగా తీసుకునేది కాదు

ఒకనాడు పళ్ళు ఆరగించి నీళ్ళు త్రాగింది గర్భవతి అయింది కాలక్రమాన పనసపండు




లాంటి కొడుకు పుట్టాడు వాయు ప్రసాదం వల్ల పుట్టాడని వాయువే చెప్పాడు చెప్పకపోతే ఆ తల్లి బ్రతుకు నట్టేటి నావ అయిపోయేది

'కొడుకు పుట్టాలని కోరి తపస్సు చేస్తానని అడవికి వెళ్లావు నీకి కొడుకెలా వచ్చాడే?' అని భర్త అడగవచ్చు అడగవచ్చేమిటి, అడుగుతాడు అనుమానిస్తాడు భరించలేక కొత్త చీపురుకట్టతో వీపు శుద్ధిచేసి గడప దాటేదాకా మెడపట్టి గెంటుతాడు లోకంకూడా కాకై కూస్తుంది

కానీ అసలుకథ ఏమిటంటే తపస్విని, మనస్విని అయిన అంజనాదేవికి పుట్టిన ఆ కొడుకు ఏక పాదరుద్రుని అంశ పుట్టడానికి మూలం ప్రభంజనుడు ఆ మహాత్ముడే ఆంజనేయుడు కన్నతండ్రి పేరుకన్నా కన్నతల్లి పేరే ఆంజనేయ పదంగా రూఢమయింది

'అంజనానందనం వీరం'

'ఆంజనేయ మతి పాటలాననం'

ఇలా గాలికి పుట్టాడు ఆంజనేయుడు మరి, పెరగడం? ఆ అడవిలోనే ఆశ్రమంలో చెట్టుకింద, లేదా చెట్టుకి కట్టిన ఉయ్యాలలో ఏమనాలి? ధూళికి పెరగడమేగా ఇది! ఈలాగు పెరిగినవాడే సురాసురులకు తేరిచూడరాని లంకను ధూళిచేసి దుమ్మురేగకొట్టాడు మన వాళ్లు తేలికగా అనేస్తారు

'గాలికి పుట్టి ధూళికి పెరుగుతున్నారు'— అని ఇది సందర్భ శుద్ధికి సమన్వయ పద్ధతికి విరుద్ధంగా ఉందని ఎవరేనా యీ రాత చెరపడానికి ప్రయత్నించవచ్చు అలాటివారికి 'నమోవాకం ప్రశాస్మహే' —

పోనీయండి ఆంజనేయులవారి పుట్టడం, పెరగడం యీలా ఉంచి ఈయనగారి తమ్ముడి పుట్టుపూ పెరగడం చూడండి కుంతీమహాదేవి కూరిమి బిడ్డడు భీమన్న భీమన్న గాలికిపుట్టి కొండలలో, కోనలలో ధూళికి పెరిగినవాడని



# సామెతల తోరణం

నాతోపాటు మీరూ ఒప్పుకోవలసిందే ఆ పక్షంలో కుంతీమహాదేవి సౌశీల్యానికి ఏమేనా కళంకం వచ్చిందా ? లేదు భీమన్న వెర్రివెంగళాయిగా అనామకుడుగా బ్రతికి వెళ్లిపోయినవాడా ? ఎవ్వరూ అలా అనడానికి సాహసించలేరు అనడానికేంపోయింది కొనితేవాలా ? అప్పుపుచ్చుకోవాలా ? నరంలేని నాలుక ఎటు తిరగాలంటే అటు తిరుగుతుంది ఏమనాలంటే అది చప్పన అనేస్తుంది

ఇలాటిదే 'సుడి ఒకచోట — చురక ఒక చోట' అనే సామెత దీనితో పరంపరగా వస్తూన్న సంప్రదాయం ఉంది. కొందరు శిశువులు పుట్టినప్పుడు తలపైనా నుదుటిపైనా అక్కడక్కడ శరీరంపైనా సుడులతో పుట్టుతారు కుడివైపు తిరిగివున్నవి మంచివనీ, ఎడమవైపు తిరిగి ఉన్నవి చెడ్డవని అంటారు ఇక్కడ ఒక చిన్న విషయం చెప్పాలి. దేవతార్చన చేస్తారు కొందరి యిళ్లలో ఆ దేవతార్చనకి చిన్న శంఖం ఒకటి ప్రధాన సాధనం అది కుడివైపు తిరిగినదై ఉండాలి 'దక్షిణావర్తం' అని దానికి పేరు కొన్ని శంఖాలు ఎడమకు తిరిగినవి ఉంటాయి వాటికి 'వామావర్తములు' అని పేరు అవి దేవతార్చనకి పనికిరావు అలాగే శరీరముపై ఎక్కడ ఉన్న సుడి అయినా కుడి వైపు తిరిగినదయితే మంచిది కొందరికి తలపై రెండు సుడులుంటాయి అలా వున్న మగపిల్లలయితే గడుగ్గాయిలవుతారట ! ఆడబిడ్డ లయితే మాట చమత్కారం కలవారౌతారట

ఏ పాపకో ఎడమకు తిరిగిన సుడి ఉండి ఉంటుంది దానిని కనిపించకుండా చేదామని తల్లిదండ్రులనుకుని శాస్త్రజ్ఞుణ్ణి అడిగి ఉంటారు ఆ 'ప్రబుద్ధుడు' ఆ సుడిమీద చురక (ఇనుపముక్క ఎర్రగా కాల్చి వాత వెయ్యడం) వేయించండి అని అన్నాడేమో ఆ తల్లిదండ్రులు పనిమనిషికి చెప్పి వాత వేయించి ఉంటారు అది కుంభకర్ణుడి చెల్లెలై ఉంటుంది ఎర్రగా మేకో ఏదో కాల్చి సుడి ఒకచోట ఉండగా దాని ప్రక్కనే వేసింది చురక సుడి అలాగే ఉండగా చురకవల్ల ప్రక్కనున్న చర్మం కాలి పుండై అది మానడానికి మందూ మాకూ వేసుకోవలసివచ్చింది. సుడి పోలేదు సరికదా ప్రక్కనే అసహ్యంగా ఒక కాలిన మచ్చ కూడా వచ్చింది ఇక అడగాలా సాగను ? సాగను మాట దేవుడెరుగును. లేని మచ్చ కూడా వచ్చిందే తెలివితక్కువవారి పనులూ వాటివల్ల వచ్చే కీడూ ఇలా ఉంటాయి విచారణచేసే అధికారి తప్పు సాక్ష్యాలు నమ్మి దోషికి బదులుగా నిర్దోషిని శిక్షిస్తే యీ సామెత వాడుతారు. 'సుడి ఒకచోట—చురక ఒకచోట' అని దీనికి దగ్గరి చుట్టం 'అడివిపంది చేను మేస్తే ఊరపందికి చెవులు కోశారట' — అనేది. చేను మేసినది అడవిపంది దానిని శిక్షించలేక ఊర్లో అమాయికంగా తిరుగుతూన్న పందికి చెవులు కోశాడట ఎవడో 'యంత్రబ్రహ్మ'— (మూర్ఖుడు)

ఈలాటి విడ్డూరాలు ఎప్పుడో కొన్ని జరిగే ఉంటాయి లేకపోతే యిలాటి సామెతలు పుట్టవు పై సామెతను వివరిస్తూంటే శంఖం ప్రస్తావన వచ్చింది ఆ శంఖానికి సంబంధించి చక్కని సామెత ఉంది

'శంఖంలో పోసిన తీర్థం'— అని

ఏటినీరైనా కోనేటినీరైనా నూతినీరైనా స్నానానికీ వంటకీ త్రాగడానికీ బట్టలుతకడానికి యింకా యింకా పనికివస్తుంది ఆ నీరే దేవతా ప్రతిమకి అభిషేకం చేసి శంఖములో పోస్తే పాపాలను పోగొట్టేదై 'తీర్థం' అనే దివ్యనామం పొందేదవుతుంది మంత్రపూతమై దేవతార్చనకి ఉపయోగించే జలానికి అంత గొప్పదనం వచ్చిందన్నమాట ఈ మాట దేవుడు వున్నాడనే ఆస్తికుల నుద్దేశించి దేవుడైనా, గురువునైనా అనే నాస్తికుల నుద్దేశించి కాదనుమండీ బొడ్డుకి తువ్వా—

అలాగే లోకవ్యవహారంలో ఏదైనా ఒక పని చేసినప్పుడో ఏ ధర్మసందేహమైనా వచ్చినప్పుడో దానికి సంబంధించిన నలుగురూ ఒక నిర్ణయానికి వచ్చి అయినా కామశాస్త్రులు గారిని అడిగి చూదాము— అని ఆయనని అడుగుతారు. 'నేను చెప్పేదేముంది ? మీ నిర్ణయం బాగానే ఉంది కానీయండి'— అని అంటాడాయన! అప్పుడెవరో ఒకరు 'అలా కాదయ్యా ! నువ్వు అన్నీ తెలిసిన పెద్దనాడవు నువ్వు చెప్పావంటే 'శంఖంలో పోసిన తీర్థం అవుతుంది'— అని అంటారు దేనికైనా స్థానాన్నిబట్టి చులకనా, లేక గొప్పతనం వస్తాయని యీ సామెత అంతర్యం

ఇలాగే 'నవ్వు నాలుగు విధాల చేటు'— అనే దానిలో నీతిబోధకమైన భారత కధ ఉంది

ఈ సామెతలు ఉపన్యాసాల్లోనూ వ్యాసాల్లోనూ మంచి పుష్టిని కలిగిస్తాయి తెలిసి టంకసాడి అతుక్కున్నట్టు వీటిని ఉపయోగించాలి కాస్త బుద్ధికి పని చెప్పాలి. లేకపోతే 'తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం' అయిపోతాయి



## సరస చిత్ర కల్పనము




### స్కూలు ఫైనలులో గడతేరిన విద్యార్థులు

విద్యార్థులు — భారత జనని ! మేమేమి చేయుదుము. మళ్ళు మాన్యములు తాకట్టుపెట్టి చదువుకొనెదమనినను కాలేజీలలో సీట్లు లేవు, పో పొమ్మని తలుపులు బిగించిరి

భారతమాత — నాయనలారా ! మరి యీ పరుగెత్తుట ఎచ్చటకు ?

వి — నీ గర్భమందనేక జీవకోట్లను రక్షించుచున్నావు వ్యవసాయము జేసికొనియైన బ్రతుకవలయునని వెళ్ళుచున్నాము అమ్మా

భా — అహో, ఇప్పటి యేర్పాటులు నా బిడ్డల కీ స్థితికి దీనికొని వచ్చినవిగా !

ఆగస్టునెల థియాసఫిస్టు పత్రికలో శ్రీమతి అనిబెసెంటు అమ్మ ఇట్లు వ్రాసినది — చెన్నరాజధానిలో కళాశాలల వసతి బహుపాడుగా నున్నది విద్యావశ్యకత ప్రస్తుతమున్న వసతికంటె మించి యున్నది కనుక వేలకొలది యౌవనులు తమ భావిక జీవితములు దేనిమీద నాధారపడి యున్నవో ఆ యున్నత విద్యకై ఆసక్తిని గలిగియున్నను, పాఠశాలలో చదువుటకు బదులుగా బజారులలో ద్రిమ్మరులు సంభవించుచున్నది

ఆంధ్రపత్రిక 1913 ఆగస్టు 20 సంచిక నుంచి

# నిజాం రాష్ట్ర ఆంధ్రులు

**ఆంధ్రపత్రిక 1923 డిసెంబరు 26 సంచిక నుంచి**

ఆంధ్రులు చెన్న రాష్ట్రమందలి ఉత్తర జిల్లాలలో మాత్రమే గాక ఉత్కంల నైజాము మైసూరు దేశమునందును గలరు రాజకీయముగా ఈ ప్రాంతము లొక్క పరిపాలన క్రింద లేకపోయినను దేశము మాత్రము ఏక ఖండముగా నుండి ఆంధ్రదేశమని వ్యవహారింప బడుటకు వీలుగానే యున్నది ఆంధ్రుల ప్రత్యేకతయు ఆంధ్రత్వమును ఏకదేశవాసమందు గాక ఆంధ్ర భాషయందును, విజ్ఞానమందును, సంప్రదాయమందును గలదు కావున దైనిక రాజిక కారణములచే వేఋవేఋ ప్రభుత్వముల కిందను, దేశములందును నుండుట తటస్థించినను ఆంధ్రునియొక్క ఆంధ్రత్వమున కెట్టి లోటును రాజాలదు ఆంధ్రులు బర్మాదేశమందుండినను వారాంధ్రులు కాకపోరు ఏకదేశవాసులై కారణాంతరములచే ప్రత్యేక పరిపాలన క్రింద నున్న మైసూరు, నైజాము, చెన్న రాజధానియందలి ఆంధ్రులు పరస్పరము సానుభూతి గలిగి అన్యోన్య సాహచర్యమున మెలగుట కెట్టి యాటంకములు లేవు ఆంధ్రమహాసభగాని, ఆంధ్ర సాహిత్య పరిషత్తుగాని లేక ఆంధ్ర జనాభివృద్ధికి హేతుభూతమైన యే యుద్యమముగాని, సభగాని మైసూరులోగాని, నైజాములోగాని సముద్రతీర ప్రాంతమందుగాని జరుగుట కభ్యంతరము లేదు.

కాని మొట్ట మొదట ఆంధ్రోద్యమము బయలుదేరినప్పుడు చెన్న రాష్ట్రమందలి ఆంధ్రులలో సహితము సంకుచిత భావము లంకురించి కొంతకాలము పరస్పర వైషమ్యములకును, అసహనమునకును కారణమైయుండెను ప్రస్తుతము బ్రాహ్మణేతరోద్యమ మెట్టిస్థితి యందున్నదో ప్రప్రథమమున ఆంధ్రోద్యమమును నట్టి స్థితియందే యుండెను బ్రాహ్మణేతరోద్యమము నిజముగా అసంఖ్యాకులైన బ్రాహ్మణేతరులయొక్క ఉద్ధారణకొర కేర్పడినప్పటికి ప్రస్తుతము అధికార పదవులకై దేవులాడు నాయకుల హస్తగత మగుటచే సంకుచిత భావములతో సన్నగిలుచున్నది కాని ఆంధ్రోద్యమము బయలుదేరినప్పుడు రాజధానియందు చెరిసగము భాగస్తులుగానున్న ఆంధ్రులకు సహితము ఉన్నతోద్యోగములందు సమాసప్రాతినిధ్య ముండవలెనని కోరినను ఉద్యమ నాయకులు మాత్రము ఉద్యోగములకై పెనుగులాడిన స్వార్థపరులు గారు అందువలననే యెన్ని యాటంకములు వచ్చినను జయమొందినది ముఖ్యముగా దత్తమండలముయందలి యాంధ్రులు ఉత్తర సర్కారులందలి యాంధ్రు లుద్యోగవాంఛచే యుద్యమమును బయలుదేరదీసినారని యాశేపించి కొంతకాల ముదాసీనభావము వహించి యుండిరి సత్యము గోచరమైపిదప మహానంది యందు చిత్తూరు నందును ఆంధ్రమహాసభను జరిపి మాతృ ఆశీస్సును బడసినారు. కాంగ్రెసు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును యేర్పరచినపిమ్మట సహితము కొందరు దత్తమండల వాసులు చెన్న పట్టణముతో గలియలెనని ప్రయత్నించిరి దైవ కృపవలనది సఫలముగాక నేడు ఆంధ్రులందరొకటిగానే భావింపబడుచున్నారు

నిజాము రాష్ట్రములో సగిభాగము ఆంధ్రులు బ్రిటిషువారు ఈ దేశమునకు రాక పూర్వము నాగపురము మొదలు మైసూరు వఱకు గల దక్షిణదేశ మంతయు నైజాము క్రిందను నైజాముకు లోబడిన నవాబుల క్రిందను ఉండి యున్నవి అప్పుడు దాదాపుగా ఆంధ్రదేశమంతయు ఒక్క రాజ్యపాలన క్రింద నుండి సర్వవిధముల నేక రాష్ట్రముగా నున్నదని చెప్పవచ్చును పిమ్మట క్రమక్రమముగా నైజాముకు ఇంగ్లీషువారికి జరిగిన యుద్ధములు ఒడంబడికల ననుసరించి ఇప్పుడు చెన్న రాజధానిలో నున్న తెలుగు జిల్లాలు వేరైనవి 1760 సం॥లో ఉత్తర సర్కారులు, 1800లో దత్తమండలములు కర్నాటకము ఇంగ్లీషువారి వశము అయినవి నాటినుండియు చెన్నరాష్ట్రమునందలి తెలుగు జిల్లాలు ఆంగ్లేయ పరిపాలన క్రిందికి వచ్చియున్నవి అంతకు పూర్వము ఆంధ్రదేశమంతయు ఒక రాష్ట్రముగా నుండి యున్నది కాని నైజాముకు పూర్వము ఇప్పటి వలెనె నైజామాంధ్రదేశము భామిని రాజుల క్రిందను ఉత్తర సర్కారులు కళింగరాజుల క్రిందను దత్తమండల ప్రాంతము విజయనగర రాజుల క్రిందను ఉండియుండెను ఆంధ్రదేశము యొక్క చరిత్ర పరిశీలించినచో ఆంధ్రదేశము యిప్పటివలెనే వేరువేరు పరిపాలనకు లోనై యుండెననుట నిజము అంతమాత్రముచే ఆంధ్రుల జాత్యభిమానము కుంటుండి యుండలేదు కవులు గాయకులు భక్తులు అన్ని ప్రాంతములందును జన్మించి అందరిచేత పూజింపబడియున్నారు. భద్రాచల రామదాసు నైజాము ప్రాంతమువాడని కీర్తింపని ఆంధ్రుడెవ్వడును లేడు నన్నయభట్టు రాజమహేంద్రవరము వాడనిగాని, తిక్కన సోమయాజి నెల్లూరువాడనిగాని, అల్లసాని పెద్దన ప్రాంతమువాడని గాని నమస్కృతులిడని యాంధ్రుడెవ్వండునులేడు ఒక్కమాత తనయులమై యామెచే పోషింపబడుచు నామె నామకీర్తనము చేయుచు నామె యంకమున శయనించుచు తాత్కాలికమును కేవలము భౌతికమునైన విభేదములచే మన ఆత్మలు భావములు ఆదర్శములు అనురాగములు భేదింపవలసిన యవసరము లేదు

ఇదంతయు నేల యిప్పుడు వ్రాయవలసి వచ్చినదనిన, నేనీ మధ్య నైజాము ప్రాంతమునకు బోయియుంటిని అచట హైదరాబాదు సికింద్రాబాదు పట్టణములలో ఉత్తర సర్కారుల నుండి వెళ్లి ఉద్యోగములోనున్నవారు చాలమంది గలరు అచటను మన ప్రాంతములందు వలెనే వివిధములైన సభలు, సంఘములు, క్లబ్బులు, అస్సోసియేషనులు మొదలయినవి గలవు వానిలో నైజామాంధ్రులును ఉత్తర సర్కారుల నుండి వెళ్ళిన ఆంధ్రులును కూడ సభ్యులుగా యుండియున్నారు చాల కాలం నుండి అందరును అన్యోన్యానురాగముతోనే మెలగుచు పరస్పర యభివృద్ధి మార్గముల వర్తించుచుండిరి కాని యిటీవల కొన్ని విభేదములను గిలిగినటుల తెలియుచున్నది నైజామాంధ్రులని ఉత్తర సర్కారాంధ్రులని భేదభావము పొడమినటుల వినియుంటిని ఇది మిక్కిలి విచారము గలిగించినది ఇట్టి భేదభావముతో తాత్కాలిక లాభము కనిపించినను నిజమారసినచో దానివల్ల కలుగు నష్టములు మిక్కుటముగా ఉండగలవు సముద్రతీరస్థ జిల్లాలలోని యాంధ్రులు నైజాము ప్రాంతములకు ఏ యుద్యమము గూర్చియైనను ధన సహాయముగాని సానుభూతి గాని నపేక్షించి వెళ్లిన నాదరముతో జూచుచుండిరి ఇప్పటికి నట్టి సహాయము ఈ ప్రాంతములు పొందుచునేయున్నవి కాని యిప్పుడు పొడచూపుతున్న భేదభావము మనములందు ఏ కారణను చేతనయిన దాటుకొనుట తటస్థించినచో సైనిక సాంఘిక వైజ్ఞానిక నష్టములకు పరస్పరములోనగుదుము ధనసహాయముగాని ఉద్యోగములు గాని ప్రధానములుగావు. పరస్పర సానుభూతి అభిమానములు ముఖ్యములు అట్టి అభిమాన వినాశకరములగు కార్యములందు నెవరును జోక్యము గలిగించుకొనగూడదు ఈ ప్రాంతముల నుండి అచటికి వెళ్లినవారు ఐక్యభావము పెంపొందించుట యందు నెక్కువ బాధ్యత వహింపవలసి యుండును

ఈ సందర్భమున నైజామాంధ్రుల కొక మనవి చేయవలసియున్నది. నైజాముదేశము స్వదేశరాజు పరిపాలనక్రిందనున్నను రాజకీయ సాంఘిక విద్యా భాషవిషయములందు చాల కొఱత పడియున్నది

ఆంధ్రభాష నైజాము రాజ్యములో సగ భాగముకంటె నెక్కువమందిచే మాటలాడబడుచున్నను ఉరుదుభాష ఒక్కటియె రాజభాషగ నెంచబడుచున్నది రాజకీయముగ సహితము నైజాములో ప్రజలకెట్టి హక్కులును లేవు ఇటీవల ఆంధ్రోద్యమమును గూర్చి గొంత ప్రయత్నము అచటి నాయకులు కొందఱు చేయ

ఆంధ్రపత్రిక 1920 డిసెంబరు 29

# ఆంధ్ర రాజధాని

[ వై. అప్పారావుగారు ]

తే 10–9–20 ది ఆంధ్రపత్రికలోఁ బ్రచురింపబడిన ఆంధ్ర రాష్ట్రము అను వ్యాసములో ఆంధ్ర రాష్ట్రమునకు బెజవాడ రాజధానిగా నుండవలెనని రూఢిపఱచితిని అందులో "నిజాము రాష్ట్రమందలి ఆంధ్రుల క్షేమము తలఁచునపుడు బెజవాడకన్న మఱి యొకటి ముఖ్యపట్టణము కాఁజాలదని వ్రాసి యుంటిని నిజాముగారి రాజధానియైన హైదరాబాదుపట్టణము ఆంధ్రదేశమధ్యమున నలరారుచున్నదని కొందఱు పాఠకులకుతెలియక పోవచ్చును ■ రాజ్యమునందే పూర్వపు టాంధ్రుల యౌన్నత్యము చాటెన ఓరుగల్లు పట్టణమును నెలకొని యున్నది వరంగల్ మొదలు హైదరాబాదు మధ్యనుండు దేశమున నాంధ్రముతప్ప వేరొండు భాష లేదు హైదరాబాదు పరిసర గ్రామములలోనేగాక హైదరాబాదుకు నూరుమైళ్ళపైగా నుండు ఇందూరను నామాంతరముగల నిజామాబాదు వరకు ఆంధ్రభాషయే వ్యాపించి యున్నది ఇచ్చటినుండియే మహారాష్ట్ర భాష ప్రారంభమగుచున్నది ఈ కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశము మిక్కిలి సారవంతమైనదియు వీర్యవంతమైనదియుగా నున్నది ఇట్టి ప్రదేశమున వసించు ఆంధ్రులు అజ్ఞాన తిమిరంబున మునిఁగియున్నారు వీరు తమ పూర్వపు ఔన్నత్యమును మఱచినారు నిజాము రాష్ట్రమునందు రాజభాష ఉర్దు అయినను దేశభాషలు తెనుఁగు, మహారాష్ట్ర, కన్నడ, భాషలైయున్నవి వీనిలో నాంధ్రమే అన్ని విధముల అగ్రస్థానము వహించి యున్నది నిజాము రాష్ట్రమునందు దేశ భాషలకు బొత్తిగాఁ బ్రోత్సాహము లేని కారణమునను, ఆంగ్ల పాలనా సౌకర్యములు లేనికారణమునను, ప్రజలు అజ్ఞానాంబుధి యందు మునింగియున్నవారు వారి యజ్ఞానమునకుఁ గారణము లెవ్వియైన నగుఁగాక వారు నాగరక దశలో లేరనిమాత్రము అందఱు తొప్పికొనక తప్పదు బ్రిటిషాంధ్ర జిల్లాలో మిక్కిలివెనుకఁబడియున్నదత్తమండలములకన్న వేయిమడుంగులు నిజాము రాష్ట్రము వెనుకఁ బడియున్నది ఇట్లనుటచే బ్రిటిషు పాలనలో నుండువారు నిజాము రాష్ట్రమువారికన్న ధనవంతులని నా మతముకాదు ఇక నాంధ్ర రాజధానికి వత్తము ఆంధ్ర రాష్ట్రములోనే యే భాగములు చేరవలెననుసంగతి గొప్ప విషయమై యున్నది మధ్యపరగణాలలోఁజేరిన సిరోంచాజిల్లాను తెనుఁగుజిల్లా అయియున్నది దానికిని చెన్న రాజధానికిని రాకపోకలకు వసతి లేదు, లేకపోయినను సిరోంచాజిల్లాను మనము వదలకూడదు మైసూరు రాష్ట్రమునందుఁ గూడ నాంధ్రగ్రామములు కొన్నియైన నుండునని వినుచున్నాఁడను, కాని స్వదేశ సంస్థానములలోనుండు నాంధ్ర భాగములను మన యాంధ్ర రాష్ట్రములోఁ జేర్చుకొనుటకు వీలులేకపోయినను, వారి యోగక్షేమముల విచారించుట నాగరకత చెందిన మన విధియై యున్నది విచారించుట యనఁగానేమి ? వారి ప్రభుత్వ విషయములో మనము జోక్యము కలిగించుకొనుటకు వీలులేకపోయినను వారి దేశములో పుస్తక పఠనశాలలు నెలకొల్పవలసి యుండును, పాఠశాలలు స్థాపించవలసి యుండును,పరపతి సంఘములు ఏర్పాటు చేయవలసి యుండును ఉపన్యాసకులు బయలుదేరి తమ యుపన్యాసములచే నిజాము రాష్ట్రమంతయు నాగరక స్థితికి వచ్చునట్లు చేయవలెను పై విషయము అన్నిటికన్న సాంఘిక రాజకీయ మత విషయములలో నిజామువారికి మనము పెక్కు విషయములు నేర్పవలసి యున్నది ఈ పనులన్నియు నెరవేర్చు భారము విద్యాధికులమైన మనమీద నున్నది రాజధాని యెందుండునో అచ్చటనే ఆ దేశ ప్రతిభ పూర్ణముగఁ గాన్పించును విద్యాధికులును ధనికులును అచ్చటనే గుమిగూడుదురు కళలన్నియు నచ్చటనే వృద్ధికి వచ్చును వార్తాపత్రిక లన్నియు నచ్చటనే స్థాపింపఁబడును ఇంతయేల, ఆంధ్ర విజ్ఞానము, ఆంధ్రౌన్నత్యము, ఆంధ్ర రాజధానియందు వికసించును కొండపల్లి దాటగనే నిజాము సంస్థానము ప్రారంభమగుటచే నిజాము రాష్ట్రమందలి యాంధ్రులు అతి సులభముగ బెజవాడ కేతెంచి ఇందలి విశేషంబులు గాంచియైన తామభివృద్ధికి రాఁగోరుదురు బెజవాడకు నిప్పుడే నిజాము రాష్ట్రపువారు పెక్కురు విచ్చేసి బెజవాడ యభివృద్ధియు నందలి నాగరకతయు గాంచిపోవుచున్నారు బెజవాడ యాంధ్ర రాష్ట్రమునకు ముఖ్య పట్టణమగుచో నిజాము రాష్ట్ర ప్రతినిధులు కొలఁది కాలములో నాగరక స్థితికి వచ్చి తమ రాష్ట్రమును కాపాడుకొనఁగలరని నా యభిప్రాయము లోకమాన్యుడుగారు తమ స్వార్థ త్యాగముచేతను, మహాత్మ గాంధిగారు తమ నిష్కామకర్మచేతను, దేశమంతయు ఎట్లు అభివృద్ధికిఁ దెచ్చిరో, అట్లే వెనుకఁబడియున్న నిజాము రాష్ట్రపుటాంధ్రులను ధనవ్యయమునకైనను ఓర్చి,వృద్ధికిఁ దెచ్చుట మన విధియై యున్నది కనుకనే ఆంధ్రదేశమునకు ముఖ్య పట్టణము పై విధానమునకు అనుకూలమైన చోట నుండవలెనని నేను వాదించుట ముఖ్య పట్టణము బెజవాడతప్ప వేఱొకటి కాజాలదని వాదించుటకుఁగల కారణములలో నిదియే ముఖ్యమైనది ఈ విషయమును గురించి నిజాము రాష్ట్రమును బూర్ణముగ గుర్తెఱిగిన శ్రీయుత కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు గారు తమ యభిప్రాయమును వెలిబుచ్చ నర్హులు వారు తమ యభిప్రాయమును దెల్పి ఈ సమస్యకు సహాయ కారు లగుదురని కోరుచున్నాను

## నిజాం రాష్ట్రాంధ్రులు

గూఢచారులు వారిని గూర్చి విచారణ సలుప మొదలుపెట్టిరి అభివృద్ధి సూచకమైన ఏ ఉద్యమముబయలుదేరినను దానిని అనుమానముతో ప్రభుత్వమువారు చూచుచుందురు నోరుగాని కలముగాని మెదల్పుటకు వీలులేనితఱి నైజామాంధ్రులభివృద్ధి చెందుట ఎంత దుస్తరమో వేరుగ వ్రాయబనిలేదు కావున నైజాములోని ఆంధ్రుల యొక్క అభివృద్ధి సహితము బ్రిటిషు ఇండియాలోని యాంధ్రులే చూడవలసియున్నది ఇట్లనుట నైజామాంధ్రు లసమర్థులని భావింపకూడదు ప్రభుత్వము నిరంకుశము, ప్రజలు పేదలు, విద్యా విహీనులు ఇట్టి పరిస్థితులలో సమర్థులైనవారు కొంతమంది యుండినను వారికి ఆటంకములు మెండుగానున్నవి కావున ఈ ప్రాంతమందలి పత్రికలు మొదలైనవి నైజామాంధ్రుల సర్వతో ముఖమైన యభివృద్ధికి పాటుపడవలసియున్నది

ఇవ్విధమున ఆంధ్రులే ప్రాంతమందుండినను పరస్పరము సహాయము చేసికొనవలసియున్నది ప్రపంచములో ఏ మానవుడుగాని, జాతిగాని ఒంటరిగా జీవింపజాలడు కావున యేక భాషచేతను, విజ్ఞానముచేతను, సాంప్రదాయముచేతను, సంబంధ బాంధవ్యముచేతను, బంధింపబడిన మనము అనగత్యమును అస్వాభావికమునైన భేదముల నేలకొల్పించుకొనవలెను ? ఆంధ్రుల యభివృద్ధికి బయలుదేరిన ప్రతి జాతీయోద్యమము అందఱిచేతను గౌరవింపబడి పోషింపబడదగి యున్నది నిజాము రాష్ట్రములోని యాంధ్రులు ఏ ప్రాంతీయులైనను సోదర భావమున మెలగి ఆంధ్ర మాతృసేవజేసి ధన్యులయ్యెదరుగాక యని కోరుచున్నాను

—ఒక ఆంధ్రుడు.

# ఆంధ్రపత్రిక సంపాదకులు



**ఆంధ్రపత్రిక అధిపతి, సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్‌గారు ఈ నెల 8వ తేదీ గురువారం రాత్రి 8.15 గంటలకు శివసాయుజ్యం చెందారని తెలుపుటకు మిక్కిలి విచారిస్తున్నాము.** ——————

**దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి అనంతరం 1938లో ఆంధ్రపత్రిక అధిపత్యాన్ని చేపట్టి; సంపాదకులుగా, వారి ఒరవడిలో 34 సంవత్సరాలుగా ఆంధ్రపత్రికను; ఆంధ్ర సచిత్ర వారపత్రికను; సాహిత్య మాసపత్రిక భారతిని, అవిచ్ఛిన్నంగా దిగ్విజయంగా నిర్వహించిన మహామహులు శ్రీ శంభుప్రసాద్‌గారు ఇక లేరు.**

శ్రీ శంభుప్రసాద్‌గారు ఇప్పటికి నెల రోజులుగా అస్వస్థులుగా వుంటూ ఈ మధ్య తేరుకుంటున్నట్టే కన్పించారు అనుకోకుండా అకస్మాత్తుగా మృత్యువు ముంచుకు వచ్చింది శ్రీ శంభుప్రసాద్‌గారు శివసాయుజ్యం చెందారన్న వార్త అందరికీ అశనిపాతమైంది

శ్రీ శంభుప్రసాద్‌గారు 1911 లో ఎలకుర్రు గ్రామంలో జన్మించారు 1923–27 బందరు జాతీయ కళాశాలలోనూ తరువాత అడయారు థియసాఫికల్ హైస్కూలులోనూ విద్యాభ్యాసం చేశారు ఆ తరువాత 1930–32లో శాంతినికేతనంలో పట్టభద్రులైనారు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రిక అధిపతిగా వుండగానే, శ్రీ శంభుప్రసాద్ ఆ సంస్థలో చేరి కొంతకాలం ఆంధ్ర సచిత్ర వారపత్రికను నిర్వహించారు వారు ఆ రోజులలో పడకకుర్చీ భావాల శీర్షిక క్రింద వ్రాసిన వ్యంగ్య వ్యాసాలు బహుజన ప్రశంసా పాత్రములైనవి

శ్రీ శంభుప్రసాద్ కొంతకాలంపాటు రాజ్యసభ సభ్యులుగా ఉన్నారు ప్రస్తుతం ఆంధ్ర శాసనమండలి సభ్యులు ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా సంస్థ డైరెక్టర్‌గాకూడా ఉన్నారు.

శ్రీ శంభుప్రసాద్‌గారు దేశోద్ధారక శ్రీ నాగేశ్వరరావు పంతులుగారికి మేనల్లుడు, అల్లుడు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి కుమార్తె శ్రీమతి కామాక్షమ్మగారికి శ్రీ శంభుప్రసాద్‌గారికి 1929లో విజయవాడలో వివాహం జరిగింది శ్రీ శంభుప్రసాద్‌గారికి ఇద్దరు కుమారులు చి రాధాకృష్ణ, చి నాగేశ్వరరావు, ముగ్గురు కుమార్తెలు చి సౌ లీల, చి సౌ నాగేశ్వరమ్మ, కుమారి రామాయమ్మ ఉన్నారు

చిన్నప్పటినుంచి పత్రికా వ్యాసంగంమీద

**ఆంధ్రసచిత్ర వారపత్రిక 1976 జూన్ 23 సంచిక నుంచి**

# శ్రీ శంభుప్రసాద్ అస్తమయం

వారికున్న అభిరుచి, ఆంధ్రసాహిత్యం అంటే వారికున్న అభిమానంవల్ల, ఈ పత్రికల సంపాదకత్వాన్ని చేపట్టడానికి వారు ఏ మాత్రం వెనుకాడలేదు అన్నింటికన్నా శ్రీ దేశోద్ధారక,కళాప్రపూర్ణ, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారిని యుగపురుషుడుగా ఎంచి, వారియందున్న భక్తిప్రపత్తులతో ఆంధ్రజాతి వికాసానికి నెలకొల్పిన పత్రికలను జయప్రదంగా నిర్వహించడానికి శ్రీ శంభుప్రసాద్ తన జీవితం యావత్తు ధారపోశారంటే అతిశయోక్తికాదు ఏ ఉత్తమ ఆశయాలకోసం ఈ పత్రికలను శ్రీ దేశోద్ధారకులు స్థాపించారో, ఆ ఆశయాల సాఫల్యమే తన జీవిత లక్ష్యమన్నట్లు, అహోరాత్రాలు కృషిచేసి, ఆ కృషి చాలా మటుకు సఫలం చేసుకోగలిగిన ధన్యజీవి శ్రీ శంభుప్రసాద్‌గారు.

శ్రీ దేశోద్ధారకులు శివకైవల్యం పొందిన సమయంలో ఆంధ్రపత్రిక నిర్వహణ అంత సులభసాధ్యమైన స్థితిలోలేదు ఎన్నో సమస్యలు, ఇబ్బందులు, కష్టాలు యెదుర్కోవలసి వచ్చింది అయినప్పటికీ చలించక ఆ పిన్న వయస్సులోనే గురుతర కార్యభారం పైన వేసుకుని శ్రీ శంభుప్రసాద్‌గారు ముందుకుసాగారంటే వారిలోగల పట్టుదల, కార్యదీక్ష తప్ప మరేమీకాదు విశేషించి ఈ సంస్థ నిర్వహణలో తనొక మహాపురుషునికి వారసుడినన్న గర్వభావం వారిని అనుక్షణం ఉత్తేజపరిచింది అందువల్లనే అచిరకాలంలో ఆ కష్టాలన్నీ గడిచి, ఆంధ్రపత్రిక, సచిత్ర వారపత్రిక, భారతులను, ఎటువంటి ఒడుదుడుకులు లేకుండా ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలోకూడా అనేక చిక్కులు దాపురించినా సాఫీగా నడుపగలిగారు

ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడాలని అప్పుడు ఆంధ్రపత్రికను, ఆంధ్రదేశానికి కేంద్రస్థానమైన విజయవాడనుంచి ప్రచురించాలని శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి ఆశయాలలో ఒకటి ఆంధ్రపత్రికను 1965లో విజయవాడకు మార్చి ఆ ఆశయాన్నికూడా శ్రీ శంభుప్రసాద్‌గారు సఫలం చేశారు అయితే ఆంధ్రప్రదేశ్‌కు రాజధానియైన హైదరాబాద్ నుంచి, ఆంధ్రపత్రిక ఎడిషన్ ప్రచురించాలని, తెలంగాణా ప్రజలకు ఆంధ్రపత్రిక తేలికగా అందుబాటులో ఉండేటట్లు చేయాలని శ్రీ శంభుప్రసాద్‌గారు సంకల్పించి, అందుకు కావలసిన ప్రయత్నాలన్నీ దాదాపు పూర్తిచేశారు ఆ సంకల్పం నెరవేరి ఇక కొద్ది కాలంలో హైదరాబాద్‌లోకూడా ఆంధ్రపత్రిక వెలువడనున్న సమయంలో కళ్ళారా ఆ సంకల్పసిద్ధిని చూడకుండా శ్రీ శంభుప్రసాద్‌గారు శివసాయుజ్యం పొందడం దురదృష్టం

సంస్థ ఆధిపత్యాన్ని ఎంతటి కట్టుదిట్టంగా సమర్థంగా నిర్వహించారో, పత్రికా సంపాదకత్వాన్నికూడా, అంతటి ప్రతిభా సమన్వితంగా వారు నిర్వహించారని వేరే చెప్పనవసరంలేదు దేశ స్వాతంత్ర్యోద్యమంతో ఆంధ్రపత్రిక మమైకమై, ఆ స్వాతంత్ర్య సమరాన్ని నిర్వహించిన కాంగ్రెస్‌పార్టీ పత్రికగానే ప్రసిద్ధికెక్కింది అయితే దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం ఆంధ్రపత్రిక, ఒక పార్టీ పత్రికగా నడపవలసిన అవసరంలేదని, ఉన్నత ప్రమాణాలు నిలుపుకుంటూ స్వతంత్ర దృక్పథంతో మంచిచెడులను అవి కాంగ్రెస్ పార్టీవైనా మరెవరివైనా నిష్పాక్షికంగా నిష్కర్షగా విమర్శించగల పత్రికగా సాగాలని నిర్ణయించిన ధీశాలి ఈ వరవడిలోనే ఆంధ్రపత్రిక నడుస్తున్నదని వేరే చెప్పనవసరం లేదు

సంపాదకులు శ్రీ శంభుప్రసాద్‌గారు ఇటీవలి కాలంవరకు అంటే అస్వస్థులుగానంతవరకు, వ్రాసిన సంపాదకీయాలు భావనాపటిమ గలిగి, ఆలోచనలు రేకెత్తించేవిగా ఉన్నవనడం స్వోత్కర్షగాదు, ఏ విషయాన్నైనా నిష్కర్షగా, సూటిగా చెప్పడం వారి స్వభావం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 'తెలుగు వెలుగులు' శీర్షిక క్రింద వారు పుంఖానుపుంఖంగా వ్రాసిన వ్యాసాలలోకూడా ఇది స్పష్టంగా కన్పిస్తుంది

ఒక్కొక్కప్పుడు వారి పలుకు వజ్రకాఠిన్యంగా ఉన్నా వారి మనస్సు మాత్రం నవనీతసదృశం ఎంత గంభీరులో అంతటి సరసులు, ప్రశాంత స్వభావులు

సర్వ సమర్థులైన అధిపతి, ప్రజ్ఞాశాలియైన సంపాదకులు శ్రీ శంభుప్రసాద్‌గారి ఆకస్మిక అస్తమయం ఆంధ్రపత్రికా లోకానికి తీరని లోటు

8వ తేదీ రాత్రి నర్సింగ్‌హోంలోంచి శ్రీ శంభుప్రసాద్‌గారి భవుతిక దేహాన్ని మైలాపూరులోని వారి స్వగృహానికి చేర్చారు అప్పటి నుంచి బంధుమిత్రులు, అభిమానులు, నగర ప్రముఖులు అసంఖ్యాకంగా వచ్చి భవుతికదేహం పైన పుష్పమాలలు ఉంచి తమ శ్రద్ధాంజలి సమర్పించారు ఆంధ్రపత్రిక, అమృతాంజనం ఉద్యోగులు ఈ వార్త వినగానే శ్రీ శంభుప్రసాద్‌గారి గృహానికి వెళ్ళి అంతిమ దర్శనం చేసుకుని శ్రద్ధాంజలి ఘటించారు

శ్రీ శంభుప్రసాద్‌గారి భవుతిక కాయానికి 9వ తేదీ ఉదయం మదరాసులోని మైలాపూర్ శ్మశాన వాటికలో వేదోక్తంగా దహన సంస్కారాలు జరిగాయి

శ్మశానవాటికలో శ్రీ శంభుప్రసాద్‌గారి జ్యేష్ఠపుత్రుడు శ్రీ ఎస్ రాధాకృష్ణ, ద్వితీయ పుత్రుడు శ్రీ నాగేశ్వరరావు వేదోక్తంగా నిర్వహించవలసిన కర్మకాండ పూర్తిచేసినతర్వాత శ్రీ రాధాకృష్ణ చితికి నిప్పు అంటించారు

శ్రీ శంభుప్రసాద్‌గారికి శ్రద్ధాంజలి ఘటించడానికి వచ్చినవారిలో ఆంధ్రపత్రిక జనరల్ మేనేజరు శ్రీ కుంచితపాదం, అమృతాంజనం డైరెక్టరు శ్రీ రామారావు, పార్లమెంటు సభ్యుడు శ్రీ కృష్ణస్వామి, శ్రీయుతులు ■ పి సోమయాజులు, ■ నాగిరెడ్డి, చక్రపాణి, పి పుల్లయ్య, మాదవపెద్ది గోఖలే, ఎం ఎ. రమణ, డాక్టర్ గాలి బాలసుందరరావు, ఎన్ రామస్వామి, తెన్నగం వేణుగోపాల్, నారాయణన్, వరదప్పచెట్టి, రామారావు (చందమామ), రామలింగం (బాంక్ ఆఫ్ బరోడా), సి ఎస్ శాస్త్రి ఉన్నారు

శ్రీయుతులు కె సంతానం (స్వరాజ్య సంపాదకుడు) సదాశివన్ (కల్కిసంపాదకుడు), వైద్యనాథన్, డి రామలింగం (ఫిలిం సెన్సార్ బోర్డు), కె సి పి డైరెక్టరు రాఘవరావు, విజయా పిక్చర్స్ మేనేజింగ్ పార్ట్‌నర్, శ్రీ పూర్ణచంద్రరావు, ఆర్ కె స్వామి (హిందుస్థాన్ థాంప్సన్), ప్రెసిడెన్సీ కళాశాల ప్రొఫెసర్ రామచంద్రన్, బి ఎస్ ఆర్ కృష్ణ (య ఎన్ ■ ఎస్), చరియన్, రామసామి అయ్యర్ (బాంక్‌ఆఫ్ బరోడా)గార్లు శ్రద్ధాంజలి సమర్పించినవారిలో ఉన్నారు.

యు ఎస్ ఎస్ ఆర్ సమాచారశాఖ అధిపతి శ్రీ ■ ఎస్ కొవల్‌యోవ్ శ్రీ శంభుప్రసాద్‌గారి భవుతికకాయంపై పుష్పగుచ్ఛాన్ని ఉంచి తమ శ్రద్ధాంజలి సమర్పించారు

ఆంధ్రప్రదేశ్ గవర్నరు, సభాపతి, ముఖ్యమంత్రి, మంత్రులు, శాసనసభ్యులు అనేక మంది అధికార అనధికార ప్రముఖులు శ్రీ శంభుప్రసాద్‌గారు అనుభవజ్ఞులైన సమర్థులైన పత్రికా రచయితలని సహృదయులు శాంత స్వభావులు అని, ఆంధ్రదేశానికి ఆయన చేసిన సేవ నిరుపమానమైనదని, కళాభిమాని, సాహిత్య ప్రియులు అయిన వారి మృతి పత్రికా ప్రపంచానికి తీరనిలోటు అని పేర్కొంటూ తమ సంతాపాన్ని వెల్లడిస్తూ, సానుభూతి సందేశాలని పంపారు






# దక్షిణ మధ్య రైల్వే

# రైలు ప్రయాణీకులకు ముఖ్యగమనిక

## మీకు తెలుసా ?

ఒక వ్యక్తి పేరుమీద రిజర్వేషన్ చేయబడిన టిక్కెట్టుతో మరొక వ్యక్తి ప్రయాణం చేయడం భారత రైల్వేల చట్టరీత్యా నేరం. అలాంటి మార్పిడి రిజర్వేషన్‌లతో ప్రయాణంచేసే ప్రయాణీకులకు మూడు సంవత్సరముల వరకు కారాగారశిక్ష లేక రు. 1000/–ల దాకా జరిమానా లేక రెండున్నూ విధించబడతాయి.

ఇదేకాకుండా, ఆవిధంగా కొన్నటిక్కట్టు జప్తుచేయబడి దానికై చెల్లించిన రైలుఛార్జీ నష్టపోవడం జరుగుతుంది. పైపెచ్చు ఆ వ్యక్తిని టిక్కట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న వ్యక్తిగా పరిగణించి తిరిగి ప్రయాణపు ఛార్జీయేగాక అపరాధ రుసుముకూడా ఆ వ్యక్తినుండి వసూలు చేయబడుతుంది.

"రైలు ప్రయాణాలలో మరొకరి పేరు ఉపయోగించడం కన్నా మీ స్వంత రిజర్వేషన్ పైనే ప్రయాణం చేయడం చౌక"

అనధికార వ్యక్తులనుండి టిక్కెట్లు కొనవద్దు. రిజర్వేషన్ చేసుకొనేటప్పుడు రిజర్వేషన్ ఫారాలపై మీకు సంబంధించిన వివరాలను పూర్తిగా, స్పష్టంగా వ్రాయండి.

తమ సౌకర్యంకోసం ప్రయాణీకులు వీలైనంత ముందుగా టిక్కెట్లు కొనుక్కొని చివరిక్షణాలలో పొడుగాటి క్యూలలో విలబడవలసిన అసౌకర్యానికి లోనుకాకుండా ఉండవలసినదిగా కోరుతున్నాము.

"మీకు సహాయం చేయడానికి మాకు తోడ్పడండి."

దక్షిణ మధ్య రైల్వే

చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటుచే జారీ

Pub 173/83-84




ఏ భాషలోనయినా సరే, కథకు ఉన్నంత ప్రాధాన్యం మరొక ప్రక్రియకు ఉన్నట్లు కానరాదు పసిపిల్లలు మొదలుకొని పండు ముదుసళ్లవరకూ అందరూ కథలంటే చెవికోసుకొంటారు సంసారంతో కొట్టుమిట్టాడుతున్న జనం సంగతి అటుంచండి లౌకిక బంధాలను తెంచుకొని అడవుల్లో ముక్కుమూసుకుని తపస్సు చేసే మహా మునులు కూడా యోగ సమాధి నిష్ఠ ముగిసిన తర్వాత కథలు వినడానికి ఆసక్తి చూపుతారు. నైమిశారణ్యంలో శౌనకాదులు సూత మహర్షివల్ల కథలు వింటూ ఉండడమే దీనికి ఉదాహరణ మన పురాణాల్లో చాలా భాగం కథలతోనే నిండి వుంటుందని వాటిని చదివిన వారికి అందరికీ తెలుసు

ఈ కథలు పురాణ కాలంలోనే ప్రారంభం కాలేదు వేదకాలం నుంచీ ఉన్నవే! వేదకాలంలో సూచనా ఉండిన కథలు ఉపనిషత్తులలో విస్తృతిని పొందాయి.

ఏ విషయాన్నయినా కథల మూలంగా బోధించడం సులభమని గ్రహించి, యీ శతాబ్ది ప్రారంభదశలో స్కూళ్ల ఇనస్పెక్టరుగా వుండిన ఎ యేట్సు దొరగారు ప్రాథమిక పాఠశాలలకు తనిఖీకి వచ్చినప్పుడు— మట్టితో మోడల్సు తయారుచేసి, ఏ విషయాన్నయినా సులభంగా బోధించవచ్చుననీ, కథల మూలంగా బోధిస్తే కష్టమైన లెక్కలు కూడా సులభంగా తెలుస్తాయనీ చెప్పి, ఆ పద్ధతులను అమలులో పెట్టించేవారు. ఈ విషయాన్ని పాటలు కట్టి మా స్కూలు హెడ్మాస్టరుగారు—

"మాయేట్సు దొరగారూ మహిమగలవారూ
మట్టిమాదిరి పనులు పెట్టించినారూ
కథపైన గణితము గరపమన్నారూ"

అని పాడుతూ ఉండేవారు నిజమే! కథల మూలంగా ఏ విషయాన్నయినా సులభంగా బోధించవచ్చు ఇతరమైన వేదాంత విషయాలను సులభంగా ప్రజలకు బోధించడానికే ఉపనిషత్తులలో కథలు ప్రవేశపెట్టబడ్డాయి పంచతంత్ర కథలు, హితోపదేశ కథలు ఇలాటివే!

వైదిక యుగం నుంచీ వస్తున్న కథ గుణాఢ్యుని కాలంనాటికి త్రివిక్రమ రూపం ధరించింది అతడు పైశాచీ ప్రాకృతంలో వ్రాసిన బృహత్కథ మనకు లభించకపోయినా, దానిని అనుసరించి వ్రాయబడ్డ బృహత్కథా మంజరి, కథాసరిత్సాగరం వంటివి మనకు లభించాయి బౌద్ధమతానికి చెందిన జాతకకథలు కూడా ఈ కోవకు చెందినవే! తెలుగులోనికి వచ్చిన కథాసరిత్సాగరం, జాతకకథలు, రెంటాల—వెంకట సుబ్బారావుగారి కథా రత్నావళి, మధిర—సుబ్బన్న దీక్షితులుగారి కాశీమజలీ కథలు తెలుగు వారి ఆదరాభిమానాలను చూరగొన్నాయి

పసిబిడ్డలను సముదాయించడానికీ, మనస్సులోని కలతపాటును దూరం చెయ్యడానికీ కథలు బాగా పనిచేస్తాయి కథలు వింటున్నంతసేపూ వాటిమీదనే మనస్సు లగ్నమయి, మరొక ఆలోచనకు చోటు ఇవ్వదు పసిపాపలకు పాటలంటే ఎంత యిష్టమో కథలంటే కూడా అంత యిష్టం ఏడు చేపల కథ, ముల్లు గుచ్చుకున్న కోతికథ, పేరు మరచిన యీగకథ—ఇలాంటి కథలు వాళ్లకు చెప్పి, వాళ్లచేత చెప్పించడం సాధారణంగా కానవస్తున్నది వాళ్లచేత యీ కథలు చెప్పిస్తే వాళ్ల జ్ఞాపక శక్తిని పెంపొందించినట్లు కూడా అవుతుంది.

కాలాన్ని బట్టి అభిరుచులు మారుతూ ఉంటాయి సినీమాలు రాకపూర్వం నాటకాలే ఎక్కువగా ప్రచారంలో ఉండేవి కాని, యిప్పుడు సినీమాలు వచ్చేక నాటక కళకు ఆదరం తగ్గిపోయింది విధంగానే సంప్రదాయ కవిత్వంపై ఆదరం తగ్గిపోయి, భావకవిత్వం కొంతకాలం ప్రజామోదం పొంది, యిప్పుడు నవ్యకవిత్వానికే ఆదరం కానవస్తున్నది కాని, కథలకు నాడు ఉన్న ఆదరణ నేడు కూడా ఉన్నది అంతేగాదు మునుపటికంటె ఎక్కువ ఆదరణ కానవస్తున్నది మంచి కథలు వస్తున్న వారపత్రికలు దినపత్రికలకంటె కూడా ఎక్కువ ప్రతులు అమ్ముడుపోతున్నవని అందరికీ తెలిసిన విషయమే!

కథలలో ఉన్న ప్రత్యేకత ఏమిటంటే—విన్న కథలనే మళ్లీ విన్నా విసుగుపుట్టదు అది కథలు చెప్పే వారి నేర్పులో ఉన్నది ఎప్పటికప్పుడు అవి కొత్తవిగానే కనిపిస్తాయి పురాణ కథలను కూడా కొత్త పద్ధతిలో చెప్తే అవి ఇంపుగానే ఉంటాయి వెనక ఒకసారి ప్రకటించబడిన కథలే తిరిగి ప్రకటించబడడం, అవి ప్రజామోదాన్ని పొందడం, అలా తిరిగి ప్రకటించడంవల్ల పత్రికల చలామణికి దెబ్బ తగలకపోవడం కానవస్తూ ఉన్నది పురాణాల్లోని పాత కథలే రచనా పద్ధతిలో మార్పు పొంది క్రొత్తవిగా భావించబడి పత్రికలలో రావడం మనం చూస్తున్నాం

విసుగుగా వుండే దూర ప్రయాణంలో కాలక్షేపానికి ఉపయోగించడం మాత్రం కథల ప్రయోజనమని కొందరి అభిప్రాయం కొన్ని కథల్లో కథాంశం ఉండనే వుండదు అయినా, కథకుని సామర్థ్యంవల్ల కథలోని సంభాషణలే విసుగెత్తించకుండా పాఠకుణ్ని చివరిదాకా తీసుకొనిపోతాయి ఇలా వ్రాయగలవాళ్లు చాలా తక్కువగా ఉంటారు

కళ కళ కోసమే అన్నట్లు కథ కథకోసమే అనీ, దానివల్ల మరొక ప్రయోజనం ఉండనక్కర్లేదనీ కొందరు అభిప్రాయపడతారు ఏదో ప్రయోజనం మనస్సులో పెట్టుకొని కథను వ్రాస్తే అందులో స్వాభావికత లోపిస్తుంది కాని, అప్రయత్నంగా కథవల్ల లోకానికి ప్రయోజనం కలిగితే హర్షించదగినదే!

ఇప్పుడు పత్రికల్లో వస్తూవున్న కథల్లో చాలామట్టుకు సామాన్య కుటుంబాల పరిస్థితులను చిత్రించేవే వస్తున్నవి ప్రజామోదమే దానికి కారణం వాటిలో చాలా కథలు మంచివనే చెప్పవచ్చును అలాటి కథలు రచించడానికి పత్రికలవారు రచయితలకు తగిన ప్రోత్సాహం ఇస్తున్నారు పారితోషికాలు ఘనంగా లభిస్తున్నందున ఔత్సాహికులగు రచయితలు ముందుకు వచ్చి చక్కని కథకులుగా తయారవుతున్నారు ఈ ప్రక్రియలో మహిళలదే ముందంజగా ఉంటున్నది

అయితే కొన్ని కథలు విన్నతరవాతగాని, రేడియోలో విన్నతరవాతగాని, ఆ కథ వ్రాసేవారి ముఖ్యోద్దేశం ఏమిటో తెలుసుకోవడం కష్టం! అలా వుండడమే కథ యొక్క ప్రత్యేకత అని కొందరు అనుకోవచ్చు కాని సులభంగా అర్థమయేటట్లు ఉంటేనే కథ రాణిస్తుంది కథకుడు తన కథలో తన ఆశయాన్ని వ్యక్తం చేయవలసి ఉంటుంది

కథకు వేరే ప్రయోజనం ఉండనక్కర్లేదనీ, కథ కథకొరకే అని అనుకున్నప్పుడుకూడా—అది అసభ్య వర్ణనలకు చోటివ్వకుండా ఉండాలి అనీతి ప్రవర్తనకు మార్గదర్శకం కాకుండా ఉండాలి కథ అలా వుంటేనే మరొకసారి చదవాలని బుద్ధి పుడుతుంది

→ "అంగీరస"



# మరువలేను నీ చిరునవ్వు

మరువలేను నీ చిరునవ్వు
మనసును తెల్లగా కరిగించిపోసిన నవ్వు
మమతను జల్లుగా కురిపించిన ఆ నవ్వు
అంత మాత్రాన—
ఆ నవ్వును హిమరమణీయంగా కొలిచి
నంత మాత్రాన—
అదే నాకు పరమావధికాదు.

రక్తాన్ని కన్నీళ్లుగా మార్చుకొని
కన్నీళ్లలో రక్తజ్వాలలు పేర్చుకొని
ఏడవలేక నవ్విన వేడినవ్వు ఒకటుంది
అదీ నా గుండెలో అవిరి పుట్టిస్తుంది.

కృత్రిమ జీవితంతో కుస్తీపట్టే
కొడిగట్టిన దివ్వెకు కొత్త ఊపిరులు ఉట్టే
అతుకుల బతుకు విసిరేసిన అలిపిరి నవ్వు ఒకటుంది
అదీ నా కణతల్లో గదాయుద్ధం చేస్తుంది.

అనుకున్నవన్నీ పోగొట్టుకొన్నా
దిగజారుతున్న విలువలను ఎగగట్టుకొన్నా
పడలిన పెదవులు చిమ్మిన పొడినవ్వు ఒకటుంది
అదీ నా అంతశ్చేతనలో ఎడారిలా కమ్ముకుంటుంది.

ఏ నవ్వు ప్రాణాలను లాగేస్తున్నా
ఈ నవ్వులను విస్మరించలేను.
ఏమనుకున్నా సరే నువ్వు
ఈ నవ్వులను తిరస్కరించలేను.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1972 జూన్ 30 సంచిక నుంచి
శ్రీ శంభుప్రసాద్‌గారి అస్తమయం సందర్భంగా రాసినది

—డా. సి. నారాయణరెడ్డి

# ✵ రూపరేఖ ✵

## మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యము

గౌతమీ సలిలావగాహ పవిత్రత
పలిత నిష్పన్న గోష్పాద శిఖయు!
నిత్యాగ్నిహోత్రత్వ విశిష్ట గరిష్ఠమౌ
భస్మత్రిపుండ్రాంక ఫాలరేఖ!
వేదాదివాఙ్మయ విశ్వవిజ్ఞాన ము
ద్రాక్రాంతదర్శి నేత్రద్వయమ్ము!
ధ్యానానుసంధాన ధర్మసంధ్యోపాస
నా ప్రాణదీప్తమ్ము నాసికమ్ము!
లలిత మధుర భావకలన ప్రచలిత స్వ
రాక్షరశ్రీ యరుణాధరమ్ము!
మకర కుండల కాంతిమండిత శ్రీకార
వర్ణశోభావహ కర్ణయుగము!
కోమల దరహాస గుచ్ఛసచ్ఛాయ రూ
ఢశ్మశ్రుకలిత గండస్థలమ్ము!
పంచాస్య రుద్రాక్షబంధుర మాలికా
కమనీయ నిస్తుల కంఠసీమ!
జపకర్మసాధన సకల వైదిక కర్మ
సాక్ష్యపవీతి వక్షస్థలమ్ము!
కాశివార జరీవికాసంపు శాలువా
యందముల్ నింపెడు నంసతలము!
పంచమవేదమౌ భారతాంధ్రీకృతి
సంగ్రథించిన ప్రవేష్టద్వయమ్ము!
తెల్గు పల్కుల పాలఁదీసిన వెన్నతో
నిండి యడంగిన నిండుబొజ్జ!
రాజరాజనరేంద్ర రత్నకిరీట ప్ర
భాభివందిత దివ్యపాదయుగము!
చామన చాయలో సంవర్తనీయమై
దీపించు సుందర దేహకాంతి!
పరమాత్మ తేజమ్ము బ్రహ్మాండమెల్ల సం
భావించునట్టి బ్రహ్మత్వ మహిమ!
చాళుక్యచోళ రాజన్య బాంధవ్య సం
స్థాపనాచార్య ప్రశస్తశక్తి!
హరిహర బ్రహ్మదేవార్చనాసక్త లీ
లా సుఖానుభవ విలాసగరిమ!
చాముండికా నిత్య సందర్శనోత్సుక
భావప్రపూర్ణ తపః ఫలమ్ము!
సకల పండిత కవి సన్మాన వర్ధిత
భవ్య గుణాధిక ప్రాభవమ్ము!
శ్వేత కీర్తిచ్ఛటా చీనాంబరశ్రేణి
భాసితమూర్తి మత్త్వమ్ముతేవ!

'నన్ని'సౌహార్ద భావ సంపన్నరీతి
గలుగ దిద్దితీర్చిన నాదు కావ్యపటము
నీదు రూపరేఖాంకమై నిత్యమగును
గాక! నన్నయభట్టారకా! నమోస్తు!

(నా 'నన్నయభట్టు' నవల అవతారిక నుండి)

# వారపత్రిక - శ్రీ శంభుప్రసాద్

దినపత్రికలు నడపడంకంటె వారపత్రికను, వారపత్రికను నడపటంకంటె మాసపత్రికను కూర్పడం కష్టమని ఈ పత్రికలని చదివే ఎవరికైనా అనిపిస్తుంది ఎందుచేతనంటే దిన పత్రికలో వార్తలు, మార్కెట్లు, రేడియో, క్రీడారంగం ఇంకా వేస్తే దినఫలాలు, వారఫలాలు యిటువంటివన్నీ ఉండి ఆ పత్రికను తేలిగ్గా ఇయ్యవచ్చుని అనిపిస్తుంది వార్తలలో విదేశీ వార్తలు, దేశవార్తలు, రాష్ట్రవార్తలు యిలా బహురకాలుగా ఉంటాయి. అంతేగాక ఒక్క రోజు, ఏరోజు పత్రిక ఆరోజు చదివేసేస్తే పాఠకుడికి తృప్తి కలుగుతుంది

వారపత్రికల విషయం అలా కాదు వారం రోజులు సరిపడగా ఇదిగో ఇందులో యిది చదివామని మనస్సుకి బాగాపట్టి మళ్లీ మళ్లీ చదవాలనిపించే విధంగా వాటిని నిభాయించు కోవల్సి ఉంటుంది వారపత్రికలలో కూడా అనేక రకాల వ్యాసాలు, కథలు, మొదలైన శీర్షికలు అనేకం ఉంటాయి కానీ యిక్కడ విషయం ఏమిటంటే వారం రోజులపాటు పాఠకులని నిర్భరులని చేసే విధంగా కొత్తకొత్త విషయాలతో పత్రికను యివ్వవలసి ఉంటుంది పత్రికలు చదివే సామాన్యుడికి కూడా కనిపిస్తూనే ఉంటుంది

మాసపత్రికల విషయంలో చూసామంటే వానియొక్క సంఖ్యనిబట్టే వాటిని నిభాయించుకు రావడం కష్టమని అనిపిస్తుంది ఈ మాస పత్రికలలో బాగా బరువైన విషయాలని గురించి వ్యాసాలు పడుతూ ఉంటాయి సామాన్యులకు అవి నిజంగానే బరువుగానే ఉంటాయి

మరి ఒక నెల అంతా విషయం పాఠకుల మనస్సుల్లో ఉంటూఉండి ఆ తర్వాత కూడా వాటియొక్క ప్రాముఖ్యం నిలిచి ఉండే విధంగా ఈ మాసపత్రికని తయారు చెయ్యవలసి ఉంటుంది

ఈ మూడు రకాల పత్రికలని చదివే ఒక సామాన్య పాఠకుడి దృష్టికి ఏమి అనిపిస్తుందో ఆ విషయాలనే ఇక్కడ చెబుతున్నాను

చాలా కాలంగా నాకు పత్రికలు చదవటం అలవాటైపోయింది. ముందు వారపత్రికతోనే పత్రికలు చదవడం ప్రారంభించాను

అప్పటికి నేను ఇంకా చిన్నవాడిని స్కూల్ ఫైనలుగావల్ను చదువుతున్నా ఆ రోజుల్లో ఆంధ్రసచిత్రవారపత్రికలో "వేయి పడగలు" నవల పడుతూ ఉండేది మంచి ఆసక్తిజనకంగా ఆ నవల కోసమే నేను ఆ రోజుల్లో వారపత్రిక కొనేవాడిని. చాలా చోట్ల కొనేవారు కొన్ని చోట్ల పత్రికలకి ఎగబడటం కూడా ఆ రోజుల్లో



నేను చూశాను పత్రిక చదవడం మొదలెడితే తలకట్టు దగ్గర్నించి చివరి పేజీ వరకూ చదవటం నాకు అలవాటు గనక ఎడిటెట్, ప్రింటెడ్ మొదలైనవి కూడా అలవాటైపోయింది

ఆ రోజుల్లో శ్రీ శంభుప్రసాద్‌గారు వార పత్రికకి సంపాదకులని ఆ చదవటంలో తెలుసు కున్నాను ఆ రోజుల్లో వారపత్రికలో ప్రతి బుధవారంనాటి సంపాదకీయం సంపాదకీయంగా వేసేవారు "వేయి పడగలు" నవలకి ఒక శివలింగము, దానిపైన నీడ పట్టేనట్టు వేయి పడగలతో ఒక మహాసర్పం తన ఫణామండలాన్ని విచ్చుకుని గొడుగు పడుతున్నదా? అన్నట్లు ఉండేది నేను నిజంగా అటువంటి శివలింగం దేశంలో ఎక్కడో ఉంది, దాని బొమ్మ సంపాదించి వేశారు అని అనుకుంటూ ఉండేవాడిని కానీ తరువాత ఎవరితోనో మాట్లాడుతుంటే ఈ విషయం వచ్చింది ఆ మాట్లాడుతున్న ఆయన— ఆ బొమ్మ ఒక పువ్వు బొమ్మ, దాన్ని నాగ పుష్పం అంటారు అని చెప్పాడు అప్పుడు అను కున్నాను — పత్రికలలో ఎంతెంత చమత్కారాలు చేస్తారయ్యా అని

నేను యింకొంచెం పెద్దవాడ్ని అయిన తర్వాత లైబ్రరీలలోని పాతపత్రికలన్నీ చదవటం అలవాటు అయి ఇతర పత్రికలు కూడా యిట్లాగే చమత్కారాలు చేస్తాయా అని పరిశీలించాము ఇటువంటివేమీ అక్కడ లేవు అప్పుడు ఆంధ్ర వారపత్రికలోనే ఈ రకమైన చమత్కారం ప్రారంభం చెయ్యబడిందని నాకున్న అప్పటి కాస్త జ్ఞానానికి అనిపించింది

ఆ తర్వాత ఆంధ్రసచిత్రవారపత్రికలోనే చెలియలికట్ట మొదలైన నవలలు కూడా చదివాను ఇట్లా చాలా నవలలు వారపత్రికలో పడ్డాయి ఈ రోజున ఆంధ్ర సాహిత్యంలో ఆ నవలలన్నీ ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకుని ఉన్నాయి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'వడ్లగింజలు', 'ఆత్మబలి' మొదలైన నవలలు కూడా వారపత్రికలోనే చదివాను అప్పుడు నవలలు చదవటం, సంతోషించడమే కానీ, ఆ నవలలు సంపాదించడానికి, ప్రచురించడానికి సంపాదకులు పడే కష్టాలు, అవీ అంతగా తెలియవు తర్వాత తర్వాత కొంతమంది పత్రికా సంపాదకులతో పరిచయభాగ్యం కలగటంచేత ఈ పని అంతా కూడా చాలా కష్టంతో కూడుకున్న విషయమని తెలుస్తూ వచ్చింది

ఇంతకీ చెప్పవచ్చేదేమంటే యిప్పుడు ఆ వారపత్రికకు అప్పుడు సంపాదకత్వం వహించి ఉన్న శ్రీ శంభుప్రసాద్‌గారు శివసాయుజ్యం చెందటం వినగా అప్పటి వారపత్రిక, అన్నీ తలపుకు వచ్చాయి. అవే యిక్కడ రాస్తున్నాను

ఆ రోజుల్లో వారపత్రిక యిప్పటి వార పత్రిక కంటే పొడుగు, వెడల్పు ఎక్కువగా ఉండేది దినపత్రిక అడ్డంగా సగానికి మడిస్తే ఎట్లా ఉంటుందో అంత ఉండేది అట్టమీద పెద్ద బొమ్మ ఉండేది వారానికి ఒక విధమైన బొమ్మ ఒకసారి పెద్ద బాతుల బొమ్మలు వేశారు బొమ్మలో చూస్తే అవి నిజంగా హంసలులాగా ఉన్నాయి ఇన్ని రకాల చమత్కారాలు అది వరకు తెలుగు పత్రికలలో ఎక్కడ ఉండేవి?

ఈ రకమైన చమత్కారాలన్నీ కూడా తెలుగుదేశపు పత్రికా ప్రపంచంలో శ్రీ శంభు ప్రసాద్‌గారే ప్రవేశపెట్టారని నేను యిప్పటికీ అనుకుంటూనే ఉన్నాను వారపత్రిక లోపల కూడా ముచ్చటైన బొమ్మలు వేసేవారు ఆ బొమ్మలు ఎంతో బాగుండేవి. నాకు బాగా నచ్చి యిప్పటికీ జ్ఞాపకం ఉన్న కొన్ని బొమ్మల సంగతి చెబుతాను ప్రతి దేశంలోనూ అనేక రకాల వృత్తులవాళ్ళు ఉంటారు. ఉద్యోగాలు అవీ చేసేవాళ్ళ విషయం కాదు కోతుల్ని ఆడించి, రోడ్డు పక్కన జాతకాలు చెప్పి, గారడీలు ఆడి, యిట్లా అనేకరకాల వృత్తులని అవలంబించి, అకించనులు అలవోకగా జీవితాలని గడిపివేసే సందర్భాలు ఉంటాయి 'బతుకుతెరువుకు మార్గాలు' అని శీర్షిక పెట్టో ఏమో వానిని ఛాయాచిత్రాల వృత్తంగా కొంతకాలం నడిపించారు దేశంలో వైవిధ్యం ఎంతగా ఉంది?

జనం ఏ విధంగా బ్రతుకుపోరాటం సాగిస్తున్నారు అన్న విషయాలు మనం రోజూ చూచేవే అయినా బొమ్మలలో చూసినప్పుడు అదొక విచిత్రమైన వినోదము ఒక విచిత్రమైన సంతోషము కూడా కలుగుతూ ఉండేవి వాస్తవాన్ని చూట్టం మనం మనల్ని చూసుకోడంలాగే ఉంటుంది ఏమీ కొత్తగా ఉండదు దానినే ఏ బొమ్మలోనో, ఛాయాచిత్రంలోనో చూచినట్లయితే అది మనస్సుకు హత్తుకుపోతుంది ఇటువంటి పద్ధతిని కూడా శ్రీ శంభుప్రసాద్‌గారే వారపత్రికలో ప్రవేశపెట్టి తెలుగు దేశం జీవితంయొక్క ఒక విధమైన వైవిధ్యాన్ని ప్రదర్శించడానికి, అకించనుల బ్రతుకుతెరువు పోరాటాలను జనం ముందు ఉంచడానికి ప్రారంభం చేశారా అనిపిస్తుంది

ఇప్పుడు కొంచెం పెద్ద వయస్సు వచ్చిన తర్వాత అప్పుడు ఆ నడిచిన వారపత్రికలు తలుచుకుంటూ ఉంటే ఆ వారపత్రిక శ్రీ శంభుప్రసాద్‌గారి చేతులో భారతతో దీటుగా నడిచిందా అని అనిపిస్తూ ఉంటుంది అప్పుడు నాకు భారతి చదివే అలవాటు లేదు కాలేజీ చదువులకి వెళ్లిన తర్వాతగానీ భారతి చదవటం మొదలుపెట్టలేదు మా కాలేజి లైబ్రరీలో మొట్టమొదటిసారి భారతి చదివాను నాకే విచిత్రం అనిపించింది ఇంతకాలం భారతి అన్నది తెలియకుండా ఎట్లా ఉన్నానా అని సిగ్గేసింది ఇప్పుడు తెలుగుదేశంలో చాలా ప్రసిద్ధమైన కథలు, నాటకాలు, నవలలు కొన్ని భారతిలోనే వచ్చాయి ప్రసిద్ధులైన రచయితలు భారతి ద్వారానేకాక అప్పటి వారపత్రిక ద్వారా కూడా తెలుగు దేశానికి తెలుగు ప్రజకు సుపరిచితులైనారు శ్రీ మాధవపెద్ది గోఖలే కథలు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథలు కొన్ని, ఇంకా మరికొంతమంది అప్పటికి కొత్తవారైన రచయితల కథలు నేను వారపత్రికలోనే చదివాను

ఇట్లా కొత్త తరం రచయితలకు శ్రీ శంభుప్రసాద్‌గారు ప్రోత్సాహం, ఉత్తేజం కలిగించి కొత్త రచనలను పురిగొల్పుతూ ఉండేవారు ఆ తర్వాత ఆ తర్వాత అనుకుంటూ వచ్చాను.

ఒకసారి వారపత్రికలో మీ గ్రామం యొక్క గొప్పతనాన్ని గురించి వ్రాయండి అని ఒక ప్రకటన పడింది కొంచెం రచనలో ఆసక్తి అప్పుడే పెరుగుతూ పెరుగుతూ ఉన్నందువల్ల మా ఊరుని గురించి కూడా రెండో మూడో కాపులు వ్రాసి పంపించాను. అది వారపత్రికలో పడలేదు నాకు చాలా నిరుత్సాహం కలిగింది. ఎందుకు పడలేదు అని ఆ శీర్షికకింద పడ్డ 'మా గ్రామపు గొప్పతనాల' వ్యాసాలను చదివాను ఆ పడినవన్నీ నేను వ్రాసిన దానికంటే బాగున్నాయి. నేను వ్రాసిన తెలుగుకన్నా మంచి తెలుగు గలిగి ఉన్నాయి మనంకూడా ఎందుకు అట్లా వ్రాయగూడదు? అన్న ఉబలాటం ఒకటి నాలో కలిగింది కాంపోజిషన్‌లా వ్రాస్తే పత్రికలలో పడవని కూడా అప్పుడే తెలిసింది ఇది ఒక కొత్త శీర్షికతో జనాన్ని ఆకట్టడానికి చేసిన ఒక పత్రికా నిర్వహణ శిల్పప్రక్రియ అని నేను అప్పుడూ అనుకోలేదు, ఇప్పుడూ అనుకోవటం లేదు పత్రికా నిర్వహణ శిల్పంలో అది భాగం అయితే కావచ్చుకానీ, రచనా వ్యాసంగ లక్షణం లోపల నిద్రాణంగా ఉన్న వారినికూడా పొడిచి రాయించడానికి ప్రోద్బలాన్ని కలిగించిన తీరువల్ల ఆ రకమైన శీర్షికలు గట్టి ప్రయోజనంతో నిర్వహింపబడినయ్యని యిప్పటికీ నాకు అనిపిస్తుంది ఇక్కడ అప్పుడు నాకు కల్గిన మనోభావ విశేషాన్ని గురించి కించిత్తు చెబుతాను

ఆ నా మావూరి వ్యాసం పడకపోవటంవల్ల ఏ నిర్వేదం నాలో అప్పుడు కలిగిందో అది నిజంగా నాలో రచనా ప్రకోపనం కలగటానికి ప్రథమ కారణం అయింది. ఉత్సాహంతో రచనా ప్రకోపనం కలుగుతుందని కొందరంటారు కానీ నిర్వేదంలోంచి పుట్టిన ప్రకోపం ఏ తాహతులో ఆ తాహతుకు స్థిరమై నిలుస్తుందని నా అనుభవం అప్పుడు మా గ్రామాల శీర్షిక కింద వారపత్రికలో వ్యాసాలు రాసినవాళ్లు యిప్పుడు రచయితలుగా ఎక్కడా కనపడటంలేదు వారికి అక్కడికి అక్కడే సంతృప్తి కలిగింది అంతటితో



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# ఉదయాస్తమాన సర్వసేవా దేవాదాయ పథకము

అవును ! శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తుల తమ జీవితపరమావధిగా కలలుగనే ఒక విశిష్ట పథకము యిది మీ జీవితాంతం ప్రతి సంవత్సరం ఈ మహత్తర అవకాశాన్ని మీరు అనుభవించవచ్చుము

తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారిది మహత్తరమైన శక్తి వీరి దర్శనం కోరుతూ, వీరి కృపా కటాక్షములను ఆకాంక్షించే భక్తులు అనేకులు భారతదేశమందేగాక, విదేశాలలోకూడ వున్నారు. యేడాది పొడవునా అశేషంగా భక్తులను ఆకర్షిస్తూ, విశేషంగా కాన్కలను పొందుచున్న భారతదేశంలోగల గొప్ప దేవాలయము ఇది.

## పథకము గురించి :

సంవత్సరంలో మీరు కోరుకునే ఏదో ఒక రోజుకు టి టి డి నిధికి కైంకర్యము చేయండి. ప్రతి సంవత్సరం ఆ రోజున ఆలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రాతఃకాలం నుంచి, రాత్రి ఆలయం మూసేవరకు జరిపే నిత్య పూజా కైంకర్యాలు మీ పేరున జరుపబడుతాయి

## ఈ నిధికి మీరు చెల్లించవలసిన మొత్తం :

మీరు కోరుకొనే ఏరోజుకైనసూ రు. 1,00,000 లు మీరు చెల్లించాలి అయితే శుక్రవారానికిమాత్రం రు 3,00,000చెల్లించాలి. ఈ చెల్లింపుపై 1961, చట్టంలోని సెక్షన్ 80 జి. (2) (బి) క్రింద ఆదాయ పన్ను మినహాయింపు సర్టిఫికేట్‌ను మీకు టి టి డి జారీ చేస్తుంది

## పద్ధతి :

(1) ఏ ఒకరోజుకైనా 1 లక్ష రూపాయలు (శుక్రవారము అయితే రు 3 లక్షలు) మొత్తం చెల్లించండి
(2) ఏ రోజుకు అనేది మీ యిష్టం. మీ పుట్టినరోజు కావచ్చు, వార్షికోత్సవం కావచ్చు, మీరు ముఖ్యమనుకొన్న మరొక రోజు కావచ్చును
(3) ప్రతి సంవత్సరం, ఆ రోజున శ్రీ వేంకటేశ్వర స్వామివారికి జరిగే అన్ని పూజలు, కైంకర్యాలు మీ తరవున నిర్వహించబడతాయి సుప్రభాతం, రోజూ మూడుసార్లు తోమాల, అర్చన, నైవేద్యం మరియు ప్రత్యేక కైంకర్యాలు (అయితే కళ్యాణోత్సవం, ఊంజలి సేవ, బ్రహ్మోత్సవం, సహస్రకలశాభిషేకం, వాహన సేవలు మొదలైనవి మినహాయించబడినవి ) (4) ఆరోజున మీ పేరును ప్రముఖంగా ఆలయంలో ప్రదర్శింపచేయబడుతుంది మీ గోత్ర నామాదులు లేదా మీ కుటుంబం పేరును ప్రకటించడం జరుగుతుంది (5) ఈ పద్ధతి ప్రతి సంవత్సరం కొనసాగుతుంది. పూజాదికాల ఖర్చులు అసాధారణంగా పెరిగిపోతే, మీరు అదనంగా 10 శాతం మొత్తాన్ని స్లాబు పద్ధతిపై చెల్లించడానికి మీకు అవకాశం యివ్వబడుతుంది. ఈ స్లాబులు మీరు వినియోగించుకొనలేకపోతే, ఆ రోజుకు మరొక డోనరును అంగీకరించే హక్కును టి.టి.డి. రిజర్వు చేసుకొని యున్నది

## ప్రత్యేక వసతులు, సదుపాయాలు :

(1) డోనరు మరియు అతని పార్టి (మొత్తం 6 గురు వ్యక్తులు)కి వి ఐ పి వసతి కల్పించబడుతుంది
(2) ప్రకటించిన రోజున డోనరు, అతని పార్టిని స్వామివారి సేవలన్నింటికి అనుమతించడం జరుగుతుంది ఆరోజున జరిగే ఆర్జిత సేవలను కూడా తిలకించేందుకు వారిని అనుమతించడం జరుగుతుంది.
(3) డోనరుకు ఈ క్రింది బహుమానాలు యివ్వబడుతాయి
   (ఎ) శ్రీవారి కళ్యాణోత్సవ ఉత్సవ మూర్తులకు సమర్పించే మూడు వస్త్రములలో ఒకదానిని
   (బి) 25 లడ్డులు, 5 వడలు.

## ఏ విధంగా దరఖాస్తు చేయాలి :

చెల్లించే మొత్తాన్ని బ్యాంకు డ్రాప్టు ద్వారా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, టి టి దేవస్థానములువారికి మీరు నిర్ణయించుకొన్న రోజుకు కనీసం 30 దినములు ముందుగా అందునట్లు ఈ దిగువ సమాచారంతోపాటు పంపాలి.

(ఎ) డోనరు పేరు, చిరునామా.
(బి) సేవలను జరుపవలసినవారి పేరు, లేదా కంపెనీపేరు మరియు గోత్రం వీనిని ఆలయంలో ప్రదర్శించబడి, ప్రకటించడంగూడ జరుగుతుంది.
(సి) ఆదాయపన్ను మినహాయింపు సర్టిఫికేట్‌ను ఎవరిపేర్న జారీ చేయవలసినది, వారి చిరునామా
(డి) ప్రతి సంవత్సరం స్వామివారికి సేవలు చేయదలచుకున్న నిర్ణీత తేది (ప్రాధాన్యక్రమంగా 3 తేదీలు యివ్వవలెను )

ఇంకా ఏవైనా వివరాలు కావలసివస్తే దయచేసి వ్రాయండి.

**ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, టి.టి. దేవస్థానములు, తిరుపతి.**

ఆ ఉబ్బు అణిగింది వారు పెరగలేదు పెరిగిన వారు యిప్పుడూ రచనలు చేస్తూనే ఉన్నారు ఒక పత్రికా సంపాదకుడు దేశంలో రచయితలను బయటికి తేవడానికి యిటువంటి ప్రక్రియలు అనేకం చేస్తారు గావును అవి అప్పుడు యిప్పుడూ కూడా నాకు అనిపిస్తూ ఉంటుంది

ఇట్లా చూస్తే ఆంధ్రదేశంలో రచయితను అన్వేషించడానికి, వారిని వెలుగులోకి తీసుకు రావడానికి, వారు ప్రతిభావంతులైతే వారిని ప్రజలముందు ఉంచడానికి వారు కాలూని దేశంలో రచయితలుగా స్థిరంగా నిలవడానికి యిటువంటి అనేక ప్రక్రియలని శ్రీ శంభుప్రసాద్ గారు తమ వారపత్రికా నిర్వహణ దినాల్లో అనుసరించడం గమనిస్తూనే వచ్చాను

సంవత్సరం బాగా గుర్తులేదుగానీ ఒకసారి వారపత్రికలో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి కవిత్వపు కూరల అంగడి అనో లేక మరియింకో అటువంటి పేరుతోనో ఒక వ్యాసం రాశారు దాంట్లో కూరగాయలను ప్రతీకలుగా పెట్టి తెలుగుదేశంలో ఆయా కవుల కవిత్వపు పంథాలను తన సహజ చమత్కార ధోరణిలో రాశారు అది ఆ రోజుల్లో నాకు చాలా నచ్చింది అందులో రుక్మిణీనాథశాస్త్రి కూరగాయల రూపంలో వ్యక్తంచేసిన అభిప్రాయాలు నాకు నచ్చినా నచ్చకపోయినా ఆ వ్యాసరచనా పద్ధతి యిప్పటికీ నా మనస్సులో నిలిచిపోయే ఉంది

వ్యాసం అనేసరికి అనేక విషయాలు జ్ఞాపకం వస్తున్నాయి శతావధానులైన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి వ్యాస పరంపరలు మొదటిసారి నేను ఆంధ్ర వారపత్రికలోనే చదివాను, ఆ వ్యాసాలలో చాలా యిప్పుడు అచ్చయి గ్రంథాలుగా కూడా వచ్చాయి తెలుగులో వ్యావహారిక భాషలో రచన చేయదలుచుకున్నవాళ్లు ఆ వ్యాసాలను విధిగా చదివితీరాలని నాకు ఆ మొదటిసారి చదివి నప్పుడే అభిప్రాయం కలిగింది ఆ తెలుగు మహా సొగసుగా ఉంటుంది నవలలకన్నా కూడా వెంకటశాస్త్రిగారి వ్యాసాలు ఎంతో రంజుగా ఉండేవి వారి ఆ వ్యాసాలు చాలా వారపత్రికల్లో పడ్డాయి ఆ వ్యాసాలు చదివి నేను తెలుగు నేర్చుకున్నాను అధునాతనమైన వ్యాస రచనా శిల్పం చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి వ్యాసాలలోనే కనిపిస్తుంది. చాలామంది వ్యాసాలు అవీ రాశారు గానీ చాలామందికి ఆ వ్యాస రచనా శిల్పం పట్టు పడలేదు ఇటువంటి వ్యాసాలను వారపత్రికలో ప్రకటించి శ్రీ శంభుప్రసాద్‌గారు నాబోటి చాలా మంది అనధికారులకు ఎంతో విద్యాదానం చేశారని నేను నిత్యమూ అనుకొంటూనే ఉంటాను

అప్పుడు వారపత్రికలో చిన్న చిన్న సాహిత్యపు తగాదాలు కూడా కొనసాగుతూ ఉండేవి అవి మాబోటివారికి మహా ఉత్సాహంగా ఉండి సాహిత్యంలో అభిరుచి కలగటానికి కారణాలు అయినవి ఆ చర్చలలో హేమాహేమీల లాంటి వాళ్ళు రాస్తూ ఉండేవారు. అప్పటికి ప్రసిద్ధులై ఉన్నవారేకాక కొత్త కొత్త వాళ్ళు కూడా ఆ వివాదాలలో ముందుకు వస్తూ ఉండేవాళ్లు అవి పలుకు ఉంటే పడుతూ ఉండేవి ఈ విధంగా కూడా రచనా వ్యాసంగానికి కొత్తతరంలో ప్రోత్సాహం కలుగుతూ ఉండేది. ఈ విధంగా వారపత్రికలో సాహిత్య విమర్శలకు ప్రోత్సాహం యివ్వడమే కాకుండా కొత్త రచయితలకు తెలిసే వీల్లు అందులో ఉండేది ఇటువంటి చర్చలవల్ల రచయితలకి ఎంత ఉపకారం జరిగిందో దేశానికి భాషకు కూడా అంతే ఉపకారం జరుగుతుంది స్కూళ్లల్లో పాఠాలకన్నా యిటువంటి చర్చల్లో నించి ఎక్కువ విషయాలు తెలియటానికి ఆస్కారం ఉంది ఇటువంటి బహుపద్ధతులను శ్రీ శంభుప్రసాద్‌గారు వారపత్రికలో ప్రవేశ పెట్టి పత్రికకు ఒక ఆకర్షణను సాధించి దేశానికి పెద్ద మేలు చేశారని నేను అనుకుంటూ ఉంటాను

తర్వాత చాలా కాలానికి శ్రీ శంభుప్రసాద్ గారితో నాకు పరిచయం అయింది బెజవాడలో అనుకుంటాను ఒక మిత్రుడి పెళ్ళికి వెళ్లాను వారూ ఆ పెళ్లికి వచ్చారు అక్కడ పందిట్లో కుర్చీలో తెల్లని ఖద్దరుపంచె, తెల్లని ఖద్దరు లాల్చీ, తెల్లని ఖద్దరు ఉత్తరీయం వేసుకుని ఆయన కూర్చున్నారు శంభుప్రసాద్‌గారు

వచ్చారు, శంభుప్రసాద్‌గారు వచ్చారు అని అంతా ఆగుబ్బుగా అనుకుంటూ ఉంటే నేనూ అటు వెళ్లాను మా మిత్రుడు నన్ను ఆయనకు పరిచయం చేశారు వీరిది ఫలానా ఊరు, ఏదో రచనచేస్తూ ఉంటారు అని పరిచయపు మాటలు చెప్పారు నిజానికి నేను అప్పటికి రచనా చెయ్య లేదు ఏమీ చెయ్యలేదు తెలుగు భాషలో మహత్తరమైన నవలలను తమ పత్రికలో ప్రకటించి, బహువిధములైన చర్చలను వార పత్రికలో నడిపి ఆలోచన అంటే యిట్లా చెయ్యాలిగావున్నా లని నామటుకు నాకు మార్గాన్ని చూపించిన, నేను అప్పటికి ఎంతో కాలంనించీ చూడాలనుకుంటున్న వ్యక్తిని చూచాను అప్పుడు నాలో ఏమి భావాలు కలిగాయో యిప్పుడు బాగా గుర్తులేదు కానీ ఒక గొప్ప వ్యక్తిని ఆ రోజు చూచాను అన్న స్పృహ నాలో యిప్పటికీ అట్లాగే నిలిచి ఉంది

తర్వాత మరి కొంతకాలానికి వారితో నాకు సన్నిహిత పరిచయం ఏర్పడింది నాలో అప్పుడు ఆయన గొప్పదనాన్ని గురించి కల్గిన ఏ స్పృహ ఉన్నదో ఆ స్పృహ పరిచయాధిక్యం కలుగుతూ వస్తూన్నకొద్దీ బలపడుతూనే వచ్చింది నేను యిప్పటికిగూడా నేను మొదట చదివిన వార పత్రికలలోనే తెలుగుభాషలో ఓనమాలు నేర్చు కున్నాను అనిపిస్తుంది అనిపించడం కాదు అక్షరాలా నిజం

వారపత్రికలో పడకకుర్చీ భావాలని అనేక విషయాలపైన వ్యాఖ్యాన ప్రాయమైన వ్యాసాల వంటివి పడుతూ ఉండేవి అప్పుడు అంతాకూడా ఇది ఎవరు రాస్తున్నారు, ఇవి ఎవరు రాస్తున్నారు అని అనుకుంటూ ఉండేవారు వాటిలో విమర్శ, విషయ వివరణ, తెలుగు నుడికారపు సొంపు సమతూకంలో ఉండి ఆహా అనిపిస్తూ ఉండేవి ఆ తెలుగులో కృత్రిమపు నగిషీలు ఉండేవికావు తెలుగు నుడికారం చిక్కగా చక్కగా ఉండేది విమర్శ కటువుకాక, క●నమూకాక మృదువుగా కాంతా సమ్మితంగా ఉండేది దేశంలో ఆ పడక కుర్చీ భావాల పరంపరమంచి సంచలనాన్ని కలిగించింది తర్వాత ఎప్పుడోగాని అవి శ్రీ శంభుప్రసాద్‌గారు రాసినవని నాకు తెలియలేదు

అప్పటి వారపత్రికని గురించి ఒక్క విషయం చెప్పి యిది ముగిస్తాను దసరా పండగ వస్తోంది, వారపత్రిక దసరా సంచిక వెలువడు తుందని ముందుగానే ప్రకటించారు మంచి అందంగానూ, మంచి వ్యాసాలతోనూ వస్తుందని వేశారు సంవత్సరం నాకు బాగా గుర్తులేదు నేనూ మా స్నేహితులమూ అది మామూలు వారపత్రిక సైజులోనే వస్తుందనుకున్నాము ఇది విశేష సంచిక గనుక విశేషంగా ఉంటుందన్న భావం రాలేదు ఆశ్చర్యాన్ని కల్గించడం అన్నది పత్రికా ప్రచురణ శిల్పంలో ఒక విశేషం అన్న విషయం ఆ దసరా సంచికని చూసినప్పుడు నాకు అనిపించింది ఆ దసరా సంచిక యిప్పుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సైజులో వచ్చింది బాగా ఎక్కువగా పేజీలు వేశారు మంచి మంచి రచనలు ఉన్నాయి పైఅట్ట మహా ఆకర్ష ణీయంగా ఉంది. ఆ పత్రికను నేను చాలాకాలం దాచి అట్టేపెట్టుకున్నాను ఇటువంటి బహు పత్రికా ప్రచురణ శిల్పంలో చమత్కారాలు శ్రీ శంభుప్రసాద్‌గారు చేస్తూ ఉండేవారు ఆ రోజుల్లో వారపత్రిక చదవటం నామటుకు నాకు కొత్త విద్యను అభ్యసించడంగా ఉండేది హేమా హేమీల రచనలు పడుతూ ఉండేవి అవి ఆ రోజులు శ్రీ శంభుప్రసాద్‌గారు వారపత్రిక సంపాదకత్వాన్ని వహించిన కొత్త రోజులని నాకు తర్వాత తర్వాత తెలిసింది ఇప్పుడు ఆ రోజులను తలచుకుంటే ఆంధ్రదేశంలో వారపత్రికను కొత్త పద్ధతిలో నడపటం అంటే ఏమిటో అప్పుడే ప్రారంభం అయినట్లు ఒక భావం కలుగుతుంది అప్పటికీ యిప్పటికీ కూడా నా అభిప్రాయం అదే ఆ అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అవసరం కూడా నాకు కనిపించలేదు

— పా. గో.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
1972 జూన్ 30 సంచిక నుంచి



రంగులు పొంగా
ఆప్కో వస్త్రాల
ఐశ్వర్యానికి
రమణీయ స్వాగ
పలకండి!
పండుగలకు ప్రారంభోత్సవం చేస్తుంది
వినాయక చతుర్థి సకల సంపదలూ సమకూర్చ
దైవానికి ఇష్టమైన ఆప్కో వస్త్రాలతో అఖండ
స్వాగతమీయండి ! మీకోసం ప్రత్యేకంగా నేసిన
మంగళప్రదమైన చేనేత చీరలు షర్టింగులు
దుస్తులు గృహాలంకరణ వస్త్రాలు మిమ్మల్నే
ఆహ్వానిస్తున్నై! ఆహ్వానం అందుకోండి!
నచ్చినవాటిని ఎన్నుకోండి
ఆప్కో
చేనేతలు
kiron/apco/83f

# ...నిన్న... నేడు... రేపు...

—శంకు

పత్రికలు | పాఠకులు


















## Enjoy the fine aroma of Newly Roasted, Fresh Ground Coffee




### Use the five-step Flavour Formula

**1** Roast the beans evenly to a golden brown colour Do not over-roast or under-roast

The coffee powder should be ground in such a way that it is neither too fine nor too coarse

Use Coffee Board filter for the best brew This is all you have to do

**2** Place filter inside jug Put coffee powder inside filter and spread evenly (One tablespoon of powder for every cup)

**3** Place plunger inside filter pressing down powder lightly Pour boiling water Close the lid

**4** After five minutes decoction is ready in the jug Add milk and sugar to taste

**5** Do not overboil water or milk

Do not re-heat infusion after it is prepared, as this spoils the aroma

Enjoy Coffee
cup after cup
For Coffee is for enjoyment



**COFFEE BOARD, Bangalore**
Making good Coffee is very simple

---

# లావణ్య

టాల్కం పౌడర్

Lavanya Super Tale

Lavanya Super Talc

Lavanya Classic

Manufacturers
**HIRUSAH ENTERPRISES**
**KANCHIPURAM-631 501**

SUVARNA

# భువనసారం పీఠికాపురం

**— సోమసుందర్ —**



పిఠాపురం శ్రీ కుక్కుటేశ్వర స్వామి

ఆంధ్ర సచిత్ర వారపత్రికవారు ఆదరంతో లేఖ రాశారు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సంచికకు 'పిఠాపురాన్ని గురించి చిన్న వ్యాసం రాసి పంప'మని ఎంతో ఆనందంతో తబ్బిబ్బులాడాను, ఎన్నో సంశయాలతో తటపటా యించాను

నిజమేమరి, పిఠాపురాన్ని గురించి అంటే ఎక్కడ్నించి ప్రారంభించి ఎప్పటివరకూ రాయాలి? కళింగ రాజ్యానికి ముఖ్యపట్నమై విరాజిల్లిన చారిత్రక పూర్వదశలగురించి రాయాలి? మహేంద్రవర్మ పాలనలో ఎన్నో అపూర్వ విజయాలు సాధించిన ప్రాచీనకాలం గురించి రాయనా? సముద్రగుప్తుడు యావద్భారతాన్నీ జయించి ఏకీకృతం చేయాలన్న సామ్రాజ్య విస్తరణ దాహంతో దక్షిణాపథానికి దండెత్తినపుడు అతన్నీ అతని సైన్యాన్నీ మట్టికరిపించి, బయల్దేరిన దిశగా పిక్కబలం చూపేటట్టు తిప్పి కొట్టిన శౌర్య గాథలు వర్ణించనా? ఏం రాయను?

రాజమహేంద్రి రాజధానిగా రాజరాజ నరేంద్రుడు పాలన సాగిస్తున్న రోజులలో పిఠాపురానికి చేరువలోగల నవఖండవాడను పావులూరి మల్లన్నగారికి అగ్రహారంగా దానమిచ్చిననాటి గాథలు రాయనా? కుమార గిరిరెడ్డి రసరాజ్య డోలలు దేశమంతా ఏర్పరచిన కథలు చెప్పనా?

"త్రపుస పుష్పలతా మతల్లీ పటోలికా
కారవేల్ల కుటుంగకముల తోడ
కూష్మాండ, వృంతాక, కోలక చించికా
కాయమాన కదంబకముల తోడ
శాకినీమూలకచ్ఛత్రాక సారణీ
ధాన్యాక మేఘనాదములతోడ
సిప్పల్యుపోదకీ వీత పలాండున్
వాస్తుశాఖా కోటిలాటి తోడ
రాజనలతోడ శృంగ బేరములతోడ
చిరుగడపు పెండలముతోడ చేమతోడ
ఒప్పు నాలుగు పొలములందు దుపదనములు
భువనసారము పీఠికాపుర వరమున!"

అంటూ పారవశ్యంతో వర్ణించిన శ్రీనాథుని కాలంలోని పిఠాపురం గురించి వ్రాయనా?

వేరు పనసలతాని ఇందిందిరాలకు విందు చేసే పసందుల్నీ, కొబ్బరాకు పరచినట్లుగా అటూ యిటూ పంటకాలువలతో చిలపిలమంటూ పాడుతున్న ఏలానదీమాతృకల రమణీయ దృశ్యాలనూ వర్ణించిన శ్రీనాథ మహాకవి పద్యాలన్నీ ఉట్టంకిస్తూ వ్యాఖ్యానించనా? వేదాలకు పాదుగా ప్రవర్తిల్లిన కుటుంబంలో పుట్టి, దివారాత్ర విభేద మెరుగక వేశ్యావాటికా మన్మథ క్రీడా నిరంతరాయతతో కులభ్రష్టుడైన నిగమశర్మ కాలంనాటి పిఠాపురం గురించి రాయనా? తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మహాత్మ్య కావ్యంలో పొందుపరచిన మధ్య యుగాల యథార్థాలను వర్ణించనా? ఏం చేయను? ఎక్కడ ప్రారంభించను? అనుకుంటూ నా మనసంతా అల్లకల్లోలమై సంశయాలలో కొట్టుకు పోతూండగా

క్రీ. శ. 1602లో పట్టాభిషిక్తుడైన రేచర్ల గోత్రీకుడు రావు తెలుంగు రాయనితో ప్రారంభమైన పిఠాపురం సంస్థానం 1962లో మరణించిన శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్ వరకూ అవిచ్ఛిన్న యశోరాశిగా కేంద్రీకృతమైన సాహిత్యార్ణం గురించి వ్రాయనా? అనే అనంత సందేహాలతో డోదూయమాన మానసుడనై పరిదేవనాపూర్ణ హృదయంతో క్షణాలు దొర్లిస్తున్న సమయంలో మెరుపులా ఒక ఆలోచన తళుక్కుమంది నేను పుట్టి పెరిగిన ఇరవైయో శతాబ్దానికే నేను ఋణపడివున్నాను కనక ఈ శతాబ్దికి సంబంధించిన చరిత్ర కాంశాలనే పాఠకుల కందించాలి పీఠికాపురంలో వెలిగిన అమూన చర్రితక కాంతులకు చివరి కిరణాలందించిన ప్రభువు శ్రీ సూర్యరాయ మహీపతి సాహిత్య సాంస్కృతిక సేవల గురించే దిఙ్మాత్రంగానైనా తెలపడం అవసరం — అదీ నా మనసు కందిన సంకల్పం!

అలా స్థిర నిర్ణయానికి వచ్చి ఆలోచించ నారంభించగానే మళ్ళీ సంశయమే, ఈ మహత్తర విషయమంతా ఒక చిన్న వ్యాసంలో యిముడుతుందా అని!

శ్రీ గంగాధర రామారావుగారికి రాణి మంగయాంబ గర్భంలో శ్రీ సూర్యరాయ మహీపతి 1885లో మే పదో తేదీని జన్మించారు పుట్టగానే తల్లి మరణించగా మరొక రాణి భావయమ్మారావు పెంచి పెద్దచేశారు. గంగాధర రామారావు స్వయంగా వేదవేదాంగాలు తుణ్ణంగా చదివిన మనీషి వారి ఆస్థాన కవి పండితులు దేవులపల్లి సోదర కవులు, ఒల్లంరాజు సుబ్రహ్మణ్య కవి మున్నగు వారెందరో శ్రీవారి పోషణలో ఉండేవారు సూర్యారావు జన్మించిన ఐదేళ్లకే 1890లో గంగాధర రామారావు స్వర్గస్థులయ్యారు యువరాజు మైనరైనందున కోర్టు ఆఫ్ వార్డ్స అధీనంలో సంస్థానం ఉండవలసి వచ్చింది సమయంలోనే వారసత్వం తమదని దత్తపుత్రు



పిఠాపురం మహారాజావారి కోట

డొకరు వ్యాజ్యంచేశారు 9వ యేడు వొచ్చేవరకూ సూర్యారావు కోటలోనే దేవులపల్లి సోదర కవుల వద్ద విద్యాభ్యాసంచేశారు 1904 న్యూయింగ్టన్ రాజకుమార కళాశాలలో రెండేళ్లపాటు ఉన్నత విద్యాభ్యాసం చేశారు 1906 లో తిరిగివస్తూ, ఆ కళాశాలలో ఆంగ్లోపాధ్యాయులుగా తమ్మాకర్షించిన మొక్కపాటి సుబ్బారాయుడుగారిని తనతో వచ్చి తనకు ప్రైవేటు సెక్రటరీగా తన వ్యవహారాలు నిర్వహించవలసిందిగా రాజావారు కోరారు ఆ విధంగా సుబ్బారాయుడుగారి సహాయంతో 11 ఏళ్ల వయస్సుకే రాజ్య వ్యవహారాలు స్వయంగా చూసుకోనారంభించారు

నూజివీడు సంస్థానానికి చెందిన కపిలేశ్వర పురాధీశుడు రాజా వేంకట రంగయప్పారావుగారి కుమార్తె చిన్నమాంబాదేవితో 1907 లో వివాహమైంది పట్టాభిషేకమూ జరిగింది మొక్కపాటి వారు, సంస్కృతాంధ్రాంగ్లభాషలలో అపార వైదుష్యం వల్లనూ, విశాలహృదయం వల్లనూ

వితరణశీలం వల్లనూ ప్రభావితులైన శ్రీ రాజా 1920వరకూ గొప్ప సామాజిక కార్యకలాపాలకు కారణభూతులయ్యారు.-1918 లో మొక్కపాటి వారు కాలధర్మం చెందే పర్యంతం శ్రీ రాజావారి కీర్తి యీ వద్భారతంలోనూ విస్తరించింది. రవీంద్రులు స్వయంగా ఆశీర్వదించారు ఆ దశాబ్ది చరిత్ర సమగ్రంగా చిత్రించడానికి ఎంత గ్రంధమైనా చాలదు

ఆ దశలోనే వివిధ శాస్త్ర పారంగతులైన పండితులను రావించి, ఆస్థాన విద్వాంసులుగా నియమించారు అట్టివారిలో సంగీతంలో వైణిక సార్వభౌమ తుమరాడ సంగమేశ్వరశాస్త్రి, చిరంతనయశస్వి ! న్యాయశాస్త్రంలో శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రి, వేదంలో శ్రీ వడలి లక్ష్మీ నారాయణశాస్త్రి, వ్యాకరణంలో వేదుల సూర్యనారాయణశాస్త్రి, విశిష్టాద్వైతంలో శ్రీ మత్తిరుమల గుదిమెళ్ల వేంకటరంగాచార్యులు, సంస్కృతాంధ్ర సాహిత్యాలలో పురాణపండ మల్లయ్యశాస్త్రిగార్లు నియుక్తులయ్యారు. వీరు కాక ఎందరో పండితులకు వార్షికాలు ఏర్పాటు చేయబడి, దసరా ఉత్సవాలలో సగౌరవంగా అంద చేయబడేది. 1909 లో ఉభయభాషకవిత్వ వేదులు వేంకట రామకృష్ణ కవులు పిఠాపురం సంస్థానంలో శతావధాన, శతవిధాన, శత ప్రాసాష్టావధాన ప్రదర్శనం విజయవంతంగా జరిగింది రాజావారికి వారు ప్రీతిపాత్రులయ్యారు. వారిని ఆస్థానకవులుగా నియమించి యిరువురికీ చెరొక మేడ కట్టించి యిచ్చారు వీరుగాక ఆంధ్రా షేక్స్‌పియర్‌గా ప్రఖ్యాతులైన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రాజావారికి బాల్యాప్త కోటిలోనివారు విశేష గౌరవాలందుకున్నారు కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం రాజమండ్రిలోనేనివసిస్తున్నా వారికి మాస వేతనం ఏర్పాటు చేయబడింది యుగపురుషులు కందుకూరి వీరేశలింగం తలపెట్టిన సంఘ సంస్కరణోద్యమంలో ప్రతి అంశానికి రాజావారు బాసటగా నిలిచారు వీరేశలింగంగారి కవుల చరిత్రకు ముద్రణా బాధ్యత వహించి కృతి స్వీకారం చేశారు.

1911లో ఆంధ్ర సారస్వత పరిషత్‌ను మద్రాసులో స్థాపించి, దాని ప్రధాన నిర్వాహకులుగా జయంతి రామయ్యపంతులుగారిని నియమించి, పది వేల రూపాయలు ప్రాథమిక నిధిగా సమర్పించారు సూర్యరాయాంధ్ర నిఘంటువు రూపొందించే కార్యక్రమానికి వేదం వేంకటరాయ శాస్త్రిగారిని ముఖ్యులుగా నియమించి, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి, కూచి నరసింహం, చర్ల నారాయణశాస్త్రి, పేసుపాటి చిదంబరశాస్త్రి, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, నిడదవోలు వేంకటరావు, చెరుకుపల్లి అప్పరాయశాస్త్రి,



లక్ష్మీదేవి —శుభమస్తు, శుభమస్తు. నీదానము లీవిధముగానే వర్థిల్లి నీవలన భారతదేశము నకు మహోపకారము గలుగుగాక నీ కెల్లప్పుడును కళ్యాణముగుగాక.

పిఠాపురం రాజగారు —తల్లీ, సకల సత్కార్యములకు నాకీశ్వరుడు ప్రసాదించినదానిలో నుండి యిచ్చుటకు నే నెల్లప్పుడు సంసిద్ధుడను. నీకు వందనములు

(శ్రీ పిఠాపురము రాజగారు అతిమూత్ర వ్యాధివిషయమును శోధనలను చేయించుటకై 10,000 రూప్యములను శ్రీ గవర్నరుగారి కొసంగి సత్కార్యములకు తామిట్లు ధనమును కురిపించుటలో మరియొకసారి వెల్లడించిరి) [ఆంధ్రపత్రిక 1914 జూలై 29 సంచిక నుంచి]

బులుసు వేంకటేశ్వర్లు మున్నగువారిని నిఘంటు కార్యకర్తలుగా నియుక్తం చేశారు.

గంగాధరరామారావుగారు కాకినాడలో స్థాపించిన కళాశాలను డిగ్రీ కాలేజీగా అభివృద్ధి పరిచి, పదమూడు లక్షల వ్యయంతో నూత్న భవనాలు, లేబొరేటరీలను సమకూర్చారు. వీరేశలింగంగారు నిర్మించిన ఆస్తికోన్నత పాఠశాలకు ఏభయివేలు విరాళమిచ్చి నూత్న భవనాలు నిర్మించారు కాకినాడలో అనాథ శరణాలయయం నిర్మించి రెండులక్షల వ్యయంతో భవనాల నిర్మాణము, మూలనిధి వగైరాలు సమకూర్చారు రవీంద్రుని అభ్యర్థనపై కలకత్తా సిటీ కాలేజికి ఉదార విరాళమందించారు సర్ రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి వైదుష్యం గురించి విన్నవారై శ్రీ రాజావారు వారిని రప్పించి 1905లోనే కాకినాడ కాలేజికి ప్రిన్సిపాల్‌గా నియమించారు వారి కాలంలోనే కాలేజి సమగ్ర ప్రతిపత్తినందుకొన్నది 1920లో శ్రీ నాయుడు పదవీ విరమణ చేసేవరకూ, నైతిక గురువుగా, ఋషి తుల్యులుగా బ్రహ్మర్షిగా ప్రఖ్యాతులయ్యారు కృష్ణశాస్త్రి, తారకం, చలం వంటి మహనీయులకందరికీ గురువులయ్యారు.

శ్రీ సూర్యరాయమహీపతి రాజ పట్టాభిషేకం జరిగిన సంవత్సరమే, వామికొలను సుబ్బారావు (వాసుదాసుగా ప్రఖ్యాతులు) రచించిన ఆంధ్ర వాల్మీకి రామాయణం రెండు సంపుటాలుగా ముద్రించడానికి సరిపోయే రెండు వేల రూపాయల నందించారు పండిత శివనాధశాస్త్రి గారి బ్రహ్మసమాజ చరిత్ర అనే ఆంగ్ల గ్రంధ ముద్రణ వ్యయభారమంతా రాజాగారే భరించారు పానుగంటి వారికి ఆమరణాంతం నెలకు మూటయిరవై రూపాయల వేతనమిచ్చి పోషించడమే గాక, వారి యావత్ గ్రంధాలన్నీ రాజావారే ముద్రించి యిచ్చారు విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర పత్రిక సంస్థాపనార్థం సహాయ మందించారు.

ఈ విధంగా ఆనాటి సకలాంధ్ర సాంస్కృతీ విభవాన్ని అభ్యుత్థాన మొనరించేబృహత్తర కృషికి శ్రీ రాజావారు ఉదార వితరణల నందించి, ఆంధ్రభోజులుగా కీర్తిమంతులై 1924 వ

సం.రంలో బ్రిటిష్ చక్రవర్తి పట్టాభిషేక సందర్భంగా మహారాజ బిరుదాన్ని అందుకొన్నారు. గోపాలకృష్ణగోఖలే పిలుపునందుకొని, దక్షిణాఫ్రికా భారతీయుల అభివృద్ధి కోసం గాంధీజీ జరుపుతున్న కృషికి పదిహేనువేల రూపాయల వుదార విరాళమందించిన మొట్టమొదటి తెలుగు జమిందారు పిఠాపురం రాజావారే! ఈ విధంగా పీఠికాపురానికి ఇంకా శతాబ్ది ఆంధ్ర సంస్కృతీ చరిత్రలు ఒక చిరస్మరణీయ స్థానాన్ని చేకూర్చిన మహనీయుడు పిఠాపురం రాజావారే! గాంధీజీ హరిజనాభ్యుదయానికి పాటుపడ నిశ్చయించడానికి ఒక దశాబ్ది ముందే హరిజన బాలుర కోసం హాస్టల్సు నిర్మించి, ఉచిత భోజన వస్త్రాదులు సమకూర్చి, ఉచిత విద్య నందచేసిన చిరయశస్వీ పీఠికాపురాధీశులే!

ఇరవైయ్యో శతాబ్దిలో పిఠాపురం చరిత్ర అంటేనే మహారాజా శ్రీ సూర్యరాయమహీపతి ఉదార చరిత్రగా అవిభాజ్యమై పెనగిపోయింది. వారొనర్చిన మహోదార కార్యాలకు ఉద్దీపన కలిగించిన మహనీయులు శ్రీ మొక్కపాటి సుబ్బరాయుడుగారన్న సత్యం వివాద రహితంగా స్థాపితమైంది. ●

# తెలుగుపాట

జె. బాపురెడ్డి

తెలుగంటే వెలుగురా
వెలుగంటే తెలుగురా
తెలుగు వెలుగు దూర దూర
తీరాలను వెలిగెనురా!

వెలుగువోలె విను వీధుల
వెడలుటయే తెలుగురా
చెలిమివోలె ఎద ఎదలో
వెలుగుటయే తెలుగురా!—

మంచి మనసు మాట్లాడే
మాటే మన తెలుగని
'మంచి మనిషి' అనుటకే
మరో పేరు తెలుగని
నిరూపించుకున్నపుడే
నీ దేశం తెలుగురా
నీ భాష వెలుగురా!—

భాషలన్నిటికి తెలుగు
భాష ఆత్మబంధువని
సంస్కృతులన్నిటికి తెలుగు
సంస్కృతి రస సింధువని
చాటుటయే తెలుగురా
సమదృష్టియె వెలుగురా —

# శ్రీమతి రామాయమ్మగారి అస్తమయం



ఆంధ్రపత్రిక స్థాపకులు కీర్తిశేషులు దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి ధర్మపత్ని శ్రీమతి రామాయమ్మగారు 16 వ తేదీ బుధవారం రాత్రి 10-10 గంటలకు మద్రాసులో శివసాయుజ్యము పొందారు. వారి వయస్సు 85 సంవత్సరములు.
దేశోద్ధారకుని ధర్మపత్నిగా, ఆదర్శ గృహిణిగా, దానశీలగా ప్రసిద్ధిపొందిన రామాయమ్మగారి మృతికి సంతాపసూచకంగా దేశవ్యాప్తంగా ప్రముఖుల సందేశాలు వస్తున్నవి.

(ఆంధ్రసచిత్ర వారపత్రిక 1963 నవంబరు 1 సంచిక నుంచి)




## "శుభలేఖలు చాలా అందంగా ఉన్నాయి" అనుకున్నాడు వాటిని మరొకసారి చూసుకుని అతను.

**ముఖ్యంగా తన పేరూ, తనది కాబోయే ఆమె పేరూను.**

సారధి

శశిరేఖ

ఆ పేరు అతనికి నచ్చింది పేరులోనేమి పెన్నిధి యున్నది? అన్నది చక్కటి పేరుగల భార్యకి నోచుకోని కవి నిరాశావాదన మాత్రమే కాని మరొకటకాదు శశిరేఖ పేరులో నిజంగానే పెన్నిధి ఉంది ఆమె ఆస్తీ అంతస్తూ సరేసరి వాటికి తోడు ఆమె పేరు

శశీ!

రేఖా!

ఎలాగ పిలిచినా అందంగానే ఉంటుంది

అయినా ప్రారంభం కానున్న తమ సాంసారిక జీవితంలో ఎలాగ పిలిస్తే ఆమె సంతోషిస్తుంది? ఈ ప్రశ్న ఆమెనే అడగాలి అనీ ఆమె కోరిక ప్రకారం చెయ్యాలనీ అతనికి చాలా రోజులనించి — శశిరేఖతో పరిచయం అయిన నాటినించీ ఉంది క్రిందటిసారి ఆమెని కలుసుకుని, వాళ్ల రెండో అంతస్థు బాల్కనీలో కూర్చున్నప్పుడు ఈ ప్రశ్న సారధి నాలిక చివరి దాకా వొచ్చి ఆగిపోయింది.

■ సాయంత్రం తాను ఆమె ఇంటికి వెళ్లేడు రోజంతా నిద్రపోయి.

అతను వెళ్లేసరికి లోపలినించి ప్రచండంగా సంగీతం వినిపిస్తోంది ఏదో హిందీ సినిమా పాట అతను గేటు తీసుకుని లోపలికి నాలుగడుగులు వేసేసరికి కుక్క కఠోరంగా మొరగడం మొదలుపెట్టింది

సారధికీ కుక్కలకీ పడదు

ఆ మాట అంతకుముందు ఒకసారి శశిరేఖతో అన్నప్పుడు శశిరేఖ విరగబడి నవ్వింది . అప్పటికి తమమధ్య చనువు మొదలవుతోంది.

'ఆమె నవ్వకపోతే బాగుండును' అని తాననుకోవడం సారధికి కుక్క అరుపుతో జ్ఞాపకం వొచ్చింది ఆమె నవ్వకపోతే అంత అందంగా ఉంటుందని కాదు కాని

ఆమె అయిదారు నిమిషాలపాటు నవ్వింది — కళ్లవెంట నీరు వొచ్చేలాగ అతని కేమనాలో, ఏమనుకోవాలో తెలియలేదు కళ్లు తిప్పుకున్నాడు

నవ్వు ఆగాక అయినా ఆ వినోదానికి కారణం ఆమె చెప్తుందని అతననుకున్నాడు. కాని ఆమె ఏమీ చెప్పలేదు — తరువాతి గంటలో, "కుక్కలకీ మీకూ పడదు!" అని చిన్న నవ్వుతో అని, దాని వెనుకనే పెద్ద నవ్వు నవ్వడం తప్ప

ఆ తరువాత జరిగిన విషయాల ప్రభావంతో అతనింక కుక్కలని గురించి ఏమీ అనడం మానేశాడు అది 'సీమ' కుక్క అని శశిరేఖ రెండు మూడుసార్లు అతనితో అంది. కరవడానికి






స్త్రీ మనోభావాలకు
ప్రతిరూపము !
Dayaram
PRINTS
దయారామ్
ప్రింటు చీరలు
పోలియస్టర్, కాటన్, టెరివాయిల్
ఆంధ్రప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు
దిలీప్ ట్రేడింగ్ కం.,
కైలాష్ మార్కెట్, సికింద్రాబాద్, ఫోన్ : 822088

సీమకుక్క. అయితే ప్రత్యేకం గర్వించదగిన కారణం ఏమీ లేదని అతను అనుకున్నా ఆ ఆలోచనని సారధి బయటికి తేలేదు.

అందుకే అరుస్తున్న కుక్క అతన్ని భయంతో ఆపివేసింది కాని, అదృష్టవశాత్తూ దానికి గొలుసు కట్టి ఉండడంవల్ల ఆ విషయం తెలుసుకోగానే సారధి ధైర్యంగా అడుగులు వేశాడు. గుమ్మం ఎక్కే సరికి ఉధృతంగా సంగీతం.

సారధి గదిలో అడుగుపెట్టి చుట్టూ చూశాడు. ఎవ్వరూలేరు. అంత పెద్ద ఇల్లయినా కాలింగ్‌బెల్ లేదు.

మరో నిమిషంలో ఒక సర్వెంటు వొచ్చి అనుమానంగా అతన్ని చూసి, "ఏం కావాలండి?" అన్నాడు. సారధి కూర్చోబోయి ఆగి, "అమ్మగారు..." అన్నాడు.

ఇంతలో శశిరేఖ వొచ్చి, "అరే! మీరా!" అంది.

"అవును" అన్నాడు గొప్ప రిలీఫ్‌తో సారధి.

"రాజ్ అరిస్తే ఎవరో అనుకున్నాను." అంది శశిరేఖ చేతి గడియారం సర్దుకుంటూ.

అతనికి ఆ ఇంటికి కాల్‌బెల్ ఎందుకక్కరలేదో తెలిసింది.

"మిమ్మల్ని చూసి రాజ్ ఎందు కరుస్తాడు?"

"తెలీదు."

ఆమె నవ్వబోయింది.

సర్వెంటుని చూసి ఆగి, "పో" అంది. మరోసారి అనుమానంగా చూసి వాడు వెళ్ళిపోయాడు.

లోపలినించి మరో హిందీ పాట వినిపిస్తోంది.



"ఏ అమ్మగారండి?"

ఆ ఇంట్లో ఉన్నది ఒకే ఒక అమ్మగారు. శశిరేఖ తల్లి ఆమె చిన్నతనంలోనే పోయింది.

"శశిరేఖగారు."

"ఎందుకండి?"

చాలా కోపం వొచ్చింది సారధికి. తను, ఈ ఇంటి అల్లుడు కాబోతున్న తాను, జవాబివ్వవలసిన ప్రశ్న కాదిది. కాని, వాడెవరో కొత్త నౌకరులా ఉన్నాడు. ఖచితంగా చూస్తూ నిలబడ్డాడు — జానపద కథల్లో రాజకుమారుడి ఎదుట రాక్షసిలా.

కాని, ఏం జవాబివ్వడం? "ఈ ఇంటికీ, మీ యజమానికీ, కాబోయే అల్లుణ్ణి, శశిరేఖకి కాబోయే భర్తని" అని చెప్పడానికి అతను సిగ్గుపడ్డాడు. అవతలనించి మరో హిందీ పాట ఫుల్ వాల్యూమ్‌తో వొస్తోంది.

ప్రేమమీద పాట.

"నాకా పాటమీద ప్రేమ" అంది శశిరేఖ.

అతను కూర్చుని, చిరునవ్వు నవ్వేడు. ఆమె అతనికెదురుగా కూర్చుని, "బాగుంది కదూ?" అంది.

"ఏమిటి?"

"పాట."

"అవును" అన్నాడు సారధి సంశయిస్తూనే.

"ఆ పాట, విన్నప్పుడల్లా మీరు జ్ఞాపకం వొస్తారు!"

"ఎందుకని?"

శశిరేఖ నవ్వింది. మామూలుగా.

"ఫరవాలేదు అంతగా" అనుకున్నాడు సారధి.

"మీరు మీరు" అంది శశిరేఖ.

"ఏమిటి? చెప్పండి" అన్నాడు సారధి.

"నన్నింకా 'మీరు మీరు' అంటారేం?" అంది శశిరేఖ.

"మరి..." అన్నాడు సారధి —

"నువ్వనండి."

"నువ్వు..."

"అలాక్కాదు — పిలిచినప్పుడు..."

అలాటివన్నీ జీవితంలో మధురక్షణాలు. కాబోయే అర్ధాంగిని పిలిచే తీరు బహువచనం నించి ఏకవచనానికి మారడం మరీ మధురమైన జ్ఞాపకంగా ఉండాల్సిన క్షణం.

అప్పుడు అతని నాలికదాకా వచ్చింది 'నిన్ను శశీ అని పిలవనా? రేఖా అనా?' అని అనాలని.

ఇంతలో సర్వెంటు పరిగెత్తుకొచ్చి, "చిన్నమ్మగారూ! కుక్క కట్టు విప్పేసు కుందండీ!" అన్నాడు.

"ఈ రాజా మరీ అల్లరి చేస్తున్నాడు!" అంటూ ఆనాడు శశిరేఖ లేచి వెళ్ళింది. ఆమె పది నిమిషాల తరవాత వొచ్చేసరికి అతనా ప్రశ్న వెయ్యలేకపోయాడు. మూడ్ మారిపోయింది. మళ్ళీ అలాటి అదను రానూలేదు.

అదంతా జ్ఞాపకం వొచ్చింది సారధికి.

సరిగ్గా పది రోజుల తరవాత పెళ్ళి.

తనకీ, ఆమెకీ.

సారధికీ, శశిరేఖకీ.

ఏభై శుభలేఖలు తనకి పంపిస్తూ "నీ మిత్రులకి పంపడానికి" అని తెలియజేశారు కంచు గంటగారు— అదే .. మామగారు. ఈ శుభలేఖలు ఆయన చాలా ప్రత్యేకంగా వేయించి ఉంటారు. అందుకే అంత అందంగా ఉన్నాయి.

శశిరేఖ.

చక్కటి పేరు.

కాని — అతను మనస్సులో ద్వారాలకి వేసిన తెరలు జారిపోతున్నాయి.

శశిరేఖ సౌందర్యవతి కాదు.

ఆమె అందంగా ఉండదు. తెల్లగా ఉన్నా, చూడ్డానికి బాగా ఉండదు.

అలాగ ఎవరూ తనతో అనలేదు. కాని తనకే అనిపిస్తుంది. చేదు నిజం.

"అందం కొరుక్కుతింటామా?"— నాన్న.

"పిల్లకేం లోటు? లక్ష్మిలాగ ఉంది"— వొదిన.

"కన్ను వొంకరా? కాలు వొంకరా?"— అత్తయ్య.

"పిల్లకేం? నిక్షేపంలా ఉంది!"— అమ్మ.

కాని.

ఏం? అందంగా లేకపోతే ప్రేమించడానికి కుదరదా? తెలుగు కథలూ, సినిమాలలోలాగ అందరూ అందంగానే ఉంటారా? ఎక్కడ

# జీవితంలో ఎప్పుడో ఒకసారి రిటయిరవుతారు.



వృద్ధాప్యం అందరికీ వచ్చేదే. రిటయిరయ్యాక మీ జీవితం సాఫీగా గడవాలంటే ఇప్పటినుంచే పథకం వేసుకుని సిద్ధపడాలి. చిన్న మొత్తాలను ఇప్పటినుంచి పొదుపు చేయగలిగితే రిటై రయ్యాక కూడా స్వతంత్రంగానే జీవనయాత్ర సాగించవచ్చు. ఇందుకు స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదువద్ద ఒక సులభమైన పథకం వుంది. అదే ఫ్యామిలీ బెనిఫిట్ కమ్ రిటైర్‌మెంట్ బెనిఫిట్ స్కీమ్. ఇది ఎంతో ఆదర్శవంతమైంది. ఎందుకంటే:

- బ్యాంకునుంచి డిపాజిటరుకు మూడునెలల కోసారిగాని లేక నెలకోసారిగాని (డిస్కౌంటు చేసిన విలువకు) సక్రమంగా ఆదాయంగా అందుతుంది.
- నెలకు రు. 20/- గాని, రు. 10/- రూపాయల గుణించగా వచ్చే ఎంత మొత్తాన్నయినాగాని 60 నెలలు మొదలు 120 నెలలవరకు కాలానికి ప్రతినెలా వేయండి.
- కాలపరిమితి పూర్తి అయ్యాక ఈ మొత్తం అంతా 36 మాసాల కాలానికి ఫిక్సెడ్ డిపాజిట్‌లో వుంచుతారు డిపాజిటరు చివరి రోజున అక్కౌంటు మూసివేయాలనుకుంటే తప్ప ప్రతిసారి రెన్యూ అవుతూ వుంటుంది. 4వ నెల తర్వాతనుంచి డిపాజిటరుకు మూడు నెలలకోసారి వడ్డీ చెల్లిస్తారు. డిపాజిటరు కోరుకుంటే వడ్డీని (డిస్కౌంటు చేసిన విలువకు) ప్రతి నెలా కూడా ఇస్తారు.
- ఫిక్సెడ్ డిపాజిట్‌లో వేసిన తేదీనుంచి 36 నెలలు పూర్తయ్యాక ఈ పథకం నుంచి విరమించుకోవాలని డిపాజిటరు అనుకుంటే అతనికి పెద్దమొత్తమే చేతికి వస్తుంది.

రిటయిరయ్యాక ప్రశాంత జీవితానికి ఇంతకంటే మంచిదారి వుండదు.



**స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్**

హెడ్ ఆఫీసు, గన్‌ఫౌండ్రి, హైదరాబాద్-500 177

పొదుపు చేయడం అలవాటయితే సుఖశాంతులు మీవే.

Time & Space- 918 T

*With the Best Compliments From*

## ది కరీంనగర్ డిస్ట్రిక్ట్ కో ఆప్ సెంట్రల్ బ్యాంక్ లిమిటెడ్

కరీంనగర్

(స్థాపితం 1921)

| దినదినాభివృద్ధిలో | 31-5-1983నాటికి (రూ లక్షలలో) |
|---|---|
| చెల్లించిన వాటాధనం | 232 46 |
| నిల్వలు | 137 74 |
| డిపాజిట్లు | 457 16 |
| అప్పులు | 1491 55 |
| వర్కింగ్ కాపిటల్ | 2318 91 |

★ జనరంజని ★ బాలాజీ ఫిక్స్‌డ్ కమ్ రికరింగ్ ★ పెన్షన్ డిపాజిటు స్కీము ★ వాణి హయ్యర్ ఎడ్యుకేషన్ స్కీము ★ సంక్షేమ డిపాజిటు స్కీము ★ రికరింగ్ డిపాజిటు ★ స్వర్ణ క్యాష్ సర్టిఫికేట్ ★ ధనలక్ష్మి డిపాజిట్ స్కీమ్ ★ యియర్లీ ఇన్‌కం డిపాజిటు స్కీం

ఎం. ప్రభాకరరావు,
ప్రెసిడెంటు

ఎస్. కొమరయ్య, B A, H D C
జనరల్ మేనేజర్

## అంజనీ మహిళా సహకార సూపర్‌బజార్ లిమిటెడ్,



కరీంనగరం.

(రిజిష్టరు నెం 1081 టి డి)

రిజిష్టరు తేది 13-8-1979

సభ్యుల సంఖ్య 354.

| సభ్యుల మరియు ప్రభుత్వ | | |
|---|---|---|
| వాటాధనము | రూ | 70,280-00 |
| స్వంత భవనము విలువ | రూ | 4,64,000-00 |
| కొనుగోలు | రూ. | 47,29,541-00 |
| అమ్మకము | రూ. | 47,66,172-00 |
| వ్యాపార లాభం | రూ | 1,45,396-00 |
| నికర లాభం | రూ | 48,595-00 |

చేయు వ్యాపారం — వస్త్రములు, (కంట్రోలు, నాన్‌కంట్రోలు) పంచదార, బియ్యం, గోధుమలు, పప్పులు, నూనెలు, ఫ్యాన్సీ, ఇతరత్ర వస్తువులు సరసమైన ధరలకు అమ్మబడును

శ్రీమతి ఆర్. మధుబాల — అధ్యక్షులు

టి. రాధాకృష్ణ, బి ఏ — బిజినెస్ మేనేజర్

# అశోకా ట్రాక్టర్ ఏజన్సీస్

సత్తుపల్లి-507 303, ఖమ్మం జిల్లా, అం. ప్ర.



అథరైజుడు డీలర్సు : స్వరాజ్ ట్రాక్టర్సు మరియు ఎయిర్ ఫీల్ సహాతియా పుట్ పంపులు.

## రైతు సోదరులకు సువర్ణావకాశం!

**స్వరాజ్ - 735 - 39 H. P.**

**స్వరాజ్ - సర్తాజ్ - 19.5 H. P.**

పంజాబ్ ట్రాక్టర్సు లిమిటెడ్, చండీఘర్, పంజాబ్ ప్రభుత్వ అనుబంధ సంస్థ వారిచే తయారుచేయబడిన ట్రాక్టర్లు.

తక్కువ ఖర్చుతో ఎక్కువ పనిచేయుటలో జాతీయ బంగారు పతకం పొంది, అత్యంత దృఢమైన, శక్తివంతమైన కిర్లోస్కర్ వాటర్‌కూల్డు డీజల్ యింజన్లతో తయారుచేయబడి, విదేశాలకు ఎక్కువగా ఎగుమతి చేయబడుచున్న ట్రాక్టర్లు.

స్వరాజ్ ట్రాక్టర్లు తక్కువ పెట్టుబడితో కొని ఎక్కువ లాభం పొందండి.

ఉంటారు ? ఆత్మ సౌందర్యం ఉండాలి శశిరేఖకి అది లేదని ఋజువేమిటి ? ఉందనా ? ఆమె కోరి, ఏరి, తనని పెళ్లి చేసుకోవడమే దానికి ఋజువు !

"మా గొప్ప ఛాన్స్ బ్రదర్ !" అన్నారు స్నేహితులు

అవును ఆమెకి లక్షల కొద్దీ ఉంది ఆస్తి తనకి స్టేట్స్‌లో రిసెర్చికి వెళ్లే అవకాశం అట్నుంచి వొస్తే దేశానికి ఎంతైనా సేవ చెయ్యొచ్చును ఎప్పుడో కావలసిన చెల్లెలి పెళ్లి ఈసారి నిమిషాల మీద అయిపోతుంది తనకి అందమైన అమ్మాయి మాత్రమే కావాలని పట్టుపట్టి కూర్చుంటే, తన వాళ్లకీ, దేశానికి, కొంత వరకూ, తనకే, ఈ ఉపకారాలన్నీ ఎలాగ జరుగుతాయి ?

ప్రమాదకరమైన మార్గాలలో సాగుతున్నాయి ఆలోచనలు సారధి దృష్టి మళ్లీ చేతిలో ఉన్న శుభలేఖల మీదికి తిప్పుకున్నాడు ఈ శుభలేఖ లెవరికి పంపాలి అని అతనంతగా ఆలోచించాల్సిన అవసరం లేదు ముప్పైరెండు చిరునామాలు నిన్న కాలేజీలో సెండాఫ్ కొట్టే ఏర్పాటు చేసే వొచ్చాడు ఎల్లుండి వర్కింగ్ డే కాబట్టి ఆనాటికి సిద్ధంగా ఉంటాయి స్టాంపులు అతికించి పోస్ట్ చేస్తే చాలు

ఆ చిరునామాలలో మమతది లేదు —

ఊరిలోనే ఉన్న మమత కొద్దికాలం కిందటి దాకా తనని ఎన్నో ఊహా లోకాలలో విహరింపజేసి, కలలు కనిపించిన మమత

కలం తీసి, ఒక కవరుమీద ఆమె అడ్రస్ రాశాడు సారధి స్టాంపుకోసం చూశాడు కాని దొరకలేదు

అప్పుడతనికి ఆలోచన కొచ్చింది స్వయంగా వెళ్లి ఇస్తే ?

అతని మనసులో జరిగినదంతా ముల్లులాగ గుచ్చుకుంది ఆమెకి ఎదురుగా నిలబడి ఈ శుభలేఖ ఇస్తే ఆమె చూపు ఇంకా వాడి అయిన ముల్లులాగ గుచ్చుకుంటుంది కాని

ఎంత సమర్థించుకున్నా ఆమెకి తాను అన్యాయం చేశానన్న భావనని అతను ఇంక దాచుకో లేకపోయాడు కవరులో అందంగా ఒదిగి ఉన్న చక్కటి కార్డుమీద ఉండాల్సినది మమత పేరు— శశిరేఖ పేరు కవరుపైన కూడా ఉండవలసినది కాదు

రెండు నెలలేనా అయింది ఆమెని తన సహచారిణిగా జీవిత భాగస్వామినిగా ఉండమని అడిగి ?

"నేనా?— మీరు హాస్యమాడుతున్నారా ?" అంది మమత

"ఏం ? నాకేం తక్కువ ? నీ పాటి నేనూ చదువుకున్నాను ! కాకపోతే కాకి ముక్కుకి దొండపండు అంటారు ఆ మాత్రం భరించలేనా ఏం ?" అన్నాడు సారధి సగం హాస్యంగానూ సగం గంభీరంగానూ

చాలా సేపు మమత మాటలాడలేదు

ఆమెమనసులో అందగాళ్లెవరెవరు మెదులుతున్నారోనని ఈర్ష్యతోనూ బాధతోనూ ఆలోచిస్తూ కూర్చున్నాడు సారధి పార్కులో ఎంతోమంది లేరు ఎండ తీవ్రంగా ఉంది. తన ముఖంనిండా చెమట ఉందనీ జిడ్డుగా కనిపిస్తున్నాననీ ఒక్కసారి గ్రహించుకుని అప్పటికే అసహ్యంగా తయారైన రుమాలుతో మరొకసారి ముఖం తుడుచుకుంటూనే ఈ అమ్మాయి ఇంత నీట్‌గా ఎలాగ ఉండగలుగుతుందోనని మరొకసారి ఈర్ష్య పడ్డాడు సారధి ఆమె కట్టిన చీర ఖరీదు అరవై కూడా ఉండదు కాని ఎంతో విలువైనదిగా కనిపిస్తుంది,

"మీ వాళ్లని అడిగారా ?" అంది మమత

"అడగడమేమిటి మమతా ? చెప్తాను ఎమ్మెస్సీ చేశాను— వయసు ఉంది అమ్మకొంగు చాటునా నాన్న వెనకాల దాగొనే భయంలేదు నాకు" అన్నాడు సారధి వాస్తవాలు అన్నీ మరచిపోయి ఆ క్షణం ఆమెని చేతులనిండా తీసుకోవాలని ఆమె కనిపించేంత చల్లగానూ ఉంటుందో లేదో గమనివాలని— అలాటి ఆలోచనలు అతన్ని గిలిగింతలు పెట్టాయి సంవత్సరం సాన్నిహిత్యం తరవాత ఆమె తనకి ఆప్తన్నలో ఉన్నపాటి చనువు ఇచ్చిందని అతను గ్రహించి ఎంతో ఎంతో సంతోషించాడు ఆమె తన ఇంట్లో తన భార్యగా మెలుగుతూ తనకి టీ ఇవ్వడమూ, తనకి టవలు అందించడమూ ఊహించుకుని సారధి ఎంతో సరదా పడిపోయాడు

"నిజమే మీరు చాలా ధైర్యం ఉన్నవాళ్లే మీరు ఇచ్చే ఉపన్యాసాలు చాలాసార్లు విన్నానుగా ! నీ విప్లవ కవితల కాగితాలూ చదివేను కాని రెండు చిన్న కులాలవాళ్లు ప్రేమించుకుని పెళ్లి చేసుకుని నన్నుకన్నారు నేను పుట్టగానే మా నాన్న మళ్లీ పత్తా లేకుండా పరారీ అయ్యాడు మా అమ్మ ఈపాటి ఆస్తి ఎలాగ వెనకేసిందో ఎవరినడిగినా చెప్తారు" అంది మమత ఏమీ ఉద్రేకం చూపకుండా

"ఆ మాట చాలాసార్లు చెప్పేవు మమతా ! నీ తాతలనాటినించీ నీ జీవిత చరిత్ర అంతా చెప్పేవు మీ అమ్మగారు ఏం చేశారో ఎందుకు చేశారో నాకు తెలీదు — కాని ఈనాడు ఆమె దైవభక్తి నీ మీద అనురాగము తప్ప ఇంకేమీ మనసులో లేని మనిషి " అన్నాడు సారధి ఉద్రేకంగా.

"కాని - మీ వాళ్లకి అలాగ అనిపించక పోవచ్చును మీది పల్లెటూరు మీ సంప్ర

## శ్రీ తాపీ ధర్మారావు కాలధర్మం



తెలుగు రచనలో కొత్త పోకడనీ, నడకను సృష్టించిన రచయిత, పండితుడు శ్రీ తాపీ ధర్మారావుగారు తమ ఎనభై ఆరవ ఏట మే 8 వ తేదీన ఖైరతాబాదులో మరణించారు.

మదరాసులో విద్యాభ్యాసం కాగానే, రెండవ ప్రపంచ సంగ్రామంలో ప్రచార వ్యవహారాల అధికారిగా, తరువాత బొబ్బిలి రాజాగారికి కార్యదర్శిగా పని చేశారు.

శ్రీ ధర్మారావుగారి విజయ విలాస వ్యాఖ్యానానికి సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. శృంగేరి పీఠాధిపతి ఆంధ్ర భాషకు తాపీగారు చేసిన అవిరళ సేవకు సూచనగా 'ఆంధ్రవిశారద' బిరుద ప్రదానం చేశారు.

వీరికి ముగ్గురు కుమారులూ, యిద్దరు కుమార్తెలు ఉన్నారు. పెద్ద కుమారుడు తాపీ మోహనరావు మదరాసులోని 'సోవియట్ భూమి'లో పని చేస్తున్నారు. రెండవ తనయుడు ప్రముఖ దర్శకుడు తాపీ చాణక్య. మూడవ వారి పేరు అహోబలరావు.

వీరు 40 సినిమాలకు 'స్క్రిప్టు' రచించారు. ముఖ్యంగా 'మాలపిల్ల', 'రైతు బిడ్డ' చిత్రాలు ఆ రోజుల్లో ప్రజల్లో ఉత్తేజాన్నీ, సంచలనాన్నీ కలిగించాయి.

**ఆంధ్రపత్రిక 25-5-73**
**సంచిక మంచి**

దాయా లెలాటివో మీరే చెప్పేరు — ''

''వాటిని మెచ్చుకుని కాదు మమతా! అసహ్యించుకుని ఆ మాట నీకూ తెలుసును ఈ బూజులు వొదలగొట్టడమూ, నీలాటి ఉత్తమురాలిని నా భార్యగా చేసుకోవడమూ మన ద్వారా జరిగితే నా కన్నా ఆనందపడేవాడెవడూ ఉండడు!'' అన్నాడు సారథి

చిరునవ్వు నవ్వింది మమత

వెన్నెలలో మల్లెలు మందహాసం చేసినట్టు ఉంది ఎర్రటి ఆ పెదవుల వెనకాల తెల్లటి ముత్యాల సరాలు తనని వెక్కిరించినట్టు అయింది సారధికి ఆమెచుట్టూ రోజూ ఆశగా బాధగా నిర్విరామంగా తిరిగే ఎంతమందో సారధికి జ్ఞాపకం వచ్చారు వాళ్లందరితోనూ ఆమె హాయిగా మాట్లాడుతుంది రాస్కెల్స్! వాళ్లలో కొంతమంది తనకన్నా అందంగా ఉంటారు డబ్బుకూడా చాలా మందికి పుష్కలంగా ఉంది కాని మమత తనతోనే — తన ఒక్కడితోనే ఎప్పుడైనా పార్కుకి వొస్తుంది స్కవుండ్రల్స్ ఆమెతో గడిపిన గంటలనీ కుమ్మరించిన రూపాయిలనీ వర్ణిస్తూ అవన్నీ తన చెవిన పడేలాగ చూస్తారు ''ముసిలిదాని అందంచూసి ఇచ్చినదానితో మేడ కొనలేదు బ్రదర్! అందమంటే మమతది అన్నీ ఆ ఆ పిల్లవే! ఆమె ఒళ్లు '' ఇలాగ సాగుతాయి వాళ్లి డర్టీ కబుర్లు సారథి అలాటి మాట లెప్పుడూ నమ్మడు ఆమె తనని ప్రేమిస్తూంది అనీ అందుకే వీళ్లందరికీ తుచ్ఛమైన జెలసీ అనీ అందుకే ఇలాగ తన కోరికలని నోటి దురద ద్వారా తీర్చుకుంటారనీ అతనికి తెలుసును. వాళ్ళలాగ తాను మాటలాడక పోవడమూ తన సంప్రదాయమూ తన తెలివితేటలూ ఈ అంద గత్తె తనని ప్రేమించడానికి కారణాలనీ అతనికి తెలుసును

మమత కళ్లెత్తి చూసింది

''మీకు చెల్లెళ్లు ఉన్నారు మీ వాళ్లకి ఆస్తి ఉంది '' అంది

''ఆ మాత్రం నేను అర్థమవలేదా మమతా? నీకోసం నా వాళ్లనీ ఆస్తినీ అన్నీ త్యాగం చేస్తాను మువ్వంటే నాకింక ఏమీ అక్కర్లేదు నువ్వు లేకపోతే ఇవన్నీ ఎలాగా అక్కర్లేదు'' అన్నాడు అంత గొప్ప విషయాన్ని అలాగ రచయిత మాటల్లో పెట్టగలిగినందుకు గర్వపడిపోతూ తన రచనలు అచ్చు కానందుకు అతనికి కోపం వొచ్చింది ముందరి రచన ఆమె కళ్లకి అంకితం ఇవ్వాలి అలాగ — వరుసగా—

''చీకటి పడుతోంది ఇంక వెడదాం'' అంది మమత లేస్తూ సూర్యాస్తమానానికింకా గంట ఉంది కాని ఆమె లేవగానే పార్కులో చీకటి పడినట్టే అయిపోయింది

''నేనడిగినది— ఏమన్నావు? నిన్ను తలుచుకుంటూంటే నిద్దరాదు'' అన్నాడు కవిత్వంలో తేలిపోతూనే ఆమె పక్కన నడుస్తూ

''నన్ను ఆలోచించుకోనివ్వండి '' అంది

''ఎప్పటి దాకా ?''

''మళ్లీ కలుస్తాంగా ? చెప్తాను''

''అదెప్పుడు ?''

''వొచ్చే ఆదివారం నాలుగ్గంటలకి ఇక్కడికి రండి '' అంది మమత

''అప్పటిదాకా ?''

''బాగా చదవండి విప్లవాలకీ తిరుగుబాటులకీ చేతిలో డబ్బు ఉండాలి మీరు ఆర్జించాలింటే పరీక్ష బాగా రాయాలి కదా!'' అంది మమత నవ్వుతూ టాక్సీలో కూర్చుని చెయ్యి ఊపి ఆమె వెళ్లిపోయింది

సారధి కాళ్లీడ్చుకుంటూ బస్స్టాండుకి నడిచి గంటసేపు ఎదురు చూసి బస్ ఎక్కి హాస్టల్ చేరేసరికి రాత్రి ఎనిమిదయింది మమత బి ఏ పరీక్షలు నిన్నటితో అయాయి ఎల్లుండి నించి సారధి పరీక్షలు

బాగానే రాశాడు శనివారం వించీ ఆది వారం కోసం చూస్తూ గడుపుతూంటే టెలిగ్రామ్— నాన్న వొస్తున్నాడని మర్నాడు ఉదయం

(ఇంకా ఉంది)

# అర్థశతాబ్దిలో పత్రికలలో కలిగిన పరిణామం

శ్రీ తిరుమల రామచంద్ర

(1) బ్రిటిష్ పరిపాలన ప్రాభవం ప్రోది చేయగా తెలుగు సారస్వతంలో పూచిన పొన్నలలో ఒకటి పత్రికా రచన క్రైస్తవ పాదిరీలు తమ మత ప్రచారం కోసం తెలుగు ముద్రణ యంత్రాలు నెలకొల్పి, కరపత్రాలను, పుస్తకాలను ముద్రించడం ప్రారంభించారు ఈ ముద్రణ వంగరాష్ట్ర రాజధాని (అప్పటి భారత రాజధాని) అయిన కలకత్తా సమీపంలోని శ్రీరాంపూర్‌లో మొదలై చెన్నరాష్ట్రానికి తరలి వచ్చింది

(2) ముద్రణ సౌకర్యం లభించడంతో 19వ శతాబ్ది రెండవ పాదంలో తెలుగు పత్రికలు వెలిశాయి ఇలా వెలసిన తొలి తెలుగు వారపత్రిక సత్యదూత (1835) రెండవది వృత్తాంతిని (1838) మూడవది వర్తమాన తరంగిణి (1842) ఇవి, తర్వాత వచ్చిన పత్రికలు ప్రధానంగా సారస్వత సాంఘిక విషయాలను మాత్రమే ప్రచురించేవి కొన్ని పత్రికలు శబ్ద చర్చలమీద, ఆచార్య వ్యవహారాలమీద కోడిపుంజుల పోరితం సాగించేవి దీనికి ఉదాహరణ కందుకూరి వీరేశలింగం పంతులు, కొక్కొండ వెంకటరత్నం పంతులుగార్ల పత్రికలు. అముద్రిత గ్రంథ చింతామణి వంటివి ప్రాచీన గ్రంధాలను భాగాలు భాగాలుగా ధారావాహికంగా ప్రచురించేవి

(3) గాజుల లక్ష్మీనరసింహసెట్టిగారు క్రిసెంట్ అనే ఆంగ్ల వారపత్రికను 1942 అక్టోబర్ 2వ తేదీని ప్రారంభించి దక్షిణ భారత దేశంలో రాజకీయ చైతన్యం కలిగించారు తెలుగులోను రాజకీయ పత్రికలు అవసరమని ప్రజలు గుర్తించారు ఒక తెల్లదొర కడపలో ఒక రాజకీయ వారపత్రికను ప్రచురించాడు ఇదే తొలి తెలుగు రాజకీయ పత్రిక ఇంగ్లీషు దొరతనం వారి హుకుంలు, తాఖీదుల అనువాదాలు ఈ పత్రికలో అచ్చయ్యేవి ఒకమారు రాజప్రతినిధిగారు జారీ చేసిన హుకుమును అనువాదకుడు తలక్రిందులుగా అనువదించడంవల్ల పెద్ద రభస జరిగింది పత్రికా యజమాని తెల్లదొర కావడంతో బ్రతికి పోయాడు ఈ ఉదంతం తర్వాత పత్రికా రంగంలో వచ్చిన మార్పు ప్రత్యేకాధికారిని ప్రభుత్వం నియమించడం నాటి నుంచి ఈ పీడ పత్రికలకు ఏదో రూపంలో అంటుకొనే వుంది

(4) తర్వాత స్థానికులే రాజకీయ పత్రికలు నెలకొల్పారు ఈ విధంగా వెలువడిన తొలి రాజకీయ పత్రిక శ్రీ యక్షిణి (1863 – బళ్లారి) అంటే, తొలి తెలుగు పత్రిక వెలువడిన ఇరవయ్యేళ్ళకు గాని రాజకీయపత్రిక వెలువడ లేదు పిదప స్వదేశ జన ప్రసిద్ధాభిప్రాయము (1865), లోకరంజని (1875), శశిరేఖ (1894) మున్నగు పత్రికలు వెలువడ్డాయి వీటిలో రాజకీయాలతోపాటు సాహిత్యాది విషయాలు వుండేవి 1885లో భారత జాతీయ కాంగ్రెస్ అవతరణతో దేశంలో రాజకీయ చైతన్యం వ్యాప్తి చెందసాగింది

(5) పెరుగుతున్న జాతీయోద్యమాన్ని ప్రతిబింబించడం కోసం, తెలుగువారిలో సర్వతో ముఖజాగృతికోసం, ఆధునిక విజ్ఞానాన్ని అంది వ్వడం కోసం అప్పటి దేశభక్తులైన నవయువకులు పూనుకున్నారు కాంగ్రెస్ వాది, దేశభక్తుడు అయిన ఎ పి పార్థసారధి నాయుడుగారు ఆంధ్ర ప్రకాశిక అనే వారపత్రిక స్థాపించి, 25 సంవత్సరాలపాటు సంపాదకుడుగా వుండి ప్రభుత్వాన్ని నిర్భయంగా విమర్శించారు ఈ వారపత్రిక తర్వాత కొంతకాలం వారానికి రెండు మార్లు వెలువడేది జాతీయోద్యమ దృష్టితో వచ్చిన పత్రికలు కృష్ణా పత్రిక (1902) స్వరాజ్య (1906 – రాజమండ్రి), నవయుగ (1907), ఆంధ్రకేసరి (చిలుకూరి వీరభద్ర రావు – 1908), సాధన (అనంతపురం – 1915) మున్నగునవి కృష్ణా పత్రికకు తొలుత కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావు గార్లు సంపాదకులుగా వున్నారు రెండు సంవత్స రాల తర్వాత ముట్నూరు కృష్ణారావుగారు సంపాదకులయి, ద్వితీయ యుద్ధ సమయం వరకు అవిచ్ఛిన్నంగా నిర్వహించారు తర్వాత

## శ్రీ తెన్నేటి విశ్వనాధం అస్తమయం



'విశ్వనాధంగార్ని' వరించని పదవి లేదు– కాని ఆయన "నీతి" కోసం "ప్రజల"కోసం వదులుకొనని పదవి లేదు. రాజకీయాలలో నీతి సూత్రాలకి లావు కల్పించిన నిష్కళంక దేశభక్తుడు, గాంధేయవాది, ప్రకాశం పంతులుగారి చెలికాడు – ఆంధ్రులు గర్వించదగ్గ నాయకుడు – శ్రీ 'తెన్నేటి' తమ 84 వ ఏట నవంబర్ పదవ తేదీ రాత్రి విశాఖపట్నంలో "గుండెపోటు" తో కీర్తిశేషులైనారు. వారి "మృతి" ఉగాది తరుణంలో ఆంధ్రులకే గాక భారత దేశానికే తీరని లోటు, అని రాష్ట్రపతి మొదలు సామాన్య పౌరుని వరకూ అంతా ఆ మహనీయుని దివ్య స్మృతికి శ్రద్ధాంజలి ఘటించారు– ఈ "ప్రజల మనిషి" చివరి రోజు దాకా ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొం టూనే వున్నారు. ✱

ఆంధ్రపత్రిక 30-11-79
పంచిక నుంచి

అది రెండు దశాబ్దాలు మనగలిగింది స్వరాజ్య సంపాదకులు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు

(6) అప్పటికే గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల సేవతో సుప్రసిద్ధులయ్యారు ఆయన సత్యాగ్రహ పద్ధతులు భారతీయులకు నచ్చాయి, ముఖ్యంగా తెలుగువారయిన కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు వంటివారికి గాంధీజీ అడుగుజాడలలో దేశసేవ, ఆంధ్రుల సమగ్రాభివృద్ధి ప్రధానలక్ష్యంగా వెలువడిన తొలి వారపత్రిక ఆంధ్రపత్రిక ఇది 1908లో బొంబాయి నుంచి వెలువడినా, క్రమంగా జాతీయోద్యమం తెలుగునాట పుంజుకొనడంతో మద్రాసుకు తరలివచ్చి తొలి దినపత్రికగా మారింది. అప్పుడు దాని సైజు అరడెమ్మీ.

(7) ఆనాడు తెలుగులో పత్రికానుభవం గలవారు లేరు, పత్రికా పరిభాషకూడ లేదు. కనుక పత్రికకు సంబంధించిన ప్రధాన పరిభాషను వంగభాష నుంచి గ్రహించారు — పత్రిక సంపాదకుడు, విలేఖకుడు మొదలుగా అలాగే పత్రిక స్వరూప స్వభావాలను గురించి కూడ తెలుగువారికి ఎక్కువ పరిచయం లేదు



(ఆంధ్రపత్రిక 1921 జూన్ 8 పంచిక నుంచి)

# శ్రీ సి.డి. దేశ్‌ముఖ్

ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త, మహా మేధావి, పరిపాలనాదక్షుడు శ్రీ చింతామణి ద్వారకానాధ్ దేశ్‌ముఖ్ అక్టోబరు 2వ తేదీ రాత్రి హైదరాబాదులోని ఆంధ్ర మహిళా నర్సింగ్ హోంలో తమ అంతిమ శ్వాస విడిచారు. శ్రీ దేశ్‌ముఖ్ బ్రిటిష్ వారి పాలనలో రిజర్వ్ బాంక్ గవర్నర్‌గా నియమింపబడిన తొలి భారతీయుడు నెహ్రూ మంత్రివర్గంలో ఆర్థికమంత్రిగా పనిచేశారు. ప్రభుత్వంలో ఉన్నత పదవులనెన్నిటినో సమర్థవంతంగా నిర్వహించారు.

నఖశిఖ పర్యంతం పాశ్చాత్య నాగరికత పుణికి పుచ్చుకున్నట్లు కన్పించే శ్రీదేశ్‌ముఖ్‌కి భారతీయ సంస్కృతిపట్ల ఎనలేని విశ్వాసం ఉండేది. సంస్కృతంలో ఆయన చక్కని పండితుడు, గ్రంథకర్త. ఆయన సతీమణి శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ మరణానంతరం ఆంధ్ర మహిళా సభ అధ్యక్షులుగా ఆ సంస్థకి సేవ చేశారు హైదరాబాదులోని తమ నివాస గృహం 'రచన'ని ఆంధ్ర మహిళా నర్సింగ్‌హోంకి కానుకగా యిచ్చారు. శ్రీ దేశ్‌ముఖ్ మరణంతో దేశం ఒక మహామేధావిని కోల్పోయింది.

ఆంధ్రపత్రిక 5-11-82 సంచిక నుంచి

ఆమాటకు వస్తే నూరేళ్ల క్రిందట పుట్టిన హిందూ పత్రికకు కూడలేదు అది అప్పటి లండన్ టైమ్స్‌ను అన్ని విధాల అనుకరించింది లండన్ టైమ్స్ చాల ప్రతిష్ఠగలది పత్రికా నీతికి పూర్తిగా కట్టుబడి వుండేది గనుక గౌరవం గల ఆనాటి తెలుగు పత్రికలు కూడ దాని పద్ధతినే అనుసరించడం సహజం మన మొదటి దినపత్రిక అయిన ఆంధ్రపత్రిక కూడ అదే వరవడిని నడచింది ఉదాహరణకు వార్తలకు సాధారణంగా లేబిల్ హెడ్డింగులే ఇచ్చేవారు అంటే — రాజమండ్రి వార్తలు, విజయవాడ వార్తలు, ఢిల్లీ వార్తలు ఇత్యాదిగా. ఈ పద్ధతి 1932 లోను కనిపిస్తుంది.

"తిరుపతి

(స్వకీయ విలేఖరి)

32—ఫిబ్రవరి 5

క్రిమినల్ లా చట్టము అరెస్టు. ▪ నెలల కరిన శిక్ష. 4–2–32 తేదీ సాయంకాలము సుమారు 41/2 ఘంటలకు శ్రీయుత తిరుమల రామచంద్రాచార్లు అనువారు తిరుపతి బజారు వీధిలో బహిష్కరింపబడిన, చేతితో వ్రాయబడిన కరపత్రములను పంచిపెట్టిరనియు, పోలీసు స్టేషనుకు వచ్చి హెడ్ కానిస్టేబిల్ వద్ద ఒక కాపీని కూడ ఇచ్చినట్లును తెలియుచున్నది సదరు హెడ్ కానిస్టేబిలు దానిని చదివి చూచుకొని వీరిని అరెస్టు చేసి స్పెషల్ రిపోర్టుతో సబ్‌ఇన్‌స్పెక్టర్‌గారికి సాయంకాలము 5 కు పైగా హాజరు చేసిరి. వీరివద్ద నుండిన 150 కరపత్రములనుకూడ పోలీసువారు వశపరచుకొనిరి.

క్రమంగా ఆంధ్రపత్రికలో ఈ లేబిల్ హెడ్డింగులను, సింగిల్ కాలంలను విసర్జించి, విషయ ప్రాధాన్యానికి అనువుగా శీర్షిక లివ్వడం ప్రారంభమయింది. తర్వాత వచ్చిన దినపత్రికలకు ఇది వరవడి అయింది.

(8) ఇది ఇలా వుండగా, తెలుగు దేశంలో వచ్చిన రాజకీయ పరిణామాలు పత్రికలలో పెద్ద మార్పులు తెచ్చాయి కాంగ్రెస్‌వారు విదేశీ వస్త్ర బహిష్కరణం, సత్యాగ్రహం, సహాయ నిరాకరణం వంటి సౌమ్య సాధనాలతో విస్తృత స్వాతంత్ర్యాన్ని సాధించడం కోసం పోరాడుతూ సత్యాగ్రహాలలో కారాగారాలను నింపుతున్న సమయంలో, జమీందార్లు, వారిలాటివారు బ్రిటిష్ ఛత్రచ్ఛాయలో పరిమిత స్వాతంత్ర్యం చాలునని, దాని సాధనకు జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీలాంటి నూతన రాజకీయ పక్షాలు నెలకొల్పుకొన్నారు. ఆ పార్టీలకు అధికార పత్రికలూ పుట్టాయి; అవే సమదర్శిని, జనవాణి లాంటివి. ఈ పత్రికలు రాజకీయంగా ఏమి చేసినా, ఏమి వ్రాసినా పత్రికా రంగంలో పెద్ద మార్పులు తెచ్చాయి అంతవరకు తెలుగు దేశంలో వున్న రాజకీయ పత్రికలు ప్రౌఢ గ్రాంధిక భాషనో, సరళ గ్రాంధికాన్నో వాడుతూండేవి వ్యాపార ప్రకటనలకు కూడ గ్రాంధికమే ఉదాహరణకు 1934 ఫిబ్రవరి 4 నాటి కృష్ణా పత్రిక నుంచి మూడు అంశాలు ఉట్టంకిస్తాను

(అ) సంపాదకీయం — రౌండు టేబిలు రౌండు టేబిలు తతంగమంతయు బయటపడినది అర్ధమరేయి అరదళపు అలంకారము అడుగంటినది పగటివేళల మసిబొగ్గుచాయ బయటపడినది మన రౌండు టేబిలు ప్రతినిధులు లోకము నెంతకాలము మభ్యపెట్టగిలరు

(ఆ) వార్త — భూమి తనఖా బ్యాంకులు మదరాసు ప్రభుత్వమువారు సహకారపు భూమి తనఖా బ్యాంకులను ప్రయోజనకరములు కావించి, వాని నిర్వహణమున కానుకూల్యము ఘటించుటకై మదరాసు శాసనసభలో నొక బిల్లును ప్రవేశపెట్టుదురని ప్రకటింపబడినది

(ఇ) అడ్వర్‌టైజ్‌మెంట్ — క్షీరవర్ధని శిశుపోషణకు అత్యుత్తమము పిల్లలపాలిటి కామధేనువు. తల్లికి నూతన శక్తిని, ఉత్సాహమునుపుట్టించును శిశువునకారోగ్యమును నానందమును కలిగించును తల్లియొక్క శ్రమను తగ్గించును, తండ్రి వ్యయము తగ్గించును

జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీ పత్రికలు తమ వాదాన్ని విశేష వ్యాప్తిలోకి తేవడానికి వాడుక భాషను ప్రవేశపెట్టాయి దీనివల్లనైతేనేమి, జాతీయోద్యమోద్ధతివల్ల నైతేనేమి, జస్టిస్ పార్టీవారు, జమీందారులు తమ వారిని కూడ గిట్టుకోడానికి చేసిన ప్రయత్నమయితేనేమి వాడుక భాషలోని పత్రికకు ప్రచారం ఎక్కువ వస్తుందన్న సంగతి రుజువయింది నాటినుంచి పత్రికా రంగంలో అప్పుడప్పుడు సరళగ్రాంధికం కనిపించినప్పటికీ మొత్తంమీద వాడుక భాష పత్రికా భాషగా రూపొందింది. పూర్తిగా వాడుక భాషలో వచ్చిన మొదటి దినపత్రిక తెలుగులో మలి దినపత్రిక ఆంధ్రప్రభ (1938) ఆంధ్రప్రభలో భాష మొదటినుంచి చివరివరకు ఏకరీతిగాను, సరళంగాను వుండడానికి కారణం వాడుకభాషలో వెలువడే జనవాణి మూతపడడంతో అందులో పనిచేసిన నార్ల వేంకటేశ్వరరావుగారు దీనిలో చేరడం, సంపాదకులు న్యాపతి నారాయణమూర్తిగారు వ్యవహార భాషావాది కావడమూ కావచ్చు ఈ పరిణామం తర్వాత ఆంధ్రపత్రికకూడ గ్రాంధికాన్ని వార్తలలో విసర్జించడం మొదలుపెట్టింది **(ఇంకావుంది)**

# మీరు మా వైశ్యాబ్యాంక్ సేవింగ్స్ ఖాతాలో చేరడానికి ప్రోత్సహించే నాలుగు లాభదాయకమైన సౌకర్యాలు



**4 అదనపు సౌకర్యాలు :**
మా సేవింగ్స్‌బ్యాంక్ ఖాతాదారులందరు ఈ దిగువ నుదహరించిన నాలుగు ఆకర్ష-ణీయమైన ప్రత్యేక అదనపు సౌకర్యాలను పొందుటకు అర్హులు :



నెలకు రు 5000/-లు వరకు కమీషను లేకుండ మెయిల్ ట్రాన్స్‌ఫర్/ డిమాండ్ డ్రాఫ్టులు పంపబడును.



నెలకు రు 5000/-లు వరకు ఇతర ప్రాంతాల చెక్కులు / డిమాండ్ డ్రాఫ్టులు / డివిడెండ్ వారంట్లు / నెలవారీ జీతపు బిల్లులు / పెన్షన్-బిల్లులు వసూళ్ళమీద కమీషను లేదు.



రు 3000/-లు వరకు వసూలుకొరకు అనుమతిపొందిన చెక్కులు అనగా! గవర్నమెంటు / గవర్నమెంటు ఆధ్వ ర్యములో నున్న సంస్థలు / జీవితబీమా / డిమాండ్ డ్రాఫ్టులు మరియు డివిడెండ్ వారంట్లు తక్షణమే క్రెడిట్ చేయబడును.



నెలకు రు 500/-లు గాని, రు 500/-లకు మించని 50 శాతం నికరం నెలజీతం మీదగాని ప్రత్యేక పరిస్థితు లలో తాత్కాలిక ఓవర్ డ్రాఫ్ట్ సౌకర్యం కలదు.

ఇంతవరకు మీరు మా ఖాతాదార్లు కాకపోయి నట్లయితే తక్షణమే రు 5/-లు చెల్లించి లాభదాయకమైన ఈ సౌకర్యాలను జారవిడువ కుండా సేవింగ్స్ ఖాతాను నేడే తెరవండి.

వైశ్యాబ్యాంక్ – ఒక షెడ్యూలుబ్యాంక్, 250 కి మించిన శాఖలతో గత 58 సంవత్స రాలుగా తమ ఖాతాదారులకు నమ్మకమైన, స్నేహపూరితమైన తన సేవలను అందిస్తోంది.

ప్రజల నమ్మకాలకు, ఆదరాభిమానాలకు ఆలవాలమైన విశిష్టమైన సేవే, దేశంలో ప్రైవేటు యాజమాన్యపు బ్యాంకులలో వైశ్యాబ్యాంక్ అగ్రగామిగా విజయవంతంగా ముందుకు సాగడానికి మూలకారణం.

**వైశ్యాబ్యాంక్ : మీ యావత్తు కుటుంబానికి అనువైన చక్కటి బ్యాంక్.**



## ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీసు :
అవెన్యూరోడ్, బెంగుళూరు-560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు 72 సెయింట్ మార్క్స్‌రోడ్, బెంగుళూరు-560 001.
ఛైర్మన్ : శ్రీ టి. కె. కె. భగవత్.



# హిందూగృహిణి

పానుగంటి లక్ష్మీనరసింహారావు

వారు తెలినాటి నియోగులు వారివే గోలకొండ నేపారుఁ. అందరు వారు మాతనముగా వైష్ణవ మత స్వీకరణ మొనర్చినవారు మిగుల వృద్ధులు భర్తకు డెబ్బదియైదు వత్సరములు భార్య కఱువది తొమ్మిది వారు పరమ దరిద్రులు వారి కొక్క పుత్రుడు అతని కేఁబది వత్సరము లుండెను అతనికిఁ బుత్ర పుత్రికా సంతాన మేమియులేదు భార్యయందు బద్ధానురాగుఁడై వర్తించుచుండెను నలువది రెండు సంవత్సరములు దాటిన పిదప నామె గర్భము ధరించెను ఆ గర్భవతియైన కాంతయం దాకాంతున కెంత యనురాగముండెనో యాతనికే తెలియఁదగినది నేటికిఁ బౌత్రదర్శనమగును గదా యని, వృద్ధ దంపతులుప్పొంగిపోయిరి. కోడలికిఁ బ్రసవవేదన యారంభమయ్యెను కొడుకు గలుగునఁ వారు సంతసించుచుండగాఁ గూఁతురు జన్మించెను దైవకటాక్షమున నిఁక ముందుఁ బుత్రుఁడు కలుగఁగూడదాయని వారు త్తలపడుచున్న చిత్తములను సమాధానపఱచుకొనిరి పుట్టిన మూఁడవ నాఁడాబిడ్డ చనిపోయెను ఆఱవనాఁడు సూతికా జ్వరమున బాలెంతరాలు తన తనువు విడిచెను సంసారవృద్ధి కాలేదని వారిదివఱ కేడ్చుచుండఁగా నిప్పుడిట్లయ్యెను ఆహా భగవదనుగ్రహము!

అన్నము తినక, నీరైన ద్రావక, సంతత భార్యా దుఃఖ సంతప్తుఁడై, యామెపోయిన మూఁడవమాసమున భర్త కూడఁ బోయెను అయ్యో! ఇఁక నేమున్నది మనుమరాలులేదు కోడలులేదు ఉన్న యొక్క కొడుకు కూఁ నెగిరిపోయెను. అయ్యో! ఇంక నేమున్నది? కొడుకా కొడుకా యని యేడ్చుచున్న వృద్ధదంపతులు మాత్రము మిగిలిరి ఏగియో వైదిక వృతి చేసికొని దినమున కొక్కరూపాయ తెచ్చి కుటుంబమునకు క్షామబాధ లేకుండఁ గాపాడుచున్న యొక్క కొడుకు గూడ మన్నయినాఁడు ఓ భగవానుడా! ఆ కుటుంబము గతి యింకనేమి?

ఏమగుఁట కేమున్నది డెబ్బదియైదు వత్సరముల యా యపుత్రకుఁడు నడుమున కంగవస్త్రమును జుట్టఁబెట్టుకొని కఱ్ఱ చేతఁబట్టుకొని యింటిలోనున్న నిలువుబోడి రాగిచెంబును జేతబుచ్చుకొని గ్రామమున భిక్షాటన మారంభించెను నాలుగిండ్లు తిరిగి తవ్వెడు మాకలు తేఁగఁ బుత్రశోకముచేఁ బొగులుచున్న గృహిణి యింత గంజికాచుచుండెను అది యొక్క పూట ద్రావి కృష్ణనామస్మరణ మొనర్చుకొనుచు దాటాకుల పంచపాలిలోఁ బడి వారు కాలముఁ గడుపుచుండిరి

ఇట్లొక్కమాసము గడవకుండానే, యాయనకు వ్యాధి యారంభమయ్యెను ఆతఁ డీఁతాకుఁ చాఁపపైఁ బండుకొని జ్వరపీడితుఁడై బాధపడుచుండ, భార్య కాళు లొత్తుచుఁ బైఁటచెఱఁగున నీఁగలను దోలుచుఁ దలనొత్తుచు నడుమ నడుమ గన్నులొత్తుకొనుచు దైవసముఁడగు భర్త కుపచారము చేయుచుండెను. డెబ్బది యైదేండ్లవాఁడు ఆఱుముగ్గినపండు జ్వరపీడితుఁడై యున్ననేమి? లంఘనము కట్ట వచ్చునా? ఏదైనా? గంజి త్రాగుట కీయవలయును గాదా లేకున్నఁ బ్రాణములు శోషిల్లవా వృద్ధులకు బాలురకు శోషవచ్చుట యెంతో సేపా లేచి ప్రొయ్యిమంట వేసి, బియ్యము కొరకు రాగిచెంబు చూడఁగ దానిలో నొక్క బియ్యపుగింజయైన లేదు హా! కృష్ణ యని నాలుగిండ్లకుఁ బోయి పిడికెడు చొప్పున నాలుగు పిడికిళ్ల బియ్యము పైటలోఁబోసి తెచ్చి గంజి కాచి యిచ్చి, భర్తపైఁ జేయి వైచుకొని యెట్లున్నది, యెట్లున్నదని నడుమ నడుమ నడుగుచు, నప్పుడప్పు డాతనికిఁ బోసిన చెమ్మటను బైఁట చెఱఁగున నిమ్మళముగా నొత్తుచు, నిలువేల్పులకు మ్రొక్కుకొనుచు భర్త ప్రక్కను గూరుచుండి యాతని సేవించుచుండెను ఇఁకను రెండు పిడికళ్ల బియ్య మింటిలో నున్నవి అవి వండుకొని తాను భుజించినయెడల రాత్రి భర్త

## విజయవాడ ఇంద్రకీలాద్రిపై వేంచేసియున్న శ్రీ కనకదుర్గాంబ

పవిత్ర కృష్ణవేణీ నదీతీరాన ఇంద్రకీలాద్రియందు శ్రీ కనకదుర్గ స్వయం వ్యక్తమై ఆవిర్భవించిన, మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వతీ త్రిమూర్త్యాత్మికయగు పరాశక్తి. ఈ దుర్గాదేవి శత్రు సంహారిణి, వరప్రదాయిని, శాంతిస్వరూపిణియై భక్తుల మనోభీష్టములను నెరవేర్చు కల్పవల్లి. పూర్వయుగములందు అగస్త్య మహర్షి, పరశురాముడు, శ్రీరామచంద్రుడు మరియు పాండవులచే ఆరాధింపబడినది దుర్గాదేవి. కలియుగమున ఆదిశంకరులచే పూజింపబడి శ్రీచక్రము ప్రతిష్ఠింపబడినందున నాటినుండియు యీ దుర్గాదేవి సాత్విక రూపిణియై సర్వజనులు పూజించుట కనువుగా వైదికమార్గమున పూజింపబడుచున్నది. దానవ సంహార క్రమమున 'రక్తబీజుని' సంహరించుటచే శక్తిస్వరూపిణిగను, మాంగల్య ప్రదముగుటం చేసియును, ముఖ్యముగా 'కుంకుమపూజ' యే యిచట నిత్యము జరుగుచున్నది. శుక్రవారమున విశేషించి భక్తులు తమ యభీష్టసిద్ధికై కుంకుమ పూజలు జరిపించుకొందురు. దసరా నవరాత్రములందు శరన్నవరాత్ర ప్రయుక్తముగ విశేషోత్సవములు వివిధాలంకారములతో శ్రీ అమ్మవారిని అలంకరించి విశేషపూజలు నిర్వహింపబడును.

ఈ క్షేత్రము శివభక్తులకు అధిష్ఠానముగుటచే శ్రీ మల్లేశ్వరస్వామి యిచట ప్రత్యేకముగా శివాలయము నందు అగస్త్యమహర్షిచే ప్రతిష్ఠింపబడి పూజింపబడును. పాండవ మధ్యముండగు అర్జునుడు పాశుపతాస్త్రమునకై యిచట శివుని యనుగ్రహమునకు తపమ్ము నొనరించెను. అర్జునుని పరీక్షించుటకై శివుడు కిరాతరూపమున మల్లయుద్ధము చేయుటవలన యీ స్వామి మల్లేశ్వరుడని ప్రఖ్యాతి నొందెను.

# హిందూ గృహిణి...

కిచ్చుటకు వేడిగంజి మెదుకులుండవని యామె భుజింపక యూరకుండెను భర్తకుఁ జెమ్మట బాగుగాఁబట్టుచున్నది జ్వరము వదలుచున్నదని భార్య సంతసించెను కాని యాతని మాటలో యేటఁబడుచున్నది అప్పుడు భార్యను జూచి యాతడిట్లనియెను

భర్త — నాకు నీరసమెక్కువగా నున్నది తనువు నిల్చునని తోఁపదు నేను నీతో నొక్క మాటఁ జెప్పవలయునని యున్నది చెప్పనా ?

భార్య నాథా! ఇట్లు నన్నడగ వలయునా — ఏమి యాజ్ఞాపింతురో చేతులు కట్టుకొని చేయుదును

భర్త — నేనింక బ్రదుకను

భార్య — మీ రట్లనఁదగదు నాకుఁ బుణ్యస్త్రీ మరణమున్నదని నే నెఱుఁగుదును

భర్త — కావచ్చును నీవు నన్నేఁబది యైదు సంవత్సరములనుండి సేవించుచుంటివి నా కీకోరిక యున్నదని నిన్నెప్పుడైనా నడిగితినా? నీవు నాకుఁ జేసిన యుపచారమునకు దేవతలు మెచ్చఁదగినది నా కిప్పుడొక్క కోర్కె కలిగినది నేను శక్తి హీనుఁడనై యున్నాను అది నీవు తీర్చవలయును

భార్య —ఎన్నండులేని దిట్లడుగుదురేల ? మీ యాజ్ఞ యేదో సెలవిండు

భర్త — అటులైనఁ జెప్పెదను వినుము మన యింటిలో నిల్వరాగిచెంబున్నదే — ఆ చెంబెడు బియ్యము చెంబుతోఁగూడ రెండురూపా యలు దక్షిణతోఁగూడ నొక శ్రీవైష్ణవునికి దానమీయవలయునని యున్నది అది నా కెట్లు సమకూడునా యని యోజించుచున్నాను

భార్య — ఇంతేకద — ఒక్క గడియలో మీరట్లు సేయవచ్చును

అంత వేగమ లేచి క్రొత్తదారపు బొందు నకుఁ బసపురాచి, గూటిలో నున్న పసపుకొమ్ము దాని నడుమను గట్టి మెడకుఁ గట్టికొని పుస్తె లున్న బొందును విప్పి వాని మూడఁదీసి రాగిచెంబు చేత పుచ్చుకొని, కోమటి యింటికిఁబోయి పుస్తెల నమ్మఁబూనెను కోమటి అయిదు రూపాయల నిచ్చెదనని చెప్పెను "చాలు నాయనా" యని యాసొమ్ము తీసికొని రాగి చెంబునిండ బియ్యము పోయించి దాని విలువను గోమటికిచ్చి సంభ్రమముతో ఇంటికివచ్చుచు దారిలోఁ గానఁబడిన యొక శ్రీవైష్ణవుని వెంటఁ బెట్టుకొని తన యింటికిఁబోయెను భర్తయా దానమొనర్చెను 'నీ పుణ్యమున నా కోర్కె తీరినదని యాతఁడు సంతుష్టమనస్కుఁ డయ్యెను కాని యాతనికిఁ నీరస మెక్కువగా మన్నది. 'నారాయణ నారాయణ'యని స్మరించు కొనుమఁ బందుకొనెను భార్య యాతని పాదముల యొద్దఁ గూరుచుండి వానిని గన్నుల కద్దుకొనుచుండెను ఆమెను పిలిచి నేను లోపల నారాయణా యని స్మరించుకొనుచునే యున్నాను ఎప్పుడు విస్మృతివచ్చునో—నీవు కూడ నా చెవిలో నారాయణస్మరణము చేయు చుండుమనెను అంత భార్య భర్త తల వైపున గూర్చుండి యటొనర్చు చుండెను ఒక్క నిముసమట్లా చరించునంతలో నాతని కొక్క యెక్కులాగున వచ్చెను కాళ్లుచేతులు బిగిసెను ఒడలు మొద్దు లాగున నయ్యెను ఊపిరి స్తంభించెను. ఆమె 'కృష్ణ! కృష్ణ!' యని వెరికేక వైచి కొయ్యయై కూరుచున్న పాళముగనే ముందునకుఁ బడిపోయెను ఆమె మొగ మాతని మొగముపై బడుట వలననో యామె వెఱ్ఱికేక మూలముననో యాతఁడులికిపడెను ఎక్కుగూడ ఎదలిపోయెను కొంత స్మృతి తెచ్చుకొని భార్యను బిలిచెను ఇంక నెక్కడి భార్య ? ఆమె మహాలక్ష్మి సన్నిధానమును నిముసము క్రిందనే చేరెను భర్త నారాయణ యనుచు బ్రాణములు విడిచెను ●

ఆంధ్రపత్రిక 1920 అక్టోబరు 13



ఆంధ్ర సచిత్ర వార పత్రిక 1962 ఫిబ్రవరి 2 సంచికనుంచి

*Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.*



గోదాదేవి — చిత్రం : కొండపల్లి శేషగిరిరావు, హైదరాబాదు.



ప్రియమిత్రుడు,
గురువు, దైవం,
తోడు, నీడ
సర్వస్వం అయిన
నాపతి పరమేశ్వరుడు
శ్రీ సి. ఎ.
రామకృష్ణారెడ్డిగారి
దివ్య స్మృతికి!

ప్రియ బంధూ!

వజ్రాలు, వైఢూర్యాలు, మరకతాలు, మాణిక్యాలు, రత్నాలు, ముత్యాలు నీ పాదాలముందు కుప్పగాపోసి ఆరాధించాలని నా మనస్సులోనిమాట ఈ ప్రపంచంలోని పూలన్నీ మాలగాగుచ్చి నీ కంఠసీమ నలంకరించాలని నా చిరకాల వాంఛితం సదా నీ అధరాలపై చిరునవ్వుల వెన్నెలలు చూడాలని నా జీవితాశయం కాని కాని

ప్రియమిత్రమా!

నిన్ను నిత్యం కనులారా వీక్షించుకునే భాగ్యంలేకుండా సుదూర తీరాలకి వెళ్ళిపోయేవు నిత్యం జ్ఞాపకాల చితిమంటల్లో ద్రిగ్గళ్ళుతూ నిన్ను కలుసుకునే క్షణంకోసం నిరీక్షించడమే నాకు మిగిలింది నీ సాన్నిధ్యంలో మాత్రమే యీ జీవంలేని ఆత్మ కనులుతెరిచేది!

నీ అడుగుల చప్పుడుకై సదా
నిరీక్షించే నీ ముద్దుల
**'అనూ'**
(తనయ)

నీకు మాత్రమే అంకితమైన
నీ ప్రియబాంధవి
**'శకుంతలాదేవి'**
(అర్ధాంగి)

# మహాకవి గురజాడ అప్పారావు స్మృతి

## ఉషశ్రీ

ఒకవైపునుండి జాతీయవాదం స్వాతంత్ర్య సముపార్జనా ప్రయత్నంలో దేశం నలుమూలలా వ్యాపించి విజృంభిస్తోంది మహానాయకుని అడుగుజాడలలో, జాతీయ సంస్థ అధ్వర్యంలో, త్రివర్ణ పతాకచ్ఛాయల క్రింద నిర్ణీత కార్యక్రమంలో ముందడుగు వేస్తోంది జాతీయత వన్నె, చిన్నెలతో తీర్చి దిద్దబడుతోంది స్వీయ పరిపాలనావాంఛ ప్రబలం కాసాగింది మరో ప్రక్కనుంచి హరిజన దేవాలయ ప్రవేశం, వితంతు వివాహం, బాల్య వివాహ నిషేధం మొదలైనవాటితో సాంఘిక సంస్కారం జరుగుతోంది నూతన సామాజిక వ్యవస్థకు శిలాన్యాసం చేయబడింది ప్రగతిపథానికి ప్రతిబంధకాలైన 'సాంప్రదాయిక' శృంఖలాలు విడగొట్టబడుతున్నై ఆచారాల పేరుతో 'జనత'ను అధఃపతనానికి గొనిపోతూన్న పెద్దల పలుకుబడి క్షీణదశకు రాసాగింది నాలుగు గోడలమధ్యలో నలిగిపోతు వెలుగుబాట లెరుగని నారీ జగత్తు గృహపరిధులలోనుండి బైటికి రాసాగింది

జాతీయవాదం — సంఘసంస్కారం సమ్యక్ సమ్మిళితములై అడుగడుగునా అడ్డతగిలే చాతుర్వర్ణ్యవ్యవస్థపై సమ్మెటపెట్టు పెట్టినై కుల, మత, వర్ణ, వర్గాది విభేదాలు అఖాతాలలో సమాధి కట్టుకుంటున్నై

ఆ యీ సాంఘిక, జాతీయ సంస్కార భావాల పరిణామ ప్రకాశాల పర్యవసానంగా నూతన సామాజిక వ్యవస్థ నెలకొనసాగింది ఈ సామాజికుల దృక్పథం ప్రగతి పథం వైపూ, విజ్ఞానం వైపూ మరలసాగింది సామాన్య శ్రామిక జగతికి విజ్ఞాన వాంఛ కలిగింది జ్ఞానసముపార్జనా ప్రయత్నం మొలకలెత్తింది

సామాన్య 'జనత'కు కలిగిన వైజ్ఞానిక తృష్ణ తీరాలంటే విద్య నేర్వాలి అక్షరాస్యులు కావాలి అయితే విద్యావిజ్ఞానాలు ఆనాటి వరకూ స్వల్పసంఖ్యాకులైన ఒకే ఒక ప్రత్యేక వర్ణానికి చెందినవారి నేలభోషణాలు కావటం వల్ల అది సర్వసామాన్యులకు ప్రయోజనకారియైన రీతులలో లేవు ఈనాడు కలిగిన విజ్ఞాన తృష్ణ అగ్రవర్గీయుల ఆస్తిపై సర్వసమానత్వ శాసనంతో దాడిచేసి విద్యా విజ్ఞానాలు కాయకష్టంపడే శ్రామికుడు వరకూ అందుబాటులో ఉండాలంది కాని ఈ తృష్ణను చల్లార్చటానికి ఆ సాహిత్యం కాని, ▪ వాఙ్మయం కాని ఉపయోగం కాలేదు ఒక కొత్త భాష, కొత్త సాహిత్యం సృష్టి చేయివలసి వచ్చింది

ఆంధ్రపత్రిక – సచిత్ర వారపత్రిక
1949 డిసెంబరు 7 సంచిక నుంచి



పాతవుంతలలో పొర్లుతూ, మార్పుకి భయపడే సనాతనులు కొందరు ఈ నూతన వాందం మీద భీకర దండయాత్ర ప్రారంభించారు ఆ మహా విమల సమర ఫలితంగా "వ్యావహారిక భాష" గ్రంథాలలోకి రావలసి వచ్చింది నాటి వరకూ సాహిత్యం పాండిత్యప్రకర్షా ప్రదర్శనలలో చర్వితచర్వణమై 'జనత'కు ఉపకరించే విధానంలో లేకపోవటం మాత్రమే కాకుండా అర్థం కాకుండా పోయింది జనతకు సులభగ్రాహ్యమై, సుబోధకమయే వ్యావహారిక భాషా సాహిత్య పథనిర్మాణం చేయవలసి వచ్చింది పథనిర్మాత కోసం 'జనత' ఎదురుతెన్నులు చూస్తోంది —

జాతీయ సాంఘిక పరిణామ వికాసాలను చూస్తూన్న యువలోకం భవిష్యత్తును గూర్చి సుందరస్వప్న కానుభూతుల్ని పొందుతోంది సర్వతోముఖంగా పురోగమించే సమాజానికి సాహిత్యం నిరాశను కలిగిస్తోంది పాతపై రోత ప్రకోపించింది కొత్త యింకా యేర్పడలేదు వైదేశిక సాహిత్య రంగాలలోని ప్రగతిపథాలు యువకులలో చైతన్యం కలిగించినై ఆ ప్రగతి పథ నిర్మాత కోసం తపస్సు చేస్తున్నారు

ఛందోశృంఖలాబద్ధులై, సమాసపదపటాటోపాలతో ప్రదర్శనా లిప్తున్న పండితకవులపై కఠోరకుఠారాఘాతం పెడుతున్నాడు గిడుగు పిడుగు తెగిపోయిన తీగెలతో తెలుగు సాహితిమ తల్లి ముంజేత నున్న సువర్ణమాణిక్యవీణకు నూతన తంత్రులు మేళవించాడు —

నిర్మలవినీలాకాశాన అలముకొన్న కారు మేఘాలు చెల్లాచెదరైనై విహాయసాన ప్రాగ్భాగాన రంగురంగుల రంగవల్లు లలంకరించుకొని ప్రత్యాహ్వానంచేస్తూ నిలబడింది ఉషారాణి క్షణ క్షణ పరివర్తితో మస్పంధ్యారోచిస్సుల మధ్యనుండి అమృతకలశం చేతబట్టి ఆవిర్భవించిన అమరమూర్తి శ్రీ గురజాడ ఆశలు ఫలించినై — సుస్వాగతం గురజాడా !

నవ్యకవిత్వ రూపకానికి తెరయెత్తారు గిడుగు సూత్రధారియై నాందీప్రస్తావనలు చేశాడు నాయక పాత్రధారియై రంగస్థలావతరణం చేసి ఉత్తమ నాయకుడై "కన్యాశుల్కం" సమర్పించి పోయిన స్వర్ణశిల్పి శ్రీ గురజాడ



సాహితిమతల్లి మాణిక్యపీఠాపై మృదు మధుర మంజుమంజులకంఠ మెత్తి "కొత్తపాతల మేలుకలయిక" పాడిన పాటకుడు, వైణికుడు శ్రీ గురజాడ

అతడు గొంతెత్తి పాడిన పాటలు తెలుగు తల్లి కంఠసీమ నలంకరించినై "ముత్యాల సరాలు"గా —

'వేమన్న'ను గూర్చి కరుణశ్రీ
కాగుడెంతాలలో డిప్పకాయగూడ
అప్పగించును నీ "ఉప్పు కప్పురంబు"
అని చెప్పినట్లు గురజాడకుకూడా
"కాగుడెంతాలలో డిప్పకాయగూడ
వల్లెవేయును నీ "దేశభక్తి" పాట —
అని అన్వయించుకోవచ్చు

ఈనాడు ధారాళంగా సాగిపోతూన్న నవకవిత్వ వాహినికి మార్గదర్శి గురజాడ—మహాకవి—యుగపురుషుడు — సంస్కర్త —

ముచ్చటగా మూడుముక్కలలో తెలుగుదేశ చరిత్ర చెప్పవలసివస్తే ఒకచోట వచ్చితీరతాడ శ్రీ గురజాడ —

జోహార్ ! అమరకవీ !!

# జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ,

## కరీంనగరము.

గ్రామాలలో నివసించు బడుగు వర్గాల ఆర్థిక సాంఘిక పరిస్థితుల మెరుగు పరచుటకై భారత ప్రభుత్వ ఆదేశానుసారముల మేరకు రాష్ట్రప్రభుత్వము 1976వ సంవత్సరము కరీంనగరము జిల్లాలో సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థను 1 50 కోట్లతో ప్రారంభించబడెను సంస్థ కార్యక్రమములు ఆరంభములో జిల్లాలోని (7) సమితులకు మాత్రమే పరిమితమై యుండెను జాతీయ విధానముల ననుసరించి జిల్లాలోని అన్ని సమితులకు సంస్థ కార్యక్రమముల 1981–82 సంవత్సరములో అమలు పరచుటకు నిర్ణయించబడెను సన్నకారురైతుల అభివృద్ధి సంస్థ సన్నకారు, చిన్నకారు మరియు వ్యవసాయ కూలీల సంక్షేమములకు మాత్రమే వుద్దేశింపబడినది కాని గ్రామీణాభివృద్ధి సంస్థ కార్యక్రమముల పరిధి లోనికి పై వర్గాలు కాక గ్రామీణ వృత్తిపనులవారు, వ్యవసాయేతర కూలీలనుకూడ చేర్చబడినది, సంస్థ ప్రారంభించినప్పటినుండి జూలై 1983 మాసాంతరమువరకు వివిధ కార్యక్రమముల క్రింద సాధించిన ప్రగతి ఈ దిగువ పొందు పరచనైనది

1 జిల్లాలో మొత్తము 6.65 లక్షలమంది సన్నకారు, చిన్నకారు మరియు వ్యవసాయ కూలీలు, గ్రామీణ వృత్తి పనివారు మరియు వ్యవసాయేతర కూలీలు వుండగా యిప్పటి వరకు 94,156 మంది సంస్థచే గుర్తించబడి 56,970మంది లాభముపొందిరి.

2 ఈ సంస్థ ప్రారంభించబడినప్పటినుండి 5.66 కోట్లు రూపాయలు సబ్సిడీ రూపేణా పంపిణీ చేయబడినది.

3. సంస్థ చేపట్టిన వివిధ ఆర్థిక కార్యక్రమములకై రూ 8.40 కోట్లు పరపతి సౌకర్యములు సహకార, వ్యాపార బ్యాంకులద్వారా కల్పించబడెను.

4. ఇప్పటివరకు 5,298 వ్యవసాయ బావులకు, 2,085 సామూహిక బావులకు మరియు 5,348 పంపుసెట్లకు సబ్సిడీ మంజూరీ చేయనైనది.

5. ఉపాధి కల్పన పథకము క్రింద 1,313 మంది గ్రామీణ యువకులకు శిక్షణ యిప్పించనైనది.

5. గ్రామాలలోని రైతులకు యిప్పటివరకు 3,607 ఎడ్ల జతలు పంపిణీ చేయనైనది.

7. గ్రామీణ ప్రజల ఆర్థిక పరిస్థితులు మెరుగుపరుచుకార్యక్రమము క్రింద 4,219 పాడిపశువులను పంపిణీ చేయనైనది.

8. కుటీర పరిశ్రమలు మరియు వ్యాపార విభాగములందు 3,390 కుటుంబములకు ఆర్థిక సహాయము అందచేయనైనది.

ఆర్. చంద్రశేఖర్, ఐ ఏ. యస్.
కలెక్టరు/అధ్యక్షులు.

యం. కోటయ్య, బి.కాం.,
ప్రాజెక్టు డైరెక్టరు.



సీరియల్

# జీవనమురళి

## కొండముది శ్రీరామచంద్రమూర్తి

(గత సంచిక తరువాయి)

పరమేశ్వరాన్ని వెంటబెట్టుకుని మురళీకృష్ణ కొద్ది అడుగులు వేశాడో లేదో విద్యార్థి యూనియన్ ప్రతినిధులు కొందరతన్ని కలుసుకున్నారు "మాకేం చెప్పకుండా వెళ్ళిపోతున్నారేం ?" అని అడిగారు

"ఏం చెప్పమంటారు ? ఇండొనీషియాలో, ఫ్రాంసులో, జర్మనీలో విద్యార్థులు ప్రభుత్వాల్నే మార్చారు ఇక్కడ తమ హెడ్మాష్టరును డిస్మిస్ చేస్తున్నా వాళ్ళకు చీమ కుట్టినట్లు కూడా వుండదు"

"ఏం చెయ్యమంటారో చెప్పండి! ట్రాఫిక్ నాపమంటారా ? హర్తాళ్ చేయించమంటారా ? స్ట్రయిక్ ఆర్గనైజ్ చెయ్యమంటారా ?" స్టూడెంట్ ప్రెసిడెంట్ గంభీరంగా అడిగాడు

"ఆ ఇంద్రసేన్ చేసిన పనికి ఎవరో ఎందుకు బాధపడాలి ?"

"అయితే ఆ ఇంద్రసేన్‌కే ఒక గుణపాఠం చెబుతాం !"

"మీ హెడ్మాష్టరుగారి గౌరవమే కాపాడతారో, తోకలు ముడిచేసి ఇళ్ళకు పారిపోతారో చూస్తానుగా !" మురళీకృష్ణ కవ్వింపుగా అన్నాడు

"చూస్తారు కదా ?" వాళ్ళు బెట్ చేసి మరీ వెళ్ళారు

వాళ్ళటు వెళ్ళింతర్వాత పరమేశ్వరం అడిగాడు, "ఎందుకురా మురళీ, వాళ్ళను రెచ్చగొట్టావ్ ?"

"ముల్లును ముల్లుతోనే తీయాలి నాన్నా! నన్ను ఒంటరివాణ్ని చేసి దెబ్బ కొట్టాడు ఆ ఇందర్ సేన్ ! మహాగ్ని గోళాల్లాంటి ఈ విద్యార్థుల ముందు అతణ్ని ఒంటరివాణ్ని చేస్తున్నాను ! టిట్ ఫర్ టాట్ !!"

"మన స్వార్థం కోసం వాళ్ళను వాడుకోవడం నాకు పాపం అనిపిస్తోందిరా ?"

"కాసేపు ఈ పాపపుణ్యాలను అవతల పెట్టండి నాన్నా ! హింసను హింస తప్ప అణచలేదు !"

తండ్రీ కొడుకులిద్దరూ ఆ విషయమై ఇంటికి వచ్చేవరకూ వాదించుకొంటూనే వున్నారు భోజనాల దగ్గర కూడా ఆ విషయం ప్రస్తావనకు రానే వచ్చింది

"నీకుద్యోగం తిరిగివస్తే మంచిదే కాని అబ్బాయీ, ఆ చెక్కెందుకు ఇచ్చేశావూ ?" అన్నది వర్ధనమ్మ సాలోచనగా

"ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తూ ఆ చెక్కును మార్చుకోవడం తప్పు బామ్మా ! నీ అభిప్రాయం ఏవిటి జీవనా ?"

"ఈ విషయంలో నేనేం చెప్పగలనూ ? సెవెన్త్ క్లాస్ గ్రాడ్యుయేట్ని !"

"అట్లా అనకు జీవనా! కొన్ని విషయాల్లో చదువుకున్నవాడికన్న చాకలాడు మేలంటారు" అన్నది వర్ధనమ్మ తన సహజ ధోరణిలో

ఆ మాట విన్న జీవన తెల్లబోయింది "మామ్మగారు– నన్ను చాకల్తో సమానం చేశారు !"

"నిన్ను కాదే వెర్రితల్లీ– సామెత చెప్పాను లోకజ్ఞానం కావాలని దాని అర్థం గడపలోకి వచ్చిన డబ్బును పోగొట్టుకోవడం ఎందుకని నా అభిప్రాయం మరి నువ్వేమంటావో విందామనీ"

జీవన ఓ క్షణంసేపు ఆలోచించింది "జారిపోతే కూడదీసుకో వీలున్నవికొన్ని, చేజారిపోతే పగిలిపోయేవి మరికొన్ని డబ్బును ఎప్పుడన్నా మనం సంపాయించుకోవచ్చు కానీ గౌరవాన్ని ముక్కలు చేసుకుంటే బ్రతుక్కు విలువే పోతుంది"

పరమేశ్వరం ప్రశంసాపూర్వకంగా జీవన వేపు చూశాడు అవునన్నట్టు మురళీకృష్ణ తలాడించాడు "ఇంకేం ? పిల్లిద్దరికీ నువ్వొకత్తెవు తోడయ్యావన్నమాట !" అన్నది వర్ధనమ్మ అవతలికి లేచి వెళ్తూ

ఇంతలో వీధిలోకి ఏదో కారు వచ్చి వాళ్ళ ఇంటి ముందు మెల్లగా ఆగినట్లయింది "పరమేశ్వరంగారు" అని కొన్ని కంఠాలరుస్తుంటే, "జిందాబాద్" అని మరికొన్ని అరుస్తున్నాయి

"డౌన్ డౌన్ !"

"ఇంద్రసేన్ !"

మురళీకృష్ణ, పరమేశ్వరం, జీవన, వర్ధనమ్మ హాల్లోకి వచ్చేసరికే కారు దిగి ఇంద్రసేన్ నాగలింగం, పరంధామయ్య లోపలకు వస్తున్నారు వీధిలో వందలాది విద్యార్థులు పతాకాలు, నినాదాల బేనర్లు చేతబుచ్చుకుని, ఇసుక వేస్తే రాలకుండా వున్నారు

ఇంద్రసేన్ చచ్చిన పాములా లోపలకు వచ్చాడు అతని మొహంమీద ఒకటి రెండు గాయాలున్నాయి. వాటి మంచి నెత్తురు

**జరిగిన కథ – 6 :** ఇంద్రసేన్ పరమేశ్వరంగారిని సర్వీసు నుంచి సస్పెండు చేస్తాడు ఆయన స్కూలులో జరిగిన విషయాలన్నీ కుటుంబ సభ్యులతో చెపుతారు తన తండ్రికి జరిగిన అవమానం విన్న మురళీకృష్ణ కోపంతో ఇంద్రసేన్ ఇంటికి వెళ్ళి, తన తండ్రిని సస్పెండ్ చేయడానికి గల రీజన్స్ చెప్పమని అడుగుతాడు ఇంద్రసేన్ సరైన కారణాలు చెప్పలేకపోతాడు నాగలింగం పెట్టిన షరతులు విన్న మురళీకృష్ణ ఆవేశానికి లోనవుతాడు ఇంద్రసేన్ తన మనుష్యులచేత మురళీకృష్ణను బయటకు గెంటిస్తాడు అసలు ఇలా జరగటానికి కారణం జీవనే అన్నట్టుగా బామ్మ నిందించగా ఆమె వెళ్ళిపోతుండగా బామ్మే జీవనను ఇంటికి తీసుకువస్తుంది మురళీకృష్ణ, పరమేశ్వరం స్కూల్ స్టాఫ్‌తో కలసి యాజమాన్యంతో ఫైట్ చేయటానికి ప్రయత్నిస్తుంటారు

కారుతోంది నాగలింగం గజగజ వణికిపోతున్నాడు.

"అయ్యా— హెడ్‌మాష్టర్ పరమేశ్వరం గారూ! తప్పయిపోయింది క్షమించాలి నన్ను మీరు మానాన్న వయసువారు, మా నాన్నలాంటి వారు ఈ స్కూలు మీది, మీరే దాన్ని మళ్ళీ పూర్వంలాగా నడిపించండి. ఇదిగో మీ ఆఫీసు తాళాలు మీమీద సస్పెన్షనూ లేదు, డిస్మిసూ ఇయ్యలేదు మీకు మేము చెక్కూ ఇవ్వలేదు. మీరు పుచ్చుకోనూ లేదు!" అన్నాడు ఇంద్రసేన్.

"ఇదిగో సార్ మీకు ఈ అపాయింట్‌మెంట్ ఆర్డరు!" నాగలింగం కాగితం అందించాడు.

పరమేశ్వరం అతనికి దగ్గరగా నడిచాడు. జీవనవేపు తిరిగి "తల్లీ! వారు మన స్కూలు ప్రెసిడెంటుగారమ్మా— కాస్త కాఫీ తెచ్చి పెడతావూ, రాకరాక మన ఇంటికి వచ్చారు!"

జీవన, వర్ధనమ్మ లోపలకు వెళ్ళారు కాఫీ కలపడానికి

"మహా ప్రభో! మాకు కాఫీ టీ లేవీ అక్కర్లేదు ఈ ఆర్డరు కాయితం తీసుకుని, సరేనని వొప్పేసుకుని, బయటికి వచ్చి, అబ్బాయిలూ వెళ్ళిపొండి అని ఒక ముక్క వాళ్ళతో చెప్పేస్తే చాలు, మేం వెళ్ళిపోతాం!" అన్నాడు నాగలింగం

"ఆర్డరు కాయితం తీసుకోడానికి అభ్యంతరం ఏం లేదు కానీండి, మీ పద్ధతుల ప్రకారం నేను పరిపాలన సాగించలేనే!" అన్నాడు పరమేశ్వరం

"అయ్యా! అడ్డు పెట్టిన గూర్ఖాకు ముక్కిరిగింది అడ్డు వచ్చిన కన్నదాసుకు కాళ్ళిరిగాయి టెలిఫోన్ తీగలు తెగిపోయాయి. సోఫాలు చినిగిపోయాయి దొరవారికి కళ్ళు పోయేంత పనైంది వాళ్ళు స్టూడెంట్స్ కారు బాబూ, చిచ్చురపిడుగులు వాళ్ళతో మాకేవిటి? మీతో మాకు పనేవిటి? ఎవరి బ్రతుకులు వాళ్ళు బ్రతుకుదాం రాజీ చేసేసుకుందాం!" అన్నాడు నాగలింగం ఆర్ద్రంపుగా.

లోపలినుండి జీవన ట్రేలో పెట్టి కాఫీ కప్పుల్ని తీసుకువచ్చింది

"ముందు కాఫీ తీసుకోండి!" మురళీకృష్ణ అన్నాడు

తీసేసుకోకపోతే ఏం చిక్కోనని వెంటనే తీసుకున్నాడు నాగలింగం

"పూర్వం లాగానే నడిపించమని చెప్పా కదా!" అన్నాడు ఇంద్రసేన్ — అంటూ కాఫీ కప్పును చేతిలోకి తీసుకున్నాడు

కాఫీ తాగేసి, మరోమారు క్షమాపణలు చెప్పేసి, నాగలింగం, ఇంద్రసేన్ కారెక్కి వెళ్ళిపోయారు వాళ్ళు వెళ్ళిపోతున్నప్పుడు వాళ్ళకు వ్యతిరేకంగా విద్యార్థులు మరిన్ని నినాదాలు చేశారు

## జీవన మురళి

"వాళ్ళూ, మీరూ కలిసి ఈ ఉద్యోగం కిరీటాన్ని నా నెత్తిన పెట్టారు మళ్ళీ సరిగా నిర్వహించగలనంటారా?" అన్నాడు పరమేశ్వరం, పరంధామయ్యతో బయటి కేకలు వింటూ

"మేమందరం ముక్తకంఠంతో ఈ తీర్మానం ప్యాసుచేశాం. ఆ తీర్మానం పాఠాన్ని టీచర్ల తరవున అందజేద్దామని నేను వెళ్ళాను. నా వెనకాలే వచ్చారు ఈ ఆటంబాంబులు అక్కడ ఇల్లు పీకి పందిరేశారు!" అన్నాడు పరంధామయ్య

[ఇంకా వుంది]



శ్రీనాథ్ మూవీస్




# రాజకుమార్

నిర్మాత: ఆలపాటి రంగారావు  దర్శకత్వం: గుత్తా రామినీడు  నిర్మాణ-నిర్వహణ: కోగంటి భాస్కరరావు

---

B.H.V.N. రాజు సమర్పించు శ్రీ బాల బాలాజీ కంబైన్స్




ఈ నలుగురు
ఆడపిల్లలు
తెలుగింటి
పడుచులకు
ప్రతిరూపాలు!

చూడండి!

# ఈ పిల్లకు పెళ్ళవుతుందా?



దర్శకత్వం: వేజెళ్ళ సత్యనారాయణ  నిర్మాత: B.H. అజయ్ కుమార్

# ఈనాడు వర్ణచిత్రాలు ఆనాడు సువర్ణచిత్రాలు

## — శ్రీమతి శాంతకుమారి



★ **ఈ** మధ్య మీరు చూసిన చిత్రాలలో మీకు బాగా నచ్చిన చిత్రమేదంటారు ?

నేనసలు సినిమాలు చూసి కొంత కాలమైంది నా రెండు కళ్ళకూ కేటరాక్ట్ ఆపరేషన్ జరిగింది కళ్ళవెంబడి ఎప్పుడూ నీళ్ళు కారుతూంటాయి అంచేత, అరగంట మించి ఏ సినిమానూ చూడలేను పైగా వెన్నుపోటొకటి, ఎక్కువసేపు కూర్చోలేను కూడా ఆరో పడిలో అడుగెట్టాను కదా ? ఐతే, ఇలాంటి పరిస్థితిలోనూ నేనొక చిత్రాన్ని పూర్తిగా చూశాను. విచిత్రమేమిటంటే — ఆ చిత్రాన్ని చూస్తున్నంతసేపూ కళ్ళనుండి నీరు రాలేదు కాని, ఆ చిత్రంలోని కరుణ రసానికి నా హృదయం ఎంతగా ద్రవించి పోయిందో చెప్పలేను వెన్నెముక కూడా పోటు పెట్టలేదంటే నమ్మండి తీరా చిత్రాన్ని పొంతం చూశాకే నా కళ్ళు చెమ్మగిల్లాయి — ఆనందబాష్పాలతో

ఆ చిత్రం ఏమిటో చెప్పడానికి ముందు చాలాకాలం క్రితం జరిగిన ఓ విషయం చెప్పాలి

''చిననాటి స్నేహితులు'' చిత్రంలో నన్ను బుక్ చేసినప్పుడు ''మా డైరెక్టర్‌గారిని మీకు కథ వినిపించడానికి ఎప్పుడు పంపించ మన్నారు ?'' అన్నారు నిర్మాత

''డైరెక్టర్ గారు మా ఇంటికి రావడమా ? నేనే మీ ఆఫీసుకొచ్చి కథ వింటాను,'' అన్నాను.

నేనో మాటంటే ఈనాటి ఆర్టిస్టులు నవ్వుకుంటారేమో !

నిర్మాత, దర్శకులంటే తండ్రి, గురువూ కంటే గొప్పగా, మా భవిష్యత్తుకు బాట వేసే భగవంతుళ్ళుగా భావించే కాలం అది ఆనాడు దర్శకుడే సర్వాధికారి నాటి చలన చిత్ర జగతిలోని స్వర్ణయుగంలో నటిగా వెలుగొందిన అదృష్టవంతురాళ్ళల్లో నేనూ ఒకతెను

సరే . అసలు విషయానికి వస్తాం కంపెనీ కారు వచ్చింది బయలుదేరాను ▪ ఆఫీసులో చిన్న శాస్త్రులు ''రండమ్మా !'' అంటూ నవ్వుతూ స్వాగతం పలికాడు ఆ అబ్బాయిని చిన్న శాస్త్రులనీ, వాళ్ళ నాన్న గారిని పెద్ద శాస్త్రులనీ పిలిచేవాళ్ళం ఆ చిన్న శాస్త్రి సౌండ్ ఇంజనీర్‌గా వాహినీ స్టూడియోలో సదాకాకీ యూనిఫామ్‌లో కనిపించేవాడు ఇప్పుడుకూడా అవే దుస్తుల్లో ఉన్నాడు ''నువ్విక్కడున్నావేమిటి, చినశాస్త్రీ ?'' అన్నాను. ''ఈ పిక్చర్‌కు నేనేనమ్మా డైరెక్టర్‌ను,'' అన్నాడు. ''నీ ఇల్లు బంగారంగానూ ! నువ్వెప్పుడు డైరెక్టర్‌వయ్యావు, నాయనా ?'' అన్నాను ఆ చిన్నశాస్త్రే డైరెక్టర్ విశ్వనాథ్ అని ఈపాటికి మీరు ఊహించి ఉంటారు విశ్వం కథ వినిపించాడు. అతను కథ వినిపిస్తూంటే, అంతా కళ్ళకు కట్టినట్లుగా ఉంది కాని, నా పాత్ర మాత్రం కాస్త విచిత్రంగా కొత్త తంహాలో ఉంది ''నేనెప్పుడూ ఏవో ఏడ్చే పాత్రలేగాని, వచ్చీరాని ఇంగ్లీషు మాట్లాడే ఈ హాస్య పాత్రను చేయగలనా ?'' అన్నాను ''మీరు కాకపోతే ఇంకెవరు చేస్తారు ? ఎన్. టి రామారావుగారు కూడా మీరే ఆ పాత్రకు కరెక్ట్‌గా సూట్ అవుతారని చెప్పారు'' అన్నాడు విశ్వం

ఆ రోజుల్లో మేము చక్కని వెరైటీ పాత్రల కోసం తపించేవాళ్ళం వచ్చిన పాత్రను ఎలా మెప్పించాలా అని కృషి చేసేవాళ్ళం నటనలో పోటీ పడేవాళ్ళం.

ఇప్పుడీ కామెడీ పాత్రలో నన్ను ప్రజలు ఎలా రిసీవ్ చేసుకుంటారోనని భయపడి పోయాను. కాని, చివరికి అంతా మెచ్చు కున్నారు అలాగే 'కలిసొచ్చిన అదృష్టం' చిత్రంలో కూడా విశ్వం నాచేత మరో కొత్త పాత్రను అందరి మెప్పు పొందేలా చేయించాడు

విశ్వంది పరుగెత్తి పాలు తాగే స్వభావం కాదు. అతని తపన, శ్రద్ధాసక్తులు — మా తరం నాటి దర్శకులను గుర్తుకు తెచ్చాయి. ఆనాటి దర్శకులు క్రమశిక్షణకు బద్ధులైనవారు వృత్తిమీద, సినిమా కళమీద అమితమైన విశ్వాసం, దీక్ష గలవారు తమ ప్రావీణ్యం చూపించడమే వారి ధ్యేయం. విశ్వంలో ఆ లక్షణాలు కనిపించాయి

అతను డైరెక్ట్ చేసిన ''శంకరాభరణం'. చిత్రం చాలా గొప్పగా ఉందని అందరూ అంటూంటే, ఒంట్లో ఓపిక లేకపోయినా — ఎలాగో థియేటర్‌లోకి వెళ్ళి కూర్చున్నా అంతే నన్ను నేను మర్చిపోయా పిక్చర్ పూర్తయ్యేదాకా నేను కదలలేదు, మెదలలేదు పిక్చర్ పూర్తయ్యాక ''మా చినశాస్త్రి ఏడీ? అతన్ని ముద్దులతో ముంచెత్తాలి,'' అంటూ ఇటు అటు చూశాను కనిపించలేదు ఆ తర్వాత అతనింటికి ఫోన్ చేసి, గంటసేపు ఆ చిత్రంలోని ప్రతి సీన్ గురించి చెప్పి, మనసారా అభినందించాను

చెప్పొచ్చేదేమిటంటే — వేగం, ఉద్వేగం గల చిత్రాల కోసం నేడు ప్రజలు బాగా ఎగబడుతూన్న రోజుల్లో — శాస్త్రీయ సంగీతం ప్రధానంగా ఒక ఇతివృత్తాన్ని రూపొందించి, అయిదు పదులు దాటిన సోమయాజులుగారిని హీరోగా వేసి, వేంప్ పాత్రలు ధరించే మంజుభార్గవిచేత నాయిక వేషం వేయించి ఆ చిత్రాన్ని హిట్ చేయించి బహుముఖ ప్రశంసలందుకున్నాడు మా చిన్నశాస్త్రి !

కాని, ఆ ఒక్క చిత్రంతో ప్రేక్షకులు కాస్త మారినట్లనిపించినా — ఆ తర్వాత అదే స్థాయిగల చిత్రాలు రాకపోవడంతో మళ్ళీ మామూలు వేగం, ఉద్వేగం గల చిత్రాలకు అలవాటు పడిపోయారు

తప్పెవరిది ?

పి. ▪ పి.

ఆంధ్రసచిత్ర వారపత్రిక

వజ్రోత్సవ సందర్భముగా మా శుభాకాంక్షలు



# తెలుగుచిత్రాల భవిష్యత్తు కాలమే నిర్ణయిస్తుంది!!

★ **మ**న తెలుగు చిత్రాలలో కాలాను గుణంగా వచ్చిన పరిణామాలపట్ల మీ అభిప్రాయమేమిటి ?

చాలా మంది విజ్ఞులు, సంస్కార వంతులు, ప్రాతికేయులు, పెద్దలు, నిజంగా ఈ సినిమా పరిశ్రమపట్ల ప్రేమాభిమానాలు గల వారు "రోజు రోజుకీ రాసి హెచ్చుతున్నప్పటికీ వాసి తరిగిపోతోంది," అని బాధ పడుతున్నారు... నిజమే... మన అచ్చ తెలుగులో సామెత ఉండనే ఉంది కూడా మంది ఎక్కువైతే మజ్జిగ పల్చనవుతుందని. అంచేత, చిత్రాలసంఖ్య పెరుగుతున్నకొద్దీ చిత్రాల్లో సరుకు తగ్గడం సహజమే.

ముఖ్యంగా పాశ్చాత్య చిత్రాలలోని హింసా, అశ్లీల శృంగార ప్రభావం మన చిత్రాలలో బలంగా చోటు చేసుకున్నాయి.

ఇది మనకు బాధాకరమైన విషయమే. ఈ అనారోగ్యకరమైన పరిణామాలకు చిత్ర పరిశ్రమకు బయటఉన్న శ్రేయోభిలాషులు, హితులు ఎంత బాధపడుతున్నారో; ప్రతి నిత్యం పరిశ్రమలో ఉండి పని చేస్తున్న మాలాంటి 'చాదస్తులం' ఎలా ఉండి ఉంటామో మీరు ఊహించు కోవచ్చు.

పది సంవత్సరాల క్రితం నేను కొందరు మిత్రులతోపాటు అమెరికా, జపాన్ వగైరా దేశాలలో పర్యటించాను. ఆనాడు ఏ పేటలోచూసినా ఏ వీధిలో చూసినా ప్రతి థియేటర్‌లోనూ కామ క్రీడలు, శృంగార లీలల చిత్రాలు తప్ప మరో ఇతివృత్తం లేదు; మరో కథలేదు. ఏమిటీ వింత మార్పు ! — అని నిర్ఘాంతపోయాను. మార్లిన్ బ్రాండోవంటి గొప్ప నటుడు అలాంటి 'లాస్ట్ టాంగో ఇన్ పారిస్' చిత్రంలో నటించడంచూసి భరించలేక జుగుప్సా భావంతో మధ్యలోనే లేచి బయటకు వచ్చేశాను.

నాలాంటి చాదస్తకాలపు ఆంగ్ల నటీమణి ఒక మాట అన్నది: "ఇన్ ప్రీవియస్ డేస్ వుయ్ వర్ ప్లేయింగ్ సేక్రెడ్ 'పార్ట్స్'. బట్, నౌ వుయ్ ఆర్ షోయింగ్ అవర్ 'సీక్రెట్ పార్ట్స్' !"

ఆ దేశాల్లో ఇంకా... విచ్చలవిడిగా, బహిరంగంగా అమ్ముడుపోతున్న కొన్ని వస్తువులు, వాటి విశేషాలు— వివరాలు పత్రికల్లో కూడా రాయదగినవీకావు; చదవదగినవీ కావు. సమాజం అంతటి దీనావస్థకు దిగజారిపోయింది. సభ్య సమాజం ఆర్థికంగా ఎంతో ముందంజవేసి, శాస్త్రీయ పరిజ్ఞానాన్ని సంతరించుకొని— సాంకేతిక నైపుణ్యంతో మరో లోకంలోకి ప్రయాణం చేసే అంతరిక్ష నౌకలను కనిపెట్టి, చంద్ర మండలంమీద కాలు మోపేంతటి పరిజ్ఞానాన్ని సంతరించుకున్న ఈ జాతి మరో వైపున ఈ స్థితికి దిగజారిపోయిందా అని నిర్వేదంతో, బాధతో నేను నిర్వీర్యుడ్నయి పోయిన మాట మాత్రం నిజం.



★ ఐతే, ఇదివరకటి లాంటి ఉదాత్తమైన కథలుగల చక్కని చిత్రాలు మళ్ళీ రావంటారా ?

ఇందాక నేను చెప్పినవన్నీ సహజ పరిణామాలే, మనం దీనికి ఆందోళన చెందవలసిన అవసరం లేదు. కాలాను గుణంగా ఇలాంటి ఆటు పోట్లు తప్పవు.

ఇవాళ మళ్ళా అభివృద్ధి చెందిన అమెరికా, యూరోప్ వగైరా దేశాలలో సినిమాలు చూసే వారి దృక్పథంలోనూ, తీసే వారి దృక్పథంలోనూ చాలా మార్పులు వచ్చాయని కొందరిమూలంగా వింటున్నాను. క్రమ క్రమంగా మళ్ళా చక్కని మానవత్వపు విలువలున్న కథలను, ప్రయోజనాత్మకమైన ఇతివృత్తాలను ఎన్నుకొని, అత్యుత్తమమైన చిత్రాలను నిర్మిస్తున్నారు. దీనికి ప్రత్యక్షసాక్ష్యం "గాంధీ"చిత్రం. ఈ చిత్రానికి పాశ్చాత్యదేశాలలో ఇంతటి విశేషాదరణ లభిస్తుందని బహుశా రిచర్డ్ అటెన్‌బరోకూడా ఊహించి ఉండడు. అటు మేధావులలోనూ, ఇటు సామాన్య ప్రజలలోను కూడా అంతటి సంచలనాన్ని రేకెత్తించిన చిత్రం. ఈనాడు ఏ ఇద్దరు మిత్రులు కలుసుకున్నా (వారు భారతీయులు కాదు సుమండీ) వారు పరస్పరం వేసుకునే కుశలప్రశ్న "మీరు గాంధిచిత్రం చూశారా?" అని. ఇది వింటున్నప్పుడు భారతీయుడుగా, అటువంటి మహాత్ముడు ఉదయించిన దేశంలోపుట్టిన భారతీయుడుగా— ఎంతటి మహదానందం కలుగుతుందో నేను వివరించవలసిన అవసరం లేదు.

చివరికి ఒక్కటి మాత్రం నిజం. కొండ కొనకు చేరుకున్నదేదైనా కింద పడిపోకతప్పదు. ఇప్పుడా స్థాయికి చేరుకున్న హింసా, అశ్లీల శృంగార చిత్రాలగతికూడా అంతే.

మహాకవి శ్రీ శ్రీ

"నిజంగానే నిఖిలలోకం
నిండు హర్షం వహిస్తుందా ?
మానవాళికి నిజంగానే
మంచికాలం రహిస్తుందా ?" అన్నారు.

పరిణామ సిద్ధాంతం ప్రకారం మంచికాలం వస్తుందనే ఆశిద్దాం.

-జి.వి.జి.

గుమ్మడి




హాల్లో టెలిఫోన్ మోగింది! ఫోన్ మావారి కేమో అనుకుని, పూజ గదిలో దీపాలన్నీ వెలిగించడం పూర్తిచేసి, పూజకి కూర్చో బోతూన్నా "అమ్మా! మీకు టెలిఫోన్ చేశారెవరో ఒకామె! అర్జంట్‌గా మాట్లాడా లంటున్నారు!" అని చెప్పి వెళ్లాడు మా వంటవాడు

వెళ్లి రిసీవరు తీసుకొని, "హలో!" అనే లోపలే "హలో? ఎవరూ? భామానా? భామా! నువ్వు అర్జంట్‌గా బయల్దేరి మా ఇంటికి రావాలి! — లేకపోతే కొంప మునిగి పోతుంది! " అని ఖంగారుపడుతూ చెప్పింది మా అత్తగారి స్నేహితురాలు అన్నపూర్ణమ్మ కోడలు భారతి అప్పటికీ అర్థమయింది

"ఏం కోడలు ట్రబులా!" అన్నాను నవ్వుతూ

"అవునూ! అది కోడలుగాదు! కొరక రానికొయ్య! నా ఒక్కగానొక్క కొడుకుని తీసుకెళ్లి అమెరికాలోనే సెటిలవుతుందట!"

నాకు నవ్వొచ్చింది భగవంతుడి లీలలు ఎవరికీ అర్థంకావు సరిగ్గా పద్దెనిమిదేళ్ళక్రితం ఇలాంటి ఫోనే భారతి అత్తగారు అన్నపూర్ణమ్మ మా అత్తగారికి చేశారు తన ఒక్కగానొక్క కొడుకునీ, మనవణ్ణి తీసుకెళ్లి తన కోడలు భారతి వేరే కాపరం పెడతానంటోందని నా బుర్ర "ఫ్లాష్ బేక్"లోకి వెళ్లింది,

పద్దెనిమిదేళ్లనాడు ఇదే విధంగా టెలిఫోన్ మోగింది హాల్లో పరీక్షలకు చదువుకుంటూ కూర్చున్న మా వాడు ఫలహారానికి పిండిజల్లించు కొంటున్న మా అత్తగారితో "నానమ్మా! నీకు టెలిఫోన్ వచ్చింది నీ ఫ్రెండ్ అన్నపూర్ణమ్మ అర్జంట్‌గా నీతో మాట్లాడాలట"అని చెప్పాడు "అయ్యో పాపం! మళ్లీ కోడలు ఏం కొంప మీదికి తెచ్చిందో" అనుకొంటూ మా అత్తగారు ఫోన్ దగ్గరకెళ్లారు "హలో, అన్నపూర్ణా!" అన్నారు అవతల ఆమె ఏం చెప్పిందో "అయ్యో! ఎంత రాతి గుండె దాందీ! నీ ఒక్కగానొక్క కొడుకును తీసుకెళ్లి వేరే కాపరం పెడతా నంటూందా! అదీ అద్దె ఇంట్లోనా! ఎంత పొగరు లంకంత ఇల్లు పెట్టుకొని లక్షణంగా మీతో కలిసి ఉండకుండా" అవతల మళ్లా ఏదో చెప్పింది అన్నపూర్ణమ్మ "ఏమిటీ! నీ మన వణ్ణ గూడా నీ దగ్గర ఉంచదట్నా! ఓసి దీని అహంకారం కూలా! ఎంత పనిచేస్తోంది! సరే మధ్యాన్నం అటు వస్తాలే నా కోడలు గూడా కంటి డాక్టర్ని చూడాలంటోంది మీ ఇంటి వేపేగా రావాలి? నువ్వు కళ్లు నీళ్లు పెట్టుకోకు ముందు ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో అసలే నీకు ఏదో రొమాన్‌టిక్కు నొప్పులన్నావ్"

పక్కనే చదువుకొంటున్నా మావాడు ఫక్కున నవ్వి, "రొమాన్‌టిక్ నొప్పులు కాదు, నానమ్మ! రుమేటిజం — అంటే, కీళ్ల నొప్పులు ఆమెకి " అన్నాడు "ఏదో ఎత్తు భారం పాపం! అదొక్కటేనా బ్రెడ్‌ప్లెషరూ, చక్కెరా ఆవిడ వంట్లో ఎన్నున్నాయో"

మా వాడు మధ్యలోనే మరింత గట్టిగా నవ్వుతూ, "నాటన్నిటితో ఒక 'బేకరీ' పెట్టొచ్చు, నానమ్మా అమెకుండేదీ, బ్రెడ్ ప్లెషరు కాదు 'బ్లెడ్‌ప్రెషర్,' అంటూ వాళ్ల నానమ్మను కరెక్ట్ చేస్తూంటే, రిసీవర్ పెట్టేసి

మా వాడి బుగ్గ పొడిచి, "అల్లరి గాడిదా! ఎప్పుడూ నా ఇంగ్లీషు పరిచేయడమే నీ పని పరీక్షలకి బుద్ధిగా చదువుకొని ఫస్టు మార్కులు తెచ్చుకో నీకు మంచి బహుమతి ఇస్తాను" అంటూ

"మధ్యాహ్నం అన్నపూర్ణని వెళ్ళిచూద్దామే పాపం, కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువైనట్లు— అన్నీ ఉండీ అన్నపూర్ణ — కోడలి చేతులో చిక్కి కుమిలిపోతోంది పాపం" అంటూ మా అత్తగారు చాలా సేపు అన్నపూర్ణమ్మ స్థితికి బాధపడ్డారు

అన్నపూర్ణమ్మకు బోలెడు ఆస్తిపాస్తులున్నాయి — భర్త రిటైర్డ్ మిలిటరీ ఆఫీసర్ రెండు మూడు పెద్ద పెద్ద బంగళాలూ, చెంగల్పట్టు దగ్గర యాభై ఎకరాల పొలమూ, తోటలూ, దొడ్లూ చాలా ఉన్నాయి పుట్టింటి వారిచ్చిన వజ్రాల నగలూ, బంగారు నగలూ— కొడుకు పెళ్లయితే కోడలికి పెట్టాలని ఎన్నో కలలుగని, వివరికి పుట్టబోయే మనవలకిగూడా బుజ్జి బుజ్జి నగలు చేయించి పెట్టుకున్నది భద్రంగా అలాంటి అన్నపూర్ణమ్మగారికి ఒక నల్లటి ఏనుగుబంటులాంటి వికృతాకారం గల కోడలు వచ్చింది కొడుకు గొప్ప అందగాడు కాకపోయినా, కన్నూ,ముక్కూ,తీరు అన్నపూర్ణమ్మ పోలికతో బాగానే వుంటాడు ఆమెలాగే మంచి గుణవంతుడూ, మంచివాడూ మా— అలాంటి వాడికి ఈ కోతిని ఎలా చేశారంటే, కోడలు మినిష్టరు కూతురు! బోలెడు పలుకుబడి పైగా, ఆ మినిష్టరు, అన్నపూర్ణమ్మ భర్త చిన్ననాటి స్నేహితుడు గూడా బోలెడు కట్నంతో పిల్లనిస్తూ అల్లుడికి గొప్ప ఉద్యోగం గూడా తక్షణం వేయించే ఏర్పాట్లు జరిగిపోయాయి! ఇష్టం లేకపోయినా— అన్నపూర్ణమ్మ భర్త మాటకు ఎదురు చెప్పలేక పోయింది అన్నపూర్ణమ్మ కొడుకూ తల్లిదండ్రుల మాటకు ఎదురు చెప్పడు !—

కోడలు అందగత్తె కాకపోయినా గుణవంతురాలైతే చాలనుకున్న అన్నపూర్ణమ్మకు అహంకారానికి మారుపేరయిన భారతి కోడలుగా వచ్చింది ! అన్నపూర్ణమ్మ అరవైయ్యో పడిలో పడ్డా అందంగా చూడ్డానికి మహాలక్ష్మిలా వుంటుంది

మేము మధ్యాహ్నం వెళ్తూనే అన్నపూర్ణమ్మ ఆప్యాయంగా మమ్మల్ని హాల్లోకి తీసుకెళ్లి కూర్చోబెట్టింది నా కళ్లు అన్నపూర్ణమ్మ కోడలి కోసం వెతికాయి ! . మా అత్తగారు గూడా ఆ పనిమీదే వున్నారుగాబోలు నాలుగు వైపులాచూసి "కోడలెక్కడ !' అని సౌజ్ఞతో అడిగారు ! మేడమీద మేకప్ అవులోందని అన్నపూర్ణమ్మగారు గూడా అభినయ సౌజ్ఞతో చెప్పారు !.

వాళ్లిద్దర్నీ చూసి నాకు నవ్వొచ్చింది

"బోయ్ !" అని మేడమీది నుండి ఓ వెర్రి కేక వినిపించింది! ఒక్కసారి అదిరిపడ్డాం అన్నపూర్ణమ్మ గడగడలాడిపోతూ, "ఒరే, రామూ! రాజూ! నటేశా! చిన్నమ్మగారు పిలుస్తున్నారా! త్వరగా వెళ్లండి!" అంటూ పని పిల్లలకోసం అటూ యిటూ పరుగెత్తింది!

మా అత్తగారు తల బాదుకొన్నారు!

పైన ఏదో తిడుతోంది 'ఛీ ఛీ !'

కాలింగ్ బెల్లు పెట్టించలేదని తిడుతున్నట్లు అన్నపూర్ణమ్మ మా అత్తగారి చెవులో రహస్యంగా చెప్పింది

"పోనీ పెట్టించకపోయావా! నీకెందుకీ బంట్రోతు ఉద్యోగం? అది పనివాళ్లని పిలవడం నువ్వు వాళ్లకోసం పరుగెత్తడం!" అంటూ కోప్పడ్డారు మా అత్తగారు

## గణేశస్తుతి

జయ జయ జయ గణనాయక
జయ జయ శుభ దాయక
జయ వినాయకా !!

సకల సురాసుర వందిత
సిందూరారుణ రంజిత !
త్రిభువన మునిజన సేవిత
శాంభవీ శంకర సుతా !!

ఇలవేల్పు లెందరుండినా
తొలి పూజ నీదే గజాననా !
విఘ్నములణచే విఘ్నేశా
వందన శతములు లోకేశా !!

శ్రీ విద్యా వరదాయక
వాంఛిత ఫల సంధాయక !
సృష్టి స్థితిలయ కారక
వరగుణ వరమొసగు మిక !!

— రావులవర్తి భద్రిరాజు

"అయ్యో అమ్మణ్ణీ పెట్టించాము కాని మా వారు పీకించేశారు తన తల బద్దలవుతోంది క్షణక్షణానికీ కోడలు పైనుంచి ఆ బెల్లు కొడుతూంటే", అంటూ ఒకే గోల పెట్టారు ! . "నేనేం చేసేది చెప్పు! తిరగల్లో గింజలా నలుగుతున్నాను !

మా అత్తగారు రైలు ఇంజన్లా ఒక పెద్ద నిట్టూర్పు విడిచారు ఏమీ చెప్పలేక ! మళ్లీ అన్నపూర్ణమ్మే అందుకున్నది "ఆ బెల్లు పీకించేసిని మా వార్ని అనరాని మాటలని, తిట్టరాని తిట్లు తిట్టి, ఎంత అవమానించిందో! కొడుక్కి చెప్తే బాధపడతాడని లోపలే కుములుతూ కొద్ది రోజులుగా మంచం దిగటం లేదు ఆయన" అంటూ కళ్ళు తుడుచుకుంది "ఛీ—ఛీ! నిండిట్లో మహాలక్ష్మిలాంటి నువ్వు కంట తడిపెట్టగూడదు ఇంతకీ అది కొండమీదే వుంటుందా?" అన్నారు అత్తగారు, కోపంకోడెతాచులా లోలోపలే బుసలుకొడుతూంటే "కొండమీద గాదు, మేడమీద వుండి!" అన్నది అర్థం గాని అన్నపూర్ణమ్మ "అదేలే . కోతి కొండమీద నీ కోడలు ఈ మేడమీద పుటకలో రెండూ ఒకటేనని అన్నా," —అన్నారు మా అత్తగారు మండిపోతూ అంత దుఃఖంలోనూ అన్నపూర్ణమ్మకు నవ్వొచ్చి, మూతికి చెంగడ్డం పెట్టుకుంది

పై నుంచి ఒక్కసారి సెంటువాసన గుభాళించింది మరుక్షణం టక్ టక్ టక్ మంటూ అన్నపూర్ణమ్మ కోడలు మెట్లు దిగి రావడం మొదలు పెట్టింది కోడల్ని పై మెట్టు మీద చూస్తూనే ఏదో తప్పు చేసిందానిలాగా భయపడుతూ నమ్రతగా గబుక్కున లేచి నిలబడ్డాది అన్నపూర్ణమ్మ. అది చూసిన మా అత్తగారు నావైపు గుర్రున చూశారు రేపు నువ్వు మెట్లు దిగి వస్తుంటే నేనూ లేచి నిలబడాలా అన్నట్లుంది ఆ చూపు అన్నపూర్ణమ్మ కోడలిమీద చూపించాల్సిన చురుకూ, కోపం ఆ చూపులో కనిపించాయి

ఆపలక్కడ కూర్చోడానికే ఇబ్బంది పడుతున్న నేను నా చూపును మరో వైపుకు తిప్పాను !

"రామ్మా!" అంటూ అన్నపూర్ణమ్మ కోడల్ని ఆప్యాయంగా ఎదురెళ్లి భయ భక్తులతో పిల్చుకొచ్చింది ?

"హాలో" అన్నది నావైపు చూసి అమెరికన్ స్టైల్లో మా ఎదురు సోఫాలో కాలిమీద కాలు వేసుకుని కూర్చుంది అది చూసిన మా అత్తగారికి ఒంటి మీద కారం రాచినట్లుందని ఆమె ముఖం సగం చూసే కనిపెట్టాను "బాగున్నారా ?" అన్నాను

"ఏం బాగు, అందులోనూ ఈ హౌస్‌లో ఛీఛీ! చాలా ఓల్డ్‌ఫాషన్ హౌస్, మనుషులూ అంతే, నిజం చెప్పాలంటే ఐ హేట్ దిస్‌హౌస్" అన్నది కట్‌చేసిన తల వెంట్రుకలు సవరించుకుంటూ మా అత్తగారికి కొంత అర్థమైంది "అది సరేగాని, కోడలా నీ మొహం ఎప్పుడైనా అద్దంలో చూసుకున్నావా ఏనుగు చర్మంలా ఉంది నీ మొహం మీద తోలు. దాని కంత పౌడరెందుకే ? పైపెచ్చు కొండముచ్చులాగా నీ

ఆంధ్రపత్రిక వజ్రోత్సవ సందర్భాన అందరికీ మా అభినందనలు!

డా॥ ఎం. ప్రభాకరరెడ్డి సమర్పించు శ్రీభ్రమరాంబికా ఫిలింస్

# ధర్మాత్ముడు

కలర్



స్క్రీన్‌ప్లే - దర్శకత్వం: బి. భాస్కరరావు నిర్మాత: కె. కేశవరావు

నిర్మాణత: సారథి

కథ: డా॥ ప్రభాకరరెడ్డి మాటలు: మద్దిపట్ల సూరి

సంగీతం: సత్యం కెమెరా: యం. సత్తిబాబు పాటలు: గోపి

ఎడిటింగ్: కె. ఎ. మార్తాండ్





L.A. PUBS... S.BALAJI.

నల్లటి పెదాలకి ఎఱ్ఱటి రంగెందుకే ఎందుకీ వగటివేషం ? లక్షణంగా జడ వేసుకుని పూలు పెట్టుకో — పోనీ, నీకిష్టమైనట్లు ఫాషనే చేసుకో అచ్చొచ్చినా ఈ ఇల్లు వదిలీ, ముసలి వాళ్లయిన మీ అత్తమామల్ని వదలీ ఊర్లోనే మరో కాపరం — అదీ అద్దె ఇంట్లో పెడతానంటున్నావటే! ఇది నీకేమన్నా బాగుందా చెప్పూ ! పైగా మనవణ్ణి అయినా కనీసం అత్తమామల దగ్గర వుంచకుండా వాడినీ తీసుకు వెళ్లి ఆయాలకు అప్పగించి, నీపాటికి నీవు క్లబ్బు గిబ్బూ అంటూ తిరుగుతూంటే నీకేం ఒరుగుతుంది ఈ ఇద్దరు ముసలాళ్లూ పతుల్లాగా బిడ్డకూ, మనవడికీ గూడా దూరంగా ఉండి ఎట్లా బ్రతగ్గలరు ! చదువుకున్న దానివి ఈ మాత్రం ఆలోచించలేవా!'' అంటూ మా అత్తగారూ కంట తడిపెట్టుకుని చెబ్తూంటే భారతి తోక తొక్కిన తాచు లాగా కస్సుమని లేచి, ''వాటీస్ దిస్ నాన్సెన్స్ ! నన్ను యిన్సల్ట్ చేయడానికేనా వీళ్లని పిలిపించావ్, ముసల్దానా ఎంత పొగరు నీకు! '' అంటూ అన్నపూర్ణమ్మ గారిమీద విరుచుకుపడ్డది మా అత్తగారూ నేనూ భయంతో బిగుసుకుపోయాం ! అన్నపూర్ణమ్మ గజగజ వణికిపోతూ కళ్లనీళ్లతో కోడలి చేతులు పట్టుకుని ప్రాధేయపడబోయింది ...

భారతి విదిలించి కొట్టింది ''చాలు ▪ నక్క వినయం అందర్నీ పిలిచి చెప్ప వే వెడ్తదాన్నని ! ఛి ఛీ మీ ముసలాళ్ల బుద్ధులు పోనిచ్చారుగాదు '' అంటూ విసురుగా పోబోతున్న భారతికి అడ్డుతగిలి అన్నపూర్ణమ్మ ''భారతీ, నామాట విని వేరే కాపరం పెట్టి మమ్మల్ని చంపెయ్యకమ్మా ! నా కొడుకునీ, మనవణ్ణి చూసుకోకుండా ఉండలేం, తల్లీ ! నా మాట విను. ఈ ఇల్లు కొన్నతర్వాతే మనకి కలిసి వచ్చింది మీరు ఈ ఇల్లు వదిలి వెళ్తే ఏమవుతుందోనని దిగులొస్తూ భయంగావుందమ్మా ! నామాట వినుతల్లీ'' అంటూ గడ్డం పట్టుకుని బ్రతిమాల్తుంటే అలాంటిఅదోగతి ఏ అత్తగారికీపట్టగూడదనిపించింది ఆక్షణంలో అన్నపూర్ణమ్మ దయానీయ స్థితి చూసి ! పాపం ! అన్నపూర్ణమ్మని చూస్తే మాకే కళ్లనీళ్లు ఆగలేదు ''ఎన్ని సార్లు చెప్పిందే చెప్తారు ! బోర్ కొట్టదూ ? నేను అనుకున్నది చేస్తాను అది మా కుటుంబ విషయం ! మీ ముసలాళ్ల కోసం నేను అవస్థపడలేను సిగ్గుంటే ఇక మీద ఈ విషయం ఇంతటితో 'స్టాప్' చెయ్యండి తల క్రిందులుగా తపస్సుచేసినా మనం కలిసి వుండడం జరిగేపనికాదు వస్తా !'' అంటూ భారతి విసురుగా మళ్ళీ బూట్లు టక టక లాడిస్తూ వెళ్లి, కార్లో కూర్చుని డ్రైవ్ చేసుకొంటూ వెళ్లిపోయింది

నేనూ, మా అత్తగారూ, అన్నపూర్ణమ్మ కొయ్యబారి నిలబడిపోయాం

అన్నపూర్ణమ్మ భుజం తట్టి మా అత్తగారు ''పోనీలే ఇలాంటి అహంకారి కోడలు ఇంట్లో ఉంచుకుని ప్రతి క్షణం గుండెల మీద కుంపటి పెట్టుకున్నట్లుండేదాని కంటే అది నీకు దూరంగా ఉంటేనే మేలు, నా మాట విను ఇది నీ పాలిట శత్రువు ఇక్కడేవుంటే నిజంగానే ఏదో ఒక రోజు కోపం వచ్చినప్పుడు నీ తలకాయ బద్దలు గొట్టగలదు . ఎందుకొచ్చిన పీడ పోనిద్దూ నీ బిడ్డ ఎక్కడున్నా నీ బిడ్డే కానీ మనవడు నీదగ్గర పెరిగినవాడు వాడిని నీనుంచి దూరం చేయలేదు చూడు కావాలంటే అది వేరే కాపురం పెట్టినా నీ మనవడు నీదగ్గరికి పరుగెత్తుకొస్తాడు అదేమన్నా పిల్లాణ్ణి పెంచిందా? ఎప్పుడైనా ? వాడన్నం తిన్నాడో లేదో చూసిందా ఈ రోజు కొత్తగా కొడుకును చూసుకుంటుందా ? ఆయాల కప్పగించి దానిపాటి కది తిరుగుతుంది వాడు నిన్నొదలి ఉండడు చూడు చూద్దాం రేపు దీనికీ వస్తుందిగా కోడలూ. ''అయ్యో! అమ్మణ్ణీ! నా మనవడు బంగారం లాంటివాడు వాడికిలాంటి కొరివి భార్యగా రాకూడదు నేను బ్రతికుంటే నా మనవడికి మంచి పిల్లను చూసి పెళ్లి చేయిస్తాను మా వారు చేసిన యీ తప్పు పగవాళ్ళు కూడా వేయగూడదు'' అంటూ వెక్కివెక్కి ఏడ్చింది— అన్నపూర్ణమ్మ

అనేక విధాల మా అత్తగారు ఆమెను ఓదార్చి, భగవంతుడు పరిస్థితులను ఎప్పుడూ ఒకే విధంగా వుంచడనీ, బండ్లు ఓడలయితే ఓడలు బండ్లు గూడా కావచ్చునీ, భారతి కూడా ఒక నాడు అత్తగారుగా తను పెట్టిన అవస్థలికి గుణపాఠం నేర్చుకోబోతుందనీ, మనసు కుదుట పరుచుకుని ధైర్యంగా వుండమనీ, అసలే మంచం పట్టిన భర్తను భద్రంగా చూసుకోమనీ చెప్పి బయల్దేరి, సాయంకాలానికి ఇల్లు చేరాం

(ఇంకా ఉంది)

# నిరీక్షణ

— శ్రీమతి మాచిరాజు సావిత్రి

ఏదో కావాలి
ఎవరో రావాలి
"అది'' ఏమిటో
''వాడు'' ఎవ్వరో
తెలియని ఈ బ్రతుకెందుకో ?

వెతకాలి ''దానిని'' ఎక్కడో
వెలుతురులోనో చీకటిలోనో
పిలవాలి ''వాడి''ని ఎప్పుడో
మరి ఇప్పుడో ఇంకెప్పుడో
ఎక్కడని చూసేది ? ఎప్పుడని పిలిచేది ? అది
తెలియని ఈ బ్రతుకెందుకో ?

వెతకిన వెంటనే దొరికెనో — ''అది'' ?
పిలిచిన వెంటనే వచ్చెనో — ''వాడు'' ?
తెలిసీ తెలియని — తెలియక తెలిసిన
తెలుసో తెలియదో — అదియే
తెలియని ఈ బ్రతుకెందుకో ?

వెతికీ విసిగీ, పిలిచీ అలిసీ
ఊరుకున్నాను — మానుకున్నాను — ఇక
''అదీ'', ''వాడూ'' కలిసి నన్ను
వెతికి రావాలి — నేను వేచి యుండాలి
ఎదురు చూడాలి — అపుడు
తెలియాలి ఈ బ్రతుకెందుకో







కృష్ణంరాజు సమర్పించు
రాధాకృష్ణా మూవీస్
కోటికొక్కడు
నిర్మాత: జి. సత్యనారాయణరాజు
దర్శకత్వం: కొమ్మినేని
అన్నపూర్ణ

# రచయిత్రిగా నా ఆశలు - ఆశయాలు!

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

ఋషి కాని వాడు కావ్యము వ్రాయలేడని పెద్దలనుడి ఆ కావ్యము వాస్తవంగాను, సుందరంగాను, మంగళకరమయినది గానూ ఉండాలనీ, దానిలో ఉపదేశం కూడా ఉండాలనీ అన్నారు ఈ సూక్తులు కావ్యాలకేనా ఇతర రచనలకు కూడా వర్తిస్తుందా అంటే రూపాలు స్టైయిలూ వేరువేరయినా రచయిత — రచన అన్నప్పుడు ఆ శ్రేణి ఉండక తప్పదు

రచన చేయటంవల్ల రచయితకు కీర్తి కనకమూ లభిస్తే చాలని కొందరనుకుంటే — మరి కొందరు రచన ప్రజోపయోగకరంగా ఉండాలనీ, లోకకళ్యాణము చేకూర్చేవే చిరకాలము నిలుస్తాయని అంటారు అసలు ప్రతి రచయితా ప్రజలకు ఏదో చెప్పదలుచుకునే కలం చేతబడతాడు తన శక్తి మేరకు సూటిగానో సూచన ప్రాయంగానో ఉపదేశిస్తాడు

అయితే ఆ ఉపదేశము ఎటువంటిదై ఉండాలి? ఇక్కడ రచయితలకు భిన్న భిన్నాభిప్రాయాలున్నాయి

రవిగాంచనిది కూడా రచయిత తన మనోనేత్రం ద్వారా చూసి, తన అనుభవాన్ని వ్యక్తం చేసి ఆనందిస్తాడు తనకు కలిగిన ఆనందాన్ని పదిమందితో కలిసి పంచుకోవాలని ఆరాటపడతాడు అలా పంచుకుంటేగాని అతడికి తృప్తి కలగదు పదిమందితో కలిసి పంచుకోవాలంటే వాళ్లకు సంబంధించిన విషయమేదో దానిలో ఉండాలి వాళ్లకు సంబంధించిన మంచి చెడ్డలు, కష్టసుఖాలు, అభివృద్ధి, పురోగమనము, ఆనందము మొదలైన వేవో ఉండాలి అప్పుడు గాని పదిమందికీ అతడి రచనలమీద అభిమానం పుట్టుకురాదు అంటే రచయితలకూ సంఘానికీ ఒక విధమయిన సంబంధం రచన ద్వారా ఏర్పడుతున్నదన్నమాట

రచయిత కావ్యం వ్రాసినా— కథ వ్రాసినా— గేయం వ్రాసినా — తన చుట్టూ ఉన్న వాతావరణాన్నీ, సంప్రదాయాలనూ, తనకు తెలియకుండానే పరిగ్రహిస్తాడు కనుకనే ముడి సరుకును సంఘంలో నుంచి తీసుకున్నా, రచయిత చిత్త సంస్కారాన్ని బట్టి రచనలుంటాయని అనుభవజ్ఞుల అభిప్రాయం

మానవ సంఘంలో అపూర్వమైనదో — అసామాన్యమైనదో — సర్వసామాన్యమైనదో సంఘటన—లేక సమస్య రచయిత దృష్టి నాకర్షిస్తుంది కొందరు రచయితలు ఆ సమస్యనూ లేక సంఘటనను శబ్ద వైచిత్రితో చిత్రించి — రంగులుపూసి ప్రదర్శనకు పెడతారు కొందరలా కాక తమకున్న విజ్ఞానాన్నీ అనుభవాలనూ, సంస్కారాన్ని ప్రయోగించి వాటికొక పరిష్కారమేర్పరుస్తారు ఆ పరిష్కారము సర్వజన సమ్మతముగా ఉండనూవచ్చు — లేకనూ పోవచ్చు.

రచయితలకు అభిప్రాయభేదాలు ఉంటూనే ఉంటాయి 'కళ కళ కొరకా' లేక సాంఘిక ప్రయోజనము కొరకా! అన్న సమస్య కొందరికింకా పరిష్కారం కాలేదు 'కళకొక ప్రయోజనముండాలి అది సంఘశ్రేయస్సును సాధించాలి అట్లా సాధించని దానివల్ల లోకానికి లాభంలేదు' అన్న వాదాన్ని చాలా మంది రచయితలు అంగీకరిస్తారు— ఏ కొందరో తప్ప



రచనలు జీవితచిత్రణమా అన్న ప్రశ్నకూడా కొత్తదికాదు మానవజీవితాలు చిత్రింపబడకపోతే రచనల మీద పాఠకులకు అభిమానమూ సానుభూతి ఎట్లా కలుగుతాయి? అయితే ఉన్నది ఉన్నట్టు చిత్రించటమా లేక సంస్కరించి చిత్రించటమా అన్నది సమస్య రచన మానవ జీవిత చిత్రణే కాని— రచయిత సంస్కారాన్ని సమస్యా పరిష్కారములో చూడగలుగుతాము

ఏ మానవుడి జీవితమూ సకలసౌభాగ్యాలతో రాణించదు ఏదో ఒకటి లోపిస్తుంది సామాన్యుడు ఆ లోపాన్ని అహర్నిశలూ ఆలోచించి ఆలోచించి మనసు పాడుచేసుకుని జీవితాన్ని నరకం చేసుకుంటాడు అదే కనుక భావుకుడయితే తన మనోవేదనను ప్రేరణగా చేసుకుని, సంఘశ్రేయస్సు కొరకు, భావవైచిత్రితో శబ్దవైచిత్రితో రమణీయమైన రూపకల్పన చేస్తాడు తద్వారా పాఠకులను ఆనందింపచేసి తాను ఆనందిస్తాడు అతడి మనోవేదన ఆనందంగా మారిపోతుంది కొందరు తమ జీవితాలలోని చీకట్లను ఎదుర్కొనలేక వాటిని వాస్తవిక జీవితానికి వదలి, తమకు ప్రాప్తించని వస్తు సముదాయాన్ని రచనాలోకంలో ప్రాప్తింపచేసుకుని ఆనందిస్తారు ఈ రచనల వల్ల పాఠకులకు జీవితపు లోతులెరుగని ఆనందం కలుగుతుంది కొందరు నిజ జీవితంలో సంఘనియమాలనూ సాంప్రదాయాలనూ ఉల్లంఘించలేరు నైతికపు టెల్లలు దాటలేరు కాని మనసు వీటనన్నింటినీ ఉల్లంఘించాలని కోరుతుంది, తద్వారా సంఘాన్ని సరమ్మతు చేయాలని కోరుతుంది అలాగే కొందరు భావుకులు వాస్తవిక జీవితంలో చేయలేని పనులు రచనల ద్వారా చేసి ఆనందిస్తారు. తాము పొందిన ఆనందాన్ని పాఠకులు కూడా పొందాలని ఆశిస్తారు

కొందరు రచయితలు పుస్తకాలలో చదివిన సిద్ధాంతాలను జీవితాలతో అన్వయింప చేసి రచనలుచేస్తారు అవాస్తవికమైన కొత్త కొత్త ప్రయోగాలు చేసిన రచయితలు మేధావుల వర్గంలో చేరిపోతారు

రచయితలలో ఎన్ని రకాలైనా ఉండవచ్చు వారి ఆంతర్యాలూ వారి చిత్తవృత్తులూ భిన్న భిన్నంగా ఉండవచ్చు వారు ఆశించే ప్రయోజనాలు కూడా పలురకాలుగా ఉండవచ్చు కాని— ముద్రణ పొందిన ప్రతి రచన యొక్క ప్రభావమూ సంఘంలో ఏ ఒక్కరిపైన అయినా పడక మానదు అది ప్రజలకు మార్గదర్శకమయినా కాకపోయినా దాని పరిణామం మాత్రం కలుగుతుంది. దాని బాధ్యత రచయితదే అవుతుంది

రచయితలు తమ సంతోషం కోసం— తమ వినోదం కోసం చేసే రచనలు లోక కల్యాణాన్ని కలిగించలేవు గాని కాలక్షేపాన్ని కలిగిస్తాయి ఒక సమస్యను పరిష్కరించాలంటే వేలాది ప్రజలను దృష్టియందుంచుకోవాలి ఏ దేశపు, ఏ ప్రాంతపు సమస్యనైనా పూర్వాపరాలు చర్చించుకుని ఆలోచించి, ఎటువంటి వాతావరణంలో ఆ సమస్య బయలుదేరిందో గ్రహించి తదనుగుణంగానే దాని పరిష్కార మార్గాలు ఆలోచించాలి రచయితగా సమస్యను దృష్టియందుంచుకోవాలి గాని— భాష, జాతి, వర్ణ వర్గ భేదాలను జీర్ణించుకున్న మనసుతో పరిష్కరింపలేరు రాగద్వేషాలను అధిగమించలేనివారు నిక్కమైన రచయితలు కాలేరు

ఇదంతా నా శక్తి మేరకు నేను పరిశీలించిన— నా కర్థమయిన రచనాలోకం

సాహిత్య చరిత్రలో ఒక్కొక్క కాలములో

తెలుగు పత్రికారంగానికి ఎనలేని సేవచేసిన
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి
ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక
వజ్రోత్సవ సందర్భముగా
హృదయపూర్వక శుభాకాంక్షలు



## వేగేశ్న సూర్యనారాయణరాజు

సర్పంచ్
**వడ్లవానిపాలెం**
పోడూరు పంచాయతీసమితి,
పశ్చిమగోదావరిజిల్లా

---

ఆంధ్ర సచిత్ర వార పత్రిక వజ్రోత్సవ సందర్భముగా
మా హృదయపూర్వక శుభాకాంక్షలు

★

## M/s. కృష్ణా ఎంటర్ ప్రైజెస్

స్టాకిస్టు : "దక్కన్ సిమ్మెంటు"
కెనాల్ రోడ్ : : పాలకొల్లు

మరియు

## M/s. కృష్ణా లెమన్ ఏజన్సీస్

లెమన్ మర్చంట్స్ & కమిషన్ ఏజంట్స్

**H. O.** 313 రవీంద్ర సరని నూతన్ బజార్,
కలకత్తా – 700 006

**B. O.** కెనాల్ రోడ్, పాలకొల్లు – 534 260

మేనేజింగ్ పార్టనర్
**వేగేశ్న కృష్ణంరాజు,** *B. Com.,*

---

వినాయకచవితి శుభాకాంక్షలతో !



## తులాబందు వెంకటప్పయ్య

చైర్మన్, మునిసిపల్ కౌన్సిల్,
చీరాల

## షరాబు వ్యాపారం

సంత బజార్, చీరాల.
ఫోన్స్ షాపు 218, రెసి 871, ఆఫీస్ 492

---







సరూప్ లేప్

మొటిమలు
మటుమాయము
చేసి ఎల్లప్పుడు
కలువలవలె
కాంతివంతముగా
చేయును



అమృత్
మలామ్

కాళ్లపగుళ్లు,
శరీరము పగుళ్లను లేకుండా
శరీరమును మృదువుగా వుంచును
కాళ్లు పాయుట నివారించును

డిస్ట్రిబ్యూటర్స్:- శ్రీసత్యసాయి ఎంటర్ ప్రైజెస్. విజయవాడ-1.
SUVARNA

# నేడు చేసే వృధా ఖర్చు
# రేపటి అవసరాలకు పెట్టే కార్చిచ్చు




## విజయభార్గవి చిట్ ఫండ్స్
## ఖర్చుకు సంకెళ్ళు వేస్తుంది,
## మీ డబ్బును కాపాడుతుంది

నేడు ఆదా చేసుకున్న రూపాయి రేపు మిమ్మల్ని ఆదుకుంటుంది. అభయ హస్తంగా మారుతుంది!

ఆదాలో అభివృద్ధి కనిపించాలంటే అందుకు సురక్షితమైన మార్గం విజయ భార్గవి చిట్ ఫండ్స్!

అవసరం ఏదైనా కావచ్చు. అన్ని అవసరాలకు అనుగుణమైన రకరకాల చిట్‌గ్రూపులు విజయ భార్గవి ప్రత్యేకత!

నెలసరి వాయిదా 2వందల నుంచి 2వేల వరకు చెల్లించవచ్చు. గడువుకాలం 25నెలల నుంచి 50 నెలల వరకు పెట్టుకోవచ్చు.

మీకు అనువైన సీరీన్ లో చేరండి. ఆదా అలవాటు చేసుకోండి. తద్వారా ఆకర్షణీయమైన డివిడెండ్ పొందండి!

సీరిస్ పూర్తయింతర్వాత వచ్చే పెద్ద మొత్తంలో ఇల్లు కట్టవచ్చు. పెళ్లి చెయ్యవచ్చు!



వివరాలకు ఈ క్రింది చిరునామాను సంప్రదించండి.

**విజయ భార్గవి చిట్ ఫండ్స్ ప్రయివేట్ లిమిటెడ్.**

1-1-80/21, (2వ అంతస్థు) ఆర్.టి.సి 'x' రోడ్స్, హైదరాబాదు - 500 020 ఫోన్ : 63154

Brain-wave/VBCF/822

ఒక్కొక్క ఆలోచనా ధోరణులు ప్రాధాన్యంగా చోటు చేసుకోవటము చూస్తున్నాము మరొకటి రాగానే ఇది వెనుకబడుతూ ఉంటుంది కాని— మానవ నైజములో మార్పు ఉండదనీ, హృదయ స్పందనకు దేశ'కాల,పాత్రలనే అవధులు లేవనీ, సార్వజనీనమైన భావాలను ఏ రాజకీయ సూత్రాలో బంధించలేవనీ విశ్వశించే వాళ్లలో నేనొకదాన్ని నా మనసు దాని వైపుకే మొగ్గుచూపుతుంది ఈ విశాల విశ్వంలో మానవాళి అంతా ఒకటి కావటానికి భావ సమైక్యత ఎంతో అవసరము దీనికి జాతి, కుల మత, వర్గ, వర్ణభేదం అవరోధంగా నిలుస్తున్నది మనం గాలిలో ప్రయాణం చేసి చంద్రుడితో చేతులు కలిపి, ఎన్నో విశేషాలు తెలుసుకున్నాం నీటిలోకి దిగి శాస్త్ర విజ్ఞాన సంబంధమైన అనేక విషయాలను తెలుసుకున్నాము భూ గర్భ పరిశోధనలు చేసి నూతనాంశాలనెన్నిటినో వెలికి తీస్తున్నాము అనేక ప్రకృతి పరిశోధనలు చేస్తున్నాము కాని — తోటి మానవుడితో సర్దుకుని బ్రతకలేకపోతున్నాము మానవాళికి అవసరమైనదీ అత్యంత ప్రధానమైనదీ భౌతిక సుఖాలకంటే మానసికమైన తృప్తి మానవాళిలో జీవన సామరస్యము వల్ల భావ సమైక్యతవల్ల ఈ తృప్తి లభిస్తుంది దేశాల మధ్య, భాష, వర్ణ, వర్గాల మధ్య, నర నారీ గణాల మధ్య సామరస్యం ఉద్భవించాలి దీని పట్ల నా మనసు మొగ్గు చూపుతుంది అందుకే నా కలానికి అంక్షలు పెట్టి గిరులు గీసింది

రచనా వ్యాసంగం ఒక కళ ఆ కళను చిత్త శుద్ధితో ఆరాధించాలని నా నమ్మకము అది నా అభిమాన కళ నా ఆరాధ్యదైవము రచయితకు భావ దారిద్ర్యముండకూడదని విశ్వసించే వాళ్లలో నేనొకదాన్ని భావ దారిద్ర్యంవల్లనే రచనలలో వైవిధ్యము సన్నగిల్లుతుందని నా విశ్వాసము

ఏ పాఠకుడినయినా మెప్పించటం సులభమేమో గాని—మనసుకు సంతృప్తి నివ్వగల రచన—హృదయమ్మీద గాఢమైన ముద్ర వేయగల రచన చేయటం చాలా కష్టమైన పని అని నాకు అనుభవం నేర్పిన పాఠం ఒక మంచి రచనను చదివిన పాఠకుడికీ రచయితకూ ఆనంద రసానుభూతి కలగాలి అటువంటి రచనలు చేయాలనే నా ఆకాంక్ష ఆ ప్రయత్నమే నా రచనలు 1945 నుండి కథ, నవల, వ్యాసరచనల సాధనతో ఒక్కొక్క మెట్టు ఎక్కి ఆశయసిద్ధిని పొందాలన్న కోరిక ఎంత వరకూ కృతకృత్యురాలినయ్యానో చెప్పవలసినది నేను కాదు పాఠకులు

# దివంగతులు వేంకటశాస్త్రిగారు



ఆస్థానకవి కళాప్రపూర్ణ శతావధాని బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కామేశ్వరీ ఉపాసకులు కృష్ణాతీరమున కనకదుర్గాక్షేత్రమైన విజయవాడ యందు మహాశివరాత్రి పర్వదినమున ఎనుబది సంవత్సరముల వయసున పరలోకగతులైరను వార్త ఆంధ్రలోకమును కంపింపజేసినది వేంకటశాస్త్రిగారికిని, ఆంధ్రప్రజానీకమునకును గల సన్నిహిత సంబంధము రక్తసంబంధముకంటె ఎక్కువ సూక్ష్మమైనది ఎక్కువ సునిశితమైనది, శాశ్వతమైనది అది హృదయసంబంధమైన అనురాగబంధము ఆంధ్ర ప్రజాహృదయమును రంజింపజేసిన కవిహృదయము వేంకటశాస్త్రిగారిది. "కళాప్రవీణులగువారలయందె వసించు లోకముల్" అను సుభాషితమునకు వారి జీవితమే ప్రత్యక్ష ప్రమాణము ఆంధ్రహృదయమును తన హస్తగతమైన వీణవలె మీటి కంపింపజేసి, పంచకావ్యములైన బరింపని విద్యార్థులచే తెనుగున తేనెలొలుకు తియ్యని పలుకులు పలికించిన ప్రజ్ఞా ప్రభావము వేంకటశాస్త్రిగారు గడించిన యశశ్రీ

79 సంవత్సరముల వయస్సులో జీర్ణవిశీర్ణ దేహులైయున్న స్థితిలో వారిని మద్రాసు ప్రభుత్వము ఆస్థానకవిగా స్వీకరించి సత్కరించిన నాడు ఆ మహారససిద్ధుడు "పదకొండేడుల పైని రెండిపుడునా ప్రాయంబు" అని తన వయస్సును గూర్చి చమత్కృతితో ప్రస్తావించెను భౌతిక దేహము బక్కచిక్కినను, రసప్రపంచమున ఆయన నిత్యయౌవనుడు శాస్త్రిగారికి గల మనోరథము మహోదారమైనది "వివిధైశ్వర్యములిచ్చి తింక నాకటే విశ్వేశి నీ సన్నిధిన్! కవిగా నుండ నను గ్రహింపు మిదియే కామ్యంబు కామేశ్వరి!" అని ఆనాడు సభావేదికపై చాటించిరి ఆయన పూర్వజన్మ సుకృతమున కవియై జన్మించెను కవియై జీవించెను కవియై వర్ధిల్లెను కవులను వర్ధిల్లజేసి, కవియై తరియించెను

ఆంధ్రసారస్వతమునందు వేంకటశాస్త్రిగారి జీవిత మొక ప్రత్యేకశకమనక తప్పదు ఆంధ్ర సాహిత్యమునందది వేంకటశాస్త్రి యుగమని పేర్కొనబడుట నిశ్చయము స్వతంత్రభారత భూమియందీ ఆంధ్ర సాహిత్య యుగపురుషుడు ప్రప్రథమ ప్రభుత్వ ఆస్థానకవిగా పూజింపబడుటవల్ల అధునాతన సనాతన సాహిత్య సంప్రదాయములు శ్రీ శాస్త్రిగారి యందు దివ్యముగా, నవ్యముగా సమన్వయినై సన్మానింపబడినవనుట నిస్సందేహము

శాస్త్రిగారు రచించిన కావ్యములు, నాటకములు, పురాణములు ఎంత జనరంజకములో, వారి ఆశుకవితా ప్రదర్శనములు, వారి ఆంధ్రపత్రికా ప్రకటితరసవిమర్శకాదివ్యాసములు అంతటి పండిత పామరజనరంజకములైనవి

అన్వయకాఠిన్యములేని శైలి, పాండిత్య ప్రకర్షకై పెనగులాడని పదలాలిత్యము, సహజ భావోద్దీపనగల సహజభాషాలాపన ఇదియే వేంకటశాస్త్రిగారి ఆంధ్రసాహిత్యభిక్ష ఇదియే నేటి తెనుగుపద్యగద్య రచనకు వారి మేలుబంతి వారి రచనలు ఆచంద్రతారార్కమై తెనుగుబాస జీవించి యున్నంతకాలము మెఱుగు తరుగని కబ్బములై వెలయగలవు అమృతత్వమీయారామద్రావిడభూసురేంద్రుని వచోమాధుర్య ధుర్యంబైన సహజ భాషాభావ సమ్మేళనమునందంతర్గతమై యున్నది

ఆయన రాజపూజితుడే కాదు కవిరాజ పూజితుడు "అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత" అంతేకాదు, వేంకటశాస్త్రిగారొక ఆంధ్ర సాహిత్య పీఠమును ప్రతిష్ఠించి ప్రజా హృదయ పీఠము నధిష్ఠించిన రససిద్ధులు సాహిత్య దిగ్విజయ యాత్ర చేసిన కవి సమ్రాట్టులు "కింకవీంద్రఘటాపంచాననులు"

వారి రచనలయందును, వారి శిష్య ప్రశిష్యుల యందును వారి కవిత్వ సంప్రదాయముచే పెంపుసొంపులందిన ఆధునికాంధ్ర సాహిత్యమునందును వారి ప్రభావము ప్రకాశించుచున్నది అందంతటను వారి యాత్మ అంతర్లీనమై విశ్వశ్రేయోదాయకమై విశ్వవ్యాప్తమైనది అట్టి కళాప్రపూర్ణుని యాత్మకు నమస్కరించుచు, వారికి పరమేశ్వరుడు పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకము నను గ్రహించుగాక యని ప్రార్థించుచున్నాము వారి యాత్మజనులకు మా సానుభూతిని నివేదించుచున్నాము ★

(సంపాదకీయం ఆంధ్రపత్రిక 1950 ఫిబ్రవరి 22)

# ఇప్పుడు!

## డిటర్జెంట్ ఉతికే బిళ్ళలకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ, ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

డిటర్జెంట్ బిళ్ళల
అధిక ఉతికే శక్తి.

ఉతికే బార్ సోపుల
మితవ్యయము.

300 గ్రాములు.

## టోటల్

నీలి డిటర్జెంట్ బార్




సులభ ఉతుకుకై
ఐదు సౌకర్యకర
మైన భాగాలు




కర్నాటక సోప్స్ మరియు డిటర్జెంట్స్ లిమిటెడ్,
బెంగళూరు వారి ఒక నాణ్యమైన ఉత్పాదన

మార్కెట్ చేయువారు·
మైసూరు సేల్స్ ఇంటర్‌నేషనల్ లిమిటెడ్, బెంగళూరు.

MCA-TDB-52-TEL

సీరియల్

# మూగ ముత్యాలు

యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సాయంత్రం కాగానే సారథి విజయని పిలిచాడు

"ఇదేమిటి ?" ఇంకా యిలాగే వున్నారు మీరు ?"

"ఏం బావుండలేదా ?"

"పూలు పెట్టుకోరా మరి చీర కట్టుకుంటే బావుంటుందేమో !" అతడామె వంక చూసి అన్నాడు

"ఈ చీరలో అందంగా లేనంటారా ?"

విజయ కళ్ళు ఆనందంతో తళతళ మెరిసిపోతున్నాయి

"అబ్బే ! అదేంగాదు ! తాతయ్య క్రొత్త చీర కట్టుకోమన్నారని అన్నాను !"

"క్రొత్త చీరా ! వుహూ ! లేదసలు ! మీకు గుర్తులేదేమో! చూడ్డానికి మీరొస్తారేమోనని తాతయ్య పట్టుచీర కట్టించారోనాడు ! కానీ మీ అమ్మగారొచ్చారు పట్టుచీరాలూ, క్రొత్త చీరలూ నాకు అదృష్టాన్నివ్వవన్న భయం పట్టుకుందా రోజునుంచి !"

సారథి గుండెనుంచి గొంతు వరకు వచ్చిన మధురాతి మధురమైన వూహల్ని బలవంతాన దిగ మింగాడు

"భలేవారే ! సరేనండి !" నవ్వు పులుముకున్నాడు ముఖాన

"మీరు వెళ్ళండి !" ఆమె కూర్చున్న చోటునుంచి లేవనే లేదు

ఆ తరువాత సోమయాజులుగారు పిలిచారు

"సారథిగారినోసారిలా పంపించండి తాతయ్యా !" ఆమె తన గదిలోనుంచే అన్నది నెమ్మదిగా

సారథికి వెళ్ళక తప్పలేదు

"ఏమిటలా కంగారు పడిపోతున్నారు మీరు? పెళ్ళిచూపులు మీకా ? నాకా ? ముందు ఆ నుదుటపట్టిన చెమటని తుడుచుకోండి ?"

అతడు రుమాలుతో అద్దుకున్నాడు

"మీ స్నేహితుణ్ణి ఓసారి బయటకి

( గత సంచిక తరువాయి )

వెళ్ళమనండి ! తాతయ్యతో మాట్లాడవలసిన పనుంది !" అన్నదామె

సారథిని చూస్తూ నవ్వుకుందామె –

"పాపం ! ఎంత కష్టం వచ్చిపడిందోనూ అతిథిదేవుడికైనా !" ఆమె మనస్సు ముచ్చటగా నవ్వింది

విజయ లేచి వెళ్ళింది ఆ తరువాత –

"ఏమ్మా ? ఏమిటి ? మాట్లాడాలన్నావట !" సోమయాజులుగారామెని నఖశిఖ పర్యంతం చూస్తూ ప్రశ్నించారు.

"సారథిగారు మన యింటికి వచ్చిన అతిథులు గనుక అవమానించడం బావుండదు ! అందుకే ఆయన స్నేహితుణ్ణి చూడ్డానికి అంగీకరించాను. ఈ మాట ఆయనకి చెప్పటం మరచిపోకండి ! మళ్ళీ యిలాంటి ప్రయత్నం చేయకండి యిద్దరూ కలిసి !"

"ఈ మధ్య నువ్వు నన్ను చిన్న పిల్లవాణ్ణి చేసి ఆడిస్తున్నావమ్మా ! సరే కానివ్వు !" ఆయన నిట్టూరుస్తూ సారథిని పిలిచారు

ప్రతాప్ కూడా లోనికి వచ్చాడు !

విజయ తాతగారి ప్రక్కన కూర్చునివుంది వాళ్ళిద్దరూ లోనికి రాగానే లేచి నిలబడి నమస్కరించింది

ప్రతాప్‌కూడా నమస్కరించి "కూర్చోండి" అన్నాడు.

సారథి కట్నం కానుకల సంగతి చెప్పాడు సోమయాజులుగారు అతని ఉద్యోగం గురించి రెండు మూడు ప్రశ్నలడిగి వూరుకున్నారు విజయ, రెండు మూడుసార్లు తలెత్తి సారథిని చూసింది అతడు విజయ గుణగణాల్ని ప్రశంసించడంలో లీనమైపోయాడు

"మీరు యింటరు చదివే వని ! కాలేజీ జీవితంలో ఏ విధమైన ఆనందం లభిస్తుంది!" ప్రతాప్ అన్నాడు విజయ నుద్దేశించి.

"మీ స్నేహితులే వద్దన్నారు !" విజయ తల వంచుకొనే సమాధాన మిచ్చింది సారథి ఆ సమాధానం విని నివ్వెరపోయాడు

అతడేదో అనబోతుంటే సోమయాజులుగారు వారించారు కళ్ళతోనే

'ఈ ముసలివాణ్ణి చూసేవాళ్ళు వుండరని అలా సలహా యిచ్చాడు బాబూ !" అన్నారాయన

"నేను వెళుతున్నాను తాతయ్యా ! కాఫీ పెట్టి వచ్చాను ! సారథిగారికి ఒంటో బావుండలేదంట ! వేడి వేడి కాఫీ యివ్వ మన్నారు !" అని విజయ లేచి వెళ్ళిపోయింది.

సారథికి అంతా అయోమయంగా వుంది అతనికి ఒంట్లో బావుండలేదని ఆమెకెలా తెలిసిందో అర్థం కాలేదు !

"విజయా ! నన్ను పిచ్చివాణ్ణి చేసి వేస్తున్నావు ! నేను వేడి కాఫీ యిమ్మని నిన్నెప్పుడడిగాను ? నాకు ఆరోగ్యం బావుండలేదా ? నీ యీ అందమైన కలల్లోకి నేను రాలేను ! విజయా !"

అతని వూహలన్నీ నిట్టూర్చాయి

అంతలో ప్రక్క యింటి నాగరాజశర్మగారొచ్చారు సారథి గురించి వివరాలు అడిగి 'మా అమ్మాయి బి ఏ వరకు చదివింది బాబూ ! నీకు యిష్టమైతే చూసివెళ్ళు నాయనా !" అన్నారు

"అబ్బే ! ఆ ప్రయత్నాలు అనవసరమండీ ! నాకు పెళ్ళయిపోయింది !" అతని మనస్సులోవున్న నిజం అదేనని సోమయాజులుగారు అర్థం చేసుకొన్నారు

**జరిగిన కథ — 7 :** సలీంకు సారథిపట్లగల ఆరాధనను మనస్సులోనే మెచ్చుకొంటుంది శశిరేఖ సారథి శశిరేఖతో విసిగి ఆమెను వదిలేసి సీత దగ్గరకు వెళుతాడు సీత భర్త శ్రీనివాస్ అని తెలుసుకుంటాడు శశిరేఖను చూడాలంటుంది సీత తను విజయకు తగనని సోమయాజులు గారితో అంటాడు సారథి మనిషికి మనస్సు ముఖ్యం కానీ, కులం ప్రధానం కాదని చెపుతాడు సోమయాజులు సోమయాజులుగారికి పక్షపాతం వస్తుంది విజయను, రాజ్యంను అయన దగ్గరకు తీసుకెళతాడు సారథి సోమయాజులుగారికి సలీంను పరిచయం చేస్తాడు సీత సారథి ఇంటికి వచ్చి అక్కడ శశిరేఖను చూస్తుంది శ్రీనివాస్‌కన్నా మంచివాడిని తెచ్చి పెళ్ళి చేస్తానని సారథి శశిరేఖకు చెప్పబోగా ఆమె అతని మాట వినకుండా అతనితో ఘర్షణ పడుతుంది మెల్ల మెల్లగా విజయ మనస్సును సారథి ఆకట్టుకొంటుంటాడు

"విజయ నా మనిషి !" అని గోలపెడుతోం దతని మనస్సు

ప్రతాప్ "ఎందుకురా అబద్ధం ఆడావు ?" అని అడిగాడు ఆ పెద్దమనిషి వెళ్ళిపోగానే

"లేకపోతే నన్ను వదిలిపెట్టరురా బాబూ !" అన్నాడతడు

ప్రతాప్ ఆ రోజే వెళ్ళిపోయాడు "మీకెపుడు వీలయితే అపుడే ముహూర్తాలు పెట్టించండి !" అని చెప్పాడు వెళ్ళేముందు

సారధి కూడా వెళ్తానన్నాడు కానీ విజయ ఆపివేసింది

## మూగ ముత్యాలు

"ముహూర్తాలు పెట్టించకుండానే వెళ్ళిపోతానంటారేమిటి ?" అని

"విజయా ప్రతాప్ మీకు నచ్చాడా ?"

"ఏం ? నచ్చగూడదనుకుంటున్నారా ?"

"భలేవారే ! అలా ఎందుకనుకుంటాను ? అయినా ప్రతాప్ ఎందుకు నచ్చడు ? వాడూ మీ అంత ఛాయ వున్నాడు ! చక్కని పర్సనాలిటీ!"

"ఆపండి ! దయచేసి ! అతను నాకు నచ్చలేదు ! ఎందుకని అడగరేమిటి ?"

ఆమె కనుల చివర చిలిపిదనపు విన్యాసాల మెరుపులు

"చెప్పండి !"

"మీకన్న తెల్లగా వున్నాడు ! నా కందుకే నచ్చలేదు !"

"నేను మీకన్న, వాడికన్న నలుపేలెండి !" అతనికేం మాట్లాడాలో తెలియలేదు

"సైగా అతనికి మీలా అబద్దాలు చెప్పడం రాదు !"

(ఇంకా వుంది)



ఆంధ్ర సచిత్ర వారపత్రిక 75 సంవత్సరాలు
పూర్తిచేసుకొని వజ్రోత్సవ సంవత్సరంలో అడుగిడిన
శుభ సందర్భములో మా శుభాభినందనలు

*

## మోహన్ ఫ్యాన్సీస్టోర్సు,
## వాసవీ ఏజెన్సీసీస్,

డీలర్లు

**అమృతాంజన్ లిమిటెడ్,**
**కాల్గేట్ పామోలివ్ ఇండియాలిమి.,**
**మైసూరు సేల్స్ ఇండియా లిమి.,**
**విల్టెక్సు ఇండియా లిమి.,**

లాలాపేట, గుంటూరు_3.

## రాజేశ్వరి మెడికల్స్,

గుంటూరువారి తోట, గుంటూరు-522001.
ఫోన్ నెం 22659

---

# దశావతార
## అగరవత్తులు

REGD.NO. 296137.

ఆహ్లాదకరమైన
సాటిలేని పరిమళము

వై. బసప్ప పర్ఫ్యూమర్,
206, అవెన్యూరోడ్, బెంగళూరు-2

స్టాకిస్టులు — హైదరాబాద్ మధాకర్ ఏజన్స్, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్
రాయలసీమ సింగార్ ఏజన్స్, కమలానగర్, అనంతపూర్

---

# జెమిని పళ్లపొడి










## సిల్వర్ జూబ్లీ
## ఉచిత బహుమతులు

FIRST PRIZE





మొదటి బహుమతి.
22ct బంగారు నెక్లెస్ 20గ్రా
లేదా డయనారా T.V-1

SECOND PRIZE



రెండవ బహుమతులు
2
సుమీత్ మిక్సర్లు

THIRD PRIZE



మూడవ బహుమతులు
3
హీరో సైకిల్సు-డైనమోతో

FOURTH PRIZE



4వ కన్సొలేషన్ ప్రైజులు
4
స్టీలు క్యారేజీలు

**GEMINI CHEMICAL PRODUCTS, MACHILIPATNAM-521001 (A.P.)**

# తొలినాటి తెలుగు పత్రికలు - కొన్ని జ్ఞాపకాలు

శ్రీ దేవులపల్లి రామానుజరావు

ఆంధ్ర వారపత్రికకు డెబ్బై అయిదు సంవత్సరాలు నిండిన శుభ సందర్భంలో వజ్రోత్సవ సంచికగా వెలువడడం ఆంధ్రావళికి మోదం కలిగించే సంఘటన నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రులను అన్నిరంగాలలో మేలుకొలిపిన వైతాళికులలో అగ్రగణ్యుడు ఆయన దేశ స్వాతంత్ర్యోద్యమానికి, సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమానికి నాయకత్వం వహించిన నిష్కళంక దేశభక్తుడు నాగేశ్వరరావుగారికి పత్రిక నిర్వహణ ఒక వ్యాపారం కాదు ఆనాటి దేశ పరిస్థితులను చూచి, జాతి అవసరాలను గుర్తించి ప్రజలకు మార్గదర్శకత్వం వహించవలసిన గురుతర బాధ్యతను నిర్వహించే ఉన్నత లక్ష్యసాధన ఆదర్శంగా దిన—వార—మాస పత్రికల నిర్వహణకు కంకణబద్ధులై తమ ఆశయంలో కృతకృత్యులైనారు. వాస్తవానికి తెలుగు పత్రికల ప్రచురణ 1840 లోనే ప్రారంభమైనది కాని ఆంధ్రపత్రిక వంటి విశాలమైన ఆశయాలు అంతకు పూర్వపు పత్రికలకు లేకుండెను దేశము, దేశస్వాతంత్ర్యము సంఘము, సంఘసంస్కరణ — ప్రజలు, ప్రజల అభ్యుదయము, సాహిత్యము, కళలు, సంస్కృతి వాని వికాసం వీటన్నిటిని సమన్వయించి సమగ్ర దృక్పథంతో పత్రికను నడిపిన గౌరవము నాగేశ్వరరావు పంతులుగారికే ఈయవలసి ఉన్నది

ఆనాటి తెలుగు సీమలో — అది మదరాసు పరిపాలిత ఆంధ్రప్రాంతమే కానీయండి, నిజాం పరిపాలించిన తెలంగాణ ప్రాంతమే కానీయండి — ఏ గ్రంథాలయంకూడా నాగేశ్వరరావుగారి ప్రోత్సాహం పొందక ఉండలేదు అనేక గ్రంథాలయాలకు, రచయితలకు, పండితులకు తమ పత్రికలను ఉచితముగా పంపించిన నిదర్శనాలు నాకు ఎన్నియో తెలుసును సూర్యుని రశ్మివలె ఆంధ్రపత్రిక తెలుగుమాట్లాడే ప్రతి పల్లెకు వెలుతురు నిచ్చినది ఆంధ్రపత్రిక పక్షాన సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక కళా—సాహిత్య రంగాలకు సంబంధించిన ఉత్తమ వ్యాసాలతో సర్వాంగసుందరంగా సంవత్సరాది సంచికల ప్రకటనను కూడా నాగేశ్వరరావుగారు ప్రారంభించిరి నాటికి నేటికి ఆంధ్రపత్రిక నిరంతరాయంగా నడుస్తున్నదంటే దానికి కారణం నాగేశ్వరరావుగారి చేతి చలువ, అమృత హృదయమే అని చెప్పవచ్చును నాగేశ్వరరావుగారి ఆదర్శాలకు అనుగుణంగా పత్రికలను నిర్వహించిన తెలుగు వారిని కొందరిని ఈ సందర్భంలో సంస్మరించడం ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశం

తెలుగు పత్రికల చరిత్రకు సుమారు నూటయాభై (150) సంవత్సరాల వయస్సు ఉన్నది అయితే భారత స్వాతంత్ర్యోద్యమాన్ని, జాతీయోద్యమాన్ని బలపరిచి ప్రజలలో జాగ్రుతి కలిగించి వారి సర్వతోముఖ వికాసానికి తోడ్పడ వలననే లక్ష్యాన్ని నూటికి నూరుపాళ్లు ఆచరణ రూపంలో పెట్టిన పత్రికలలో 'ఆంధ్రపత్రిక'దే అగ్రతాంబూలం ఇంగ్లీషువారు పరిపాలించిన తెలుగు ప్రాంతాలలో 1832 సంవత్సరం నుండియే పత్రికా ప్రకటన మొదలైనప్పటికిని నిజాం ప్రభువు పాలించిన తెలంగాణ ప్రాంతంలో తెలుగులో పత్రికా ప్రకటన 1920 వరకు ప్రారంభం కాలేదు

తెలంగాణములో హైదరాబాదు నగరం నుండి వెలువడి 19 వ శతాబ్దంలో కొన్ని ఇంగ్లీషు, ఉర్దూ పత్రికలు కొంత కాలం నడిచినవి అయితే ఆ పత్రికల మీద కూడ ఆనాటి ప్రభుత్వం అనేక ఆంక్షలు విధించేది బ్రిటిష్ ప్రభుత్వానికి గాని, నిజాం ప్రభుత్వానికి గాని ఇబ్బంది కలిగించే వ్రాతలు ఏవీ వ్రాయకూడదనే ఆంక్ష ఆనాటి పత్రికల మీద విధింపబడిన నిదర్శనాలు కొన్ని ఉన్నవి పత్రికా స్వాతంత్ర్యము అరికట్టడము ఆనాటి ప్రభుత్వ విధానమై ఉండెను దానిని ఎదుర్కొన్న సంపాదకులు అనేక కష్టాలకు పాలయినారు ఈ దుష్ట సంప్రదాయం ఇంచుమించుగా హైదరాబాదుపై పోలీసు చర్య జరిగే వరకు కొనసాగినది 19వ శతాబ్దంలో ఉర్దూ పత్రికల వలె 20వ శతాబ్దంలో తెలుగు పత్రికలు వాగ్బంధ శాసనాది అనేక నిర్బంధాలకు గురియైనవి

1920 వ సంవత్సరంలో తెలంగాణము నుండి రెండు పత్రికలు వెలువడినవి మొదటి పత్రిక ''తెనుగు పత్రిక'' వరంగల్ జిల్లా, మానుకోట తాలూకా, ఇనుగుర్తి అనే పల్లెటూరు నుండి ప్రకటితమైంది ఈ పత్రికా సంపాదకులు ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవరంగారావు సోదరులు ఉభయులు సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు, పారసీ భాషలలో ప్రవీణులు, దేశసేవా పరాయణులు, సంపన్న కుటుంబీకులు, మఖ్తేదారులు, పత్రికను ఒక వృత్తిగా స్వీకరించిన వారుకారు అందు వలన డబ్బు సంపాదించి కుటుంబాన్ని పోషించుకోవలసిన అవసరం వారికి లేకుండెను నిరంకుశ ప్రభుత్వ పరిపాలన క్రింద సాంఘికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా ఆర్థికంగా అణచివేయబడిన తెలుగు ప్రజలను మేలుకొలిపి వారి సర్వతోముఖ అభ్యుదయానికి కృషి చేయడమే తెనుగు పత్రిక ఆదర్శం ఆ సోదరులు స్వయంగా ముద్రణాలయ వ్యవహారాలు అన్నింటిని నిర్వహించి తుదకు కంపోజిటర్ పని కూడా చేసి పత్రికను నడిపే వారిని తెలిపితే వారి పట్టుదల, త్యాగనిరతి, దేశాభిమానం సులభంగా ఊహించుకోవచ్చును ఈ పత్రిక సుమారు అయిదు సంవత్సరాలు నడిచి ప్రశంసనీయమైన కృషి చేసినది ఇదే సంవత్సరంలో నల్లగొండ నుండి ''నీలగిరి'' అనే పత్రిక షబ్నవీసు నరసింహారావుగారి సంపాదకత్వంలో వెలువడినది నరసింహారావుగారు ఒద్దిరాజు సోదరుల స్థాయిగల పండితుడు కాకపోయినప్పటికిని నీలగిరి పత్రికను ప్రశస్తంగా, ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దే సాధనంగా నిర్వహించినారు ఈ రెండు పత్రికలకు ప్రేరణ నాగేశ్వరరావుగారి పత్రికల నుండియే లభించినది ''నీలగిరి'', ''తెనుగు'' పత్రికలు ఆరోజులలో తెలంగాణా ప్రజలలో మంచి జాగ్రుతి కలిగించినవి, ఆంధ్రోద్యమానికి బలము చేకూర్చినవి, ప్రాథమిక స్వత్వాల కొరకు పోరాడి జాతీయతకు అండయై నిలిచినవి

(ఇంకా వుంది)



AVM PRODUCTIONS

ఏ.వి.యం.ప్రొడక్షన్స్ సమర్పించు

శ్రీసారథీ స్టూడియోస్



# మూడుముళ్ళు



జంధ్యాల శశిభూషణ్

కె.భాగ్యరాజ్

ఎస్.గోపాలరెడ్డి
రాజన్ నాగేంద్ర

నవయుగపిక్చర్స్

నవయుగ

# ఆనాడు-ఈనాడు — అంజలీదేవి

★ మీరు సినిమా రంగంలో ప్రవేశించి మూడు పదులు దాటిందను కుంటూ ఒక్కసారి వెనక్కితిరిగి చూసుకుంటే, మీకే మనిపిస్తుంది ?

అదొక సుందర స్వప్నంగా కనిపిస్తూంటుంది. గత స్మృతులు, గతానుభవాలు మనోహరంగా కొన్ని, మానసికానందం కలిగించేవిగా కొన్ని, మనోవేదనా మయమైనవిగా కొన్ని— స్మృతి పథానికివచ్చి, ఇంతకాలం ఇట్టే గడిచిపోయిందా అనిపిస్తుంది. ఒక్కొసారి జీవితమంటే నిత్యపోరాటమా అని కూడా అనిపిస్తూంటుంది. ఈ ముప్పయ్యైన 35 ఏళ్ళ సినీజీవితాన్ని వెనుకకు తిరిగి చూసుకొని ఏం సాధించానని ఆలోచించుకుంటే— నా మనసు తృప్తితో నిండిపోతుందేకాని, అసంతృప్తి ఎంత మాత్రం తోచదు. ఎందువలన అంటే, ఈ నాటికీ ప్రజలలో నా స్థానాన్ని గౌరవప్రదంగా నిలబెట్టుకో గలిగానన్న సంతృప్తి. ఇటు ఆంధ్రదేశంలో అడుగుపెట్టినా- అటు తమిళనాడులో కాలుమోపినా, ప్రజలలో అపారమైన ఆదరణ నాకు ఈ నాటికీ లభించడం నా భాగ్యం. నా జీవితం చరితార్థమయిందనే తృప్తి. ఇంత కాలం విభిన్న పాత్రలలో నటించి, ప్రజల హృదయాలలో చెరగనిముద్ర వేసి, వారి సానుభూతి పొందగలిగానన్న సంతృప్తి...అయినా, ఇంకా ఏదో సాధించాలనే తపనతో— వయోభారం పై బడినా ఇంకా నటించాలనే కాంక్ష కేవలం ఆత్మానందం కోసమేనంటే అతిశయోక్తి కాదు. మానసిక ప్రబోధమైన నటనాసక్తి, దైవదత్తమైన సృజనాత్మక శక్తి నన్ను ఉత్తేజితను చేస్తున్నాయి.

★ నవతరం తారలకు మీరిచ్చే సందేశం?

బాగా కృషి చేయాలి. ఓర్పు, పట్టుదల పెరగాలి. వైవిధ్యంగల పాత్రలలో నటించే నేర్పు పెంపొందించు కోవాలి. అందుకోసం నటనలో ఏకాగ్రత అలవరచుకోవాలి. ఇదే నా అనుభవాన్నంతా తరచి, నవతరానికి నేనిచ్చే సందేశం... నేను సినిమా రంగంలో అడుగు పెట్టినసమయం చిత్రసీమకు బంగారుయుగం అని నా భావం. ఆనాటి చలనచిత్ర నిర్మాణ సంస్థలన్నీ క్రమశిక్షణకు నిలయాలు; ఆ నిర్మాణ సంస్థలు మాకు కళాశాలలు.'లర్న్ వైల్ యు అర్న్' అనేది మా ఆశయం.

★ చలనచిత్ర నిర్మాణంలో, నాటికీ, నేటికి వచ్చిన మార్పులేమిటి ?

ఆనాటి క్రమశిక్షణ ఈనాడు లేదు. మరి ఏనాడూ రాదు. ఆనాడు దర్శకులు మాకు దివినుండి దిగివచ్చిన దేవతలు, ఆనాటి చలనచిత్ర నవయుగ వైతాళికులు 'స్టోరీ సెషన్స్' ఏర్పాటుచేసి, మాకు ఆది నుంచి అంతం వరకు కథ వినిపించి, అందులో మా పాత్ర స్వభావాలేమిటో, దాని లక్ష్యాలేమిటో వివరించి చెప్పేవారు... మరి ఈనాడు సెట్స్ లోకి వెళ్ళేవరకు మా పాత్రలేమిటో మాకు తెలియవు. వాటి స్వరూప స్వభావాలేమిటో ఎవరికీ అర్థంకావు. ఆనాడు మా సంభాషణలు సమగ్రంగారాసి ముందే ఇచ్చేవారు. వాటిని మననం చేసుకుంటూంటే, వైవిధ్యంలేని పాత్రలనైనా సరే— వాటికి మెరుగులుదిద్ది, వైవిధ్యాన్ని ఆపాదించు కొనగలిగే అవకాశం, అవగాహనశక్తి పాత్రధారులకు అలవడ్డమే కాకుండా, ఆలోచనా తరంగాలు మెదడులో కదులుతూ— భావప్రకటన, శబ్దోచ్చారణా పాటవం స్ఫురించేవి. ఈనాటి నటీనటులకు ఆ సదవకాశం లేదు.

ఆనాడు అంతా ఒక ప్లాను ప్రకారం నిర్మాణ నిర్వహణ జరిగేది. పాటలు పాడించడానికీ, డాన్సులు చేయించడానికీ రెండు మూడు రోజులైనా రిహార్సల్సు చేయించేవారు. ఈనాడు అంతా హడావిడి. దాంతో పెర్ఫెక్షన్ అనేది 'హుష్‌కాకి' తంతుగా గాలిలో ఎగిరి పోతుంది.



★ నాటికీ, నేటికీ మీ అభిమానులలో ఏదైనా తేడా కనిపిస్తూందా ?

నేను నాయికగా నటించినప్పటికన్నా "లవకుశ"లో సీత, "రంగులరాట్నం"లో తల్లి పాత్రలు ధరించినదాదిగా నాకు అభిమానులు మరింత ఎక్కువయ్యారు. నేను నటించిన చిత్రాలు ప్రజల చిత్తప్రవృత్తులపై ఎంతటి అమోఘమైన ప్రభావాన్ని చూపించాయో నేను ఔట్‌డోర్ షూటింగ్‌లకు వెళ్ళిన అనేక సందర్భాలలో తెలుసుకోగలిగాను. ఒకసారి శ్రీశైలం వెళ్ళి వస్తూండగా ఒక గ్రామం దగ్గర జనం దారి కడ్డుగా కాచుకొని, కారు రాగానే ఆపారు. కొందరు సోదరీమణులు "సీతమ్మతల్లీ, కారు దిగమ్మా !" అని ఆప్యాయతతో కోరారు. దిగిన వెంటనే కొందరు నా కాళ్ళకు నమస్కరించారు. ధాన్యపు కంకుల గుత్తులు కానుకగా నాకు సమర్పిస్తూ నుదుట కుంకుమతిలకం దిద్ది, "తొలి పంటమ్మా ! ఇస్తున్నాం. నీకు జయం కలగాలి !" అని అంతా ఏకకంఠంతో పలికితే నేను పరవశురాలినై పోయాను. జీవితం చరితార్థమైందను కున్నాను. ఇది "లవకుశ" చిత్రం విడుదలయ్యాక ప్రజలలో నాపై ఏర్పడిన పవిత్ర భావం. ఇలాగే "వదినగారి గాజులు" చూసిన కొందరు సోదరులు "నీలాంటి వదిన కావాలనే కోరుకుంటున్నాము." అని ఉత్తరాలు రాశారు. "ఇలవేల్పు, ఋణానుబంధం, బడిపంతులు, రంగులరాట్నం" మొదలైన చిత్రాలు ప్రజల హృదయాలలో భావ పరివర్తన కలిగించి నన్ను వదినగా, తల్లిగా, సోదరిగా ఊహించుకొని సంబోధిస్తూంటే ఎంతగా మురిసిపోయానో చెప్పనలవి కాదు. దీన్నిబట్టి అశ్లీలానికి, అసభ్యతకు తావులేని ఉత్తమ చిత్రాలను ఆదరించే ప్రేక్షకులు ఇప్పటికీ ఉన్నారని రుజువవుతోంది. మన దేశ సంస్కృతినీ, ఆనాటి ఆచార వ్యవహారాలనూ, నీతినియమాలనూ చాటిచెప్తూ సంఘ పురోభివృద్ధికి తోడ్పడేలాగ యువతీ యువకుల హృదయాలలో ఉత్తమ భావాలను రేకెత్తించి, వారి నైతిక ప్రమాణాలను పెంచి, ప్రజా జీవితానికి ప్రతిబింబాలుగా నిలబడే ఉత్తమ చిత్రాలు విరివిగా తయారవ్వాలని కోరుకుంటున్నాను.

—జి. వి. జి.



# తెలుగు వెలుగులు 45

దుర్గాబాయమ్మగారంటే ఒక వ్యక్తి కాదు, ఒక వ్యవస్థ అనిబిసెంటమ్మను పోలిన వ్యక్తి దివ్యజ్ఞాన సమాజానికి అనిబిసెంటమ్మ మూల విరాట్టయినట్లు ఆంధ్ర మహిళా సభకు దుర్గాబాయమ్మగారు మూలవిరాట్టు సంస్థా నిర్మాణ నిర్వహణశక్తులకు అనిబిసెంటమ్మ జగత్ప్రసిద్ధిని సంపాదించింది జగత్ప్రసిద్ధి కాకపోయినా, దేశ విఖ్యాతి సంపాదించింది దుర్గాబాయమ్మగారు

కనకదుర్గమ్మవలె ఈ కాకినాడ దుర్గమ్మ శక్తిమయి అయితే ఆమె శక్తి దారీ తెన్నూలేక పొంగి పొరలి ప్రవహించే శక్తి కాదు, వ్యూహ విధానంలో నడిచే శక్తి, సంకల్ప సిద్ధిని పొందే శక్తి

మొట్టమొదటగా దేశం దుర్గాబాయమ్మ గారిని గురించి విన్నది ఉప్పుసత్యాగ్రహ సమరంలో ఏదో పనిమీద వచ్చి, అప్పటికి ఆమె మద్రాసులో ఉండటం తటస్థించింది, సత్యాగ్రహం రాబోతున్నదనీ, అందులో పాల్గొందామనీ రాలేదు కాని, సెలయేరు పొంగినట్లు ఎదలో దేశభక్తి పొంగి ఆమెను సత్యాగ్రహ రంగంలోకి తరుము కొని పోయినది నాగేశ్వరరావు, ప్రకాశం పంతులు గార్ల తర్వాత ఉద్యమ నాయకత్వం వహించింది అప్పుడు కనుక ఆమె లేకపోతే, మద్రాసునగరంలో ఉద్యమం సన్నగిలిపోయేది ఎవరీ దుర్గాబాయి–అన్న ప్రశ్నతో మద్రాసునగరం మారుమ్రోగింది

అప్పటి కామెకు పట్టుమని ఇరవయిఏళ్ళు కూడా లేవు అందుకనే ఆవిడను "జోన్ ఆఫ్ ఆర్క్" వంటి వీరవనిత అని ప్రస్తుతించారు మనిషి, మాటా కూడా బెర్నార్డ్ షా వర్ణించిన జోన్‌రూపాన్నే స్ఫురింపజేసేది

పిల్లప్రాయమందే ఆమెలో ఒక శక్తి తల యెత్తి వేధించుకు తినేది పెద్దలకు అందని, పెద్దలు తలపెట్టని పనులకు పూనుకొనేది కాక పోతే పదిఏళ్ళు వచ్చేటప్పటికే, హిందీ భాషలో మంచి పాండిత్యం సంపాదించడమే కాక, అమ్మలకి, అమ్మమ్మలకీ బడిపెట్టి పాఠాలు చెప్పడమేమిటి?

వాస్తవానికి ఆంధ్రలో మొదటి హిందీ పాఠశాల పెట్టిన పేరూ ప్రతిష్ఠ ఆమెవనే చెప్పాలి జమ్నాలాల్ బజాజ్ ఆ పాఠశాలను చూచి "దాన్ని నడిపేదెవరు?" అని ప్రశ్నించాట "ఇదిగో ఈ అమ్మాయి!" అని పరికిణీ చొక్కాలో ఉన్న దుర్గాంబని చూపించారట

ప్రథమ సత్యాగ్రహం నాటికి దుర్గాబాయమ్మగారికి దాదాపు ఇంగ్లీషు రాదంటే ఆశ్చర్యపోవచ్చు ఉప్పు సత్యాగ్రహంలో రెండు పర్యాయాలు జైలుకు వెళ్ళింది. మూడు నెలలు మధుర జైలులో ఒంటరి గదిలో వేశారు నడి ఎండలో నిలబెట్టారు మెరపకాయలు దంపించారు

విడుదలయ్యేనాటికి ఆరోగ్యం పూర్తిగా చితికిపోయింది అయినా ఆమె తన మనో నిశ్చయంవల్ల అనారోగ్యాన్ని జయించి విద్యాభ్యాసం ఆరంభించింది మహర్షి సాంబమూర్తి పితృవాత్సల్యంతో ప్రోత్సాహమిచ్చారు మెట్రిక్యులేషన్ నుండి ఎం ఏ, బి యల్ వరకు పరీక్షలన్నీ ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణురాలయింది రాజ్యాంగ నిర్మాణసభ సభ్యురాలైంది అప్పటికే ఒక వ్యక్తిగానే కాక ఒక వ్యవస్థగా పల్లవించడం ఆరంభమైంది.

ఆమె ఆ రోజులలో స్థాపించిన ఆంధ్ర మహిళా సభ వివిధశాఖలతో వ్యాపించి మహా వట వృక్షంలా వర్ధిల్లుతున్నది ఆ సంస్థ ఆమె కార్య దీక్షకు, నిర్మాణ శక్తికి ఓర్పుకు చిహ్నం మద్రాసు మాదని ఆవేశంతో వీరాంగం వేసిన నాయకులెవరూ మద్రాసులో ఆంధ్ర సంస్థను స్థాపించలేకపోయారు, స్థాపించిన ఘనత దుర్గాబాయమ్మగారికి దక్కింది

1952లో పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో ఆమె ఓడిపోక పోయి ఉంటే చాలామందికి మల్లె మహా అయితే ఒక మంత్రి అయ్యేది, అంతే ఓడిపోవటం ఆమెకెలా ఉన్నా దేశానికి మంచిదయినది గెలిచి ఉంటే సంఘ సంక్షేమ వ్యవస్థకు (సోషల్ వెల్‌ఫేర్ బోర్డుకు) అధ్యక్షురాలుగా సేతుశీతనగ పర్యంతం జనానీకానికి సేవ చేయగలిగేది కాదు. ఆ వ్యవస్థ భారతదేశమంతా పరివ్యాప్తమైంది, ఒక చిన్న సామ్రాజ్యం ఆమె దానికి మహారాజ్ఞి. "స్త్రీ త్రప్రియాయై నమః"

ఆమె ఇంత ఉన్నత స్థానం ఆక్రమిస్తున్నా, చింతామణి దేశ్‌ముఖ్ ఇల్లాలై దుర్గాబాయి దేశ్‌ముఖ్ అయినా, ఆంధ్రులకు దుర్గాబాయమ్మగారే ●

ఆంధ్ర పచిత్ర వారపత్రిక
1960 అగస్టు 3 సంచిక నుంచి

# మీరు ముచ్చట పడే లాంపులు



ఇప్పుడు ఎక్కువ కాలము మన్ను
అధునాతనమైన డిజైన్లలో

**kapoor**
**LAMP SHADE CO**
బషీర్ బాగ్, హైదరాబాద్.

---

***With Best Compliments***

Cable DEHYDRATES Phone 4353



## CIRCAR DEHYDRATES LIMITED

*Registered Office & Factory*
*RAMANAYYAPETA, KAKINADA-533 009, INDIA*

A Joint Venture with A P Industrial Development Corporation Ltd, and A P State Agro Industries Development Corporation Ltd

**MANUFACTURERS & EXPORTERS OF CANNED, BOTTLED & DEHYDRATED FOODS**

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
రజతోత్సవం జరుపుకుంటున్న సందర్భంగా
మా శుభాకాంక్షలు

*



## మహాలక్ష్మి శారీ మ్యూజియం

జైన్‌మందిర ప్రక్కన, సుల్తాన్ బజార్
హైదరాబాదు-500 001

పట్టు చీరలకు మరియు రోజువారీ ధరించే
చీరలకు స్పెషలిస్టులు
నేడే దర్శించండి.

సీరియల్

# వాసన చూరలి

కొడాలి సాంబశివరావు

24

(గత సంచిక తరువాయి)

శ్రీరావ్ – విజయ్ చిన్ననాటి స్నేహితుడు వాళిద్దరూ డిగ్రీలో క్లాస్‌మేట్స్ వారి మధ్య అరమరికల్లేవనే చెప్పాలి ఒకరోజు శ్రీరావ్ హఠాత్తుగా దర్శనమిచ్చాడు చాలా రోజుల తరువాత కనిపించిన మిత్రుడ్ని చూసి చాలా సంతోషించాడు విజయ్

"ఏమిటిలా హఠాత్తుగా దర్శనమిచ్చావు ?–" అంటూ ఆప్యాయంగా కరచాలనం చేసాడు

"ఆఫీసు పనిమీద వచ్చాను అది సరే ఏమిటి మాకెవరికీ చెప్పాచేయకుండా పెళ్లి చేసుకున్నావట కనీసం ఇంటికి తీసుకెళ్లి మీ శ్రీమతినన్నా పరిచయం చేస్తావా ? లేక ఇలాగే రోడ్డుమీద నిలబెట్టి హస్కు కొడతావా ?–"

"ఐ యామ్ సారీ రావ్ ! మ్యారేజ్‌కు నిన్ను పిలవాలనుకున్నాను కానీ, అనుకోని కారణాంతరాల వలన వ్యవధిలేక పిలవలేకపోయాను పద ఇంటికి వెళ్దాం–" అని బైక్‌మీద ఎక్కించుకుని ఇంటికి తీసుకువచ్చాడు విజయ్ శ్రీరావ్‌ను

పెరట్లో పూలమొక్కలకు నీళ్లు పోస్తున్న మానస బైక్ శబ్దం విని బయటకు వచ్చింది భర్తతోపాటు లోపలకు వస్తున్న యువకుడ్ని చూసి ఆమె గుండె కొన్ని క్షణాలు దడదడలాడింది కంగారుగా లోపలకు తప్పుకోబోయింది

ఇంతలో విజయ్ పిలిచాడు

"మానసా! ఇలారా! ఇతను నా క్లాస్‌మెట్– మరియు బెస్టు ఫ్రెండ్ అనకాపల్లిలో జ్యాబ్ చేస్తున్నాడు –" అని నవ్వుతూ శ్రీరావ్‌ను చూసి "షి ఈజ్ మై లైఫ్ పార్ట్‌నర్ మానస–" అని ఒకరి నొకరికి పరిచయం చేసాడు విజయ్

శ్రీరావ్ ఆమెను చూసి హృదయం కలుక్కుమన్నట్లుగా అయ్యాడు గుండెలోంచి ఓ భారమైన నిట్టూర్పును వదిలాడు

తరువాత విజయ్–శ్రీరావ్ కబుర్లలో పడ్డారు విజయ్ ఏవేవో విషయాలు ఉత్సాహంగా చెప్పుకు పోతున్నాడు శ్రీరావ్ మౌనంగా ఊ కొడుతున్నాడు మానస పనిమనిషి చేత కాఫీలు పంపింది

"ఏమిట్రా వున్నట్లుండి అలా డల్‌గా అయిపోయావు ?" అతను మూడ్‌లో లేనట్లు గమనించి అడిగాడు విజయ్

"అబ్బే ఏం లేదు నాకు పనుంది మరి వస్తాను –" ఇబ్బందిగా నవ్వాడు శ్రీరావ్

"అదేమిటి ? వచ్చి అరగంట కూడా కాలేదు అప్పుడే వెళ్లిపోతావా ? వీల్లేదు ఈ రోజంతా నాతో వుండిపోవాలి ఇక్కడే భోజనం చేయాలి చెప్పడం మరిచాను నా భార్య వంట బ్రహ్మాండంగా చేస్తుంది ఒక్కసారి రుచి చూసావంటే మళ్లీ మళ్లీ మా ఇల్లు వెదుక్కుంటూ వస్తావు –"

"ఉహుఁ అంత బాగా చేస్తుందా ?–"

"తిని చూడు నీకే తెలుస్తుంది –"

"తప్పకుండా మరోసారి వస్తాను – ప్రత్యేకంగా ఆమె చేతి వంట రుచి చూడడానికి సారీ విజయ్ పనులు చాలా వున్నాయి –" అని విజయ్ బలవంతం చేస్తున్నా ఆగకుండా వెళ్లిపోయాడు శ్రీరావ్.

విజయ్‌కు చాలా అసంతృప్తికరంగా వుంది

"రాకరాక వచ్చాడు ఒక్క పూటైనా వుంటాడేమోననుకున్నాను చెప్పుల్లో కాళ్లుంచుకు వెళ్లిపోయాడు ఇడియట్ – ! –" అని తన అసంతృప్తిని భార్యముందు కక్కాడు

"అతనికి ఇక్కడ వుండడం ఇష్టం లేదేమో –" అన్నది మానస

"ఏమో ! ఏవో పనులని ఏడ్చాడు లేకుంటే బలవంతాన వుంచేవాడిని –"

మానస మరేమీ అన్లేదు

నిర్లిప్తంగా తనలో తాను నవ్వుకున్నది

అలా వెళ్లిన శ్రీరావ్ ఒక వారం రోజుల తరువాత విజయ్‌కు ఒక లేఖ రాశాడు దాన్ని అందుకుని నివ్వెరపోయాడు విజయ్

మిత్రుడు విజయ్‌కు–

నా ఉత్తరం చూసి ఆశ్చర్యపోతున్నావు కదూ ? నాకూ ఇలా రాయాల్సి వస్తుందనుకోలేదు. ఏదో ఆదర్శంకోసం కులం కాని అమ్మాయిని పెళ్ళిచేసుకున్నావనుకున్నాను కానీ, నీ భార్యను చూసాక అసలువిషయం బోధపడింది ఆమెను గురించి పూర్తిగా నీకు తెలుసో, తెలియదోనన్న అనుమానం నన్ను పీడిస్తోంది.

ఆమె గతం చాలా హీనమైంది

ఆసంగతి నీకు తెలీకపోతే–తెలియ చెప్పడం స్నేహితునిగా నా ధర్మం

ఒకవేళ ఆమె గత చరిత్రను గురించి తెలిసీ చేసుకుంటే నిన్ను మెచ్చుకోలేకపోతున్నాను మొదటినుంచి ఆదర్శాలను అర్థం చేసుకున్నవాడిని కనుక – నీ ముఖం మీద ఆమెను గురించి చెప్పి బాధించలేక ఆ వేళ అలా వెళ్ళిపోయాను

నీ భార్య ఒక వేశ్య ! డబ్బు కోసం వళ్లు అమ్ముకునే నీచమైన మనిషి ఒక నాడు నావద్ద రెండు వందలు తీసుకుని హోటల్‌గదిలో నాకు సుఖాన్ని అందించింది–అని ఆనాడు నీకు చెప్పడానికి నా సంస్కారం అడ్డువచ్చింది

నీవు ఏ పేదింటి పిల్లను చేసుకున్నా నేనింత బాధపడేవాడిని కాదు పోయి పోయి ఒక చెడిపోయిన ఆడదాన్ని చేరదీసావు నిన్నుచూస్తే జాలి కలుగుతుంది విజయ్ ఆమెతో ఎలా కాపురం చేస్తున్నావో తలుచుకుంటే నాకే కంపరంగా వున్నది పైగా ఆమెను గురించి –

**జరిగిన కథ – 10 :** మానస ఉద్యోగం చేయడానికి ఒప్పుకోదు ఈ నీచ వృత్తే నీకు ఇష్టం అని మానసను విజయ్ నిందించగా ఇన్ని మాటలకు బదులు తనను పెళ్లి చేసుకొని ఉద్ధరించమని అడిగి వెళ్లిపోతుంది విజయ్ తను మానసను పెళ్లి చేసుకోడానికి నిర్ణయించుకున్నట్లు ఆమెకు చెపుతాడు ఆమె అతనిని తన ఇంటికి తీసుకెళ్లి తన కుటుంబ సభ్యులను పరిచయం చేస్తుంది మానస కోరిక ప్రకారం కోవెల్లో ఆమెను వివాహం చేసుకుంటాడు విజయ్ మానసను బలవంతంగా ఎత్తుకుపోయి రేప్ చేయబోయిన సుకుమార్ నుండి ఆమెను రక్షిస్తాడు విజయ్ ఈ సంఘటన తరువాత మానస ఇంట్లోంచి కదలకూడదని నిశ్చయించుకొంటుంది

"నేను
కుట్టుపని నేర్చుకున్నప్పటినుంచి,
ఒక పరిపూర్ణమైన స్త్రీమూర్తిగా
అనుభూతి చెందుతున్నాను."






మీ పిల్లలకు బట్టలు కర్టెన్లు, కుషన్ కవర్లు   ప్రత్యేకతగల ఒక టేబుల్ క్లాత్
మీ చీరకు ఫాల్ వేసుకోవడం లేదా ప్రతివారం చిరిగినవి కుట్టుకోవడం కుట్టుపని,
ఒక స్త్రీ తన వ్యక్తిత్వాన్ని వ్యక్తపరిచేందుకు ఆనందదాయకమైన ఒక మార్గం

ఇది మనకు తెలుసు ఎందుచేతనంటే, భారతదేశంలో మరే ఇతర కుట్టుమిషను కన్నా కూడా ఉషా కుట్టుమిషన్‌తోనే ఎక్కువ మంది స్త్రీలు కుట్టుపని చేస్తారు ఉషా మిషనుని వాడటం, నిర్వహణ తేలికని వారికి తెలుసు భారతదేశంలో తయారయ్యే మరే ఇతర కుట్టుమిషనుకంటే కూడా, ఉషాకు అధికంగా ప్రత్యేక సదుపాయాలు ఉన్నాయని వారికి తెలుసు దీనికి, భారతదేశంలోకల్లా పెద్దదైన విక్రయానంతర సేవ మద్దతు ఉందని వారికి తెలుసు

రండి, ఈ రోజే ఒక ఉషాని జాగ్రత్తగా పరికించండి




అద్భుతమైన నాణ్యతకు ప్రతీక

ఉషా నం 1 అయినది
ఎందుచేతనంటే, దాని అద్భుతమైన నాణ్యతను అందరూ మెచ్చుకుంటారు.




ULKA D US 704

ఆమెచేతి వంటను గురించి నా దగ్గర అదేపనిగా పొగిడావు నాకు మాత్రం చాలా అసహ్యంవేసింది అందుకే వెళ్ళిపోయాను.

ఆదర్శం అవలంభిస్తే పది మందీ మెచ్చేలా వుండాలి కానీ, ఇలా చులకన కారాదు ఇకనైనా కళ్ళు తెరుస్తావని — నీ విలువల్ని నీవు కాపాడుకుంటావని ఆశిస్తాను

శ్రేయోభిలాషి
శ్రీరావ్—

విజయ్ ఉత్తరం చదివి పళ్ళు పటపట కొరికాడు 'ఇడియట్' అని కసిగా ఆ ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చింపి డస్ట్‌బిన్‌లో పడేసి చేతులు కడుక్కున్నాడు.

"ఎక్కడనుంచి ఉత్తరం? — ఎందుకు చింపేశారు?—" ఆశ్చర్యంగా అడిగింది మానస. విజయ్ తేలిగ్గా నవ్వేస్తూ "పోలీసాఫీసర్ని కదా, ఎవడో బెదిరిస్తూ ఉత్తరం రాశాడు తను చెప్పినట్లు వినమని —" అని అన్నాడు

మానస అతని ముఖంలో ఏదో వెదకబోయింది

"ఏమిటోయ్ అలా చూస్తున్నావు? పదపద నాకు ఆకలేస్తోంది —" అని నవ్వుతూ భార్య చేయిపట్టుకుని వంటగదివైపు కదిలాడు విజయ్

## 25

ఒకరోజు విజయ్ డ్యూటీలో వుండగా ఒక అరవై ఏళ్ల వృద్ధుడువచ్చాడు వస్తూనే విజయ్‌కు నమస్కారం చేసి బిడియపడుతూ నిలుచున్నాడు నుదుట విభూది రేఖలు, మెడలో జంధ్యము, తలమీద పిలక — చిరుగులుపడి సూదితో కుట్టిన మాసిన పంచె, వంటి మీద తాతలనాటి ఉత్తరీయము — అతన్ని ఆ స్థితిలో చూస్తే పేద బ్రాహ్మణుడని ఇట్టే పసి గట్టేయవచ్చు అతని ముఖం నిండా విషాదరేఖలు అలముకుని మబ్బులు పట్టిన ఆకాశంలా వుంది ఏదో చెప్పాలన్న ఆరాటం, ఆత్రుత — బాధ పిగ్గు అతనిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి

"ఏమిటండీ! ఏంకావాలి? —" మామూలుగా అడిగాడు విజయ్

"సార్! నాకు చాలా పెద్ద కష్టమొచ్చింది ఈ పేద బ్రాహ్మణునిమీద కనికరంతో సహాయం చేసి పుణ్యం కట్టుకోండి —" అని కన్నీళ్ళలో దీనంగా అన్నాడు

విజయ్ అతనివంక విచిత్రంగా చూసాడు

"ఎవరు మీరు, మీకేం సాయం కావాలి?"

అతను రెండు క్షణాలు తటపటాయించి "నా పేరు విశ్వనాథశర్మ, అమ్మవారి శాలలో అర్చకునిగా వుంటున్నాను నాకు నలుగురు ఆడపిల్లలు. పెద్ద పిల్లలకు ఎలాగో అష్టకష్టాలు

## మానస మురళి

పడి పెళ్ళిళ్ళు చేసి పంపాను. ఇక మా మూడో పిల్ల దమయంతికి పెళ్ళి ఖాయమయింది

మా బావమరిది కొడుక్కి ఇచ్చి చేయాలని నిశ్చయం కూడా అయింది. ఇంతలో మా పరువు బజారు కెక్కిస్తూ నా కూతురు పక్కింటిలో అద్దెకుంటున్న అబ్బాయితో లేచిపోయింది—"అని చెప్పలేక చెప్పాడతను.

విజయ్ సానుభూతిగా చూసాడు

"మీ అమ్మాయి వయసెంత వుంటుంది?"

"మొన్నటితో పద్దెనిమిది నిండాయండి నిన్ననే ఈ ఘోరం జరిగింది మా ప్రక్క



ఇంట్లో శశికర్ అని ఓ స్టూడెంటు తగలడ్డాడు అభం శుభం తెలియని మా పిల్లకు మత్తుజల్లి మాయచేసి ఇంత అఘాయిత్యానికి ఒడిగట్టాడు తిండి లేకపోతే బ్రతగగలము గానీ, పరువు పోతే మేము బ్రతకలేము సార్.. విన్నటి నుంచి మా యింటిల్లిపాది పచ్చిగంగి కూడా ముట్టలేదు దిగులుతో — అవమానంతో అలమటించిపోతున్నాము—" ముసలాయన కళ్లలో నీళ్లు జలజలా రాలాయి

ఆయన బాధను— ఆ కేసును అర్థం చేసుకున్నాడు విజయ్ ఎందుకో ఆయన్నలా చూస్తుంటే విజయ్‌కు జాలి కలుగుతుంది వాళ్లను గురించి వివరాలన్నీ నోట్ చేసుకున్నాడు. వాళ్ల రూపు రేఖల్ని— ఎప్పుడు వెళ్లింది— ఏ ప్రాంతం వెళ్ళివుంటారని— అన్నీ సూచనప్రాయంగా తెలుసుకున్నాడు

"ఆల్‌రైట్! మీరిక నిశ్చింతగా ఉండండి సాయంత్రం లోపు మీ అమ్మాయిని మీకు అప్పగించే బాధ్యత నాది—"హామీ ఇస్తున్నట్లుగా అన్నాడు విజయ్

ఆ మాటలతో ముసలి బ్రాహ్మణుడు కొత్త ఊపిరిలను పోసుకున్నాడు

"మీ గురించి ప్రజలంతా చెప్పుకుంటుంటే విన్నాను మీరామాత్రం భరోసా ఇస్తే చాలు ఎలా చేస్తారో మీ యిష్టం మా కూతురు బుద్ధి మార్చి తీసుకువచ్చి అప్పగించండి మీ పేరు చెప్పుకుని మా ఇంట్లో దీపం పెట్టుకుంటాము—" అని కృతజ్ఞతగా నమస్కరించి భారంగా అడుగులు వేస్తూ వెళ్లిపోయాడు

(ఇంకా ఉంది)

# కాలాన్ని బట్టి పాత్రలు

— కాంతారావు

★ మీరు తొలుత జానపద చిత్రాల ఆ తర్వాత ఏ చిత్రంతో కేరెక్టర్ హీరో రోల్స్ వేయడం మొదలెట్టారు?

బాలయ్యగారి చిత్రం "నేరం—శిక్ష" నాతో తయారైన జానపదచిత్రాలన్నీ తక్కువ బడ్జెట్‌లో నిర్మింపబడినవే నిర్మాతలకు బాగా లాభాలు వచ్చేవి పుష్కలంగా డబ్బురావడంతో నిర్మాతల దృష్టి సహజంగా భారీ బడ్జెట్ చిత్రాల మీద పడేది భారీ తారాగణంతో చిత్రాలు తీయాలనిపించింది నాకు తీశాను చెయ్యి కాల్చుకున్నాను సంపాదించిన డబ్బంతా హారతి కర్పూరంలా హరించుకుపోయింది మరో వంక జానపద చిత్రాలు ఉధృతంగా తయారై ఒకదాని మీదొకటి పోటీగా విడుదలవడంతో చాలా వరకు దెబ్బతిన్నాయి దాంతో ఆ నిర్మాతల దృష్టి సాంఘిక చిత్రాల వంక మరలింది నామీదేమో జానపద చిత్రాల నాయకుడన్న ముద్ర పడిపోయింది సోషల్ పిక్చర్స్‌లో నేనెందుకు చేయలేను? ఎవరైనా అవకాశమివ్వాలేగాని ఆ పుణ్యం బాలయ్య గారు కట్టుకున్నారు "మీరే మీఅనుకోకపోతే, మా చిత్రంలో ఒక ఫాదర్ రోల్ ఉంది మీరే వెయ్యాలి," అన్నారు బాలయ్యగారు కూడా ఒకప్పుడు హీరోయే నిర్మాత అయ్యాక కేరెక్టర్ రోల్స్ అడపాదడపా వేస్తున్నారు ఆయన వచ్చి అడిగితే, కాదని ఎలా చెప్పగలను? కాని, నా మిత్రులు కొందరు 'హీరో వేషాలు వేసిన మీరు ఒకసారి ఎల్‌డర్లీ రోల్ వేస్తే, మీ మీద అదే ముద్ర పడిపోతుంది ఒప్పుకోకండి,' అన్నారు ఒప్పుకోకపోతే ఎలా? మరి, జరుగుబాటు? ఒక రాత్రంతా తీవ్రంగా ఆలోచించాను అక్కినేని నాగేశ్వరరావుగారిని సలహా అడిగాను "తప్పకుండా ఒప్పుకోండి మీకిది మరో టర్నింగ్ పాయింట్ కావచ్చు," అన్నారు. నిజమే ఇండస్ట్రీకి దూరం కాకుండా ఉండాలంటే, కాలానికి తగ్గట్టు సర్దుకుపోవాలి— అని నాకు నేను నచ్చచెప్పుకుని, 'నేరము—శిక్ష'లో తొలిసారిగా తండ్రి వేషం వేశాను అది చూసి దుక్కిపాటి మధుసూదనరావు గారు, స్వర్గీయ ఆదుర్తి సుబ్బారావు గారు అన్నపూర్ణ వారి "బంగారు కలలు" చిత్రంలో కేరెక్టరు రోల్ ఇచ్చారు దరిమిలా 'గుణవంతుడు, ఓ సీత కధ, ముత్యాలముగ్గు' యీ నా నట జీవితంలో రెండవ ప్రకరణం నిరంతరం సాగిపోతోంది నిర్మాతలు కూడా నేనొకప్పుడు హీరో అన్న విషయాన్ని గుర్తుంచుకొని కాస్త ప్రాముఖ్యం గల పాత్రలనే ఇస్తూ ఆదరిస్తున్నారు

★ అప్పటికీ, ఇప్పటికీ అభిమానుల్లో ఏదైనా తేడా కనిపిస్తోందా?





ఏం లేదు అప్పటిలాగే ఇప్పటికీ కూడా నాకు అభిమానుల నుంచి లేఖలు వస్తూనే ఉన్నాయి నా పాత చిత్రాలిప్పటికీ ఎన్నో సెంటర్లలో ఆడుతున్నాయి కదా? వాటిని చూస్తున్నారు నాకు ఉత్తరాలు రాస్తున్నారు ఇదివరకటిలాగే టూరిస్ట్ బస్‌లలో వచ్చే అభిమానులు ప్రతిరోజూ మా ఇంటికి వచ్చి నన్ను చూసిపోతూనే ఉన్నారు వాళ్ళ హృదయాలలో నాకింకా చోటు ఉందని తెలుసుకొని, ఎంతో ఆనందిస్తూంటాను ఒక అభిమాని ఊళ్లో నేను హీరోగా వేసిన 'ఆకాశ రామన్న' చిత్రం విడుదలైందిట కాని, పోస్టర్లలో మాత్రం నా ఫోటో లేదెందుచేత— అని అడిగాడు నేనిప్పుడు కేరెక్టర్ రోల్స్ వేస్తున్నాను గనుక నా బొమ్మ ఎందుకని ఆ చిత్రాన్ని కొనుగోలు చేసిన వారో, పంపిణీ దారులో పోస్టర్లలో తొలగించి ఉండవచ్చు కాని, ఆ సినిమాలోని నా భాగమంతా తొలగించలేరుగా? ఈ విషయం ఎవరికైనా విస్మయం కలిగించక మానదు ఇటీవల "మూడుముళ్ళు" చిత్రం ఔట్‌డోర్ షూటింగ్‌కు మాగాం వెళ్తూ, రాజమండ్రిలో ట్రయిన్ నుంచి దిగగానే ఎందరో అభిమానులు నన్ను చుట్టుముట్టారు ఎంతో మురిసిపోయాను 'ఏమండీ, ఇటీవల మీరు చిన్న వేషాలు వేస్తున్నారెందుకని?' అని కొందరు అడిగారు 'వయసుకు తగ్గ పాత్రలతో ఇప్పటికీమీకు కనిపిస్తున్నాను కదా?' అన్నాను కొందరు పాత మిత్రులు వాళ్ళ పిక్చర్‌లో నేను ఏదో ఒక వేషం వేయాలన్న అభిమానం కొద్దీ చిన్న వేషమైన ఇస్తారు మరి కొందరు నా పట్ల గల గౌరవంతో గెస్ట్ వేషం వేయాలని కోరుతారు కాదనలేను కదా? ఈ విషయమే వాళ్ళకు విశదపరిస్తే, 'అయినా, మీరు చిన్న వేషాలు మాత్రం వేయకండి ప్రాధాన్యత ఉన్నా లేకపోయినా పెద్ద వేషాలే వేస్తూండండి' అన్నారు వాళ్ళలా నా పట్ల అభిమానంతో చెప్పినా, వాళ్ళు చెప్పిన సలహా పాటించదగినదే

ఇదివరకు నేను హీరోగా వేసిన చిత్రం విడుదలవడానికి ముందు రాత్రి నాకు నిద్ర పట్టేది కాదు పిక్చర్‌ని ప్రజలు ఎలా ఆదరిస్తారనే దిగులు ఏంచేతంటే, పిక్చర్ బాగా ఆడకపోతే,ఆ హీరోపిక్చర్ దెబ్బతిన్నదంటారు ఇప్పుడలాంటి భయాలేవీ లేవు హాయిగా నిద్రపోతాను

మొత్తం మీద మూడు దశాబ్దాలు దాటినా నిర్మాతలు, అభిమానులు నన్నింకా మరవనందుకు ఎంతో ఆనందిస్తూంటాను

— జి. వి. జి

తప్పక చూడండి!

చలం సమర్పించు శ్రీ రమణ చిత్ర కంబైన్స్



# పెళ్లిచేసి చూపిస్తాం

నిర్మాత:
కోరాడ హరీష్

దర్శకత్వం:
ఎస్.ఎ. పెంచ్యాల



తప్పక చూడండి!

ప్రసాద్‌బాబు
సమర్పించు
చంద్రమణి ప్రొడక్షన్స్



# మా ఇంటి ప్రేమాయణం

కలర్

స్క్రీన్‌ప్లే దర్శకత్వం ఆలూరి రవి

నిర్మాత శ్రీమతి చంద్రమణి

శ్రీ ఫిలింస్





# ఆశ్రయం

మధురాంతకం రాజారాం

## రాయలసీమ ఎక్స్‌ప్రెస్ హైద్రాబాదు శివార్లను అందుకునేటప్పటికి బాగా తెల్లవారిపోయింది.

**రాత్రివేళ నడిచే బండి కావడంవల్ల, అందులో ప్రయాణం పర్వత సొరంగంలో దూరి వెళ్ళినట్టే వుంటుంది.**

మసక చీకట్లు విచ్చిపోయినప్పటి నుంచీ నాకు గుర్తు.

దిక్కుల అంచులదాకా పరచుకున్నట్టున్న నల్లరేగటి పొలాలు వృక్ష సంతతి చాలా నకృత్తు కొన్ని కొన్నిచోట్ల దాదాపు 'నిల్' అనే చెప్పొచ్చు విస్తీర్ణంలో ఎకరాకు తగ్గని పెద్ద పెద్ద కయ్యలు, ఎత్తయిన గట్లు, ఉండీ వుడిగీ వరి, జొన్న, హైబ్రీడ్ పశుగ్రాసం, కొర్ర, ఆరికలాంటి పైర్లతో ఒకటో అరో పచ్చని చెట్లు, ఇవన్నీ మనుషులు నివసిస్తున్నారనుకోడానికి దాఖలాలే! కానీ ఎక్కడ నక్కి కూర్చున్నాయో మరి, ఆ మనుషులు నివసించే పల్లెలుగానీ, పేటలుగానీ కనుచూపు మేరలో కానరావడంలేదు జలప్రళయం తరువాత మానవ జాతి అభివృద్ధి కావడంకోసం మిగిలిన నమూనాలకు మల్లే ఏ రెండు మైళ్ళకో, మూడుమైళ్ళకో ఒక చోట కాడి భుజాన మోసుకుంటూ ఎద్దుల్ని పొలానికి తోలుకెళ్ళే ముసలిరైతు, ఎరువు తట్ట తలకెత్తుకుని గనుమవెంట సాగివెళ్ళే ఆడమనిషి, మడుగునుంచీ బర్రెగొడ్డును ఈవలికి లాగుతున్న కుర్రవాడు — యిలా మనుషులు అరుదుగా కనిపించి, అంతలో మటుమాయమవుతున్నారు పగ్గాలులేకుండా ఎండలు కాసినప్పుడు, ఉన్నట్టుండి జడివానలు ముంచుకొచ్చినప్పుడు వీళ్ళెక్కడ తలదాచుకుంటారు? బరాబయలు ప్రకృతి నడుమ మానవుడెంత నిస్సహాయుడో?

జనాలూ, జనావాసాలూ కనిపించని కొరత రైలుబండి నగరం పొలిమేరల్లోకి చొచ్చుకుపోయేటప్పటికి యిబ్బడి ముబ్బడిగా తీరిపోయింది పుడమి కడుపును చీల్చుకుంటూ ఆకసంవైపు లేచినట్టు రకరకాల కట్టడాలు ఒంటరిగా చిన్న కోటల్లాంటివి కొన్ని కార్ఖానాలు నడపడం కోసం ఉద్దేశించినవి కొన్ని శిథిలావస్థలో కొన్ని సరికొత్తవి కొన్ని సజీవులూ నిర్జీవులూ కలిసి సహజీవనం చేస్తున్నట్టుగా ఆకట్టడాలకు మధ్య సమాధులూ, ఘోరీలూ కొన్ని సిటీ యిలా ప్రారంభమైపోయింది చీరకైనా పంచెకైనా సొబగుచేకూర్చేవి వాటి అంచులే నగరం శివార్లలోని మురికి వాడలందుకు విరుద్ధం చెత్తచెదారంతోనూ, పెంటకుప్పలతోనూ, మురికి కాలవలతోనూ నిండి ఆది వైతరణీ నదీతీరంలో యాతనా జీవుల కోసం వేసిపెట్టిన గుడారాల్లా వుంటాయి అలాంటి మురికివాడల వీధులవెంట ఎందరో వ్యక్తులు చీమలబారుల్లా కదులుతూ కొందరు, కూరగాయల అంగళ్ల ముందర ఈగల్లా ముసిరి కొందరు, టీకొట్లల్లో గొంతు తడుపుకుంటూ కొందరు, నీటి పంపుల దగ్గర ఖాళీ బిందెల పోరాటం సల్పుతూ కొందరు తమ నిత్యకృత్యాల రొటీనుకు ఉపక్రమిస్తున్నారు ఏమైనా నగరవాసుల్లో ఒక సుగుణమున్నట్టు నాకు తోచింది పాపం తమ గొడవేదో తమది నగరాభి ముఖంగా పరతెంచి వచ్చే క్రిక్కిరిసిన రైళ్లనుగానీ, బస్సులనుగానీ వాళ్లు పట్టించుకోరు చూచినా చూడనట్టే వుంటారు తెప్పలుగా నిండిన చెరువులోకి కొన్ని కప్పలు కొత్తగా వచ్చి చేరినట్టుగా వేలకొలది మంది ఆగంతుకులు పట్నంలో దిగబోతున్నారన్న ఊహ గూడా వాళ్లకు కలిగేటట్టులేదు ఇదంతా వాళ్లకు బాగా అలవాటైపోయినట్టుంది

గమ్యస్థానం చేరువకు వచ్చిన కొద్దీ నేను కూర్చున్న రెండో తరగతి రిజర్వుడు కంపార్టుమెంటులో సంచలనం పుంజుకుంటూ వచ్చింది

"విశ్వదాత" కాశీనాథుని నాగేశ్వరరావు
పంతులుగారిచే స్థాపించబడిన
"ఆంధ్రసచిత్ర వారపత్రిక"
తెలుగు ప్రజల మన్ననలు పొంది
75 ఏండ్లు నిరాటంకంగా వెలువడుతూ
"వజ్రోత్సవం"
జరుపుకుంటున్న శుభ సందర్భంలో
యాజమాన్యానికి, సిబ్బందికి
నా హృదయపూర్వక
శుభాకాంక్షలు



# ఎం. శివనారాయణ,

15-6-161, బేగం బజారు,

హైదరాబాద్.

[హైదరాబాదులో 30 ఏండ్లకు పైగా
ఆంధ్రపత్రిక, ఆంధ్రసచిత్ర వారపత్రిక, భారతిలకు
ప్రధాన ఏజంటు]

ఆరోగ్యకరమైన ఆలోచనా విధానాలకు

# శక్తివంతమైన సాహితీ ప్రతిరూపాలు

| | | | |
|---|---|---|---|
| బతుకు పుస్తకం — స్వీయ చరిత్ర | పుప్పల లక్ష్మణరావు | రు | 12-50 |
| తిలక్ కథలు | బాలగంగాధర్ తిలక్ | రు | 20-00 |
| ధనాసో కథలు | చాంగటి సోమయాజులు | రు | 16-00 |
| కళ్ళజోడు (కథలు) | పెద్దిభొట్ల సుబ్బరామయ్య | రు | 6-00 |
| కుటుంబరావు సాహిత్యం | మొదటి సంపుటం | రు | 25-00 |
| కుటుంబరావు సాహిత్యం | మూడవ సంపుటం | రు. | 25-00 |
| స్వీయచరిత్రము — ప్రథమభాగము | కందుకూరి వీరేశలింగం | రు. | 16-00 |

## నవలలు

| | | | |
|---|---|---|---|
| గోదాన్ | ప్రేమ్‌చంద్ | రు | 16-00 |
| చిరస్మరణ | నిరంజన్ | రు | 14-00 |
| చదువు | కొడవటిగంటి కుటుంబరావు | రు | 7-00 |
| చీలని పాయలు | పొన్నాల యాదగిరి | రు | 8-00 |
| పట్టణంలో బతుకుదామని | ఎం విశ్వనాథ్ | రు | 6-00 |
| తిరుగుబాటు | మలయశ్రీ | రు | 8-00 |
| కనువిప్పు | ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ | రు | 9-00 |
| కూలిబతుకు | సింహప్రసాద్ | రు | 12-00 |
| చీకటి చెదిరింది | దశరథ్ | రు | 8-00 |
| ఇనపచక్రాలు | యర్రంశెట్టి శాయి | రు | 10-00 |
| వెదురు పొదలు నినదించాయి | జాతశ్రీ | రు | 7-00 |
| శతాబ్దాల నిశ్శబ్దం | దాశరథి | రు | 7-00 |
| బలిపశువు | జాతశ్రీ | రు | 7-50 |
| దేవుళ్ళారా మీపేరేమిటి? | శ్రీకాంత్ | రు | 6-00 |
| కన్నీటికి నోరొచ్చింది | యస్ కాశీవిశ్వనాథ్ | రు | 10-00 |
| వీళ్ళూ మనుషులే | పరుచూరి రాజారామ్ | రు | 9-00 |

పోస్టేజీ అదనం • • ప్రతులకు

## విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,

విజయవాడ-520 004.

బ్రాంచీలు.

## విశాలాంధ్ర బుక్ హౌస్,

విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్నం, తిరుపతి,
గుంటూరు, అనంతపురం, హనుమకొండ.



ప్రగతి పథంలో
# చీరాల మహిళా మండలి

* 1961లో శ్రీమతి టి. రుక్మిణమ్మగారి ప్రోత్సాహముతో స్థాపించబడి, గత 22 సంవత్సరములుగా చీరాల పట్టణంలో అనేక మహిళా అభ్యుదయ కార్యక్రమాలు చేపట్టి యితోధిక వుత్సాహంతో పురోగమించుచున్నది.
* ప్రభుత్వ సహకారముతోను, పురజనుల తోడ్పాటుతోనూ, పురప్రముఖుల చేయూతతోనూ స్వంత భవనమును నెలకొల్పుకొని తమ ఆధ్వర్యములో చీరాల మహిళా సూపర్ బజారును గత ఎనిమిదేళ్ళుగా దిగ్విజయంగా నిర్వహించుచున్నది.
* లోగడ కుట్టుపని శిక్షణాకేంద్రమును, కిండెర్నుడు స్కూలును జయప్రదంగా నిర్వహించి, ప్రస్తుతం బాల్వాడి కేంద్రము, అంగన్‌వాడి శిక్షణాకేంద్రములను ప్రత్యేకం స్త్రీలకొరకై ప్రభుత్వంవారి పథకముక్రింద నిర్వహించుచున్నది.
* పట్టణంలో మహిళల సాంస్కృతిక, సాహిత్యాభిలాషను పెంపొందించేందుకై సంచార గ్రంథాలయము నిర్వహించబడుచున్నది.
* స్త్రీ జనాభ్యుదయమే లక్ష్యంగా పలు కార్యక్రమాలు చేపట్టడం జరుగుతున్నది.

- పి. అనసూయ -
అధ్యక్షురాలు

శ్రీమతి జె. ఎల్. పద్మావతి
కార్యదర్శి

VISWESWAR

'ఎల్లలోకములొక్కయిల్లై' అని ఒక మహానుభావుడు అన్నాడు కానీండి, అది వట్టి ఆదర్శం మాత్రమే! వ్యవహార సరళికి అడ్డుగోడలు తప్పని సరి! అడ్డుగోడలు లేకపోతే కంపార్టుమెంటులో యిన్ని అరలుండేవీ కాదు, ఇన్ని బెర్తులు ఏర్పాటు చేయడానికి వీలుండేదీ కాదు అరలో నాతో బాటుగా వచ్చిన ప్రయాణీకులు పెట్టెలూ బట్టలూ సర్దుకుంటూ వీడ్కోలు మాటలు పలుక్కుంటున్నారు. అందులో ఒక బొద్దు మీసాల ఆసామి కోడూరులో రైలెక్కాడు కుమార్తె హైదరాబాద్‌లో వుందండి అల్లుడు ఒక ప్రయివేట్ ఫర్మ్‌లో సేల్సు రెప్రజెంటేటివు పంజగుట్ట పోలీసుస్టేషనుకు అరమైలు దూరంలో జర్నలిస్టుల కాలనీ దాపున ఒక యింట్లో అతడి నివాసం. వెళ్లడానికి ఆటో వుంది సత్కారాలు నెరపడానికి కూతురుంది. గౌరవించడానికి అల్లుడున్నాడు నాకేం కొదవ అన్న ధీమా ఆయన ముఖంలో చిందులాడుతూ వుంది ఇంకొకాయన పొద్దుటూరులో పెద్ద బట్టల వ్యాపారి హైదరాబాదుకు రాకపోకలు సల్పడమంటే ఆయనకు కొట్టిన పిండిలా వుంది వాడుకగా సుల్తాన్ బజారులోని హోల్‌సేల్ మండీల్లో బట్టలు కొంటూ వుంటాడట సదరు బట్టల షాపుల షావుకార్లు ఆయనకు బస ఏర్పాటు చేసి, భోజన సదుపాయాలు కల్పించి, తిరుగు ప్రయాణానికి టికెట్టు గూడా రిజర్వు చేయించి, టాక్సీలో తీసుకొచ్చి స్టేషనులో దిగబెడతారట! బట్టతల ప్రయాణీకుడొకాయన చెదరని గంభీర ముద్రదాల్చి, లోకం సంగతి తనకేమీ బట్టనట్టు ప్రయాణం పొడుగునా వీలయినంత ముభావంగా కూర్చున్నాడు ఒకానొక యూనివర్సిటీలో సోషియాలజీ రీడరుగా వుంటూ ఆయన 'ఉస్మానియా'లో ఒక 'వైవా' నిర్వహించడం కోసం వెళ్తున్నాడట! ఆయనకేమబ్బా, అదృష్టవంతుడు! మకాం పెట్టడానికి యూనివర్సిటీ గెస్ట్‌హవుసు అడుగులకు మడుగులొత్తడానికి రేసెర్చిస్కాలరు!

ఎటొచ్చీ హైదరాబాదు నగరంలో ఆశ్రయాన్ని గురించి నాకున్నన్ని అనుభవాలు వాళ్లకెవరికీ వున్నట్టులేవు రాష్ట్రానికి దక్షిణపు సరిహద్దు జిల్లాలో ఒక మూరు మూల గ్రామానికి చెందిన వాడినైనా నాకు ఏడాదికి కనీసం ఒక సారైనా ముఖ్య నగరంతో పని తగులుతూ వుంటుంది సిటీలో అనువైన ఆశ్రయాన్ని సంపాదించడం కోసం నేను మొదట మొదట వివిధ ప్రయోగాలు చేసి చూశాను చిక్కడపల్లిలో మాకు దగ్గరి బంధువులున్నారు కొన్ని పర్యాయాలు అతిథిగా వాళ్ల యింట్లోదిగాను పులి మేదనేగదండి పుట్ర! ఒక పెళ్లి వ్యవహారం మూలంగా వాళ్లకూ మాకూ కొంచెం బెడిసింది రాకపోకలు బందయిపోయాయి అంతటితో చిక్కడపల్లి మాట కట్టిపెట్టేశాను మలక్‌పేట కాలనీలో యింకొక కుటుంబం వుంది బంధుత్వం కన్నా ■ కుటుంబానికి చెందిన అన్నదమ్ములిద్దరితోనూ నాకూ స్నేహమే హెచ్చు ఉద్యోగరీత్యా వాళ్లు దక్షిణాది నుంచీ హైదరాబాదుకు వచ్చి స్థిరపడి చాలా కాలమైంది అరమరికలు లేకుండా నాకాతిథ్యం యివ్వాలన్న సంకల్పం స్నేహితుల కున్నప్పటికీ, ఆయింటి గృహిణులకు మాత్రం ఎంత కాలమైనా నేను పరాయివాణ్ణిగానే కనిపిస్తూ వచ్చాను ఒకసారి గౌలిగూడా బస్ స్టేషనులో దిగి, రిక్షాచేసుకుని కాలనీకివెళ్తే వాళ్లు "మగవాళ్లింట్లో లేరండీ! కావాలిస్తే లగేజీ యింట్లోపెట్టి వెళ్లండి" అన్నారు నాకు లభించని మర్యాద నా లగేజీకి దక్కడం నాకిష్టం లేదు అందువల్ల వెనుదిరిగి చూడకుండా తిరుగుదారిపట్టాను హైస్కూలుదాకాసహాధ్యాయి అయిన ఒక మిత్రుడు నారాయణగూడాలో కాపురముంటున్నాడు ఒక కంచాన తిని ఒక మంచాన పడుకున్నవాళ్లమే! కానీ ఒక గొప్ప యింటి ఆడపడుచు భారీ కట్నంతో అర్ధాంగి కావడం వల్ల అతడి స్టేటస్సు పూర్తిగా మారిపోయింది చిన్న కోర్టులంటే ముఖం మొత్తి, కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలన్న పూనికతో హైదరాబాదు వచ్చి హైకోర్టులో ప్రాక్టీసు చేస్తున్నాడు ఒకసారి పనిగట్టుకుని అతణ్ణి వెదుక్కుంటూ వెళ్తే–క్లయింట్లతో మాట్లాడుతూ నన్నొక గంటసేపు వెయిటింగురూములో కూచోబెట్టి, ■ తర్వాత క్లుప్తంగా ఒక కాఫీ యిప్పించి "దగ్గర్లోనే ఒక హోటలుంది రూము దొరకడం కష్టం అయినా ప్రొప్రయిటరు నాకు తెలిసినవాడు నేను ఫోను చేస్తే దొరక్కపోదు" అన్నాడు అద్దె గురించి అడిగాను "ఎంతో వుండదు రోజుకు యాభై రూపాయలే" నన్నాడు ఆ పైన నారాయణగూడా వైపు తిరిగి చూచివుంటే ఒట్టు! ఇంకొక మిత్రుడు సంతోష నగర్ నివాసి నాలాగే కొంచెం కథలూ, కాకరకాయలూ రాసే పిచ్చికద్దు! మంచి ఉద్యోగం చేస్తున్నాడు అతడి వెంట ఒకటి రెండుసార్లు సంతోషనగర్ కాలనీ దర్శించాను వెళ్లిన తర్వాత సంతోషం లభించే మాట నిజమే గానీ, అక్కడికి వెళ్లడం మాత్రం ప్రయాసతో గూడిన పని బస్సుల కోసం పడిగాపులు పడాలి మూడు బస్సులు మారి ఏడెనిమిది మైళ్లదూరంవెళ్లాలి మళ్లీ ఉదయం తొమ్మిందింటికి నేను నా సమావేశానికి హాజరు కావాలంటే ఆ వేళప్పుడు బస్సులుండవు ఆటో వాడు తానంతదూరం రానంటాడు ఈ బాదరబందీ అంతా. ఎందుకని సంతోషనగర్‌ను గూడా నా జాబితాలో నుంచీ తీసేశాను ఏ విధంగా చూచినా హైదరాబాదులో నాకింక హోటలు గదే శరణ్యమనిపించింది పల్లెలో ఒక కుటు■బానికి నెలకంతా కలిపి యిచ్చేటంత బాడుగ నగరంలో ఒక మనిషి ఒక రోజుకే యివ్వవలసి వస్తున్నదన్నదే నా బాధ ఒక వస్తువు యొక్క లేదా ఒక సదుపాయం యొక్క విలువ దేశాన్ని బట్టి కాలాన్ని బట్టి మారుతుందని మార్క్సులాంటి మహనీయుడెవరైనా చెప్పాడో లేదో నాకు తెలియదు ■ మాటకేంగానీ, రిక్షావాడు నన్ను మూసీ నది ఒడ్డున వున్న ఒక లాడ్జికి తీసుకెళ్లాడు పాతిక రూపాయలకొక గది దొరికింది దానికి కిటికీలుగానీ,, వెంటిలేటర్లుగానీ లేవు రెక్క తలుపులు మూసి గడియపెడితే పర్‌ఫెక్టు ఇనప్పెట్టె సబ్ మెరీన్‌లో ప్రయాణం చేస్తే అలాంటి అనుభూతి కలుగుతుందేమో! ■ త్రిశంకుడి స్వర్గం కంటె లగేజిని క్లోక్‌రూంలో పడేసి, స్టేషనులో ఒక బెంచీపైన పడుకోవడం దేవేంద్ర భోగంలా ఉంటుందనిపించింది మరునాటి ఉదయం మంచి లాడ్జికోసం అన్వేషిస్తూ వీధులవెంట చెడ తిరిగేశాను, వసతి బాగుంటే అందుకు తగ్గ ఆర్థిక స్తోమత మనకుండదు ఆర్థికంగా అందుబాటులో వుంటే అక్కడ వసతులు తృప్తికరంగా వుండవు కొన్ని గంటలపాటు నీటి ఆవిరిలో నిండిన నీరెండలో తిరిగేటప్పటికి కాగే నీటిలో పడవేసిన చిలగడదుంపలా శరీరం వుడకిపోయింది వేసుకున్న దుస్తులు చెమటతో తడిసిపోయాయి, ఏం చేయాలో తోచక నిస్సహాయంగా ఒకచోట పేవ్‌మెంటుపైన నిల్చున్నాను అట్టి పరిస్థితిలో వరదలో కొట్టుకుపోతున్న వాడి చేతికి తెడ్డు కొయ్య దొరికినట్టుగా, కారు చీకటిలో కాంతి పుంజం ఒకటి కనిపించినట్టుగా, రెండు స్నేహహస్తాలు అమాంతంగా నన్ను కౌగలించుకుని ఉక్కిరి బిక్కిరి చేసి పారేశాయి

"ఏమండీ రాజశేఖరంగారూ! బాగున్నారా? అబ్బ, ఎంతకాలానికి కనిపించారండీ! ఎప్పుడొచ్చారు హైదరాబాదు? హైదరాబాదుకొస్తే నేనొకణ్ణి వున్నానని మీరు మరిచే పోయారా?"

పరామర్శలన్నీ ముగిసేలోగా అప్పటి నా పరిస్థితినంతా అతడు కుణ్ణంగా ఆకళించుకోగలిగాడు "ఏమిటండీ మీరు మరీనూ! ఒకటి రెండు రోజులు సిటీలో స్టే చేయడంకోసం యింతగా యిబ్బంది పడిపోతారా? వదిలేయండి మీకా బెంగేవద్దు హోటలు రసీదు, తాళంచెవి నా చేతికిచ్చి మీరు చక్కా మీ పని పైన వెళ్లండి మీ లగేజిని సురక్షితంగా మా యిల్లు చేర్చే పూచీ నాది పని పూర్తయ్యాక మీరు నేరుగా మా యింటికొచ్చేయండి మీకోసం మా యింటి తలుపులెప్పుడూ తెరిచేవుంటాయండీ!" అన్నాడు

అతడు నాకామాట యిచ్చి పదేళ్లయింది అప్పటినుంచీ సిటీకెప్పుడు వచ్చినా నా చిరునామా మార్పులేదు — కేరాఫ్ చీమకుర్తి భవానీ శంకరం మాక్స్‌ముల్లర్ రోడ్డు, రాంకోటి

'హైద్రాబాదు నగరంలో నేను గూడా నిరాశ్రయుడినేమీ కాదండోయ్!' అని బిగ్గరగా అరిచి చెప్పాలనిపించింది కానీ కంపార్టుమెంటు అప్పటికే ఖాళీ అయిపోయింది తోటి ప్రయాణికులందరూ ఒకరినొకరు తోసుకుంటూ గేటు వైపు వెళ్లిపోతున్నారు

* * *

రిక్షా బండి నాంపల్లి స్టేషనుమంచి బయల్దేరి రాంకోటివైపు వెళ్తుండగా నాలో ఏదో అలజడి రొద పెట్టసాగింది ఒక మిత్రుడి మంచితనాన్ని ఎక్స్‌ప్లాయిట్ చేస్తూ నేను నా పబ్బాన్ని గడుపుకుంటున్నానేమో! అసలే భవానీశంకరంది చాలా చిన్న యిల్లు, స్టేట్‌మెంట్ తప్పయినందుకు మన్నించాలి. స్వంత యిల్లు కాదు, అది భవానీ శంకరం నివసిస్తున్న అద్దెయిల్లు ముందువైపు నుంచీ చూస్తే అది గారమిద్దెలా వుంటుంది నడవదాటి వెళ్తే కొంచెం ఖాళీ జాగా, దాని చుట్టూ పెంకుటిళ్లు కనిపిస్తాయి పావురాల గూళ్లలాంటి ఆలోగిట్లో ఎంత లేదన్నా నాలుగైదు కాపురాలు కొనసాగుతూ వుండొచ్చునని నా అనుమానం ముందువైపు గారమిద్దెలో కొంత భాగం, వెనుక వైపు పెంకుటింట్లో ఒక గది ఇంత మాత్రమే భవానీశంకరానికున్న గృహవసతి.

నడవలో నుంచీ తట్టిన వెంటనే తలుపు తెరుచుకుంటుంది భవానీ శంకరం సాధారణంగా పాత కొయ్యకుర్చీలో కూర్చుని, టేబిలు కానించి నడుములదాకా జరిపి పెట్టుకున్న అట్టపైన డ్రాయింగు పేపరు పరచుకుని గాజు బుడ్డిలోని రకరకాల కుంచెలుపయోగిస్తూ ఏదో ఒక చిత్ర రచనలో నిమగ్నుడై వుంటాడు చిత్రకారుడుగా అతనికి పేరుంది కానీ 'పేరు' తిండి పెడుతుందా? అందుకోసం అతడొక ప్రభుత్వ కార్యాలయంలో యు డి సి గా పనిచేస్తున్నారు కానీ అతడి ఆరో ప్రాణం చిత్రకళ అతడి దౌర్బల్యం ఎవరే ఆబ్లిగేషన్‌తో వెళ్లినా 'కాదు' అనకపోవడం భవనీశంకరం పుస్తకాలకు ముఖచిత్రాలు రూపొందిస్తాడు బ్లాకులు చేయించుకోడానికి వీలుగా స్వంత దస్తూరీతో ప్రకటన పత్రాలు, ఆహ్వాన పత్రికల మొదలైన వాటివి తయారు చేస్తాడు ఎంబ్లమ్స్ గీస్తాడు డిజైన్లు వేసి రకరకాల వాల్‌పోస్టర్లకు నమూనాలు సిద్ధం చేస్తాడు చిన్న ఫోటోలను పెద్దచిత్రాలుగా ఎన్‌లార్జ్ చేస్తాడు కుంచెతో అతడు చేయగల ఇంద్రజాలాలు చాలా వున్నాయి అయితే చేసినపనికి ఎవరైనా ఏదైనా యిస్తే పుచ్చుకోడం తప్పితే నిక్కచ్చిగా అడిగి పుచ్చుకునే కూసువిద్యమాత్రం అతడికి ఒంట బట్టలేదు ఫలితమేమిటంటారేమో— ఇదిగో, హైద్రాబాదుకు వచ్చి చేరి పాతికేళ్లయినా యింకా అద్దెయింట్లోనేవుండడం!

భావానీశంకరం పుట్టిందీ, పెరిగిందీ కోనసీమ—పెళ్లాడింది విజయనగరం చిన్నపిల్లలకు పుస్తకాలు వ్రాయించడం కోసం ఒక జాతీయ సంస్థ మదరాసులో నిర్వహించిన వర్క్‌షాపులో నేను రచయితగానూ, భవానీ శంకరం చిత్రకారుడుగానూ పాల్గొన్నాము అ పాటి పరిచయాన్ని సులభంగా మరచిపోయి వుండొచ్చు మనుషులతో అనుబంధాలు పెంచుకోడమంటే, కొందరి కదొక బెడదగా వుంటుంది మరి కొందరు స్నేహాన్ని గొప్ప సంపదనుకుంటారు భవానీ శంకరది రెండో కేటగిరి రాష్ట్ర విస్తృతంగా, యింకా మాట్లాడితే ప్రవాసాంధ్రుల్లోగూడా అతడికెందరో స్నేహితులున్నారు ఏ పని పైన హైద్రాబాదు వచ్చినా, వాళ్లు భవానీ శంకరాన్ని కలుసుకోకుండా వెళ్లరు తనను వెదుక్కుంటూ వెళ్లిన స్నేహితుడికి ఒక పూట భోజనం పెట్టి సత్కరించడం అతడు విధిగా పాటించే అతిథి మర్యాద అర్ధాంగి సుమిత్రగూడా అతనికి తగిన ఇల్లాలే! అతిథిని చూచినప్పుడు ఆమె ముఖంలో తరళించే ఆనందాన్ని గమనించి నేనెన్నోసార్లు ఆశ్చర్యపడ్డాను కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో ఆ యింట్లో అతిథుల సందడి మరింత ఉద్ధృతం కావడం కద్దు మృష్టాన్నం పెట్టడంతో సరిపెట్టుకోకుండా వచ్చిన వాళ్లకా దంపతులు పడకలు ఏర్పాటు చేయడముందే, అది చూచి తీరవలసిన దృశ్యం హాలును రెండు భాగాలుగా విభజించే ప్లైవుడ్ స్టాండును గూడా తీసేసి, ఆసుపత్రిలో పేషంట్లకు వేసినట్టుగా హాల్లో మంచాలు వేస్తారు దిండు గలీబులు మారుస్తారు పెట్టె అట్టడుగు నుంచీ చలువ దుప్పట్లు తీసి పడకల పైన పరుస్తారు ఇలా అతిథుల అవసరాలన్నీ గమనించిన తర్వాత ఆ యింటి గృహిణి సిరిచాప పరచుకుని తన యిద్దరు పిల్లలతోబాటుగా వంటింట్లో నిద్రపోతుంది చుట్టూరా పుస్తకాల బీరువాలున్న పెంకుటింటి గదిలో ఈజీ చేర్ వేసుకుని, భవానీశంకరం అందులోనే నిద్రపోతాడు

లోకంలో అన్నింటి కన్నా తేలికైన పని సలహాలివ్వడం! ఒకసారి నేనాపని అత్యంత సమర్థవంతంగా నిర్వహించాను "చూడండి భవానీ శంకరంగారూ! 'గెస్టు'ల రూపంలో ఎందరో 'గోస్టు'లు మిమ్మల్ని వేదిస్తూ వుండడం నేను కళ్లారా చూస్తున్న విషయం అందులో నేనూ ఒకణ్ణని సవినయంగా ఒప్పుకుంటాను మీరు మీ కోసం గాకపోయినా, మా కోసమైనా హైద్రాబాదులో మరిన్ని వసతులుండేటట్టు ఒక స్వంత ఇల్లు కట్టుకోగూడదా?"

నా అభ్యర్థనకు భవానీశంకరం మాటలతో బదులు చెప్పలేదు పొడుగాటి స్కేలును చేతికి తీసుకుని గోడవైపు చూపించాడు. అతడు నిర్దేశించిన చోట గోడకొక బొమ్మ వ్రేలాడుతూ వుంది ప్రత్యేకమైన కాగితం పైన నీటిరంగులతో వేసిన చిత్రం అది. మరీ అంత ఎత్తుగా లేని ప్రహరీ గోడల ఎదుమ, ఉన్న జాగాలో మూడింట ఒక భాగాన్ని మాత్రమే ఆక్రమిస్తున్న చిన్న మేడ దానికి రెండువైపుల మాత్రం మంగుళూరు పెంకులతో వంచిన వసారా మేడ ముంగిట వసారా పొడుగునా పూల పందిరి ఎడమవైపు నుంచీ మేడ పైకి మెట్లు డాబాపైన ఈవలా ఆవలా విశాలమైన గవాక్షాలతో రెండు పెద్ద గదులు ఆ గదుల నడుమ పూరికప్పుతో ముచ్చటైన కొట్టం మెట్లపైన నిల్చుని చూస్తే ఎదురుగా వెదురు దబ్బలతో నిర్మించిన లతా కుటీరం. ప్రహరీని అంటిపెట్టుకుని చుట్టూ కొబ్బరిచెట్లు, ఇంకా పూలమొక్కలూ, పచ్చిక బొంపాలూ వ్, ఎందుకులెండి! ఈ పొడి మాటల వర్ణన ఆ చిత్రానికి న్యాయం చేకూరుస్తుందనినేననుకోను. పరమ రమణీయమైన వర్ణ సమ్మేళనం చూచి తీరవలసిందేగానీ, మాటల్లోకి అనువదించడం సాధ్యమా? అందులోనూ విందు పున్నమినాటి నిశిరాతిరివేళ కురిసే వెన్నెల చిక్కగా ప్రసరించే నీడలు విరిసినవ్వే పువ్వులు 'ప్రశాంతి' అనేది ఒక దైవమైతే, ఆ దైవం కొలువు దీర్చడానికి మోజుపడే చోటు బహుశా అలాంటిదే అయి వుంటుంది ఇక్కడొక మాట చెప్పాలి. నేనా చిత్రాన్ని చూడడానికదే మొదటిసారి గాదు. అయితే భవానీ శంకరం వేసిన వెయ్యి చిత్రాల్లో అదొకటని మాత్రమే అనుకున్నాను. తనఊహలో అతడు నిర్మించుకున్న ఆదర్శ గృహమని అప్పుడే తెలిసింది

"అయితే ఈ మాత్రం ఇల్లు కట్టుకోవాలంటే నేను ముందుగా ఓ పని చెయ్యాలండీ రాజశేఖరంగారూ!" అన్నాడు భవానీ శంకరం 'ఏమిటి' అన్నట్లుగా అతడివైపు చూచాను "ఏంలేదు ఎడుగూ బొదుగూలేని ఉద్యోగాన్ని మానెయ్యాలి కనీసం లాంగ్ లీవ్ అయినా పెట్టాలి వ్యాపార చిత్రంలో దిగాలి పూర్తిగా టైమంతా దానికే డివోట్ చెయ్యాలి నాలుగు రూకలు మిగిలించాలి"

"కానీ కళను వ్యాపారంగా మార్చడం మీ చేతగాదే!" వాపోయినట్టుగా నేనన్నాను

[ఇంకా వుంది]

# ❀ తెలుగు వెలుగులు-3 ❀



ఆంధ్ర సాహిత్య క్షేత్రంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చేయని వ్యవసాయం లేదు, పండించని పంటలేదు.

దానికి మించిన విశేషం ఆయన రచనా వ్యాసంగం అనర్గళంగా ఈ క్షణం వరకు సాగుతూనే ఉన్నది.

మామాగు మీసాలవాడు వ్రాసిన నాలుగు పద్యాలనే షష్ఠిపూర్తినాడు, ఆ తర్వాత వినిపించి సన్మానాలు పొందటంలేదు.

వేషాలంకారాలనుబట్టి కవి అని గుర్తించా లంటే సత్యనారాయణగారిలో ఆ లక్షణాలు వెదికినా కనిపించవు. అసలు ఆయనకు వేష మంటే గిట్టదు ఆయన మాట అకురాయి, నవనీతం.

సర్వసాధారణంగా సత్యనారాయణగారిపై (పరోక్షంగా) అందరూ విసిరే విమర్శలు, "ఎందుకండి, మళ్ళా ఈ రామాయణం వ్రాయడం వాల్మీకిదే ఇంతకంటే తేలికగా అర్థమవుతుంది పట్టిసనాతన సిద్ధాంతాలూ, ఈయనాను," అని

"మరలనిదేల రామాయణం బన్నచో" ఈ ప్రపంచకము "తినుచున్న యన్నమే తినుచున్న దిన్నాన్ని" "చేసిన సంసారమే చేయుచున్నది." తుదనైన యమధూళి తుదదుగొన "నా భక్తి రచనల నావిగాన" అని, "వ్రాసిన రామచంద్రుని కథ వ్రాసితిననేనంతే" అని తండ్రి చేసిన యజ్ఞయు "జీవుని వేదన ఏకమ్మై" అని ఆయన ఒక చెంపన చెబుతూ ఉన్నా వీరు వినిపించుకోరు.

వాల్మీకిది అర్థం కాకపోతే తప్పు తమది కాదు, వాల్మీకిది కాదు కాని సత్యనారాయణ గారిది అర్థం కాకపోతే తప్పు సత్యనారాయణ గారిదేనని వీరి నమ్మకం

సత్యనారాయణగారి సనాతన ఉపదేశాలకు మూలం ఒకటే సాహిత్యం, సంస్కృతి అవిభాజ్యమనీ, వాటి ఉద్ధరణకూడా ఏకంగా జరగాలని ఆయన ఉద్దేశం దేశోద్ధరణకు, జాతి ఉద్ధరణకు వాటి ఉద్ధరణ అవసరమని ఆయన విశ్వాసం. రాజకీయ రంగంలో పండిత మదన మోహన మాలవ్యాగారెలాంటివారో సాహిత్య రంగంలో సత్యనారాయణగారలాంటివారు.

వారి రచనల్లో తెలుగుదేశం సాక్షాత్కరించినట్లు మరెవరి రచనల్లోనూ సాక్షాత్కరించదు. తెలుగు పాఠకలోకాన్ని సత్యనారాయణ గారి రచనలు ఆకర్షించినంతగా మరొకరి రచనలు ఆకర్షించవు. వారికున్న శిష్యవర్గం, అభిమాన వర్గం మరొకరికి లేదు.

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భాగ్య మస్మాదృశుండు" శిష్యుడైనట్లు, "చెళ్ళపిళ్ళ వంశస్వామికున్నట్లుగని". ఇది అహం అనండి, పొగరు అనండి. కాని నిజమని నమ్మేవారు లేకపోలేదు. అది అలా ఉండగా సత్యనారాయణగారు కనుక నన్నయ తిక్కనల కాలంలో ఉండి ఉంటే కవిత్రయంకాక కవి చతుష్టయం అయ్యేదేమో అని నమ్మేవారు కూడా లేకపోలేదు. (ఆయన అభిప్రాయాలతో ఏకీభవించనివారు కూడా ఆయన రచనా వైదగ్ధ్యానికి మళ్ళీ మళ్ళీ ముగ్ధులుకాక తప్పదు.) చెళ్ళపిళ్ళవారి షష్ఠిపూర్తి సన్మానోత్సవంలో తమ గురువులను గురించి "... ... .. నానలో దడియనివారు మదుగ్రువధాన మృదూక్తి మరందధారలన్ గడుగనివారు మా కెవరు గానగ రారు తెలుంగు నాడునన్" అన్నారు. ఇది సత్యనారాయణగారియెడ్ల కూడా అక్షరాలా వర్తిస్తుంది. ●

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1959 సెప్టెంబరు 23 సంచిక నుంచి**

## ✱ ఆంధ్ర విశ్వవిద్యాలయము ✱

అయ్యా,

ఆంధ్రరాష్ట్రముకొరకు, ఆంధ్రులొక సంఘముగాచేరి, సభలు జరుపుచుండుట [illegible] సం॥ముల నుండి వినుచుంటిమి. ఈ సభలలో ఆంధ్రుల కొక విశ్వవిద్యాలయమును, ఇంజనీరింగు కాలేజియును గావలెనని తీర్మానములు చేయుచుండిరి. ఈ తీర్మానములు గవర్నమెంటువారు చూచియున్నారని నమ్మెదము కాని, యింజనీరింగు కాలేజిని గురించి గిండిలో కట్టుచున్న మేడలు తయారగువరకు, ఆలోచించుటకు వీలులేదని తెలియవచ్చినది. ఆంధ్ర మహాజనసభ వారి కోరిక కనుకూలముగా దత్తమండలములలో నొక కాలేజి పెట్టుటకు గవర్నమెంటువారు శాంక్షను చేసిరి. అది యచిరకాలములోనె రాగలదని మా నమ్మకము కాని, ఆంధ్ర విశ్వవిద్యాలయమును గురించి యింతవరకు గవర్నమెంటువారుగాని, ఆంధ్రులుగాని యేమి చేయదలచుకొన్నట్లు గానిపించదు. ఇతర రాజధానులలో ప్రతి రాష్ట్రమువారును విశ్వవిద్యాలయములకొరకు ధనము పోగుచేసి, గవర్నమెంటువారి సహాయము గోరుచుండిరి. అటులనే మన ప్రముఖులుకూడ ధనము గొంత పోగుచేసి, గవర్నమెంటువారిని అడిగిన యంతట, మనకు విశ్వవిద్యాలయము చిరకాలములోనే రాగలదని నా నమ్మకము శ్రీ బి. నరసింహశర్మగారు, కొండా వెంకటప్పయ్య పంతులుగారు మొదలగువారు, రాబోవు రాజధానిసభలోను, ఆంధ్ర మహాజన సభలోను ఈ విషయమును చర్చించి, తగు నేర్పాటు చేయుదురని నమ్ముచున్నాను

—ఒక ఆంధ్రుడు.

**ఆంధ్రపత్రిక 1915 మే 5 సంచిక నుంచి**

# "దివ్య సంగీత మహా ప్రవాహంలో నేనూ ఒక చిన్న నౌకను"

— పి.సుశీల

★ **నాటికీ, నేటికీ తెలుగు చిత్రాలలో సంగీతస్థాయిపై మీ వ్యాఖ్య?**

కాలం అనేది ఎప్పుడూ ఒకేలాగ ఉండదు కదండీ? అది మారుతూనే ఉంటుంది? అలాగే కాలానుగుణ్యంగా ప్రకృతిలోని ప్రతి అంశం మారుతూనే ఉంటుంది ఆ మారే అంశాలలో సంగీతంకూడా ఒకటి సంగీతంతో పాటే సాహిత్యం కూడా అనేక పరిణామాలకు గురి అవుతూనే ఉంది ఇంతకీ, దీనికి ముఖ్య కారణం మానవుని అభిరుచి మారడమే భగవంతుని అభిరుచి కూడా మారుతూనే ఉంటుందేమో! ఆనంద స్వరూపుడైన భగవంతునికి కూడా మార్పు అంటే ఇష్టమేమో! లేకపోతే ఎల్లకాలం వసంతంగానే సృష్టించి ఉండేవాడు ఒకే కాలాన్ని ఆరు ఋతువులుగా విభజించి, మానవుల మనస్సుకి షడ్రసోపేతమైన విందు అందిస్తున్నాడు ప్రతి వృక్షపు జీవితాభివృద్ధిలోనూ ఆరు దశలు ఉన్నాయి 1 కొమ్మలు, 2 ఆకులు, 3 పువ్వులు 4 పిందెలు 5 కాయలు 6 ఫలాలు ఫలించిన చెట్టు కాలవశాన మళ్ళీ ప్రథమ దశకు వచ్చి, తిరిగి ఆరు దశలు దాటి ఫలించినప్పటి ఆనందం వర్ణనాతీతం ఈ సత్యాన్ని గమనించినప్పుడు మార్పు అనేది అనివార్యమే కాక అవసరమూ అనిపిస్తుంది

ఈ రీతిగానే చిత్ర పరిశ్రమలోనూ ఎన్నెన్నో మార్పులు వచ్చాయి వస్తున్నాయి వస్తూనే ఉంటాయి నా దృష్టి కోణం నుంచి నేను సింహావలోకనం చేసుకుంటే— నేను చిత్ర రంగంలో ప్రవేశించనప్పటికి, ప్రవేశించినప్పటికి— ఇప్పటికి నాకు సంబంధించినంతవరకు సంగీతం పొందిన మార్పులను తలచుకున్నప్పుడల్లా ఆశ్చర్యానుభూతి కలుగుతుంది. మునుపటి రోజుల్లో పాటల బాణీలు ఎక్కువగా శాస్త్రీయ సంగీతంమీద ఆధారపడి ఉండేవి అప్పుడప్పుడు రాగమాలికలలో తప్ప సాధారణంగా ఒక పాట ఒకే రాగానికి, తాళానికి కట్టుబడి ఉండేది మానవజీవితంలో కట్టుబాట్లకు కట్టుపడ్డం చాలా కష్టసాధ్యం కనుకనే కాబోలు పాటల బాణీలు కూడా అనేక రాగపోకడలలోనూ (స్కేల్స్), అనేక తాళాలలోనూ రూపొందడం జరుగుతోంది ఈ కాలంలో పల్లవిలోనే మూడు నాలుగు రాగాల ఛాయలు తొంగిచూస్తూ వుండడం మనం గమనిస్తూనే ఉన్నాం అలాగే లయలో కూడా ఒకే పాట అనేక నడకల్లో చిందులేస్తూ ఉండడం అనుభవిస్తూనే ఉన్నాం ఇదివరలో మధ్య మధ్య వచ్చే మ్యూజిక్ బిట్స్‌కి కూడా ఆవృత్తాల కొలబద్ద ఉండేది కాల క్రమేణా అది బార్ సిస్టమ్‌లోకి అవతరించింది దీని క్కారణం చిత్రకథా, కథన విధానంలోనూ, పాటల చిత్రీకరణలోనూ విజృంభిస్తున్న వింత పరిణామాల పరిణామాలు రిథమ్‌లో వచ్చే కట్స్ ప్రకారం పాటల్లోని ఫ్రేమ్స్ కూడా తగిన జెర్క్స్‌తో నృత్యం చేసేలా చిత్రీకరింపబడడం అత్యాధునాతనమైన అభివృద్ధి కొన్ని కొన్ని సందర్భాలలో కళ్ళకీ, చెవులకీ ఒకింత ఇబ్బంది కలుగజేసే అవకాశం ఉన్నా ఈ చిత్రీకరణలో దర్శకులు వివరాలు



(డీటైల్స్)కి ఇస్తున్న ప్రాముఖ్యత గమనార్హమే కాక ప్రశంసనీయం, అభినందనీయం కూడా సంగీతంలోనూ, సాహిత్యంలోనూ, దర్శకత్వంలోనూ లాగే సాంకేతిక పరిజ్ఞానంలోనూ, తదితర ప్రగతిపథాలలోనూ చిత్రసీమ అనుదినమూ అమోఘమైన పురోగతి సాధిస్తోందనక తప్పదు అలాగే పాడే విధానాలలో కూడా అనేక మార్పులు అవసరం అయ్యాయి

ఇంకో విషయం చెప్పాలి మన చిత్రాలలో పాశ్చాత్య సంగీతానికి క్రమేణా ప్రాధాన్యత ఇవ్వబడుతోన్న సమయాన పాశ్చాత్య చిత్రాలలో భారతీయ సంగీతానికి ప్రాముఖ్యం లభించడం ముదావహం వారికి మన సంగీతం వెరైటీ మనకు వారి సంగీతం వెరైటీ 'వెరైటీ ఈస్ ది స్పైస్' అని ఊరికే అన్నారా పెద్దలు? నా మట్టుకునాకు 'ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈస్ జాయ్ ఫర్ ఎవర్' అన్నట్టుగా 'ఎ సాంగ్ ఆఫ్ మెలోడీ ఈస్ ఎ జాయ్ ఫర్ ఎవర్' అనిపిస్తూంటుంది

★ **నేడు చలనచిత్ర నిర్మాణంలో ప్రతి ఘట్టంలోనూ 'వేగం' అనే మాట వినిపిస్తోంది పాటల రికార్డింగ్ సందర్భంలోనూ ఈ వేగం తప్పలేదు దీనిపై మీ వ్యాఖ్య?**

అవునండి అప్పటి చిత్ర పరిశ్రమకు, ఇప్పటి చిత్ర పరిశ్రమకు కొట్టవచ్చేలాగున కనిపించే మార్పు వేగం— స్పీడ్! రాకపోకలలో ఒంటెద్దు బండి కాలం నుంచి నేటి రాకెట్ యుగం ఎంత వేగాన్ని సంపాదించుకుందో చిత్ర పరిశ్రమ కూడా తన కార్యక్రమాలలో అంతకుమించిన వేగాన్ని పుంజుకుంది ఒకప్పుడు పాట రికార్డు చెయ్యాలంటే ఒక నెల రోజుల పాటు రిహార్సల్ చేసిన మీదట కాని సాధ్యం అయ్యేది కాదు కారణం— అప్పుడు చిత్ర నిర్మాణ సంఖ్య బహు తక్కువ అయి ఉండడం చిత్ర నిర్మాణంలో పాల్గొనే అన్ని శాఖల వారికీ ఆలోచించుకొని, మెరుగులు దిద్దుకొని సర్వాంగ సుందరంగా చిత్రాన్ని మలచేందుకు కావలసిన టయిమ్, వసుపాయాలు, అవకాశాలు, అందుబాటులో ఉండేవి ఈనాటి స్పీడ్‌లో ఆలోచించుకోటానికి కూడా తీరుబడి లేదు కారణం— చిత్ర నిర్మాణ సంఖ్య మితిమీరి పెరగటం ఈ రోజుల్లో ఒక పాట రిహార్సల్స్ చేసేందుకు కూడా టయిమ్ ఉండటం లేదు అయినా కూడా కళాకారులు, సాంకేతిక నిపుణులు తమ శక్త్యనుసారం పాటకుగాని, చిత్రానికికాని న్యాయం చేకూరుస్తున్నారంటే, స్పీడ్‌తోపాటు టేలెంట్ కూడా ఎంత పెరిగిందో మనకు అవగాహన అవుతుంది ఒకే ఆర్టిస్టు ఒకే రోజున పలు చిత్రాల విభిన్న పాత్రల చిత్రీకరణలో పాల్గొనడం, ఒక సింగర్ ఒకే రోజున వివిధరసాలలో పలుసంస్థల చిత్రాలకు పాడి న్యాయం చేకూర్చగలగడం ఈనాడే సంభవం హేట్స్ ఆఫ్ టు ది టేలెంట్స్ ఆఫ్ అవర్ ఆర్టిస్ట్స్ అండ్ టెక్నిషియన్స్!

మనం జీవితంలో కూడా చూస్తున్నాం— ఆనాటి పిల్లలకి, ఈనాటి పిల్లలకి ఎంతో తేడా ఈ రోజుల్లో బిడ్డలు ఆరు నెలల్లోనే కళ్ళు తెరచి, మాట్లాడి, నడచి, గంతులు కూడా వేస్తున్నారు! బహుశా అదీ మనిషికి భగవంతుడి వరప్రసాదమేమో!

ఏది ఏమైనా సంగీతంలో మాధుర్యం సంపూర్ణంగా లోపించనంత కాలం చింతించవలసిన పనిలేదు.

నా సంగీత యాత్రలో మూడు దశాబ్దాలుగా అనేక చిత్రాలలో అనేక నాయికామణులకు — అనేక రసాలలో — అనేక గీతాలు



పాటకు పల్లవి
దొరకని వేళా_
కవులకు నీలిమబారే
కల్పతరువు ఈవేళ

నీలిమ బార్ & రెస్టారెంట్
అరండల్ పేట, గుంటూరు.

**Neelima**

ORE THAN A BAR...AN EXPERIENCE

ASIS (A.C) JAABILI (ROOF)

EELIMA BAR & RESTAURANT...

th line Arundelpet..Guntur.. Ph.23211 & 24772

---

MANUFACTURERS
OF
GREETING CARDS

**Vimal**
ARTS & CRAFTS

No 16 I Floor K H B Colony I Stage
Agrahara Dasarahally Magadi Road
BANGALORE 560 079

*Agents For Andhara Pradesh -*

**NARENDRA ENTERPRISES**

*Manufacturer's Representatives*

CLOTH BAZAAR
GUNTUR - 522 003

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
వజ్రోత్సవ
సంవత్సరంలో
యాజమాన్యానికి
సిబ్బందికి
పాఠక లోకానికి
మా శుభాభినందనలు!

వంశీకృష్ణ



గాంధీనగర్,
విజయవాడ-3.

VAMSEEKRISHNA PUBS.

Bachi

# ఉద్రిక్తత కలిగించే సంగీతానికేనా ప్రజాదరణ?

## డాక్టర్ ఎస్. రాజేశ్వరరావు



★ **కా**లానుగుణంగా అన్ని శాఖల్లోనూ మార్పు వచ్చినట్లే తెలుగు సినిమా సంగీతం లోనూ ఎన్నో మార్పులొచ్చాయి దీనిపై మీ వ్యాఖ్య ?

ఈ నాటి తెలుగు సినిమా సంగీతం గురించి నేనేం చెప్పను ? అందరికీ తెలిసిందే చిత్రాలు లెక్కకు మిక్కిలి తయారవడంతో కథల్లో, కథనంలో వెరైటీ కొరవడినట్లే సంగీతంలోనూ వెరైటీ కొరవడింది దాంతో శ్రవణానందం, మానసికోల్లాసం కలిగించే సంగీతంకన్నా ఉద్రిక్తతను కలిగించే వెస్ట్రన్, పాప్‌మ్యూజిక్, డిస్కోవగైరాలతో ప్రేక్షకులను ఆకట్టుకోవచ్చని నిర్మాతలు తలపోశారు దానికి తగ్గట్టు చలన చిత్ర నిర్మాణంలోని అన్ని శాఖల్లోనూ స్పీడ్ పెరిగినట్లే మ్యూజిక్ విషయంలోనూ బాగా పెరిగింది అప్పటికప్పుడు సీన్‌ను అనుకొని, వెంటనే కవిగారిచేత పాట రాయించడం, క్షణాలమీద సంగీత దర్శకునిచేత ఏదో ఒక ట్యూన్ కట్టించెయ్యడం, రిహార్సల్స్ గట్రా లేకుండా పాడించేందుకు అంతా తేలిగ్గా జరిగిపోతోంది ఈనాడు రిహార్సల్స్ చేయడానికి గాయనీ గాయకులకు తీరుబడిలేదు, ఆర్కెస్ట్రా వారికి ఖాళీలేదు అయినా, ఏదో విధంగా అయిందంటే అయిందనిపించక తప్పదు ఈపాటి మేమూ చేయగలం కాని, మనసొప్పదే !

ఆ నాడు సంగీత దర్శకులుకూడా కథా చర్చల్లో పాల్గొనేవారు అప్పుడే ఎక్కడ ఏ పాట ఉండాలో, ఏ పాట ఏ విధంగా ఉండాలో, ఏ రాగం బాగుంటుందో నిర్ణయించేవాళ్ళు ఒక పాటను నేను పది బాణీల్లో పాడి విని పిస్తేనేగాని, ఏదో ఒకటి సెలెక్ట్ అయ్యేది కాదు

ఇప్పుడు ఏదో ఒక పాట ఇచ్చి, అప్పటి కప్పుడే ట్యూన్ చెయ్యమంటారు సందర్భం ఏమిటని అడిగామో — ఇక వాదనుడని చవట కింద జమకట్టేస్తారు

అయినా, ఈనాటివరకు ఈ చలనచిత్ర కురుక్షేత్రంలో నేనూ, మరో ఇద్దరు ముగ్గురు సంగీత దర్శకులూ జనమే జయుడిలా అలా అలా కొట్టుకొస్తున్నాం

నేను జెమినీ సంస్థలో 1941 నుంచి '50 వరకు ఉన్నాను "జీవన్ముక్తి, బాల నాగమ్మ, మంగమ్మ శపథం, చంద్రలేఖ, అపూర్వ సహోదరులు" వగైరా పది చిత్రాలకు పని చేశాను ఆ సంస్థలో నియమాలు చాలా కఠినంగా ఉండేవి ఉదయం పదిగంటలకల్లా స్టూడియోకు రావాలి పది దాటితే హాజరుపట్టీ తీసేసేవారు ఇప్పటిలా ఆనాటి సంగీత దర్శకులకు స్వేచ్ఛ ఉండేది కాదు "చంద్రలేఖ" చిత్రం పతాక సన్నివేశంలోని డ్రమ్ డాన్స్ పాటకు రెండేళ్ళపాటు రిహార్సల్స్ చేయించామంటే — ఇప్పటి సంగీత దర్శకులు ఎంతైనా విస్తుపోతారు వాహినీ వారి "మల్లీశ్వరి"లో 'పిలచిన బిగువటరా' పాటను ఆర్కెస్ట్రాతో సహా పదిహేనురోజుల పాటు రిహార్సల్స్ చేశాం అప్పటి పాటలను ఇప్పటికీ ఎవరైనా మరచిపోగలరా ? ఇప్పటి పాటలను ఎంతవరకు జ్ఞాపకం పెట్టుకో గల్గుతున్నారు ?

ఆ రోజుల్లో 25 వాయిద్యాలు పెట్టడమే గొప్ప విషయం ఈ రోజుల్లో 60నుంచి 100వరకు పెడుతున్నారు ఇటీవల 'స్టీరియో ఫొనిక్' వచ్చాక మెలోడీ సంగతి అటుంచితే, మోత మాత్రం ఎక్కువైంది పారవశ్యం కలిగించే సంగీతం కన్నా ఉద్రిక్తం కలిగించే సంగీతానికే శ్రోతలు అలవాటు పడ్డారు వాళ్ళు "ఛీ ! ఏమిటీ పాట ?" అంటూనే ఆ పాటను పాడుకుంటున్నారు ఇప్పుడు వాంప్ పాటకు, హీరోయిన్ పాటకు తేడా ఉండటంలేదు !

తప్పెవరిది ? కాలానిదే !

ఆనాటి సంగీత దర్శకులు కాస్త 'స్లో' అని అపవాదు ఆ అపవాదు కొందరికి శాపమైంది

మొత్తంమీద మానవుని మనో దౌర్బల్యానికి సినిమా సంగీతం హేతువు కాకూడదు

కాని, ఒకటి మాత్రం చెప్తాను శాస్త్రీయ సంగీతం ఎప్పటికీ నశించదు ఎప్పటికైనా మళ్ళీ శాస్త్రీయ సంగీతానిదే పైచేయి అవుతుందనీ, సాఫ్ట్ మెలోడీ గల పాటలే నాలుగు కాలాలపాటు నిలుస్తాయనీ చెప్పక తప్పదు "శంకరాభరణం, మేఘసందేశం" చిత్రాలలోని పాటలు ఎంతటి ప్రజాదరణ పొందాయో అందరికీ తెలిసిందే !

★ ఇప్పటి సంగీత దర్శకులలో మీరుమెచ్చుకునే వారెవరైనా ఉన్నారా ?

ప్రత్యేకించి ఒకరిని గురించి చెప్పాలి. ఇళయరాజా సంగీతంలో ఎన్నో ప్రయోగాలు చేస్తున్న మేధావి ఈ విషయంలో నిర్మాతలు కూడా అతనికెంతో తోడ్పాటు ఇస్తున్నారు

చివరికి నాదొక్క మనవి "నాదం పరబ్రహ్మ స్వరూపం" ఈ విషయాన్ని ఎవ్వరూ మరువకూడదు.

— జి. వి. జి.



పాడే అపూర్వమైన అవకాశాన్ని అందజేసిన ఆ సర్వేశ్వరుడికే కాక, నా సంగీత వృత్తి విజయానికి అన్ని విధాలా దోహదమిస్తూ, సహకరిస్తూ, ప్రోత్సహిస్తున్న చిత్రరంగ ప్రముఖులందరితో పాటు రసజ్ఞులైన ప్రేక్షక శ్రోతలందరికీ నా హృత్పూర్వక కృతజ్ఞతా వందన సహస్రాలర్పిస్తున్నాను సాహిత్యంలో

## దివ్యసంగీత మహా...

పలు భాషలు జీవిస్తున్న సంస్కృతం లాగ — రూపగతి భేదాలు ఎన్ని పొందినా, సంగీత గంగా తరంగిణి సర్వదా రసజ్ఞ హృదయ సాగరంలో సంతోష తరంగాలు ఉప్పొంగేలాగ — నిర్విరామంగా, నిర్విఘ్నంగా ప్రవహిస్తూనే ఉంటుంది అటువంటి దివ్య సంగీత మహా ప్రవాహంలో నేనూ ఒక చిన్న స్వరనౌకనై, ఆనంద సాగరతీరం వైపు పయనిస్తూ, జన్మ సాఫల్యం చెందే మహాభాగ్యం అందించినందుకు దయామయుడైన పరమాత్ముడికి మరోసారి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు సమర్పించుకుంటున్నాను

— జి. వి. జి.



# తల వెంట్రుకలు రాలుటకు కారణము పేలు

పేలను, ఈరులను నశింపజేయుటకు కెన్జ్ వాడండి సువాసనతోకూడిన పేలనాశిని కెన్జ్ హెయిర్ ఆయిల్‌ను వాడి మీ కేశములను కాపాడుకొనండి

## కెన్జ్

పేలనాశిని మందు
దీనిలో ఈరులను నశింపజేయు బెన్జోకెయిన్ ఉన్నది










ఫార్మ్ ప్రోడక్ట్స్
తంజావూరు-613 007 తమిళనాడు

అన్ని జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు కావలెను

---

# బాలాజీ ఆహారధాన్యాల రుబ్బుడు గ్రైండర్లు




★ మీ ఇంటిలో మా విసి గ్రైండర్లను వెలకొల్పుకొని రోజూ రుచికరమైన ఇడ్లీ, వడ, దోసె మొదలగువాటిని భుజించండి. రడీ స్టాకు నుండి 1, 1½, మరియు 2 లీటర్ల సైజులలో కూడా లభ్యమౌతాయి.

★ హోటల్ మరియు కేంటీన్లకుగాను పెద్దసైజు గ్రైండర్లు లభ్యమౌతాయి.

★ గ్యారంటీ మరియు మంచి సర్వీసుతో అమ్మకం.

మేము వీటినికూడా సరఫరా చేస్తాం: వేరుసెనగ డికార్డికేటర్లు, మిల్క్ క్రీం సపరేటర్లు, పౌండింగ్ టైపు చిల్లీస్ మెషీన్లు, రొటరీ ఆయిల్ మిల్, ఫ్లోర్ మిల్, వాష్‌తార్స్ మెషిను, విసి ఫ్లోర్‌మిల్ వగైరా....వగైరా....

వివరాలకు సంప్రదించండి :

## శ్రీ బాలకృష్ణా ఇంజనీరింగ్ కంపెనీ,

5-1-372/2/3, రాణిగంజ్, బాటన్‌పుక్కాలు ఎదురుగా, లోకల్ లారీస్టాండువద్ద,
సికింద్రాబాద్ – 500 003. ఫోన్ : 821520

# పి. పుల్లయ్య

# జ్ఞాపకాల పొరలు......

★ **యాభై** ఏళ్ళకు పైగా మీరు నిర్మాతగా, దర్శకుడుగానేకాక దక్షిణ భారత చలనచిత్ర రంగానికి నిరంతరప్రతినిధిగా అఖిల భారతంలో సుజ్ఞాతులు పెద్దలకు ఆత్మీయులు, పిన్నలకు మార్గదర్శకులు గతం వర్తమానాన్ని నడిపిస్తుంది గత మీ అనుభవాలు, జ్ఞాపకాలు ఈ తరంవారికి ఎంతైనా ఉపకరిస్తాయి తెలియ జేస్తారా ?

నిజమే గతించిన రోజులెప్పుడూ చాలా విలువైనవి ఎంతయినా చెప్పాలనే ఉంటుంది కాని, ముఖ్యమైనవి, ఆసక్తికరమైనవి కొన్ని మాత్రమే చెప్తాను

దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఒకసారి "మీరు శ్రీ కృష్ణదేవ రాయలి చరిత్రను చలన చిత్రంగా తీయాలి," అన్నారు నాతో

"మంచిదే కాని, ఎంతో రిసెర్చ్ చేయాలి. ప్రతి చిన్న అంశంగురించి ఎంతో జాగరూకత వహించాలి ఎంత కృషి చేసినా ఆ మహనీయుని చరిత్రకు న్యాయం చేకూర్చలేనేమో !" అన్నాను.

"అవునవును," అన్నారు పంతులుగారు

ఆ రోజుల్లో ఒక చిత్రం తీయడమంటే అంత భయభక్తులతో కూడిన పని !

మహానుభావుడు దాదాఫాల్కే "అయోధ్యాకా రాజా, హరిశ్చంద్ర" చిత్రాలు తీసే రోజుల్లో ఆడవాళ్ళు వేషధారణ చేయకూడదన్నారనేకులు. "హరిశ్చంద్ర"లో స్త్రీ పాత్రలన్నిటినీ పురుషులే ధరించారు. తదుపరి చిత్రాలకు ఫాల్కే తన కుటుంబంలోని మహిళలచే స్త్రీ పాత్రలు వేయించి, ఎందరికో దారిచూపారు ఆ రోజుల్లోనే ఆ మహనీయుడు "కృష్ణలీలలు"చిత్రాన్ని ట్రిక్ ఫొటోగ్రఫీతో ఎంత అద్భుతంగా తీశాడని! 1934లో నేను పనికట్టుకుని నాసిక్ వెళ్ళి ఒక డేరా హాలులో ఆ చిత్రాన్ని చూసి ముగ్ధుడ్న య్యాను

అలా చలనచిత్ర పరిశ్రమ నన్నాకర్షించింది. చిత్ర నిర్మాణంలోని అన్ని శాఖల గురించీ తెలుసు కోడానికి కొల్హాపూర్, పూనా, కలకత్తా వెళ్ళాను కొల్హాపూర్‌లో బాబూరావ్ పెయింటర్ "ఉష", దాదాఫాల్కే "గంగావతరణం" చిత్రాలు తీస్తున్నారు ఈ ఇద్దరు మహానుభావుల దగ్గర నేర్చుకోవాలనే తపన నాలో ఎక్కువైంది కాని, వాళ్ళకు ఇతరులకు నేర్పించేంత వ్యవధి, అవకాశం లేవు బాబూరావ్ పెయింటర్ స్వతహాగా మితభాషి తరచు అందరికీ వడ్డనలు తగిలిస్తూంటాడుకూడా

"గంగావతరణం"చిత్రంకోసం కొల్హాపూర్ పక్కన రాధానగరిలో రెండు కొండలకు తెల్లగా వెల్ల వేయించాడు ఫాల్కే ! ఆ చిత్రంలోనే ఒక జలపాతం సన్నివేశంకోసం ఆయన యూనిట్‌తో గోకాక్ వాటర్ ఫాల్స్ వద్దకు నేనూ వెళ్ళాను అప్పుడక్కడ ధార చాలా తక్కువగా ఉంది "మీరు అనుకున్న ఎఫెక్ట్ రాదేమో !" అన్నా

"ఏయ్, మదరాసీ! ఏం చేద్దామంటావ్?" అడిగారాయన

"ఈ వేళ రాత్రి మనం పైన అడ్డ కట్టలువేసి, నీటిని బాగా నిలువచేసి, రేపు ఉదయం షూటింగప్పుడు ఆ కట్ట తీసేస్తే, ధార జోరుగా పడుతుంది," అన్నాను

యూనిట్‌లోని వారంతా నా వంక వింతగా చూశారు

"ఐతే, ఆ బాధ్యత నువ్వే వహించు చూద్దాం," అన్నారాయన

వెంటనే నేను అక్కడి జనం కొంతమందిని పోగుచేసి, వారిని పైకి తీసుకెళ్ళి, అలాగే అడ్డ కట్టు వేయించాను నీరు బాగా నిండిపోయింది మర్నాటి ఉదయం అందరూ షూటింగ్‌కు సిద్ధంగా ఉన్నారు నేను ఫాల్కేవద్దకు పరుగున వెళ్ళి, "సేట్ సాబ్ ! మీరు రిహార్సల్స్‌లో ఆ కట్ట తీయించేస్తే, ధార ఒక్కసారిగా పడి పోతుంది ఆ తర్వాత 'టేక్' అప్పుడు ధార పడదు," అన్నాను

"అవునవును బాగా గుర్తు చేశావు," అంటూ ఫాల్కే "నీటి ధార పడుతూందని భావిస్తూ అందరూ ఏక్ట్ చేయాలి," అని రిహార్సల్స్ చేయించారు

'టేక్' అప్పుడు అడ్డకట్టు తీయించాం ధార బ్రహ్మాండంగా పడింది ఆ షాట్‌లో నేనుకూడా పాడుతూ నటించాలి షాట్ మహాద్భుతంగా వచ్చిందని ఫాల్కే నన్ను అమాంతంగా కౌగలించుకున్నాడు పరమానందంతో

★ అంటే, సినిమాల శైశవదశలో ప్రతిదీ ట్రయల్ అండ్ ఎర్రర్ పద్ధతిలో గ్రహించే వారన్నమాట ?

ఇంకా బాగా చెప్పాలంటే — బొప్పికడితే నొప్పి గ్రహిస్తూ , తప్పులను పరిదిద్దుకుంటూ, చిన్న దీపంలోనే ముందుకు అడుగులు వేస్తూ, తెలుగు చిత్ర పరిశ్రమనుకూడా ఓ కొలిక్కి తీసుకొచ్చాం నేను డైరెక్ట్ చేసిన 'హరిశ్చంద్ర' చిత్రంతోనే సినిమాలలో 'బాక్ లైటింగ్' ప్రారంభమైంది అసలీ 'బాక్ లైటింగ్' టెస్ట్ జరపడానికి కొడక్ కంపెనీవాళ్ళు ఒక నిపుణుడ్ని కొల్హాపూర్‌కు పంపించారు

ఆ రోజుల్లో చిత్ర పరిశ్రమలోని వ్యక్తుల్లో ఒక ధర్మముండేది — వృత్తిని అమితంగా ప్రేమించడం అది ఆ వృత్తే తమను పోషిస్తున్నదని భయభక్తులతో ఉండేవారు

ఆర్టిస్టులందరూ నెలవారీగా పనిచేసేవారు ఒకేసారి 20, 25 చిత్రాల్లో పని చేసేవారు కాదు ఒకే కాల్‌షీట్‌ను ముగ్గురికి పంచేవారు కాదు సీన్ అయిపోతే చాలనుకునేవారు కాదు అందరిలోనూ భక్తి, శ్రద్ధ, భయం, కృషి, పట్టుదీక్ష వెరసి ఆత్మవిశ్వాసం ఉండేది అంతే కాని - అహంభావం, అతిశయం, అహంకారంతో కూడిన ఆత్మవిశ్వాసం ఉండేది కాదు.

కథను అరటిపండు ఒలిచిపెట్టినట్లు చెప్పే వాళ్ళం పాత్రలే కనిపించేవిగాని, పాత్రధారులు కనిపించేవారు కాదు దాంతో ప్రేక్షకులు తాదాత్మ్యం చెందేవారు ముందు చెంచి ప్రేక్షకులను ఆకర్షించడానికి ఏవో హంగులు పెట్టేవాళ్ళమేగాని, నైతిక విలువలను ఎప్పుడూ విస్మరించలేదు అందుచే దాదాపు పాతికేళ్ళ క్రితం నిర్మించబడిన "మురళీకృష్ణ, జయభేరి" వంటి చిత్రాలు ఇటీవల మళ్ళీ విడుదలై, ఆనాటి కంటే మరింత ఎక్కువగా వసూలుచేస్తున్నాయి ఆ చిత్రాలలో 'ఆత్మ' (సోల్) ఉండేది అది సాధించడానికి మార్గం ఏకాగ్రత

ఈ రోజుల్లో శ్రద్ధ తీసుకోవడమంటే చాదస్తంకింద జమ కట్టేస్తారు

కారణం వేగం !

★ చిత్ర నిర్మాణం ఎప్పట్నుంచి విపరీతమైన పోకడలు పోయిందంటారు ?

1946 నుంచి ఎందరో కొత్త నిర్మాతలు చిత్రరంగంలో ప్రవేశించారు వాళ్ళల్లో చిత్ర నిర్మాణమంటే ఏమిటో తెలియనివాళ్ళు ఎక్కువవడంతో విపరీతంగా ఖర్చులు పెంచేసి, సిసలైన నిర్మాతలను మరుగుపరచేశారు అటువంటి

అమాయకులైన నిర్మాతల అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకుని, ఆర్టిస్టుల కాల్‌షీట్లు ముందు తీసుకొన్నాక కథ గురించి ఆలోచించే పద్ధతి మొదలైంది. ఆర్టిస్టులు నిర్మాతలను మభ్య పెట్టి, పనికిరాని 'ఇమేజ్'లను పోషించుకోవడం మొదలెట్టారు. నటించే శక్తిగలవారు కూడా కాలంతోపాటు దిగజారిపోతున్నారనిపిస్తోంది.

ఒక కథను ఆలోచించే వ్యవధి, ఓపికలేక, కొన్ని చిత్రాలలోని సన్నివేశాలతో హడావిడిగా ఏదో కథను రూపొందించడం చిత్తశుద్ధిలేని అప్రోచ్.

డైరెక్షన్ అంటే ఏమిటో తెలియకుండానే ఇతర సాంకేతిక నిపుణులమీద, అనుభవంగల నటవర్గంమీద ఆధారపడి దర్శకత్వం వహించే వారున్నారనీ నే విన్నాను. నిజానికి సృజనాత్మక శక్తిగల డైరెక్టర్లు ఇద్దరు ముగ్గురు లేక పోలేదు. కాని, ఆశక్తిని వీరు అమ్ముకునేవారి లాగా కనిపిస్తున్నారు. ఈ పరిస్థితిలో తాము అనుకున్న ఫలితాన్ని రాబట్టాలన్న పట్టుదల ఎలా ఉంటుంది ?

దాంతో కాంప్రమైజ్... సర్దుబాటు ... రాజీపడడం !

అందరూ ఆత్మవంచన చేసుకుంటూ మనుగడ సాగించవలసి వస్తోంది.

అదృష్టవశాత్తు ఒక చిత్రం హిట్ అయితే, ఇక కొమ్ములొచ్చేస్తాయి. నేనేది చేసినా అది ఘనకార్యమే అనే ధీమా. దాంతో రొమ్ములు విరుచుకోవడం... నేను ఇన్ని చిత్రాలకు దర్శకత్వం వహించాను. ఇన్ని జూబిలీలు చేసుకున్నాయని గొప్పలు చెప్పుకుంటారేగాని—వాటిల్లో ఎన్నిటికి ఏకాగ్రతతో శ్రద్ధగా దర్శకత్వం వహించాను, వాటిల్లో ఎన్నోవంతు ప్రజలకు నచ్చింది, ఎన్నోవంతు నిర్మాతలకు లాభాలు తెచ్చి పెట్టాయి — అనే ధ్యాసే కనిపించదు. ఇలా అంటున్నందుకు నన్ను క్షమించాలి.

ఐతే, ఒకటి మాత్రం మెచ్చుకోవాలి. సాంకేతికంగా ఎంతో అభివృద్ధి సాధించారు చిత్రీకరణ విధానంలో ఆధునిక ప్రక్రియల చేపట్టిన వారూ కొందరు లేకపోలేదు. ఎన్నెన్నో కొత్త ప్రయోగాలు చేస్తున్నారు. కాని, కాంప్లిమెంట్ ఇస్తే పొంగిపోతారు; పరిస్థితులకు మరింత లొంగిపోతారని భయం.

మొత్తంమీద 'వేగం' సెపంతో అయోమయంలో పడిపోతున్నారు. ఏం చేస్తున్నారో తెలుసుకోడానికి వ్యవధిలేని అస్తవ్యస్త స్థితిలో కొట్టుమిట్టాడుతున్నారు. ఫలితంగా చిత్ర నిర్మాణాన్ని ఏదోవిధంగా కొనసాగించి తీరవలసిన అవసరం నిర్మాతలకు ఏర్పడుతోంది. విజయవంతమైన చిత్రంకూడా నిర్మాణ వ్యయాన్ని రాబట్టుకోలేని స్థాయికి పరిస్థితులు దిగజారాయి. పెట్టుబడిని త్వరితంగా రాబట్టుకోవాలనే తహతహతో జిల్లా హక్కుదారులు, పంపిణీదారులు 'పర్సంటేజీ' పద్ధతిలో సాఫీగా సాగే పంపిణీ వ్యవస్థకు బదులుగా 'రెంటల్' పద్ధతి ప్రవేశ పెట్టారు. దీంతో ఆర్థిక సుస్థిరతకు అవకాశమే లేకపోతోంది. ఈ దుస్థితిని తొలగించడం ఎలా అన్న ఆలోచన, అందుకు తగిన కృషి చేయాలన్న తపన పలువురిలో ఉన్నా — ఇప్పట్లో పరిశ్రమ సువ్యవస్థితం అయ్యేలా కనిపించడంలేదు.

— జి. వి. జి.




## వ్యక్తిగతం



చాద్ ఉత్తర ఆఫ్రికా ఖండ ప్రాంతపు దేశం. ఈ దేశంలో ఒక తిరుగుబాటు బయలు దేరింది. దాని నాయకుడు గౌకౌని ఉవెద్దీ కొంతకాలం కింద ఆ దేశానికి అధ్యక్షుడుగానే ఉండేవారు. ఈ మధ్యనే గెరిల్లా వృత్తి పుచ్చుకున్నారు...



ఈయన వయసు 56. పెద్దలాయరు. మెక్సికో దేశంవాడు. ఆయనకి కొంత పేరు స్వయంగానే ఉంది. కాని సినిమా నటి ఎలిజబెత్ టేలర్ 8వ భర్త కాబోతున్నారు కాబట్టి మరింత పేరు వస్తోంది. ఇంతకీ ఆయన పేరు : విక్టర్ గొంజారెస్ లూనా...



సుమన్ జీత్ ఆనంద్‌ని పోలీసులు అరెస్టు చేశారు. ఈయన తండ్రి జె. ఎస్. ఆనంద్ ఈమధ్యనే మరణించారు — హత్య చెయ్యబడ్డారని అనుమానం. జె. ఎస్. ఆనంద్ ఎవరు ? మేనకాగాంధీ పినతండ్రి. సుమన్‌జీత్ తన తండ్రి హత్యలో అనుమానితుడన్న మాట...

# "క్రియాశీలమైన రాజకీయ వాతావరణం ఏర్పడాలనేదే నా ఆశయం"

—కె. జగ్గయ్య



★ **ద**క్షిణాది చిత్ర పరిశ్రమలో రాజకీయ ప్రాబల్యం కనిపించడానికి కారణమేమిటంటారు ?

దక్షిణ భారతంలో చలనచిత్ర పరిశ్రమ మొదట్నుంచీ సాంఘిక చైతన్యాన్ని సంతరించుకుంటూనే వచ్చింది పౌరాణిక జానపద గాథలు చిత్రాలుగా రూపొందినప్పటికీ ఎప్పటికప్పుడు జాతీయ జీవితంలో ఏర్పడిన పరిణామాలకు, ధోరణులకు ప్రతిబింబాలైన చిత్రాల నిర్మాణం జరుగుతూనే వచ్చింది ఇది ప్రత్యేకంగా తెలుగు చిత్రాల విషయంలో మరింత వాస్తవం జమీందారీ — రైతు సంఘర్షణను చిత్రీకరించిన ''రైతుబిడ్డ'', అంటరానితనానికి—అద్దం పట్టిన ''మాలపిల్ల'', వితంతు పునర్వివాహాల అవసరాన్ని నిరూపించిన ''మళ్ళీ పెళ్ళి, సుమంగళి'' వగైరా చిత్రాలు కొన్ని దశాబ్దాల కిందటే ఆనాటి రాజకీయ, సాంఘిక సమస్యల పరిష్కారానికి దోహదం చేశాయి దానికి కారణం — ఆనాటి నిర్మాతలు, దర్శకులు కేవలం చిత్ర రంగానికే పరిమితమైన వారేకాక, విస్తృతమైన జాతీయ జీవన గమనంలో పయనించినవారూ, విద్యాధికులూ కావడమే అదే రీతిగా ఆ తర్వాత చిత్రరంగానికి వచ్చిన నటీనటులు కూడా చదువుకున్నవారూ, అంతకు ముందే ప్రజా జీవితంలో సన్నిహిత సంబంధం పెట్టుకున్నవారూ కావడం వల్ల చలనచిత్ర జీవితంతోపాటు సాంఘిక జీవితంలో కూడా వారు ఆసక్తి, కృషి చేయడం జరిగింది ముఖ్యంగా 1950 దశకంలో చిత్రరంగంలో ప్రవేశించిన అనేకమంది నటీనటులు, దర్శకులు, ఇతర సాంకేతిక నిపుణులు — విద్యార్థి యువజన ఉద్యమాల్లో పాల్గొన్నవారూ, ఏదో ఒక రాజకీయ పార్టీలో కృషి చేసినవారూనూ ఉదాహరణకు — నాబోటి వాళ్ళకు హైస్కూల్‌లో చదివే దశలోనే రాజకీయ వాసన అబ్బింది ఇదే పరిస్థితి మలయాళ చిత్రరంగంలోనూ, తమిళ, కన్నడ చిత్రరంగాల్లోనూ కనిపిస్తుంది ఈ కారణాల వల్ల దక్షిణ భారత చలనచిత్ర రంగంలో రాజకీయాల పట్ల ఆసక్తి, ప్రజా జీవితంలో పాలుపంచుకునే కృషి — సమాంతరంగా ప్రదర్శితమవుతున్నాయి

★మరి, ఉత్తరాది చిత్రరంగంలోని వారిలో రాజకీయ వ్యాసంగం ఎక్కువగా కనిపించదెందుచేత ?

పైన చెప్పిన కారణాలే దీనికి కూడా వర్తిస్తాయి దక్షిణాది చిత్రరంగంలోని ప్రముఖులందరూ సినిమారంగంలోకి రాకపూర్వమే ప్రజా జీవితంతో సన్నిహిత సంబంధం కలవారు జాతీయోద్యమంతో ప్రభావితులైన కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మం, హెచ్ ఎం రెడ్డి, వై వి రావు, బి ఎన్ రెడ్డి, చిత్తూరు నాగయ్య ప్రభృతుల దగ్గర్నుండి కాంగ్రెస్ పార్టీతోనో, కమ్యూనిస్ట్ పార్టీతోనో సాన్నిహిత్యం కలిగిన నేటి ప్రముఖ నటీనటులు, దర్శకులు చిత్రరంగంలో ప్రవేశించి, దాన్ని తమ వృత్తిగా చేసుకున్నారు అదే విధంగా తమిళదేశంలో ద్రావిడ కషగం, ద్రావిడమున్నేట్ర కషగం వంటి పార్టీలలో మొదట్లో కృషి చేసిన వారందరూ చిత్రరంగంలో ప్రవేశించడం జరిగింది శ్రీ ఎం జి రామచంద్రన్, శ్రీ శివాజీగణేశన్, నేమూ మొదలైనవాళ్ళు చిత్రరంగానికి రాకపూర్వమే ఏదో ఒక రాజకీయ పార్టీలో సభ్యులుగా ఉన్నవాళ్ళం ఇతర రంగ ప్రముఖులలో ప్రత్యక్షంగా రాజకీయ వ్యాసంగం పెట్టుకోకపోయినా — చాలామంది ఎప్పటికప్పుడు ప్రజల సాంఘిక జీవితంలో వచ్చే పరిణామాల్లో, వానికి సంబంధించిన ఉద్యమాలలోనూ, కృషితోనూ సంబంధం పెట్టుకున్నవారే అందువల్లనే దక్షిణాది చిత్ర పరిశ్రమలోనే రాజకీయ ప్రాబల్యం కనిపిస్తుంది

ఇదే రకమైన పరిస్థితి బెంగాలీ చిత్ర రంగంలోనూ, మరాఠీ చిత్ర రంగంలోనూ కూడా మనకు కనిపిస్తుంది కాగా, హిందీ చిత్ర రంగంలో మాత్రం ఈ ధోరణి అంతగా కనిపించదు కారణం — అక్కడివారు జీవితంలో అంతర్యాన్ని [ప్రైవసీ]కి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడమేననుకుంటాను అయితే, అక్కడకూడా కీ॥శే॥ పృథ్వీరాజ్‌కపూర్, బాలరాజ్ సాహ్నీ వంటి ప్రసిద్ధులు మనకు గుర్తుకొస్తారు దిలీప్ కుమార్, నర్గీస్ వంటివారూ ప్రజాహిత కార్యక్రమాలలో తరచు పాల్గొన్నవారే అంతేకాక, ఎమర్జెన్సీ తర్వాతి దశలో హిందీ చిత్ర ప్రముఖులు కూడా రాజకీయ పరిధిలో అడుగుపెట్టడం జరిగింది కాని, దక్షిణాదిలో వలే ఉత్తరాది వారిలో విస్తృతమైన, సంఘటితమైన రాజకీయ వ్యాసంగం ఎక్కువగా కనిపించదు

★ దర్శకుడు చెప్పినట్లు చేయడమే తారలవంతు — అని సామాన్యంగా అందరి భావన అటువంటి సినిమాస్టార్‌లు చక్కని పాలకులు అవగలరంటారా ?

చిత్రీకరణ విషయంలో దర్శకునిదే తుదిమాట అయినప్పటికీ నటీనటుల ప్రభావం దానిమీద ఉండదనుకోవడం పొరపాటు అది ఒక సమిష్టికృషి అయితే — దీనికీ, పరిపాలనా సామర్థ్యానికీ సంబంధం లేదు పరిపాలనా సామర్థ్యమనేది ఒక వ్యక్తి యొక్క చదువు సంస్కారాలమీద, సమస్యల అవగాహనమీద ప్రజలకు సన్నిహితం కావడంమీద, ఎదుటివారి అభిప్రాయాలను మన్నించడంమీద, కలుపుగోలుతనంమీద ఆధారపడి ఉంటుంది దీనికి అనుభవం తోడైనప్పుడు అది రాణిస్తుంది కనుక, సినిమానటుడు ఎంత సమర్థవంతంగా పరిపాలన సాగించగలడు అనేది అతని వ్యక్తిత్వాన్ని

బట్టి ఉంటుంది. అంతేకాక, నటుడు తన వృత్తి జీవితంలో సమిష్టి కృషికి, క్రమశిక్షణకి ఎక్కువ అలవాటుపడి ఉంటాడు ప్రజల అభిరుచులను, అవసరాలను అవగాహన చేసుకో గలిగి ఉంటాడు అటువంటివారు పరిపాలకులైనప్పుడు సంకుచితమైన పరిధుల్ని దాటి, ప్రజాహితానికి పాటుబడగల్గుతారు ఈ సందర్భంలో— రాజకీయ జీవితం ఎక్కువగా కలిగిన వ్యక్తులు కూడా పరిపాలనా దక్షతలో విఫలులైన సంఘటనలను కూడా మనం గుర్తుంచుకోవాలి

★ తెలుగుదేశం పార్టీ అధికారంలోకి రావడానికి రాష్ట్రంలో అనుకూలించిన పరిస్థితులేమిటో సెలవిస్తారా?

30 సంవత్సరాలుగా దేశాన్ని పరిపాలించే కాంగ్రెస్ పార్టీ ప్రజలకెంతో సేవ చేసినప్పటికీ, మేలు చేకూర్చినప్పటికీ — రామరామా ముఠా తగాదాలను, ఆశ్రిత పక్షపాతానికిలోనై — ప్రజలకు దూరం కావడం, సత్వర ఫలితాల్ని సాధించలేకపోవడం జరిగాయి. జాతీయోద్యమంతో సంబంధమున్నవారు, దాని గురించి తెలిసినవారు— కాంగ్రెస్ పార్టీ చరిత్రను, త్యాగాలను దృష్టిలో పెట్టుకుని నేడు జరుగుతున్న అక్రమాలను, లోపాలను క్షమించగలిగినప్పటికీ స్వాతంత్ర్యానంతరం వచ్చిన యువతరం వాటిని క్షమించలేకపోయింది. దీనికి కారణం సమాజం చైతన్యం కావడం, సమాజం అవసరాలు పెరగడం, రాజకీయ చైతన్యం పెరగడం ఈ యువతరానికి కావలసింది వారి సమస్యలకు పరిష్కారం, సత్వర ఫలితాలు. వీటిని తాముకున్నంత త్వరితంగా, తాము ఆశించిన రీతిగా కాంగ్రెస్ పార్టీ సాధించలేకపోవడంవల్ల—ఆ పరిపాలనపై, ఆ వ్యవస్థపై వారికి నమ్మకం పోయింది. ఆ పరిస్థితిలో 'తెలుగుదేశం' ఆవిర్భవించింది. రామారావుగారు ఆబాలగోపాలానికి సుపరిచితులు కావడం మూలాన ఆయన ఇమేజ్‌పైన వాళ్ళకు నమ్మకం ఏర్పడింది ఈ ధోరణి వెనుకబడిన వర్గాలకు, అల్పసంఖ్యాక వర్గాలకు కూడా వర్తిస్తుంది పైగా, కాంగ్రెస్ పార్టీ ప్రత్యామ్నాయంగా అధికారం చేపాలంటే — ప్రతిపక్షాలలో ఒక్క తెలుగుదేశం పార్టీయే అన్ని సీట్లకూ పోటీ చేయడం జరిగింది గనుక, ఆ పార్టీనే వారెన్నుకున్నారు కొన్ని సీట్లకు మాత్రమే పోటీచేసిన ఇతర ప్రతిపక్షాలు గెలిచినా — అప్పుడు మిశ్రమ ప్రభుత్వం ఏర్పడుతుంది. చరిత్ర ధోరణిని గమనించిన ప్రజలకు మిశ్రమ ప్రభుత్వాలమీద నమ్మకంలేదు. గనుకనే తెలుగుదేశాన్ని గెలిపించారు

★ మన చిత్రాలలో శృంగారం మితిమీరి ఉంటోందని చాలామంది తమ బాధను వ్యక్తం చేస్తున్నారు. ఈ విషయమై మీరేమంటారు?

సెక్స్ అనేది గర్హించవలసిందికాదు; దాచుకోవలసింది కాదు. సెక్స్‌తో కూడిన దృశ్యాలు చిత్రాల్లో ఉండడానికి ఎవరూ అభ్యంతరం చెప్పక్కర్లేదు. అవి సన్నివేశాల [illegible] కొంతవరకు తోడ్పడుతాయి. పైపెచ్చు, నగ్నత అనేది అశ్లీలంగా పరిగణించే రోజులుపోయాయి. అన్ని కుదిరికలూ కలిగిన మానవరూపం — స్త్రీయైనా, పురుషుడైనా — ఎంతో అందమైనది. ఈ సత్యాన్ని ప్రపంచంలోని ప్రాచీన నాగరికతలన్నీ కూడా గుర్తించాయి కాబట్టే వారి వారి శిల్పకళల్లో నగ్నత ప్రదర్శించడానికి వారు వెనుకాడలేదు. ఈనాడు నీతిని గురించి, సౌందర్యాన్ని గురించి నిర్వచనాలు మారిపోయాయి, విలువలు కూడా మారిపోయాయి గనుక, ఆధునాతన సాంఘిక మనస్తత్వానికి అనుగుణంగా మన కళారూపాల్లో, కళాప్రదర్శనల్లో మార్పులు చేసుకోవడం సమంజసమే అదీకాక, వ్యాపార ప్రకటనల్లో, కేలెండర్ బొమ్మల్లో కానవచ్చే నగ్నతకు అభ్యంతరం చెప్పనివారు చలనచిత్రాల్లో 'సెక్స్'కి అభ్యంతరం తెలియజేయడం వివేకం కాదు సెక్స్‌గాని, నగ్నతగాని ఆరోగ్యప్రదమైనది అందుకు విరుద్ధంగానో, పాశవికంగానో సెక్స్ చూపించడం మాత్రం గర్హనీయం

★ రాజకీయరంగంలో మీరెలాంటి పాత్ర వహిస్తున్నారు?

నేను మొదటే చెప్పినట్లు—చిత్రరంగంలో ప్రవేశించక ముందే నాకు రాజకీయ జీవితం ఉంది. సినిమా జీవితంలో కూడా నేను రాజకీయాలకు దూరం కాలేదు ఆ కారణంగానే నేను కొన్నాళ్ళు పార్లమెంట్ సభ్యునిగా కూడా పని చేశాను. రాజకీయాల నుండి విరమించుకోవడం నా అభిలాష కాదు ఐతే, క్రియాశీలమైన రాజకీయ వాతావరణం ఏర్పడాలనేది నా ఆశయం .. అందుకే నా కృషి.

(జి. వి. జి.)




## గంటి సూర్యప్రకాశరావు

ఆ రోజు ఆఫీసు నుంచి బయటికి వచ్చేసరికి అయిదు దాటింది. బస్సుకోసం వెళ్తూ ఉండగా అర్జెంటుగా రావలసిందని రమణారావుగారు పంపిన కబురు జ్ఞాపకం వచ్చి వెంటనే టాక్సీ ఎక్కి రాయపురం పోనివ్వమన్నాను

రమణారావుగారు వయస్సులో నా కంటె పెద్దవారైనప్పటికీ మా ఇద్దరికి అదోక విధమైన స్నేహం ఏర్పడింది. ఆయన ఇప్పుడు నా కోసం ఎందుకు కబురు పంపారో నాకు తెలుసు; ఈ మధ్య ఆయన కొన్న ఒక పాత చిత్రపటం దానికి కారణం. రమణారావుగారికి చిత్రపటాలు, శిల్ప విశేషాలు, పాత పుస్తకాలు సేకరించటం అంటే ఇష్టం. వాటిని గురించి నాకు చెప్తూ ఉండే వారు కూడా.

ముఖ్యంగా ఈ చిత్రపటాన్ని గురించి నాకు చాలా చెప్పారు ఈ పటం నాకు చాలా సాధారణమైనదనిపించింది. కాని రమణారావుగారు అదోక నవాబుల కుటుంబానికి సంబంధించినదని, అది వేసి కనీసం అరవై ఏళ్ళయినా అయి ఉంటుందని అన్నారు ఆ పటం ఇరవై ఏళ్ల లోపు ఉన్న ఒక నవాబు కుర్రవానిది ఫ్రేము కట్టినప్పటికీ బాగా దుమ్ము కొట్టిపోయి ఉంది ఆ చిత్రంలో విశేషమైన చారిత్రక విషయాలున్నాయని రమణారావుగారి అభిప్రాయం అందుచేతనే ఇటువంటి వాటిలో ప్రవేశమున్న అవధానిని పిలిపించి పరిశీలించమని కోరారు. అదేమిటో ఇవ్వాళ నాకు చెప్పడానికే ఇంత హడావిడిగా కబురు పంపాడని ఊహించాను

ఇంతలో హార్బర్ దాటి రాయపురంలో ప్రవేశించాము రమణారావుగారి ఇల్లు సముద్రానికి చాలా దగ్గర ఆయనకు ఒక కొడుకు తప్ప మరి ఎవ్వరూ లేకపోవటంవల్లా, అతను కూడా మరోక ఊళ్లో పనిచేయటంవల్లా ఆ ఇంట్లో ఒంటరిగానే ఉండేవారు టాక్సీని పంపించేసి తలుపు తట్టాను. రమణారావుగారే వచ్చి తెరిచారు ఆయన్ను చూడగానే ఎందుచేతనో కలతచెంది ఉన్నట్లు కనిపించారు

ఆయన "రావోయ్! నీకోసమే చూస్తున్నా" నని ఆహ్వానించారు

"పటం గురించి అవధాని ఏం చెప్పాడండి?" అని అడిగాను

"ఇప్పుడంతా దాని గొడవేకదుటోయ్! అవధాని దాని సంగతి పూర్తిగా కనుక్కున్నాడు అది సాహెబ్‌పురంలో ఉండే ఓ చిన్న నవాబు వంశానికి సంబంధించినదట బొమ్మలో మనిషి చిన్నప్పుడే దారుణంగా హత్య చేయబడినట్టు కూడా అవధాని చెప్పాడు ఇవన్నీ పుస్తకాల్ని చూసి చెప్పాడనుకో కాని అసలు సంగతేమిటంటే నిన్న రాత్రి చిత్రమైన సంఘటన జరిగింది అవధానికి కూడా కబురు పంపించాను కొంత సేపట్లో వస్తా"డంటూ రమణారావుగారు లేచి లోపలికెళ్లి ఆ పటాన్ని తీసుకుని వచ్చారు. అద్దం తీసివేయబడి ఉంది అది కొంచెం శుభ్రం కూడా చేయబడి ఉంది దాన్ని నా చేతికిస్తూ "నీకేం కనిపిస్తోందో చెప్ప" అన్నాడు ఆయన

నేను జాగ్రత్తగా పరిశీలించాను క్రింది భాగంలో రెండు మూడు చిన్న బొమ్మలు కనిపించాయి అసలు బొమ్మపైన ఎవరో పిచ్చిగీతలు వేసినట్లనిపించింది ఇంకా జాగ్రత్తగా చూడగా రెండు ఆకారాలు గోచరించాయి మొదటిది పై నవాబు వేసుకున్నటువంటి దుస్తులు కలదిగా తెలుస్తోంది మెడచుట్టూ, నడుంచుట్టూ కూడా ఉచ్చు వేసినట్లు బొమ్మ గీసి ఉంది ప్రక్కన పూర్తిగా ముసుగు కప్పుకున్న ఆకారం మరోకటుంది ఎందుచేతనో నాకు అది భయంకరమని తోచింది

"ఎవరండీ గీసిందీ బొమ్మల్ని?" అనడిగాను

"అది తెలియదుగాని, నిన్న రాత్రి నిద్ర పట్టక దీన్ని చూస్తుంటే ఈ బొమ్మలు కదిలాయి నా కళ్ళను నేనే నమ్మలేదు అవధానికి చెపితే తనేదో తెలుసుకొస్తానని వెళ్ళాడు సాయంత్రం తప్పకుండా వస్తానన్నాడు ఆ పటం ఒక మూల ఉర్దూలో ఏవో అక్షరాలు ఉన్నాయని వాటినిబట్టి తెలుసుకోవచ్చన్నాడు ఇదుగో అతనే వచ్చినట్టున్నాడు"

అవధాని ఒకప్పుడు కవిత్వం వ్రాసేవాడు ఇప్పుడు అవన్నీ మానేసి సినిమాలకు, పత్రికలకూ వ్రాస్తూ ఉంటాడు రమణారావుగారికి బాగా స్నేహితుడు ఇటువంటి విషయాలలో మిడిమిడి జ్ఞానం లేకపోలేదు

"ఏం రావ్ ఎప్పుడొచ్చావ్ చూశానండి రమణారావుగారూ హా—లో పత్రిక ఫైలు తిరగేస్తే ఆ నవాబు ఎలా చచ్చాడో తెలిసింది. గొంతుక పిసికేయటమే కాక పొట్టమీదకూడా దారుణమైన గాయాలుచేసి చంపేశారుటండీ! ఎవరో తెలియనేలేదుట పటంలో మూల కనిపించిన ఉర్దూ మాటలు ఒకడికి చూపించాను. అతను అవేవో మంత్రాల్లాగున్నాయన్నాడు జలాలుద్దీన్ పైన (ఈనవాబు కుర్రాడతనే) ప్రయోగంలాగ ఉందన్నాడు" అవధాని ఇంకేదో చెప్పబోతూ ఉండగా రమణారావుగారు "ఇప్పుడేం చేద్దాం అంటావు అవధానీ?" అన్నారు

"ఏం చెయ్యటమేముంది? సాహెబ్‌పురం వంద మైళ్ళేగా! దీని అంతు కనుక్కుంటాను! మంచి వ్యాసం ఒకటి పత్రికకు వ్రాయొచ్చేమో"

రమణారావుగారు దీనికి మొదట ఇష్టపడలేదు పటాన్ని తగులపెట్టేసి దాని సంగతి పూర్తిగా మర్చిపోవాలన్నారు అవధాని మాత్రం పట్టుబట్టి ఆయన్ను ఒప్పించాడు ఆ రోజు రాత్రి పది గంటల రైలుకు సాహెబ్ పురానికి వెళ్లేట్టు అక్కడనుంచి రోజూ మాకు ఉత్తరం రాసేట్టు చెప్పి రమణారావుగారి చేత ఎలాగయితేనేం ఒప్పించాడు తనతోపాటు చిత్రాన్ని కూడా తీసికెళ్లాడు. మళ్ళీ మర్నాడు సాయంత్రం కలుసుకుంటానని రమణారావుగారితో చెప్పి నేను వెళ్లిపోయాను.

* * *

రెండు రోజుల తర్వాత అవధాని దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది సాహెబ్‌పురంలో ఆ నవాబులకు చెందిన భవనం బాగా పాడుపడిపోయినట్లూ, తానా రాత్రి అందులో గడపటానికి ఏర్పాటు చేసికొన్నట్లూ వ్రాశాడు అంతేకాక వారి వంశం వారికి ఊరి ప్రక్కనే

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
1960 జూలై 20 సంచిక నుంచి



## చిత్తరువు

ఉన్న కొంతమంది నవాబులకూ విరోధాలు ఉండేవని అందువల్లనే మేము చూసిన బొమ్మ లోని కుర్రాడు ఏదో దుష్ప్రయోగానికి బలి అయ్యాడనీ అక్కడ చెప్పకుంటున్నారని కూడా వ్రాశాడు పాడుపడిపోయినకట్టడాన్ని వర్ణించాడు జలాలుద్దీన్ చనిపోయిన చోటు గురించి కొంచెం చెప్పాడు అదొక విధమైన మంటపం వంటిది దానికి ఆనుకునే ఉన్న తోటలో ఒక పెద్ద పాడు పడిన నుయ్యి, దట్టంగా పెరిగి ఉన్న చెట్లూ మొదలైనవి ఉన్నాయి ఇటువంటి వర్ణనలను మేమెక్కువ పట్టించుకోలేదు రమణారావుగారు అవధాని మొండితనానికి విసుక్కున్నారు

* * *

మర్నాడు ఉత్తరమేదీ రాలేదు రమణారావుగారు కొంచెం భయపడ్డారు రాత్రే సాహేబ్‌పురానికి బయలుదేరి వెళ్ళాలన్నారు మరుసటి దినం వెళ్ళినట్టయితే నేను కూడా సెలవుపెట్టి వస్తానన్నాను

ఆఫీసుకు సుమారు పదిన్నరకు రమణారావుగారు టెలిఫోన్ చేశారు "రావూ! నీకు ఘోరమైన వార్త చెప్పాల్సొస్తోంది!" ఆయన గొంతుకలో ఆందోళనా, విచారమూ స్పష్టంగా ధ్వనించాయి "పొద్దున్నే మా ఇంటికి ఇద్దఱు పోలీసువాళ్లు వచ్చారు మన అవధాని చనిపోయినట్లు వార్త వచ్చిందనీ నేను సాహేబ్‌పురం వెళ్లవలసి ఉన్నదనీ చెప్పారు ఇప్పుడేం చేద్దాం?" ఈ వార్తకు నేనొక క్షణం నిర్ఘాంతపోయాను నేను కూడా వస్తానని అప్పుడే అనుమతి తీసుకొని రమణారావుగారి దగ్గరకు వెళ్ళాను రైలుకోసం ఆగకుండా రమణారావుగారి కారులో బయలుదేరి వెళ్ళాము దారిలో రమణారావుగారు మరికొన్ని వివరాలు చెప్పాడు అవధాని హత్య చేయబడినాడనే అనుమానం ఉన్నట్లు పోలీసువారు తెలియ బరిచారని అన్నారు అవధాని డైరీ మొదలైన వాటిని బట్టి తనకు కబురు చేసినట్లుగా కూడా చెప్పారు

* * *

సాహేబ్‌పురం చేరుకునేటప్పటికి

సాయంత్రం కావచ్చింది అదొక చిన్న ఊరు, మనుష్యుల దుస్తులలో, మసీదులలో నవాబుల ప్రభావం తెలుస్తూ ఉంది నేరుగా పోలీస్ స్టేషనుకు వెళ్ళాము అక్కడ సబ్ ఇన్స్పెక్టర్ రమణారావు గారి స్థితి చూచి చాలా సానుభూతి చూపాడు అవధాని శవాన్ని చూడగానే నాక్కూడా కొంచెం భయం వేసింది గొంతు పిసికి చంపేసినగుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. పొట్టమీద కూడా ఘోరమైన గుర్తులున్నాయి !

"ఇదొక హత్యకేసేమోనని అనుమానంగా ఉంది" అన్నాడు సబ్ ఇన్స్పెక్టరు. ఆ తర్వాత స్టేషనుకు వెళ్ళి ఆయన అడిగిన ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చాము అవధాని కేవలం చరిత్ర పరిశోధనకు వచ్చినట్లు చెప్పాము అవధాని అనుమానాలగురించి ఏమీ చెప్పలేదు విచారణ ముగిసేదాకా వెళ్లవద్దని ఇన్స్పెక్టర్ చెప్పగా, ఆ ఊళ్ళో ట్రావలర్స్ బంగళాలో మకాము చేశాము రమణారావుగారిని ఈ సంఘటన బాగా కదిల్చివేసింది మాట్లాడకుండా కుర్చీలో కూలబడిపోయారు ఆయనతో సంభాషణకు నేను కూడా ప్రయత్నించలేదు

చీకటిపడుతూ ఉందనగా సబ్ఇన్స్పెక్టర్ వచ్చాడు కొంతసేపు ఇవీ అవీ మాట్లాడిన తర్వాత "నేను ముందు ఈ విషం ప్రస్తావించలేదు. ఈ ఊళ్ళో కొన్ని వింత కథలు చెప్పుకుంటూ ఉంటారు కేవలం కథలే అనుకున్నాను కాని మీ అవధానిగారి డైరీ చదివిన తర్వాత నాకు కూడా అనుమానం తోస్తోంది" అని తికమక పడ్డాడు ఆ డైరీలో ఉన్నది ఇది

"రాత్రి 11-30 బాగా వెన్నెలగా ఉంది బాటరీలైటు అనవసరమని ఆర్పేశాను నా ఊహ మాత్రం అయి ఉండవచ్చు ప్రతి చెట్టూ భయంకరంగా కనిపిస్తోంది రావు ఉండి ఉంటే నా భయాన్ని చూసి నవ్వేవాడు ఏం తోచటంలేదు

"రాత్రి 11–45, ఆ నూతిని చూసినప్పుడల్లా ఓవిధమైన భయం వేస్తోంది శంకరనాయర్ ఈ నూతిని గురించే చెప్పాడు అతన్ని తీసికొనివచ్చి ఉంటే బాగుండేదేమో !

"రాత్రి 12 దూరంగా గంట వినిపిస్తోంది నూతిలోంచి ఏదో కదుల్తూ వస్తోంది ఏదో దెయ్యం కాదుకదా! ఇక్కడనుంచి పారిపోదాం అన్నా కాళ్ళు ఆడ్డంలేదు లైటువేశాను ఎవరో బురఖా వేసికొన్నట్లు కనిపిస్తోంది. కాని నడక మామూలు మనిషి నడకమాత్రం కాదు ఇటు నావైపే వస్తోంది ఇప్పుడేం చెయ్యాలో తెలియటంలేదు. నా బాటరీలైటు ఆ ఆకారంలోనుంచి అవతలున్న గోడమీద పడుతోంది! నా మనస్సులో ఒక చిత్రమైన ఊహ కదిలింది ఆ పటాన్ని తీసి లైటువేసి చూశాను ఎందుకోగాని ఆ నవాబు ముఖం కనిపించలేదు దానిబదులు ఏదో పరిచితమైనది మరొకటి కనిపిస్తోంది అది నా ముఖంలాగే ఉంది! ఇప్పుడు అరచినా నాకు సాయంవచ్చే వాళ్ళెవరూఉండరు ఇక వ్రాసి లాభంలేదు మీదకు వస్తే ఏదోవిధంగా రక్షించు

# చిత్రపటం

కోవటానికి ప్రయత్నించాలి "

* * *

ఇన్స్పెక్టరుగారు "మీరు రావడానికిముందు శంకర్ నాయర్‌ని కలుసుకున్నాను అతనొక రిటైర్డు హెడ్ కానిస్టేబులు మీ స్నేహితుడు అక్కడ రాత్రి గడుపుతానంటే వద్దని వారించాట్ట చివరికి తనవైనా వెంటబెట్టుకెళ్ళమని అడిగాడుట శంకరనాయర్ అవధానిగారు అతన్ని వదిలించుకొనేందుకు గావును సరే అని ఒప్పుకుని, తానారాత్రి వెళ్ళటంలేదని, మర్నాడు ఇద్దరు కలిసి వెళ్దాం అని పంపించేశాడుట శంకరనాయర్ మంత్రాలు అవీఇవీ తెలిసినవాడు ఇక్కడ నవాబును గురించి ఉన్న కథలు మీరు వినే ఉంటారు మీకేం అభ్యంతరం లేకపోతే ఇవ్వాళ రాత్రి దీని అంతు కనుక్కుందాం " అన్నాడు

"తప్పకుండా వెడదాం" అని నేనన్నాను రమణారావుగారుకూడా సరేనన్నారు ఆ రాత్రి పదకొండు గంటలకు మేమంతా ఆ భవనానికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాం

* * *

శంకరనాయర్‌కి ఇంచుమించు అరవై సంవత్సరాలున్నా మంచి విగ్రహం అంతకంటే చాలా చిన్నవాడుగా కనిపిస్తాడు గిరజాలు, చందనంతో చిత్రంగా ఉన్నాడు అవధానికీ తనకూ మధ్య జరిగిన సంభాషణను క్లుప్తంగా చెప్పాడు రమణారావుగారి కారులో ఆ భవనాన్ని చేరుకొనేటప్పటికి పదకొండు దాటింది అవధాని చెప్పినట్లే ఎక్కడ చూసినా పొదలు, చెట్లు దట్టంగా పెరిగిపోయి ఉన్నాయి మంటపం, దానిప్రక్కన తోట, నుయ్యి, అన్నీ అవధాని వర్ణించినట్లే ఉన్నాయి "అవధాని శవం దొరికినచోటు ఇదే జలాలుద్దీన్ శవంకూడా ఇక్కడే దొరికిందని అంటారు" అన్నాడు సబ్ఇన్స్పెక్టరు అక్కడే ఆ రాత్రి గడపాలని నిశ్చయించాం రమణారావుగారు తెచ్చిన జంబుఖానా ఒకటి పరిచి కూర్చున్నాం

శంకరనాయర్ సుద్దముక్కతో జంబుఖానా చుట్టూ కొన్ని గీతలు గీశాడు కొంచెం విభూతి కూడా అక్కడక్కడ చల్లాడు కొన్ని నిమ్మకాయల్ను అమర్చాడు

ఏ పరిస్థితులలోనైనా ఆ గీత దాటి వెళ్ళవద్దని చెప్పాడు "అప్పుడే పదకొండున్నర అయింది" అన్నాడు సబ్ఇన్స్పెక్టర్ ఎందుకో అందరం స్తబ్దుగా అయిపోయాం నూతివైపు చూస్తూ కూర్చున్నాం కొన్ని నిమిషాలు గడిచాయి "అదిగోచూడండి!" సబ్ఇన్స్పెక్టరు మెల్లిగా అన్నాడు

"ఎవరూ కదలొద్దు" అన్నాడు శంకరనాయర్ వెన్నెలలో నూతిగోడ స్పష్టంగా కనిపిస్తోంది లోపలనుంచి మెల్లిగా ఏదో పైకి లేస్తోంది ముందు గుండ్రంగా, నల్లగా కనిపించింది తర్వాత ఒక ఆకారం పైకి వచ్చి మా ప్రక్కకు రావటం మొదలుపెట్టింది. సబ్ఇన్స్పెక్టరు తొందరగా టార్చిలైటు వెయ్యబోగా అది అతని చేతిలోంచి జారి, శంకరనాయర్ గీసిన గీతల అవతలికి దొర్లిపోయింది దాన్ని తీసుకుందామని సబ్ఇన్స్పెక్టరు ముందుకు జరుగబోగా శంకరనాయర్ అతన్ని చెయ్యి పట్టుకుని ఆపాడు

బురఖాలో ప్రత్యేకంగా భయం కలిగించేదేమీ లేకపోయినా, ఆ ఆకారాన్ని చూస్తుంటే నా కెందుకో భయం వేసింది అది మామూలు మనిషి నడిచినట్లు లేదు ఒక్కొక్క అడుగు మెల్లిగా ఒక కొయ్య బొమ్మ వేసినట్లు వేస్తోంది మేము ఎవ్వరూ మాట్లాడకుండా చూస్తూ ఉండగా శంకరనాయర్ తనలో తాను ఏదో చదువుకోవడం మొదలుపెట్టాడు ఇంతలో ఒక చిన్న మబ్బు కప్పేసి అంతా చీకటై పోయింది రమణారావుగారు నా చెయ్యి గట్టిగా పట్టుకున్నారు మబ్బు తొలిగేటప్పటికి వెన్నెలలో ఆ ఆకారాన్ని బాగా దగ్గరగా చూశాం తలపైని నల్లగుడ్డ ఉన్న సందులోంచి ముఖం ముఖం ఉండవలసిన చోట్లో ఉన్న ఒక పుర్రె కనిపించింది ఆ పుర్రె ముక్కు, కళ్ళు నల్లని రంధ్రాల్లాగా ఉన్నాయి రమణారావుగారు మూర్ఛపోయినట్లు నా చేతి పట్టువదలటంవల్ల తెలుసుకున్నాను ఆ ఆకారం సరిగ్గా గీత దగ్గరకు వచ్చి ఆగిపోయింది రెండు మూడుసార్లు మెల్లిగా గీతచుట్టూ తిరిగి నూతివైపు నడిచి వెళ్ళిపోయింది అందులోకి వెళ్ళి మాయమైపోతుందని అనుకుంటుండగా గోడ మీద కూర్చుంది

"మనకోసం కాచుకుని ఉంది చూశారా !" అన్నాడు శంకరనాయర్ అతని కంఠం విని అదొకసారి తలెత్తి మళ్ళీ దాచేసింది ఆ రాత్రి ఎలా గడిపామో మాకే తెలియదు ఎక్కడో తొలికోడి కూత వినిపించింది చీకటి ఇంకా ఉండగానే ఆ ఆకారం మెల్లిగా నూతిలోకి దిగి మాయమైంది కొంతసేపైన తరువాత శంకరనాయర్ అనుమతితో అందరం బయటికివచ్చాం అప్పటికి రమణారావుగారు కూడా బాగా కూచున్నారు నూతిలో ఏముందో చూద్దామని శంకరనాయర్ అనగా వెళ్ళి చూశాం. లోపల అంతా చెత్త చేరి ఉంది సాలెగూళ్ళు బాగా అలుముకున్నాయి

* * *

కొన్ని రోజుల తర్వాత ఆ నూతిలో వెతగ్గా పొడుగైన నల్లటి పెట్టె దొరికిందని, అందులో నల్లని గుడ్డ కప్పబడి ఉన్న ఒక అస్థిపంజరం దొరికిందని విన్నాం ఆ పెట్టె బయటపడిన తర్వాత మళ్ళీ ఆ ఆకారం కనిపించలేదని సబ్ఇన్స్పెక్టరు మాకు రిపోర్టు చేశాడు ఆ చిత్రపటం ఈ రోజుకూ రమణారావుగారి దగ్గర ఉంది దానిలో బొమ్మలు కూడా కదలడం మానేశాయి

# నవ వధూవరులు పాత కాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనే సరిపెట్టుకోవాలా?



కుటుంబంలో ఒక కొత్త పెళ్లికూతురు. నూతన సంవత్సరం, ఒక నూతన గృహములో— మీరు క్రొత్తవిగా జరిపించనున్న తరుణంలో పాత సొగసులో వున్న ఆయిల్ బౌండ్ డిస్టెంపర్ మీకు యిక అవసరం లేదు అనుకుంటారు కదా! మీ గోడలకు వైనల్‌తో అందాన్ని యివ్వండి—ఆకర్షణీయమైన అందాలతో తొణికిసలాడే వాటిని చూసి ఆనందించండి!

వైనల్ మీ గోడలకు నున్నటి ఫినిష్ ఇస్తుంది, ఖరీదైనవిగా కన్పించేలా చేస్తుంది—మునుపెన్నడూ లేనంతగా! వైనల్ వల్ల మరెన్నో ప్రత్యక్ష ప్రయోజనాలు కూడా—ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపరూ పోటీ పడలేనివి! ఇవన్నీ అదనపు ఖర్చేమీ లేకుండానే!

## బ్రిటిష్ పెయింట్స్ వైనల్ తెచ్చుకోండి మీ ఇంటి గోడల చేత ఆశీర్వాదాలు పలికించండి

వైనల్‌ని ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనైనా పోల్చి చూడండి
ప్రతి విషయంలోనూ అతి శ్రేష్ఠమైనది వైనల్.

| | వైనల్ | ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ |
|---|---|---|
| ఫినిష్ | చక్కటిది, నున్నటి | బాగుండదు. |
| ఆరడానికి పట్టే సమయం | 4 గంటలు | 12 గంటలు |
| వాసన | ఇంపైనది | భరించలేనిది |
| కడుక్కొవేందుకు | ఎంతో వీలైనది | వీలుగా వుండదు |
| రంగు నిలిచి వుండటం | దివ్యం | పరవాలేదు |
| మన్నిక | ఎక్కువ | తక్కువ |
| వెయ్యడం | భేదం లేదు | |

...అన్నిటికీ మించిన విషయం, 5 కిలోల ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కావలసివచ్చే విస్తీర్ణానికి, కేవలం 2 లీటర్ల వైనల్ చాలు !




# వైనల్

ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కన్నా అన్ని రకాలుగానూ మేలైనది.

British Paints
BERGER
WORLDWIDE

LINTAS(C)/VNL/75/2317 TL

ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సందర్భమున

**CYANAMID** వారి శుభాకాంక్షలు!

అధిక దిగుబడులు! అధిక లాభాలు!

హరిత విప్లవానికి చేయూత

**సయానమిడ్ ఇండియా లిమిటెడ్**, బొంబాయి వారి

అత్యద్భుత కీటక నాశనులు!




## థైమెట్* 10 జి

వరిపై వచ్చు వేరుపురుగు, తెల్లకంకి, ఉల్లికోడు, దోమపోటుల
నివారణకు అతిశక్తివంతమైన గుళికల రూపంలో లభించు కీటకనాశని.
ప్రత్తి, మిరప పంటలపై ఆశించు తొలిరుతు క్రిములను అరికట్టుటలో విశిష్టమైనది.




## సైథియాన్* 50 ఇ.సి. ▪ సైథియాన్* 5% పొడి

వరి, మిరప, ప్రత్తి, మామిడి, పప్పుధాన్యములు, కూరగాయలు
మొదలగు పంటలను వివిధ దశలయందు ఆశించు
కీటకములను నివారించుటలో మేలైన కీటక నాశని.




## ఎబేట్* 50% ఇ.సి.

దోమలను లార్వా దశలోనే నివారించి,
నీటి కాలుష్యమును అరికట్టి ప్రజాజీవనములో
పారిశుధ్యమునకు తోడ్పడు ఏకైక కీటక నాశని.

## సైకోసెల్* 50% AS

ప్రత్తి పంటలో అనవసరపు
పెరుగుదలను అరికట్టి అధికోత్పత్తులను
సాధించుటలో పేరెన్నికగన్నది.

**CYANAMID**
ప్రతి రైతు విశ్వసించే పేరు.

---

తయారీదారులు: **సయానమిడ్ ఇండియా లిమిటెడ్** (వ్యవసాయ విభాగం)
పో. బా. నెం. 9109, బొంబాయి-400 025.

---

కోస్తా జిల్లాలకు స్టాకిస్టులు: **రాంమోహన్ ఎంటర్‌ప్రైజెస్**
పో.బా.నెం.384, ప్రకాశంరోడ్, సూర్యారావు పేట, విజయవాడ-520 002
ఫోన్స్: 73598, 74188 బ్రాంచీలు: • భీమవరం • అమలాపురం

* Registered Trademark of American Cyanamid Company Wayne, New Jersey, U.S.A.

nvkr/Bachi

# సరాగమాల
## వి.ఎ.కె. రంగారావు

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు పేరు పెట్టిన యీ శీర్షిక ఆంధ్రసచిత్ర వార పత్రిక ద్వారా లక్షలాది పఠితలకూ, శ్రోతలకూ గ్రామఫోన్ రికార్డుల సంగీత సాహిత్యాలమ గుణ దోష నిర్ణయ ప్రయత్నం చేస్తూ అందజేసింది పేరు పెట్టిన వారి ఆశీర్బలమో సత్సంకల్పానికి ప్రతిఫలమో కాని సాగినంతకాలం సరాగమాల సద్వాహినిగా సాగింది

కాని ఆవే సన్నివేశాలు వారే రచయితలు, సంగీత కర్తలు గాయకులు అభినేతలు, ఎంత కని! ఆ శీర్షిక ఆపి యిప్పటికి యిరవైయేళ్లు రెండు దశాబ్దాలయింది పాతవారు అరుదుగా యీ వీధులలో ఇంకా తిరుగాడుతున్నారు కొత్త వారే అటూ యిటూ పరుగులెడుతూ కొట్టు మిట్టాడుతూ పాటలు పంపుచేసేస్తున్నారు. కొత్త నీరు వచ్చింది, పాత ఊటావుంది ఆ కలయిక పాతచెమ్మతో కమ్మగా కొత్త రంగుతో హంగుగా సాధారణంగా అరుదుగా అందంగా వుంటున్నది

అయితే పాతవన్నీ మిన్న అనుకోవడం ఎంత అవివేకమో కొత్తదంతా సున్న అనుకోవడమూ అంత వెర్రి తనమే అప్పటికీ యిప్పటికీ ముఖ్య మైన యెదుగుదల విలువల సంఖ్యాబలంతో వుంది, పరువు బరువులో కాదు

శ్రీ మల్లాది రామకృష్ణగారు పోయారు కాని తెలుగు సినిమా పాటకింకా సాహిత్య గౌరవం కల్గించే వారున్నారు ఘంటసాల మనలో లేడు కాని అడపాదడపా తెలుగు సినిమా సంగీతంలో తెలుగుదనం వినిపిస్తూనే వుంది నాగయ్య గతించాడు కాని సంగీత మయమైన చిత్రాలింకా తీయబడుతూనే వున్నాయి

మేధస్సు యే ఒక్కరి సొత్తూ కాదు ఉపజ్ఞ యే ఒక్కడికో కట్టుబడిపోయే ఉంపుడు కత్తె కాదు ఊహాలక్ష్మి చంచల, పదునైన ఆలోచనల రంగవల్లు లెక్కడెక్కడ వుంటాయో అక్కడంతా కాలు మోపుతునే వుంటుంది

"మల్లీశ్వరి" (1951 బి ఎన్ రెడ్డి, దేవులపల్లి, రాజేశ్వరరావు) తరువాత మరో "మల్లీశ్వరి" రాలేదు "శంకరాభరణం" (1980 కె. విశ్వనాథ్ కె వి మహాదేవన్) వచ్చింది సంగీత నాట్య ప్రధాన చిత్ర ప్రబంధా లకు పెద్దనై, యుగ ప్రారంభకుడై పెద్ద పీట వేయించుకు కూర్చున్నాడు దర్శకుడు విశ్వనాథ్ వేషాలకోసం వచ్చి, చిన్న వేషాలే వేసి, పెద్ద వేషాలు దొరకక విఫలుడై చివరికి యెన్నో రకాల సంగీత చిత్రాలకు విధాతయ్యాడు ఏడిద నాగేశ్వరరావు "సిరి సిరి మువ్వ" (1976), "శంకరాభరణం", "సీతాకోక చిలుక" (1981), "సాగర సంగమం" (1983) తీయడమంటే మాటలా, దివ్యసంగీత నాట్యఖచిత మైన బాటలు.

ఆ అడుగు జాడలలో యిప్పటికి దక్షిణాది భాషలలో యిరవైఅయిదు చిత్రాలు తయారై వుంటాయి కొన్ని విడుదలకే నోచుకోలేదు కొన్ని విడివడి సాగిలపడ్డవి, మరికొన్ని కుంటి నడకన ఆడినవి కొన్ని మాత్రం ప్రత్యేక ప్రతిభను చాటుకొన్నవి ఆలోచిస్తే, చిత్రంగా "శంకరాభరణం" గొప్పదే కేవలం సంగీత సాహిత్యాలకే దృష్టి పరిమితం చేస్తే అదే దర్శక – సంగీత దర్శకుల "ఉండమ్మా బొట్టు పెడతా" (1968) ముందు తీసికట్టే ఈ మేలిమికి దేవులపల్లి కలిమి, వేటూరి సుందరరామమూర్తి లేమి అనుకొంటే అది బుద్ధిమాంద్యమే, స్వర్ణయోగం అన్నివేళలా సిద్ధించదు! "శంకరాభరణం"లోని పన్నెండు సంగీత ఖండికలలో వేటూరి వ్రాసినవి అయిదే (అందులో రెండు త్యాగరాజస్వా - వారి పల్లవులు) వీటిలో కొన్నిపట్ల శబ్దాడంబరం భావాన్ని బలహీనపరుస్తే దానికి జవాబుదారి కవి వేటూరి కాదు, విగించి విశ్వనాథ్

ఇరవై యేళ్ల నాటిది సి నారాయణరెడ్డి– దాశరథి యుగమైతే యిది వేటూరి జగం బూతులు వ్రాశాడు వేటూరి అన్న నింద లేకపోలేదు. అన్నీ నీతులే వ్రాసిన మహానుభావు డెవడు? జయదేవుడూ, పోతన్నా, సముద్రాలా, ఆత్రేయా అందరూ వ్రాశారు ఆ రచనలను అందలాల నెక్కిస్తే శృంగారమని మెచ్చుకొన్నారు అడుసులోనికి దించితే, అయ్యో అని నొచ్చు కొన్నారు (వారు ప్రతిభావంతులు కనుక ములుకుట్ల అలా వ్రాస్తే నేను తప్ప మరొకడు పట్టించుకోలేదు)

నేనూ అన్నాను ఆమధ్య కాలవైరి నాగేశ్వర రావుతో "మేము ఆరాధించే బాటసారి, విప్రనారాయణ, కలిమిలేములు, తెనాలి రామకృష్ణాదుల పాత్రధారిని చంపి, ఆనాడు శివరావు — సురభి బాలసరస్వతి వంటి సామాన్య పాత్రధారులు పాడితే చీదరించుకొన్నటువంటి హేయమైన గేయాలను యెగురుతూ, దూకుతూ, సిగ్గులజ్జలను చీల్చి చెండాడి, స్వైరవిహారం చేస్తూ రసిక పరిహారం చేస్తున్నా"వని

అయితే దీనికంతా బూతులు అభినయించే వారే బాధ్యులా? వ్రాయించుకొన్న దర్శక– నిర్మాతలూ, వ్రాసిన రచయితలూ, వాటి అవ గుణాలను హెచ్చవేసి చూపరులను రెచ్చగొట్టే విధంగా ఊపూ, లయా కూర్చిన సంగీత దర్శ కులూ, నాట్యదర్శకులూ, పాడినవారూ, వింటూ చూస్తూ, చవులూర్చు కొంటున్న మనమూ బాధ్యులము కామా!

ఒకసారి సుశీలనడిగాను "ఏమిటండీ మీరూ యిలాంటి పాటలు పాడటం!" అని, అతి మర్యాదగా, సుతిమెత్తగా జవాబిచ్చింది "పాడే పాటల సాహిత్యం గురించి ఆలోచిస్తూ కూర్చుంటే నేనొక్క పాట కూడా పాడలేనండీ" అంటూ నిజమే మరి (ఇంకావుంది)



# తమపిల్లలు 'గొప్పవాళ్లు' కావాలని కోరుకునే తల్లిదండ్రులను ఉద్దేశించి!...

"ఇటువంటి పత్రికొకటి ఇప్పటి ఆధునికతరంలో పిల్లలకుకావాలన్న లో చన నాకింతవరకూ తట్టలేదు సుమండీ." అన్నారు - తమ పిల్లలపెంపకంపట్ల ఎంతో బాధ్యతవహించే ఒక తండ్రి. ఆయన శ్రీమతి, ఆయన పక్కనే కూర్చునివున్నదల్లా 'అవును!' అంది. అందుకు మద్దత్తుగా అబ్బురపడిపోతూ ఇద్దరూ ఈ మాటల్ని 'యంగ్‌హీరో' ప్రారంభసంచికను శాంపిల్‌గా ఇచ్చినప్పుడు, దానిని చదివి, అడగాపెట్టకుండా వెలిబుచ్చిన అభిప్రాయాలు ఇవి:

"యంగ్‌హీరో' చాలబావుంది! మా అమ్మాయీ అబ్బాయీ చదివేరు. వాళ్ళకెంతో నచ్చింది. భూతాల కధలూ, మాంత్రికులవీ, దయ్యాలవీ, పాతచింతకాయ పచ్చళ్ళేవీ లేకుండా ఎంత చక్కటిపత్రికను తెచ్చారు. మీదొక ఉద్యమమే! ఆ కధలకు అలవాటుపడిపోయి, మూఢనమ్మకాలకు దాసోహమయిపోతున్నవాళ్ళను ఈ తరహా ఆశయాలవీ, సాహసాలవీ చెప్పే కొత్తబాణీకధలకు మళ్ళించడం కష్టమే. బాలలపత్రికపట్ల ఇప్పటికెవ్వరూ చేయని ఒక గొప్పప్రయోగాన్ని చేసిచూపేరు!" అన్నారు ఒక విద్యావంతురాలైన తల్లి.

ఈ సరికొత్తవిధానపు తెలుగుబాలలపత్రికను మెచ్చుకోని బాబుల్నీ, పాపల్నీ మనసర్వేలో మనం ఎచ్చటా తారసిల్లడం జరుగలేదు. ఇంతటి ప్రయోజనకరమయిన పంథా పత్రికనుగురించి, తమ కన్నబిడ్డలపెంపకంపట్ల జాగ్రత్తలుతీసుకునే తలిదండ్రులకు మేము ఏ కొంతో నివేదించవలసిన అవుసరమూ, బాధ్యతా వున్నాయి!

'యంగ్‌హీరో'లో వున్నవల్లా-సాహసాలూ, మూఢవిశ్వాసాలపై పోరాటాలూ, వ్యక్తిత్వవికాసంతో ప్రభవిల్లే బాలలస్వైరవిహారమూ, వాస్తవస్థితిని ఆకళించుకోగల నేర్పూ వంటివి. ఆ విధంగా కధలు తీర్చిదిద్దబడ్డాయి. ఒక్కొక్క కథా బాలలను ఉత్తేజపరచి, నడవడిని ప్రభావితపరచేదిగా తయారుచేయబడింది. ఈ పత్రికను మీ ముద్దుబిడ్డలు చదవనిపక్షంలో, వాళ్ల ఈ సమకాలీన వైజ్ఞానికజీవనవిధానంలో కొన్ని అత్యున్నతస్థాయివిషయాల్ని అందుకోనట్టే కాగలదు జీవితంపట్ల ఆలోచించగలిగిన ఆధునికుల కన్నబిడ్డలకోసం ప్రత్యేకంగా తయారుచేయబడిన అపురూపపత్రిక ఇది!

'బ్రూస్ లీ'వంటి ఆధునికయోధుడూ, 'స్టార్‌వార్స్' వంటి అంతరిక్షసాహసాలపై కామిక్స్ ప్రచురించేము. సైన్స్‌కుసంబంధించిన అనేకవిషయాలు బాలలకు వంటబట్టేవిగానూ, బాలలను వైజ్ఞానికవిషయాలతో బాగా పరిచయమయేట్టూ-ఈ సంచికలో రూపొందించేము. బాలలపత్రికల్లో ఇప్పటికి ఇటువంటిపత్రిక మనభాషలోవరకూ రాలేదు. ఈ తరహా పత్రిక మరేప్రాంతంలోనూ రాలేదని, మిగతా బాలలపత్రికలతో సంబంధంవున్నవాళ్ళు చెబుతున్నారు.

బాలల్ని పిరికిపందలుగా, నిర్వీర్యులిగా, సంశయాత్మకులిగా తయారుచేసే దయ్యాలూ, భూతాలూ, రాక్షసులూ, మాంత్రికులూ, కొడుకును చంపి, వండిపెట్టేరకం పురాణకతలూవంటివాటితోకాక, వీరత్వం వుట్టిపడే కధలతో సాహసవంతులిగా, సమగ్రులిగా, స్పష్టమైనవ్యక్తిత్వంతో వెలుగొందేలా కధల్నితీర్చిదిద్ది ఈ పత్రికలో పొందుపరిచేము. బజారుల్లో అనారోగ్యకర తినుబండారాలవంటివి తిన్నవిధంగా, మీ అనుంగుబిడ్డలు క్షుద్రసాహిత్యాన్ని పిల్లలకధలపత్రికలరూపంలో ఇంతదనుకా చదువుతున్నారని మేము అంటున్నాము. అటువంటిపరిస్థితిని తిప్పికొట్టి, ఈ తెలుగుపోతుగడ్డపై ఆరోగ్యమానసికస్థాయితో కొదమసింగాలను తయారుచేసేందుకనే 'యంగ్‌హీరో'ను విడుదలచేసేము 'ఈ పత్రిక బాలలపట్ల ఒక గొప్పఉద్యమం' అని మీరు అనకపోతే, మేము ఈ పత్రికను మూసివేసేందుకు సంశయించము. బెదిరింపు కాదు ఇదొక సవాలుగానే మేము ఇంతస్థాయి ప్రకటనను చేస్తున్నాము.

విప్లవాభినందనలతో

41, యల్.బి.స్టేడియమ్
హైదరాబాద్-500001

– వినుకొండ నాగరాజు
ఎడిటర్, యంగ్‌హీరో



వజ్రోత్సవ శుభాకాంక్షలతో



## ది గుంటూరు జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటి

రైతులకు ఎరువులు, క్రిమి సంహారక మందులు, నిత్యావసర వస్తువులు సరసమైన ధరలకు అందజేయబడును.

ఎం. శీతారామయ్య M A., — బిజినెస్ మేనేజర్
దాసరి సుబ్బారావు — అధ్యక్షులు

---

వజ్రోత్సవ శుభాకాంక్షలతో

స్థాపితం 1938  ఫోన్ 9

## ది బాపట్ల సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంక్ లిమిటెడ్

బాపట్ల, గుంటూరు జిల్లా.

సభ్యులు - 5000,

సభ్యులకిచ్చిన రుణాలు: రు. 1,43,21,804

1981-82 లో ఇచ్చిన రుణాలు :

రు 32,60,000

1982-83 లో ఇచ్చిన రుణాలు :

రు. 69 లక్షలు

శ్రీ డి హరిగోపాల్, — మేనేజర్
శ్రీ పి. కృష్ణంరాజు, — అధ్యక్షులు

---

వజ్రోత్సవ శుభాకాంక్షలతో

స్థాపితం 1937 ఫోన్ 91

## ది దుగ్గిరాల సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంక్ లిమిటెడ్

దుగ్గిరాల

సభ్యులు : 3872.

షేరు ధనం : రు 10,95,950.

ఇచ్చిన రుణాలు . రు 82,96,722

1982-83 లో ఇచ్చిన రుణాలు :

రు. 32 లక్షలు

50 గ్రామాలలో వ్యవసాయదారులకు ఫిల్టర్‌పాయింట్లకు, ఇంజన్లు, ఎలక్ట్రిక్ మీటర్లు పవర్ స్ప్రేయర్స్, ట్రాక్టర్స్ కొనడానికి, పండ్ల తోటలకు గోబర్ గ్యాస్ ప్లాంట్లకు బ్యాంకు ఋణాలు ఇస్తున్నది.

శ్రీ ఏ వి. సుబ్బారావు — మేనేజర్
శ్రీ వెనిగళ్ళ కృష్ణప్రసాద్ — అధ్యక్షులు

---

వజ్రోత్సవ శుభాకాంక్షలతో

స్థాపితం 1950 ఫోన్ 130

## ది నర్సరావుపేట సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంక్ లిమిటెడ్

నర్సరావుపేట, గుంటూరు జిల్లా

సభ్యులు 10120

చెల్లించిన షేరు ధనం: రు 20,91,530

A.P.C.C A.D. బ్యాంకునుండి పొందిన అప్పు:

రు 1,57,74,736

సభ్యులు చెల్లింపవలసిన ఋణాలు :

రు. 1,61,30,763

1982-83లో ఇచ్చిన ఋణాలు: రు.41లక్షలు

నర్సరావుపేట తాలూకా, చిలకలూరిపేట తాలూకాలోని కొంతభాగం రైతులకు దీర్ఘకాలిక ఋణసౌకర్యం కలుగజేస్తున్నది

శ్రీ ఎవ్.శ్రీనివాసరావు, — మేనేజర్
శ్రీ ఎం.జగన్నాధరెడ్డి, — అధ్యక్షులు

శ్రీ ఎ. భిక్షపతి, — కోశాధికారి
శ్రీ జి. తిరుపతిరాయుడు, — ఉపాధ్యక్షులు

# దారితప్పిన మనిషి



ఆంధ్ర సచిత్ర వారపత్రిక
1964 మార్చి 20 సంచిక నుంచి

**మూ**ర్తి వ్యాపారరీత్యా ఒంటిగా కారుమీద నూరు మైళ్ళ దూరంలోనున్న పట్నంకి వెళ్ళి తిరిగి వస్తున్నాడు వెన్న వెళ్ళినప్పుడు తన ఆలోచనలలో వ్యాపారం, లాభాలు, కొత్త పరిశ్రమలు, పన్నులు తగ్గించుకునే ఉపాయాలు, క్రొత్తకారు ఇలాంటి ఆలోచనలతో నిండి దారి తప్పకుండా ఆ పట్నం చేరుకున్నాడు

ఈ వేళ తిరిగి వస్తూనే ఈవేళ ఉదయం జరిగిన సంఘటన గురించి దీర్ఘాలోచనలోపడ్డాడు తన తండ్రికి ఆప్తుడైన వ్యక్తి తనను ఉదయమే ఒక దేవాలయానికి తీసుకువెళ్ళారు. తనకు స్వతహాగా, గుడులు, గోపురాలు అంటే ఆసక్తి లేదు దేవుడూ, దెయ్యాల అంటే నమ్మకం లేదు కనపడని, నిరూపించని సత్యాల కోసం పరితపించి యీ మానవ జన్మలో పొందవలసిన ప్రాపంచిక సౌఖ్యాలు విడిచి పెట్టుకోవడమంత తెలివి తక్కువ తనం యింకొకటి లేదని తను నిర్ధారించుకున్నాడు తన తండ్రి రోజుకొకసారే తిని, చౌకరకం బట్టలు కట్టి ఒక చిన్నయింట్లో ఉండేవాడు సుఖపడటానికి ఉన్న అవకాశాలన్నీ జారవిడుచుకున్నాడు తనే కాకుండా తన కొడుకు కూడా తను బ్రతికుండగా తనలానే కట్టు దిట్టంగా వుండాలనేవాడు. ఎవరి జోళ్ళకు వారే పాలిష్ వేసుకుంటేనేగానీ అతనికి శాంతి వుండేది కాదు. లాభాలలో సగందాకా దానాలకే పోసేవాడు అలాంటి తండ్రి అగపడని సత్యాలకోసం వెదకి వెదకి సత్యమిది అని వూహేగానీ నిరూపించుకోలేని పరిస్థితిలో పోయాడు. ఒక యేడాది తిరక్కుండానే లోకం అతనిని మరచిపోయింది అందుకే తనకు తండ్రి గతించాక పెద్దరికం రాగానే ప్రజల ముఖప్రీతి మాటలను వినలేదు. అతను చేస్తుండిన దానాలను ఆపివేసాడు లాభాలలో వ్యాపారం త్వరితంగా వృద్ధిచేసాడు తను, భార్యాపిల్లలూ యిప్పుడేకాక కొన్ని తరాలవరకు వెతుక్కునే అవసరం లేకుండా చేయటానికి తాపత్రయపడుతున్నాడు స్వసుఖాలకు మరిగిన మనసు ఆ సుఖంకోసం డబ్బు వెచ్చించటానికి వెనుదీయలేదు. కండపుష్టి తిండిలోనేకాదు సుఖాలతోనూ కలిగింది.

ఇలాంటి మూర్తి యీ రోజు ఆ పట్నం దేవాలయ ప్రాంగణంలో తన తండ్రి శిలాప్రతిమను చూసాడు. తండ్రి బ్రతికుండగా యిది ప్రతిష్టించడం జరగలేదని తనకు తెలుసు. అలా చెయ్యడానికి తన తండ్రి ఒప్పుకునేవాడు కాదు ఆ శిలాప్రతిమ చుట్టూ చిన్న వుద్యానవనం వుంది. కొందరు భక్తితో ఆ బొమ్మను చూస్తూ తలవంచటం చూసాడు.

"ఎప్పుడు దీనిని ప్రతిష్టించారని" అన్నాడు.

"ఈ మధ్యనే......"

తన తండ్రి శిలాప్రతిమ ప్రతిష్టించేటప్పుడు కనీసం ఆయన యేకైక పుత్రుడ్ని పిలవాలనే మర్యాదనైనా యీ పట్నవాసులు పాటించలేదని మూర్తి మనసు బాధపడింది తనను తెచ్చిన తండ్రి మిత్రుడు ఆ విగ్రహానికి ఒక నమస్కారం చేస్తూ.

"దారితప్పిన మహానుభావుడు" అన్నాడు.

తిరిగి కారులో వస్తూ మూర్తి మనసులో యిదే తిరగతొచ్చింది మనుషులకు ఒక దారి వుంటుందని ఆ మార్గంగుండాపోతూ యెక్కడో గతించినా మళ్ళీ ఆ గతించిన చోటులో వచ్చే జన్మలో పుట్టిస్తాడని, మళ్ళీ ముందుకుమార్గం గుండా సాగి పోతాడనీ, చివరకు గమ్యమైన పరమాత్మను చేరుకుంటాడనీ, —జన్మ జన్మానికి తప్పులను తగ్గించుకుని ఒప్పులను పెంచుకొని ఒప్పులకుప్పయైన భగవానుల చేరుకోవటమే మానవుని ధ్యేయమని — యిలా యెక్కడో యెవరో అనగా విని యిదివరకు నవ్వుకున్నాడు

మతం మనిషికి నల్లమందువంటిదని యెవరో అన్నదాంట్లో నిజముందని దాని జోలికి తను పోలేదు మతం ప్రాతిపదికంగా మనిషి మార్గాలన్నీ సృష్టించబడ్డాయి దేవుని ప్రమేయం లేకుండా యేమతమూ లేదు దేవుని రూపులో భయమూ భక్తీ రెండూవున్నాయ్ రెండు మానవుని ప్రాపంచిక సౌఖ్యాలకు శత్రువులు పాపం చెయ్యని మనిషి ప్రాపంచిక సుఖాలను పొందలేడు

కారు మెల్లగా డ్రైవ్ చేస్తూనే యింకో సిగరెట్ ముట్టించాడు ఆలోచనలూ కాలుతున్న సిగరెట్ లానే ఆరిపోకుండా పోతున్నాయ్ తన తండ్రి మిత్రుడు ఆ దేవాలయంలోనికే తీసుకు వెళ్ళి ఆ మాటలు అని తండ్రీ కొడుకులకు ఉన్న భేదాలు యెత్తి పొడిచాడు డబ్బూ, తాగుడూ, స్త్రీ యీ మూడు తప్పించి మనిషికి యింకేమీ సుఖమీయలేవు తెలివి తక్కువ వాళ్ళే పుష్కలంగా నీరు లభించేటప్పుడు యెండమావుల వెంట దాహం తీర్చుకోడానికి పరుగెత్తుతారు పచ్చని ఆకులు ఉండగా యెండుటాకులు పట్టుకొని గతించిన పచ్చదనం చూడటానికి ప్రాకులాడుతారీ భక్తులు వేదాంతులూను నేడు పడిన సుఖమే నిజం రేపటి సుఖం వూహ ! ఈ రోజున రేపటి ఊహలో పడి సుఖాన్నెవరు ఖూనీ చేసుకోమన్నారు ? నేడు సుఖపడుతున్న వాళ్ళే నిజంగా దారి తప్పని వాళ్ళని సిగరెట్ పీకను విసిరేసాడు

ఈ ఆలోచనా తరంగాలలో చిక్కుకుని యింతవరకూ తను దారి తప్పానని పోల్చుకోలేదు మనుష్య సంచారం మృగ్యమైన ఒక ఘాట్‌పై కారు పోకుండకా తను దారితప్పానని గుర్తుకు వచ్చింది ఒక అరణ్య మార్గంలో పోతున్నానని ఆ జూబు చెట్లు, చెట్లపై కోతులే చెప్తున్నాయి ఘాట్‌పైకి పోయి కారు త్రిప్పుదామని ఆపాడు ఓసారి కారు దిగాడు

ప్రకృతి యెండలో వెలిగిపోతుంది చుట్టూ కలియజూస్తే ప్రకృతి ఆకాశాన్ని గొడుగుగా వేసుకున్నట్లుంది దూరానకొండలు మండిపోతూ దినకరుని చీల్చి మింగాలని భల్లూకాల్లా ఎదురు చూస్తున్నాయ్ ▪ రక్తంతో సింగారించటానికి తెల్లని మబ్బులని ఆహ్వానిస్తున్నాయ్ ఎండ మావులు వేడిని భరించలేక యేటి ఒడ్డుకు పరుగులెడుతున్నాయ్ గాలికి గులాబి వనంలో రెక్కల వర్షం కురుస్తోంది కమలాలు క్రిందికి రాలుతున్నాయ్ అతను కొద్ది క్షణాలు యీ ప్రకృతి పచ్చని ఊయలలో ఊగాడు

విరబూసిన గులాబీలను తెంపి ముందు సీటులో కుప్పగా వేసాడు కమలాపండ్లను యేరి వెనుక సీటులో వుంచాడు ఇంతలో చెట్లపై నున్న కోతుల కోలాహలం వినిపించింది అంత

# దారి తప్పిన మనిషి

దూరాన ఒక లేడిపిల్ల గెంతులేస్తూ పోతుంది పెద్ద పాము తన యెదరగానున్న చెట్టుమీద నుంచి దిగుతోంది ఇలా తను వస్తానని తెలుసుంటే తుపాకి తెచ్చేవాడే ! రాళ్లను ఆ పాముమీద రువ్వాడు ఇంకోరాయి రువ్వగానే ఆ పాము డొంకలలోకి దిగిపోయింది

తిరిగి పోదామని కారు స్టార్టు చెయ్యబోతుండగా అద్దంగుండా వెనుకనుంచి యెవరో వస్తున్నట్లు చూసాడు ఎర్రరంగు చీర కనుపిస్తోంది రాను రాను దగ్గరై గబ గబా నడుస్తోంది ఒకసారి తనవేపు చూసి మళ్ళీ ముందుకు సాగి పోయింది ఆ చూపుతో కళ్ళాలు వేసింది యౌవనం అంతా ఆమె శరీరాన్ని వుప్పొంగించి ▪ కన్నె లేడిలా కదిలి పోతోంది ముసుగులేని నగ్న ప్రకృతిలా ఆ జాకెట్టులేని జవ్వని అగుపించింది సంపెంగ మొగ్గ లాంటి ముక్కు, గులాబిల్లాంటి శరీరచ్ఛాయ, మందారాల్లాంటి పెదిమలతో నున్న ఆడవాళ్ళను యిది వరకు చూశాడు అనుభవించాడు కాని యీమెది లేడిలాంటి నిగనిగలాడే శరీరచ్ఛాయ పొంగిన బుగ్గలు ముక్కును లోనికి త్రోశాయ్ మూతి చిన్నదైనా ముద్దుగా వుంది ఫాల భాగంలో తిన్నగా ఒక ముదుత అగుపించింది

తన జీవితంలో అదృష్టం అనేది ధనార్జనలోను, స్త్రీ సౌఖ్యాలలోనూ, యిది వరకూ వెతుక్కొని వచ్చింది ఇప్పుడూ యిలా దారి తప్పించి వెతుక్కుని వచ్చిందనుకొని మెల్లగా కారు ముందుకే నడిపాడు

వెనుక చూపు లేకుండా ఆమె గబగబా సాగిపోతోంది కారు అద్దంలోనుంచి కనిపిస్తున్న కొండ శిఖరాలు కదులుతూ అవి యెంతో చేరువలో వున్నట్లున్నాయ్ కొండల్లో నుంచి గలగలా శబ్దంతో జారుతున్న సెలయేర్లు తనలోనూ అలాంటి శబ్దాలతో పులకరించాయ్ అడవిలో తేనెపట్లు, గులాబులు, తియ్యని కమలాలూ అన్నీ తనచుట్టూ కదులుతున్నాయ్ కారుతో పాటు అతని పొంగిన నరాలూ పరువెత్తసాగాయ్

ఆమె దగ్గరగా తీసుకు వెళ్లి కారునాపి, "దిగబెట్టనా ?" అన్నాడు

"చాలా దూరం బాబు — సాయం కాలానికి గానీ చేరుకోలేను "

"ఫరవాలేదు కారులోనైతే వేగంగా వెళ్ళిపోతావు "

"చాలా మంచి బాబులా వున్నావ్ నా ఆతృత అలాంటిది నేను చెప్పిన దగ్గర ఆపు బాబూ " అంగి

మాట్లాడకుండా ముందు తలుపు తెరిచాడు ఆమె కూర్చుంది తలుపు వెయ్యటానికి అటువేపు వంగుతూ అతని భుజాన్ని ఆమె కొకసారి తగిలించాడు ఇద్దరికీ మధ్యనున్న గులాబీలు కాస్త నలిగిపోయాయ్ సిగరెట్ ముట్టించి మళ్ళీ కారు ముందుకు పోనిచ్చాడు

"ఎందాక వెళ్తున్నావ్ ?"

"ఆ కొండలు కనిపిస్తున్నాయే ▪ వెనక మా వూరుంది "

"ఎక్కడ నుంచి వస్తున్నావ్ ?"

"ఆ ఘాట్ క్రింద మా కన్నవారి వూరు పాలెంలో నున్నాను. నా మొగుడికి పెద్ద జబ్బు చేసిందని కబురొచ్చింది ఎకాయెకిగా బయలు దేరాను "

"మీ వాళ్లెవరూ తోడు రాలేదేం ?"

"మా అయ్య ముసిలోడు ఐనా యీ త్రోవంట భయం లేదు బాబూ "

"అడవి కదా !"

"ఈ చిరుతపులులు, జంతువులూ వాటి నేమైనా అంటేనే మీదపడ్తాయ్ లేకపోతే యేమీ చెయ్యవు బాబూ !"

"పెళ్ళయి యెన్నాళ్ళయింది ?"

"ఆరు నెలలు నిండలేదు బాబూ ! మాయదారి జబ్బు యెక్కడుందో ?"

"ఫరవా లేదులే తగ్గిపోతుంది "

"మంచి బాబువి నీ నోటమాట జరుగుతుంది "

తను తిరిగి పోడానికి పెట్రోలు సరిపడదనే అనుమానం కారు వేగాన్ని తగ్గించి ఇనుప దిమ్మ దగ్గరగానున్న అయస్కాంతపు ఆకర్షణను తిరస్కరించలేక పోతోంది రోడ్డు ప్రక్కనే ఒక పెద్ద చెరువు అగపడింది కారు ఆపాడు

"అదిగో నీరు — నాకు ఆకలౌతోంది నువ్వు యెప్పుడు తిన్నావో యేమిటో రా -- తిని మళ్ళీ బయలుదేరుదాం "

"నాకు ఆకలి చచ్చిపోయింది బాబూ ! ఆతృతగా వుంది వేగంగా తినేసి రండి "

"అయితే నేను తినను" అన్నాడు

"నా నుంచి మీ కెందుకు బాధ? పదండి" అంది

లేచి కారులో నుంచి ఒక బేగ్ తీసాడు అప్పుడే ప్రొద్దు పడుటకు తిరిగింది అంత వరకూ ▪ పెద్ద సరస్సుపై పూల మాలలా తిరుగుతున్న చిన్న తెల్లని పక్షుల గుంపులు చెదరి పోయాయ్ సరస్సు దరికి చేరేసరికి తెల్ల కలువలు వణుకుతున్నాయ్ విశాల వటవృక్షం వూడలతో ఒడ్డుపై ఒక శాలను కట్టింది అక్కడకు చేరే సరికి ఆకులు రాలసాగాయి అల్లంత దూరంలో సుడిగాలి రేగి ధూళిని పైకి లేవనెత్తింది తివాసీ

■ పటశాల దగ్గర పరిచాడు

కేరియర్ నుంచి పూరీలు తీసి తినమని ఆమె కివ్వగా ఆమె అతనినే తినమంది

"నీవు తింటే గానీ ఒప్పకోను" అంటూ బలవంతాన ఆమె నోట పెట్టబోయాడు ఆమె వెనుకకు వంగగా ఆమెను ముట్టుకుంటూ నోటిలో పెట్టాడు ఆమె సరిగ్గా కూర్చుని తల దించుకుని తింటోంది మూర్తి ఆమె వేపు క్రీగంటగా చూశాడు మనసున్న ఆడవాళ్ళు యిలాంటి వేషాలే వేస్తారని తను నిర్ధారించు కున్నాడు యిదంతా లోనున్న ప్రేమను అణచు కోడానికి చేసే ప్రయత్నంలోని నటన నటిం చటం చేతకాని ఆడది యెప్పుడూ ప్రేమించ లేదని తనకు తెలుసు ఆకలి జ్వాలలు ఆరగానే అతనిలో కామజ్వాలలు రేగినయ్ ఆ మంటలలో మనస్సు మండిపోయి రక్తం భుగ భుగ లాడి పురకలు వేసింది ఆమె నోటిలో బలవంతాన బ్రాందీ పొయ్యించింది

"దాహం పోతుంది తాగు — తాగు యేమీ కాదు" అన్నాడు

తాగని ఆమెచేత బలవంతాన 'తియ్యని సోడా' అని తాగించాడు ఆమె కొద్ది క్షణాల్లో నవ్వింది. పక పక నవ్వింది. అతను తాగింది ఆమె కంటే ఎక్కువే ఆమె లేచిపోబోతూంటే ఆమెను గట్టిగా పట్టుకొని కూర్చోబెట్టాడు. ఆ మైకంలోనే ఆమె "మంచి బాబు . నీలాంటి బాబులు యీ అడవి వేపు యెవరూ యిప్పటి దాకా రాలేదు మా .మంచి బాబు "

ఆమె సగం మైకంతో యేవేవో వాగుతోంది ఎర్రని చీర గాలికి యెగిరిపడి పక్కన నీటిలోకి కొంతవరకూ తడిసిపోయింది. తడిసిన చీర రంగు నీటిలో వెలిసింది ఆ నీటిలోని యెరుపు రంగును ప్రొద్దు పీల్చుకొని పోయింది.

ఆమెకు స్పృహ వచ్చినట్టు అతనికి కొంత సేపటివరకూ తెలియలేదు ఆమె ఒక్కసారి "అమ్మా" అనగానే చప్పున లేచి చూసాడు ఆమె లేచి ముందుకు పరిగెత్తి ఆగిపోయింది అతను ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె చూపులు యెక్కుపెట్టిన బాణాల్లా వున్నాయ్ ఆ మరు క్షణంలో ఆమె యేడుస్తోంది మాట్లాడ టానికి కూడా శక్తి లేని మనిషిగా నిల్చున్నాడు ఆమె కన్నీరు తుడుచుకుంటూ —

"ఒకదారిన పోయేదాన్ని—నన్ను దారి తప్పిం చేసావ్. . నీకు న్యాయమా ?" అంది

మూర్తి ఒకసారి తలెత్తి చూసినా ఆమె ముఖం అతనికి సరిగ్గా కనపడలేదు

"నా మొగుడికి నా ముఖం యెలా చూపిస్తాను ?"

"నీకూ నాకూ తప్పించి యింకెవ్వరికి తెలీదులే "

"దేముడికి తెలీదా ?" అంది

మూర్తికి అప్రయత్నంగా చిరునగవు వచ్చింది తను తిరిగివస్తూ తలుచుకున్న తలపులే జ్ఞప్తికి వచ్చాయ్

"పద నిన్ను వేగంగా దిగబెట్తాను !"

మౌనంగా అతని వెంట కదిలింది కారు లోని గులాబీలు వాడిపోయినయ్ వేడి తగ్గిన దినకరునిపై కసి తీర్చుకోడానికి పశ్చిమ కొండలు యెదురు చూస్తున్నాయి ప్రకృతి మూగవోయి నట్లుంది ఆమె వుండీ వుడిగి అతని చేతుల వేపు చూస్తోంది

కారు ఒక పెద్ద లోయ ప్రక్కనే ఉన్న సన్నటి బాట గుండా పోతుంది ఆమె చెప్పన అతనిని ఆప్యాయంగా తాకి అతని భుజంపై ముద్దు పెట్టి "అటు చూడు బాబూ ఎంత చక్కగా వుందో" అంటూ తూర్పు వేపు చూపిం చింది అతను చూసి ఆమె ముద్దు పెట్టి చెప్పగా చూసానని సంతోషంతో వహవ్వా అన్నాడు ఆమె చప్పన బలమంతా ఉపయోగించి కారు స్టీరింగు చక్రాన్ని గిరగిరా త్రిప్పివేసింది కారు దారితప్పి కొన్ని వందల అడుగుల లోయ లోనికి జారి పిప్పి అయిపోయింది ●

# ! మహాశయా కంపోసిటర్ ఓ

←

## శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

వ్రాయ డెందుకు కవిరాజా గాడొక్కడూ
: కొరకు వాని ప్రెస్సు కొరకు వాని
అతను రచన చూచు ఆద్యంత మంత్యాది
. లేదు వాడె చదువు లేక వాడు

"వాణి మెఱగు నేరి పాణి చలువ కోరి ?"
" ? రాలు ఆట ఎవని రాలు అక్క "
"రాతసాల కెవడు రామభద్రుడు గాడు"
. ఎవడు అవడు - అన్ని అవును అతడు

అతను యెవ డటంచు అర్ద్రాగ్ని గోళాలు
— కోండి వదలు రూళ్ళ లెండి వలదు
మనకు వాడు గాక మరియొక డుండునా ?
: కుండు సార ప్రథమ లెండి వాడె

ఎవడు నా గ్గలట్టి ఏకైక పతియితా
; నుండి వాడె ప్రెస్సు లెండ వాడె
కమక వాడు మటుకు అచ్చితమ్ముగ జూచు
. కాని కొత్త రచన, కాని చెత్త

ఆ మృదూకృతాత్ము ఆత్మ సంతృప్తియే
, కాగ నాంది కింక కవిత వాదు
వ్రాయుచుంటి లక్ష్య లక్షణ మూర్తికి
. వెంది ఆట లాంటె విడుపు ఆట

ఆ ద్యం త ర హి తా !

చదువుకో గదోయి చంద్రార్కశాశ్వతం
! వాడ పేర్చు పైపువద్ద ప్రెస్సు

[ ఈ పద్యాలు సరిగా చదవలేకపోతే 247 పేజీ చూడండి — సం. ]

# గాడిద గుడ్డు *

డి.వి. నరసరాజు




ఒకానొకప్పుడు —

ఆంధ్రదేశాన్ని ఒక రాజు పాలిస్తుండేవాడు

ఆ తరువాత —

భారతదేశం స్వతంత్రమైంది,

ఆంధ్ర దేశం అస్వతంత్రమైంది

అందువల్ల — కాలానుగుణంగా —

ఆంధ్ర దేశ పాలకులుగా — రాజులు పోయి మంత్రులు వచ్చారు, కొందరు రాజులే మంత్రులైనారు!

అలా మంత్రుల పరిపాలన సాగిపోతుండగా— నాలుగైదేళ్ల క్రితం —

ఒకానొక మంత్రిగారి సన్నిధికి ఒకానొక దిగంబర సన్యాసి వచ్చాడు

వచ్చి — "అయ్యా! తమరి వల్ల నా కొక చిన్న సహాయం కావాలి" అని అడిగాడు!

"ఏమిటది?" అని సవినయంగా అడిగాడు మంత్రి! అందుకు సన్యాసి "వూరి చివర శ్మశానంలో — ప్రజాక్షేమం కోసం ఒక హోమం చేస్తున్నాను అందుకు తమ సహాయం కావాలి" అన్నాడు!

"ప్రజాక్షేమం కోసమైతే — నా ప్రాణాలయినా యిస్తాను! నేను పుట్టింది ప్రజాసేవ కోసమే గదా" అన్నాడు మంత్రి!

"తమరు సరిగా అర్ధరాత్రివేళ — శ్మశానికి రావాలి" అన్నాడు సన్యాసి

"ఎందుకు?" అని అడిగారు మంత్రి

"ఏం? శ్మశానం అంటే భయమా?"

"అబ్బే! నాకేంభయం! మీరు అక్కడే వుంటారుగా?" అన్నాడు మంత్రి

"వుంటాను" అన్నాడు సన్యాసి!

"అయితే వస్తాను" అన్నాడు మంత్రి

"అయితే బ్రతికినన్నాళ్లు మంత్రిగానే వుండేటట్లు ఒక మూలికగూడ యిస్తా"న్నాడు సన్యాసి!

"అయితే తప్పక వస్తా"నని — సరిగ్గా అర్ధరాత్రివేళకి శ్మశానానికి వెళ్లాడు మంత్రి!

అప్పటికే సన్యాసి అక్కడ హోమం చేస్తున్నాడు

"అదుగో! చూడండి!" అని షుమారు మైలు దూరంలో వున్న మోదుగు చెట్టు చూపాడు సన్యాసి మంత్రికి!

మంత్రి చూశాడు!

"మోదుగు చెట్టు ఎక్కగలరా?" అని అడిగాడు సన్యాసి!

"మోదుగుచెట్టు ఏం కర్మం! తాడిచెట్టు గూడ తలక్రిందులుగా ఎక్కగలను! నాకు చిన్నప్పుడు అలవాటే"నన్నాడు మంత్రి!

"అయితే తమరు ఆ మోదుగుచెట్టు ఎక్కి, చిటారు కొమ్మన తలక్రిందులుగా వేళ్లాడే భేతాళుణ్ణి పట్టి, కట్టి, మోసుకురావాలి" అని చెప్పాడు సన్యాసి

"ఎందుకు?" అని అడిగి—మళ్లీ వెంటనే—

"అన్నట్లు ప్రజా క్షేమం కోసం అని చెప్పారుగా! వెళ్లి తీసుకొస్తాను" అని మంత్రి వెళ్లబోతుంటే—

సన్యాసి "ఆగండి! ఆ భేతాళుణ్ణి మోసుకువచ్చేటప్పుడు— తమరు మౌనం పాటించాలి! నోరు విప్పి మాట్లాడగూడదు

మాట్లాడారా— భేతాళుడు తుర్రుమని ఎగిరిపోయి— మళ్లీ మోదుగు చెట్టుమీద వాల్తాడు! జాగ్రత్త" అని హెచ్చరించాడు సన్యాసి!

'అలాగే' అని మంత్రి, మోదుగు చెట్టు వద్దకు వెళ్లి— చెట్టు అవలీలగా ఎక్కి— భేతాళుణ్ణి పట్టి, కట్టి— బుజాన వేసుకుని— నడిచి వస్తున్నాడు—

భేతాళుడు "అయ్యా! మంత్రివర్యా!" అని పిలిచాడు మంత్రి మాట్లాడకుండా వచ్చేస్తున్నాడు

"సైలెంటుగా పోతూంటే— బోర్ కొడుతున్నది ఏవైనా కబుర్లు చెప్పుకుంటూ పోదాం!" అన్నాడు భేతాళుడు

భేతాళుడు, తనను మౌనభంగం చేయాలని ప్లానువేస్తున్నాడని గ్రహించాడు మంత్రి!

మళ్ళీ—భేతాళుడు—

"నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను ఆ ప్రశ్నలకి జవాబు తెలియకపోతే— నోరుమూసుకుని వూరుకోండి నేనేమీ అనుకోను!

కాని— నా ప్రశ్నకి జవాబు తెలిసిగూడా చెప్పకపోతే — మీ శిరస్సు వెయ్యిన్నొక్కముక్కలవుతుంది! జాగ్రత్త" అని హెచ్చరించాడు భేతాళుడు

మంత్రి మాట్లాడలేదు! నడచిపోతున్నాడు!

భేతాళుడు ప్రారంభించాడు ప్రశ్నలు —

"కృష్ణా గోదావరి ఆనకట్టలు కట్టిన తెల్లదొర పేరేమిటి?"

మంత్రి మాట్లాడకుండా పోతున్నాడు మంత్రి తల పగిలిపోలేదు

భేతాళుడికి ఆశ్చర్యం వేసింది

"ఓహో! అంటే మంత్రికి జవాబు తెలీదన్నమాట" అనుకొని— ఈసారి యింకా తేలిక ప్రశ్న అడుగుదామని—

"రెండో ప్రపంచ యుద్ధం ఎవరెవరికి జరిగింది?" అని అడిగాడు

జవాబు లేదు! అయినా మంత్రి తల పగల్లేదు!

"ఇండియాకి స్వరాజ్యం ఎప్పుడొచ్చింది?" జవాబులేదు

"ఇందిరాగాంధి భర్త పేరేమిటి?"

"పోనీ రాజీవ్‌గాంధి తండ్రి పేరేమిటి?"

"మహాత్మాగాంధికి ఇందిరాగాంధి ఏమవుతుంది?"

"ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని జిల్లాలున్నాయ్?"

"గేదె కట్టిన తరువాత ఎన్నాళ్లకు ఈనుతుంది?"

"గుడ్లు పిల్లలు కావడానికి కోడిపెట్ట ఎన్నాళ్లు పొదుగుతుంది?"

"గాడిద గుడ్లు పెడుతుందా? పిల్లల్ని పెడుతుందా?"

మంత్రి వెంటనే —

"గుడ్లు పెడుతుంది" అన్నాడు

వెంటనే భేతాళుడు తుర్రుమని ఎగిరిపోయి మోదుగుచెట్టుమీద వాలాడు

మంత్రి గుండె జారిపోయింది కాళ్లీడ్చుకుంటూ సన్యాసి వద్దకు నడిచి వెళ్లాడు

"పడిన శ్రమ అంతా వృథా అయింది స్వామీ" అన్నాడు

"ఏం? ఏం జరిగింద"ని అడిగాడు సన్యాసి ఆదుర్దాగా!

"భేతాళుడు నన్ను మాట్లాడించాలని ఎంతో ప్రయత్నించాడు!

ఎన్నో కఠినమైన ప్రశ్నలు వేశాడు నా అదృష్టంకొద్దీ వాటికి జవాబులు నాకు తెలియలేదు అందుకని హాయిగా—నోరు మూసుకుని — నడుస్తూ వస్తున్నాను ఆఖరికి—నా దురదృష్టంకొద్దీ — ఒక ప్రశ్న వేశాడు

"గాడిద గుడ్డు పెడుతుందా? పిల్లల్ని పెడుతుందా? అని అడిగాడు! గుడ్లు పెడుతుందని చెప్పేశాను"

సన్యాసి విసుగ్గా —

"అబ్బా! జవాబు తెలియనప్పుడు ఆ ప్రశ్నకిగూడ నోరు మూసుకుని వూరుకోక పోయావా?" అన్నాడు!

"తెలియకపోతే వూరుకోవచ్చు! కాని — జవాబు తెలిసి — చెప్పకపోతే — తల పగిలి ఛస్తానే!?" దీనంగా అన్నాడు మంత్రి!

సన్యాసి కోపం దిగమింగుతూ —

"అంటే — ఆ ప్రశ్నకి నీకు జవాబు తెలుసా?" అని తీవ్రంగా అడిగాడు!

"తెలియకేం స్వామీ! "గాడిదగుడ్డు" సంగతి తెలియని తెలుగువాడున్నాడా? ఆంధ్రదేశంలో గాడిదలేని వూరుందా? గుడ్డుపెట్టని గాడిద వుందా?" మందహాసంతో అన్నాడు మంత్రి!

"నా కర్మ!" అని నొసలు బాదుకున్నాడు సన్యాసి!

"మీ ఒక్కడి కర్మేగాదు! తెలుగువాళ్లందరి కర్మ" అని సవరించాడు మంత్రి! ●

## తొలి అడుగు

### డా॥ సి. నారాయణరెడ్డి

ఈ ఓటమి తుది విజయానికి తొలి అడుగు
ఈ ఓరిమి నవక్రాంతికి తొలి తొడుగు
ఎటు తోచక తనలోతానే గొణుగుకునే
ఈ ఊపిరి రేపటి ఝంఝంకు తొలిమడుగు

ఆ మబ్బు సంతకం ఉన్నది చినుకుల్లో
ఈ మాను సంతకం ఉన్నది చిగురుల్లో
ఏ దస్తావేజులను చూసి ఏం లాభం?
నా మనసు సంతకం ఉన్నది కవితల్లో

ఒక కంటికి ఇష్టం ఒక కంటికి కష్టం
ఈ విషమదృష్టి ముదిరితె ఒంటికి నష్టం
ఎన్నాళ్ళు గోళ్లు గిల్లుకుంటె యేముంది?
ఈ సమస్య చల్లారని రావణకాష్ఠం

# మన నవలా రచయిత్రులు

## కొలను వెంకట దుర్గాప్రసాద్

ఇరవైయేళ్ల క్రితం నవల రాయటం అంటే బ్రహ్మవిద్య ఇప్పుడు టైం ఉండాలేగానీ, అందరూ 'నవల' రాయగల సమర్థులే అని పిస్తుంది — పేరు తెచ్చుకోవటం తర్వాత సంగతి ఆ రోజుల్లో గొప్పవని తరుచూ వినిపించే నవలల పేర్లు — విశ్వనాథ 'ఏకవీర', చలం 'మైదానం' బుచ్చిబాబు 'చివరకు మిగిలేది', అడవిబాపిరాజు 'నారాయణరావు', గోపిచంద్ 'మెరుపుల మరకలు' రాచకొండ విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి' లత 'మోహనవంశి' వీరంతా రాయగలిగిన సమర్థత గలిగిన వారు కాదనే ప్రశ్న ఎప్పుడూలేదు ఇప్పుడా ప్రశ్న కొందర్ని వేస్తున్నారు

తర్వాత కాలంలో ప్రముఖ వారపత్రికలు నవల పోటీలు ప్రారంభించాయి దానితో నవలలకు ఒక వూపు వచ్చిందని చెప్పాలి వారపత్రికల్లో నవలలు ధారావాహికంగా రావటం మొదలు పెట్టాక స్త్రీ పాఠకుల సంఖ్య ఎక్కువయింది మధ్య తరగతి కుటుంబాల్లోగానీ, కాస్త దిగువ తరగతి కుటుంబాల్లోగానీ, స్త్రీ చదువుకుగల ప్రాముఖ్యతను బాగా గుర్తిస్తున్న రోజులవి ఆ విధంగా కనీసం హైస్కూలు చదువు పూర్తి చేసిన వారు ఎక్కువ మంది అవటంతో, వార, మాస పత్రికలకు మంచి ఆదరణ లభించటం మొదలయ్యింది

నవల అంటే ఏమిటి ? అది ఏ లక్షణాలు సంతరించుకొని వుండాలి ? నాయకుని లక్షణాలు ఎలావుండాలి ? నాయికి లక్షణాలు ఎలావుండాలి. ఇత్యాది ప్రామాణికాలు పక్కనపెట్టేసి రాస్తున్నారు అనే వాళ్ళు ఇప్పుడు ఎక్కువ మందిలేరు ఏది ప్రమాణం ? జనం మెచ్చిందే గొప్పది, అంటున్నారు ఇది మంచి నవల (అంటే బాగుంది) ఇది చెత్త నవల అన్న రెండు విషయాలు మాత్రం నేటి పాఠకులకు బాగాతెలుసు 'గొప్పది' అని చెప్పటానికి ధైర్యం కావాలి ఎందుకంటే, 'గొప్పదికాదని' వాదించేవాళ్ళూ ఎక్కువగానే వుంటున్నారు.

ఆడవాళ్ళు రాసేవి కాలక్షేపం కోసం, మొగవాళ్ళు రాసేవి గొప్ప నవలలు అనే అపవాదు వున్నది ఎంతమంది రచయితలు కాలక్షేపానికి మాత్రం పనికివచ్చేట్టుగా రాయటంలేదూ ? అట్లాగే మంచి నవలలు రాస్తున్న రచయిత్రులూ వున్నారు ఒక్క విషయం చెప్పాలి రచయిత్రులకు పరిశీలనాపరిధి తక్కువ అందువల్ల వాళ్ళు 'గొప్ప' నవలలు రాయలేకపోతూ వుండవచ్చు అంతమాత్రంచేత వారికి రాయగల శక్తి లేదనుకోటం మంచిదికాదు వారికున్న పరిధిలోనే — నేటి యువతీ యువకుల నైతిక సమస్యలు, వరకట్నాలు, కుటుంబ కలహాలు గల కథా వస్తువుతో, మంచి శిల్పంతో, వ్రాసినవారున్నారు ధనికులు రాక్షసులనీ, పేదలు బలిపశువులనీ చెప్పే కథావస్తువును రచయిత్రులు ఎక్కువమంది తీసుకోవటంలేదు అట్లా రాస్తేనే సాంఘిక ప్రయోజనం గల నవలా ? అని ప్రశ్నించే ఆడవాళ్ళు చాలామంది వున్నారు

ఏదిఏమైనా స్త్రీ పాఠకులే ఎక్కువగా నేటి పత్రికల్ని ఆదరిస్తున్నారని చెప్పటం అతిశయోక్తికాదు మగవాళ్ళు కథలు, నవలలు అంత ఎక్కువగా చదవరు ఇంటర్ దాటగానే ఇంగ్లీషు పుస్తకాలు పుచ్చుకు తిరగటం వారికి అలవాటవుతోంది తక్కువ చదివిన వారికి డిటెక్టివ్ పుస్తకాలు, సంచలన పత్రికలున్నాయి అందువల్లనే పత్రికలన్నీ ఆడవారి అభిరుచుల మేరకు నడుస్తున్నాయి నవలల సంఖ్య విపరీతంగా పెరగటానికి అంటే నగటున రెండ్రోజులకొకటి — ఆడవారిని అభినందించాలి దినపత్రికల్లో కూడా ధారాహిక నవలలు చోటు చేసుకోవటం స్త్రీ పాఠకులను ఆకర్షించటానికే వారు గొప్పగా ఏమీ కోరరు వారికి కావల్సింది ఒక్కటే — నవలంటే కేవలం చదివించ గలగటం.

ఈ తరం వారిని ఎక్కువగా ఆకట్టుకున్న రచయిత్రులు ఎవరు అని చెప్పాల్సి వస్తే — యద్దనపూడి సులోచనారాణి (సెక్రటరీ, జీవన తరంగాలు, మీనా) రంగనాయకమ్మ (కృష్ణవేణి, బలిపీఠం, పేకమేడలు) అరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవి (చక్రభ్రమణం, ప్రేమనగర్, శాంతినికేతన్) వాసిరెడ్డి సీతాదేవి (మట్టి మనిషి) ద్వివేదుల విశాలాక్షి (వైకుంఠపాళి) కావిలిపాటి విజయలక్ష్మి (విధి విన్యాసాలు, చక్రపాణి) డి. కామేశ్వరి (అరుణ) ఐ వి ఎస్ అచ్యుతవల్లి (ఇదెక్కడి న్యాయం) హజరా (తార) ఆర్. సంధ్యాదేవి (జీవన తార) యలమంచిలి ఝాన్సీలక్ష్మి (మనుషులు మమతలు, వెలుగునీడలు) అరవింద (అవతలిగట్టు, జలసూర్య) కోమలాదేవి (ఉన్నత శిఖరాలు) కె రామలక్ష్మి (ఆడది) డా॥ సి ఆనందారామం (ఇంద్రసింహాసనం), శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, శ్రీమతి గోవిందరాజు సీతాదేవి, చిట్టారెడ్డి సూర్యకుమారి గార్లని పేర్కొనాలి. మాలతీ చందూర్ మంచి అనువాద రచయిత్రిగా పేరు తెచ్చుకున్నారు

ఇటీవల స్వర్గస్తురాలయిన మాదిరెడ్డి సులోచన సుమారు డెబ్బయినవలలు రాసారు పాఠకుల్లో ఆమె ప్రత్యేకస్థానాన్ని సంపాదించారు.

పైన చెప్పినవారిలో కొందరు ఒకప్పుడు ఎక్కువగా పెద్ద కథలు రాసినవారే ఇప్పుడు వారు కథలు రాయటం తగ్గించేశారు కథనే నవలగా రాసేస్తున్నారు అంటారు చాలామంది.

ప్రచురింపబడుతోన్న నవలల గురించి పాఠకులు పనిగట్టుకుని వాటి బాగోగుల గురించి పత్రికలవాళ్లకు రాస్తే, రచయిత్రులకు (పోనీ రచయితలకు) ఉపయోగకరంగా వుంటుంది ●

### ఓ కంపోసిటర్ మహాశయా !

వ్రాయు డెందుకు కవిరాజుగా డొక్కడూ  
వానికొరకు ప్రెస్సునాని కొరకు  
అతను రచనమూచు ఆద్యంత మంత్యాది  
వాడులేక చదువు వాడెలేడు.

"వాణిమెలగు నేరి పాణి చలువకోరి ?"  
"అక్కరాలు ఎవని ఆటరాలు ?"  
"రాక్షసాల కెవడు రామభద్రుడుగాడు?"  
అతడు అవును అన్ని — అవడు ఎవడు

అతడు యొవ డటంచు అర్ధాగ్నిగోళాలు  
వలదులెండి రూక్ష వదులుకోండి  
మనకు వాడుగాక మరియొక డుండునా?  
వాడె లెండి ప్రథమ పాఠకుండు

ఎవడు నా గ్గలట్టి ఏకైక పతియితా  
వాడెలెండి ప్రెస్సు వాడెనుండి,  
కనుక వాడు మటుకు ఖచ్చితమ్ముగ జాచు  
చెత్తకాని రచన కొత్తకాని

ఆ మృదూకృతాత్మ ఆత్మ సంతృప్తియే  
వాదు కవిత కింక నాందికాగ,  
వ్రాయుచుంటి లక్ష్య లక్షణస్ఫూర్తికి  
ఆట విడుపు లాంటి ఆటవెంది.

ఆద్యంత రహితా !

చదువుకో గదోయి చంద్రార్క శాశ్వతం  
ప్రెస్సు వద్ద టైపు పేర్చువాడ !

ఆంధ్రపత్రిక—సచిత్ర వారపత్రిక  
1951 జనవరి 3 సంచిక నుంచి



# భవదీయుడు - బంతిపూలు

సింగరాజు రామచంద్రమూర్తి

ఈ కథలో 'భవదీయుడు' నేను కాదండి మా చలపతి నేనల్లా కథను మీకందించే 'మీడియం'ను మాత్రమే

*  *  *

భయపడ్డ వాడి ముఖంలా చీకటి తెల్ల బోతూంది. దానికి పట్టినగతే తనకూ పదుతుం దన్న వంకతో పొగమంచు చెదిరిపోతోంది

దూరంనుంచి హరిదాసు భజనలు లీలగా వినబడుతున్నాయి తెల్లవారుతోంది — మాకు నీళ్ళు పట్టరే? అని ఆవుదూడలు 'అంభా' అని గొంతు చించుకుంటున్నాయి

నోట్లో పుల్లలు పెట్టుకుని నేనూ, మా బావమరది ఊరిబయటికి బయలుదేరాం చలపతి నాకు అసలు బావమరిది కాదు — మా వసంతకు పినతండ్రి కొడుకు.

ఇద్దరు జమా జెట్టీల్లాంటి మగాళ్ళు రోడ్డునపడి వస్తుంటే ఇళ్ళముందు పేడ నీళ్ళు చల్లి ముగ్గులు పెడుతున్న ఆడంగులు గబుక్కున ఇళ్ళలోకి దూరిపోతున్నారు

చిన్న తనంనుంచి బస్తీల్లో పెరిగిన నాకు ఈ పల్లె వాతావరణం కొత్త అవటంవలన మమ్మల్ని చూడంగానే పని వదిలి పారిపోతున్న ఆడవాళ్ళను చూసి తప్పుచేసినట్టు అనిపించింది

కాని అంతలోనే అలా లోపలికి వెళ్ళినవాళ్ళు తలుపుచాటునుంచి బయటికి తొంగి చూస్తుంటే నవ్వొచ్చింది

పెదనాయుడు ఇంటిముందు వాళ్ళ అమ్మాయి గొబ్బెళ్ళు పెడుతూ — మేం రావటం కూడా గమనించలేదు కాబోలు - పారిపోకుండా తన పనిలోనే నిమగ్నురాలై ఉంది.

నే నెరిగినంతవరకు మా ఇంట్లో గొబ్బెళ్ళు పెట్టటం అలవాటులేదు మా అక్కయ్య లంతా నవనాగరికులవటంవలన వాళ్ళకు పేడ ముట్టటం నామోషీ!

మా అమ్మకుమట్టుకు ఇటువంటివి చాలా సరదా! వాళ్ళ ద్వారా తన సరదాలు తీర్చు కునేందుకు ప్రయత్నించి విఫలురాలై — ఇంటి ప్రక్కనున్న ఆడపిల్లల్ని పిలిచి ముగ్గులు వేయించి గొబ్బెళ్ళు పెట్టించేది.

నాకూ కొంత ఆవిడపోలిక [illegible]చ్చింది అభిరుచుల్లో!

బంతిపూల రథంలా ఉన్న నాయుడు కూతురు కూర్చుని గొబ్బెళ్ళమీద బంతిపూలు గుచ్చుతుంటే ఆ అమ్మాయి కుచ్చులజడ ముందుకుపడి నేలమీద నాట్యం చేస్తోంది. వరికి * చుట్టూ రత్న కంబళంలా పరుచుకుంది

ఆ దృశ్యానికి సహజ సౌందర్యానికి ముగ్ధుడి నయిపోయాను.

"చూడవోయ్ బావా, ముద్దబంతి పూవు లాంటి ఆడపిల్లలు ముగ్గులు వేస్తుంటే హరి దాసుల హరినామస్మరణ వినబడుతుంటే— చేతి నిండా ధాన్యం, ఇంటినిండా బంధువులూ ఉండే

ఆంధ్ర పచిత్ర వారపత్రిక
1960 జూలై 20 సంచిక నుంచి

పల్లెటూరి సంక్రాంతికన్న ఆనందమయిందేముంటుంది ?'' అన్నాను ఆవేశంతో

అని అతనివంక చూసి తెల్లబోయాను

అంతవరకు హుషారుగా ఉన్న మనిషి అంతలో గంభీరంగా అయిపోయాడు నోట్లో పుల్ల కదలికను బట్టి పెదిమలు అదురుతున్నాయని తోచింది

నా మాట విని ఛెంగున లేడిపిల్లలా ఇంట్లోకి పారిపోయిందా అమ్మాయి

''ఏమిటి చలపతీ, క్షణంలో అలాగయిపోయావు ??'' అనడిగాను— నేనన్న మాటల్లో తప్పు ఏమయినా ఉందా అని మధనపడుతూ

అతను కాసేపాగి ''అబ్బె, ఏంలేదులెండి'' అంటూ గబగబ అడుగులు వేశాడు

మధ్యాహ్నం భోజనాలు అయాయి.

వెల్‌కార్నెజీ అంటాడు— ఎవరి దృష్టిలో నయినా నువు ''కలుపుగోలు'' అనిపించుకోవాలంటే— వాళ్ళకు నచ్చిన విషయం మీద మాట్లాడమని

ఓనమాలు రాకపోయినా పొలం విషయాల మీద అనర్గళంగా అరగంటసేపు మామగారితో మాట్లాడేశాను ఇక ఆయన నన్ను వదిలే లక్షణాలు కనబడలేదు ! పైగా గదిలోంచి గాజులు గలగల్లాడటంతో నిద్ర ముంచుకొచ్చినట్టు ఆవులించాను

సంగతి పసిగట్టి మీసాల వెనుక నవ్వుకుని పొన్నుకర్ర కిర్రు చెప్పులతో వీధినపడ్డారాయన.

బ్రతుకు జీవుడా అని గదిలోకి దూరాను

''ఊడ్పటం— అంటే అర్థమయిందా ?'' అడిగింది వసంత నవ్వు దాచుకుంటూ.

''ఓస్, మరీ అంత వెధవకింద కట్టేయకు— ఊడ్పటం అంటే కూడా తెలియదనుకుంటోంది హూఁ! చేలకు నీళ్ళు పట్టేముందు గడ్డిగాదా ఊడ్చి మరీ పడతారు'' విగమర్చి చెప్పాను

## భవదీయుడు.......

కిలకిలా, గలగలా నవ్వింది వసంత.

''నవ్వుతావెందుకు ?''

''అబ్బ, ఊడపటం అంటే మొక్కలు నాటడమండీ బాబూ'' అని మళ్ళీ నవ్వింది

వసంత తలలో బంతిపూలు కనిపించడంతో నాకు పొద్దుటి ఉదంతం జ్ఞప్తికి వచ్చింది

''అది సరేగాని వసంతా, మీ చలపతి ''బంతిపూలు'' అనగానే అలా ముడుచుకుపోయాడే ?'' అనడిగాను

నవ్వుతున్నదల్లా రక్కున ఆగిపోయింది

కొంపదీసి ఈ ఊరివాళ్లకు, బంతిపూలుకు జన్మవైరం లేదు కదా !

''వాడినే అడక్కపోయారా ? ''

''అడిగా, కాని చెప్పలేదు'' అన్నాను

వసంత ఒకసారి నిట్టూర్చి ''పాపం వాడి జీవితమే మార్చేసింది'' అంది

ఆశ్చర్యబోయాను— ''ఏమిటీ ! బంతి పువ్వా ? ''

''కాదు సావిత్రి'' అంది వసంత

కథ మంచి పాకాన పడుతోంది అనిపించింది !

''పిన్నీ, పిన్నీ— శాంతినివాసం మావయ్య వచ్చాడు'' అంటూ వార్త మోసుకొచ్చింది మా వదినగారి కూతురు

''శాంతి నివాసం మావయ్య ఎవరూ ? ''

''వాడే, చలపతి మిలిటరీలోకి వెళ్ళాడుగా'' అని చటుక్కున మంచంమీంచి దిగి కుర్చీలో కూర్చుంది వసంత

నేకూడా సర్దుకుని ''రండి బావగారూ— మీ విషయమే చెబుతున్నాను, కూర్చోండి'' అంటూ ఆహ్వానించాను

మనిషిలో పొద్దుటి మేఘాలు చెదిరిపోయి తేటగా ఉన్నాడు

''పొద్దున్నటి విషయమా ?'' అన్నాడు తేలిగ్గా

''మరే !'' అని వసంత వంక చూశాను

తల వంచుకుంది !

కాసేపు నిశ్శబ్దత ఆవరించుకుంది ఆమాట ఎందుకెత్తానా అనిపించింది నాకు

''అలా మామిడితోటలోకి వెడదాం రండి'' అన్నాడు

ఆర్నెల్ల తరువాత అత్తారింటికి వచ్చిన మానవుడ్ని కాని బంతిపూల మిస్టరీ విడిపోతుందన్న ఆశతో వసంతవైపు చూడకుండా బయలుదేరాను

మామిడి చెట్టు నీడలో కూర్చున్నాం

కాసేపాగి అతనే మొదలుపెట్టాడు

''అసలు సంతానం లేనివాళ్ళకు పిల్లలు లేరే అన్న దిగులు ఆడపిల్లలున్న వారికి వంశోద్ధారకుడు కావాలి పుట్టరాని మగపిల్లడు ఉన్నవారికి ఆడపిల్లలు కావాలి మానవులదంతా విచిత్రం

మా అమ్మకు నేను ఒక్కడినే సంతానం— బతికి ఉన్నది అసలు ఆడపిల్లలు పుట్టకపోతే బాధపడేది కాదేమో కాని— పుట్టి చనిపోవటంతో మా అమ్మకు ఈ లోకం నిండా మగాళ్లే అన్న భావం కలిగింది

మా ఇంటినిండా రకరకాల పూలమొక్కలు చుట్టుపక్కల ఆడపిల్లలను ఆకర్షించేందుకు— వేసి పెంచింది మా అమ్మ వాటి కోసం నిత్యం మా అమ్మచుట్టూ తిరిగేవారు ఆడపిల్లలు— అందులో ముఖ్యురాలు సావిత్రి

సావిత్రి నాన్న నాకు వరసకు మావయ్య అవుతాడు. ''వరసకు'' అన్న మాటేగాని వారికి మాకు చాలా సాన్నిహిత్యం ఉంది.

సావిత్రి పుట్టినప్పటినుంచీ నా భార్యగానే

చలామణి అయింది మా ఊళ్లో

సెలవులకు ఇంటికొచ్చాను వరండాలో కూర్చుని 'మాప్' నవల చదువుకుంటే మా గేటు విసురుగా తీసి అలవాటు ప్రకారం సావిత్రి వచ్చింది రాగానే నన్ను వరండాలోచూసి అంతలో సిగ్గుపడి వెనక్కు తిరగబోయి నాదృష్టి పుస్తకం వైపు ఉండటం చూసి సర్దుకుని బంతిపూలు కోసి పమిట చెంగులో పోసుకుంటోంది

ఆ రంగుల ముద్దబంతిపూవుల మధ్య వన లక్ష్మిలా, తనే ఒక ముద్ద బంతిపూవులా ఉన్న సావిత్రిని చూసి ముగ్ధుడినయిపోతున్నాను

ఇంతలో "ఒరేయ్ చలపతీ, పట్టుకోరా దాన్ని రోజూ బంతిపూలన్నీ తనే కోసుకు పోతోంది" అంది మా అమ్మ లోపలనుంచి

అంతకన్నా నాకేం కావాలి?

మాట వినడమే తడవుగా అరుగుమీంచి ఒక్క దూకు దూకాను

ఆమాట, నేను దూకటం—అన్నీ గమనించి లేడిలా, గజ్జల గుర్రంలా ఛంగున పరుగెత్త పోబోయింది సావిత్రి కాని గేటులో ఓణీ కొస ఇరుక్కుపోవటంతో ఒక్కక్షణం ఆలస్యమయింది

ఇంతలో నేను గాలిలో అందుబాటుగా ఉన్న జడపుచ్చుకుని ఒక్కసారి వెనక్కు లాగటంతో గిరుక్కున తిరిగి, నిలదొక్కుకోలేక — నామీద వాలిపోయింది పమిట చెరుగులోని బంతిపూలు నా కాళ్ళ చుట్టూ కుప్పలా పడ్డాయి!

సావిత్రి కళ్ళల్లో సిగ్గు, బాధ, ఆనందం చదువుకున్న నేను చటుక్కున ఆమె జడ వదిలి పూలు ఏరదామని వంగబోయాను

కాని అదే సమయాన సావిత్రి కూడా వంగ టంతో ఇద్దరి తలలు ఢీడిక్కి కొట్టుకున్నాయి

"ఇద్దరూ అలా గేటుకు దణ్ణాలు పెడతా రెందుకురా — ఇటొచ్చి నా కాళ్ళకు పెట్టండి" అంది వరండాలో నిలబడి ఈ తంతు చూస్తున్న అమ్మ నవ్వుతూ

అంతలో ఒళ్ళంతా సిగ్గుపడి పోయింది సావిత్రికి "పో అత్తయ్యా" అని నా కాళ్ళ ముందు వంగి పూలు ఏరుకుంది

అంత మధురమయిన జీవిత మది?

బస్తీల్లో ఎవరయినా ఎదురయితే—"ఎప్పు డొచ్చావు, కులాసా, మళ్లీ కనబడతావుకదూ!" లతో సమావేశం ముగుస్తుంది

తరువాత వీరు వారింటికి పోకపోయినా మునిగిపోయిందేమీ ఉండదు

కాని పల్లెటూళ్ల విషయంవేరు పొద్దున్న ఊళ్ళోకి వచ్చిన మనిషి సాయంత్రందాకా కనబడ లేదంటే వాళ్ళు గిలగిల్లాడిపోతారు వారివి అటు వంటి మనస్సులు బస్తీల కృత్రిమత్వం అటువైపు ఇంకా పాకలేదు

మావాళ్ళందరిఇళ్లల్లో శక్తికొద్దీ కాఫీయో,

## భవదీయుడు......

ఫలహారమో తిని తరువాత ఒకరోజు భోజనానికి తప్పకుండా వస్తానని వాగ్దానాలు చేసుకుంటూ చివరికి మావయ్యగారింటికి వెళ్ళాను

తాపీగా కూర్చుని సావిత్రిని ఏడిపించి ఆనం దించవచ్చుని ఆఖరికి చేరుకున్నాను వాళ్ల ఇల్లు!

"అత్తయ్యా" అంటూ కేకేశాను

అందుకు సమాధానం వంటింట్లోంచి వచ్చింది—"ఎవరూ?" అని

"నే నత్తయ్యా, చలపతిని"

"కూర్చో బాబూ, లోపలికి రాకు — మడి కట్టుకున్నాను అదిసరేగాని ఊళ్లోకి నిన్ననగా వచ్చి ఇప్పుడా మా ఇంటికి రావటం?" అంది

"భలేదానివే, నిన్న అర్థరాత్రికదా నేను వచ్చింది మధ్యాహ్నందాకా నిద్రపోయాను" అంటూ ఇల్లంతా కలయచూశాను

సావిత్రి జాడ కనబడలేదు చాలా నిరు త్సాహం కలిగింది,

"ఇంట్లో ఎవరూ లేనట్టుందే?" అన్నాను అక్కడికీ

అంతకన్న ఏమనను?

వెంటనే అర్థం చేసుకున్నట్టుంది "ఆ సావిత్రి మాటేనా? దాని విషయం చెప్పబోకు కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందిట!"

"ఏం ఏమయింది?" అన్నాను ఆదుర్దాగా

"ఆ ఎప్పుడూ స్నేహితులూ, ఆటలు, సినిమాలు! ఇంటిపట్టున ఒక్కక్షణం ఉండదు కదా!"

"ఒస్, ఇంతేనా — ఈ వయస్సులో అలాగే ఉండాలిలెద్దూ" అన్నా తేలిగ్గా నవ్వేసి

"నువ్వూ ఆమాటే అన్నావూ? అందుకే నేను మరీ అలుసయిపోయాను వయసొచ్చిన ఆడ పిల్లలు మా రోజుల్లో ఇల్లు కదిలేవాళ్లా?" అంది

ఆవిడతో పేచీ పెట్టుకోటానికి రాలేదు నేను సావిత్రి దర్శనం కోసం వస్తే అది కాస్త దుర్లభ్యం అయింది

"మరే, తప్పే!" అన్నాను విసుగ్గా

"వంట రాదుకదా! కూరతరగవే మా తల్లి అంటే మూతి మూడుసార్లు విరిచి మరీ వస్తుంది మరుక్షణంలో కెవ్వున అరుస్తుంది ఒకటి రెండు వేళ్లు తెగి ఉంటాయి ఇలా అయితే ఎలా?"

"మరే, ఎలా?" లేచి నిలబడ్డాను ఇక వెడదామని,

"ఎప్పుడొచ్చావ్, అప్పుడే లేచి నిలబడ్డావు? కూర్చో — అమ్మాయి కాఫీ అయినా ఇచ్చిందా?" అని వెనకనుంచి వినబడ్డాయి మాటలు ఉలిక్కి పడి వెనక్కు తిరిగాను

(ఇంకా వుంది)

# దేశంలోని ప్రతి ఒక్క రాష్ట్ర చేనేత వస్త్రాలకు నిలయం

| స్త్రీలకు | పురుషులకు | గృహముకు |
|---|---|---|
| సిల్కు చీరలు, బనారస్, పోచంపల్లి, ధర్మవరం, కంజీవరం, కాష్మీరు, బెంగుళూరు, ముర్షిదాబాద్, కాటన్ చీరలు; బనారస్, బెంగాల్, గద్వాల్, వెంకటగిరి, పోచంపల్లి, కోయంబత్తూరు, మహారాష్ట్ర సిల్కు కాటన్ రెడిమేడ్ కుర్తాలు, కఫ్తాన్స్, చురిదార్, సూట్స్, మెక్సీ మరియు మిడిస్. | షర్టింగు, సూటింగ్, సిల్కు కాటన్, పాలియస్టర్, సిల్కు మరియు రెడిమేడ్స్, షర్టులు, కుర్తాలు, పైజమా సూట్స్, డ్రెసింగ్ గౌన్సు, ధోవతులు, లుంగీలు, టై మరియు బౌసు, హేండ్ కర్చీపలు | ఫర్నిషింగ్స్, దుప్పట్లు, గలీబులు, తువ్వాళ్లు, వాల్ హేంగింగ్స్, లాంప్ షేడ్స్, ఉన్ని తివాచీలు, (బదోయి నుంచి) టేబుల్ మేట్స్, టేబుల్ నేపకిన్స్, టెలిఫోన్ మేట్స్, టైపురైటర్ మేట్స్, ఆసన్స్ |






## హేండ్‌లూం హౌస్

(ఎర్ కండీషన్డ్ షోరూము)

మాచాని సోమప్ప భవనం, గాంధీ భవనం ప్రక్కన, నాంపల్లి, హైద్రాబాద్. ఫోను : 50252

ఉదయం 10 నుంచి రాత్రి 8 గం. వరకు ఆదివారము శలవు.

మా కాతాదారులకు, అభిమానులకు శ్రేయోభిలాషులకు.
శుభాకాంక్షలు

# శ్రీ గోపాల్ ఆటో సర్వీస్

వల్లభాయి స్ట్రీట్, కాకినాడ - 533 001

గ్రామ్స్: "GOPAUTO"  ఫోన్స్: 3231 (3 లైన్లు)

: బ్రాంచీలు :

హార్బర్ అప్రోచ్ రోడ్, విశాఖపట్నం–530 016 ★ న్యూ కాలనీ, మెయిన్‌రోడ్, విశాఖపట్నం–530 016

**ఉత్పత్తిదారులు :**

ఆటోమోబైల్ బ్రాండ్ మెటల్ బుష్‌లు

**డిస్ట్రిబ్యూటర్సు :**

మహీంద్ర&మహీంద్ర లిమిటెడ్–ఇంటర్‌నేషనల్ B 275, 444, 500 మోడల్ ట్రాక్టర్లు
A. P. I. లాంబి–150 & Mac 175 S స్కూటర్లు, డీసెల్ త్రీ వీలర్స్

**డీలర్సు :**

బజాజ్ టెంపో–మెటడోర్ & డీసెల్ టెంపో వెహికల్స్
కెనెటిక్ ఇంజనీరింగ్ లిమిటెడ్–లూనా–TFR మోపెడ్స్

**స్టాకిస్టులు :**

"ఎడివన్స్ పెయింట్స్, సిమెంట్ & ఎనామెల్

**స్పేర్ పార్ట్సు :**

బెంజ్ & లేలాండ్ వెహికల్స్

**వర్క్‌షాపు :**

అన్ని రకముల డీసెల్ మోటారు వాహనములు రిపేర్లు చేయబడును.






పూజ గదిమంచి బయట కొచ్చిన కృష్ణమూర్తి — నుదుట విభూతి రేఖల్లో, వంటిమీద పట్టు వస్త్రాలతో ధగధగా మెరిసి పోతున్నాడు. గదిమంచి బయటకు రాగానే అతను మొట్టమొదట — తన కొత్త సెక్రటరీ వెంకుబాబుని ఆ హాల్లో చూసేడు

వెంకుబాబు చేతిలో ఫైలుంది. అతను కూచున్న సోఫామీదినుంచి లేచి వినయంగా నిలబడ్డాడు.

పూజనుంచి లేవంగానే ఈ వెంకుబాబుని చూడవలసి వచ్చినందుకు మనసులో బాధపడ్డాడు కృష్ణమూర్తి. కానీ, ఆ బాధని వ్యక్తం కానీకుండా, తల వంకిస్తో, దైవ నామస్మరణ చేసుకుంటూనే తన గదిలోకి వెళ్లిపోయేడు

ఆ గది గోడమీద కృష్ణమూర్తి కీ॥ శే॥ తల్లిదండ్రుల ఫొటోలున్నాయి. కృష్ణమూర్తి ఆ ఫొటోల ఎదుట నిలబడి వినయంగా తల వంచేడు. చేతులు రెండూ జోడించేడు కళ్ళు మూసుకున్నాడు. ఆ మూయబడిన కళ్లల్లో తల్లితండ్రులు స్పష్టంగా కనుపించి, తనని దీవించే భంగిమలో నిలబడేంతవరకూ అతను అలాగే వున్నాడు.

మూడు నిమిషాలకుగాని ఆతనికోరిక తీరింది కాదు. తృప్తిగా కళువిప్పి మళ్లా ఆ ఫోటోలకు చేతులు జోడించి, ఆ తర్వాత భార్యా పిల్లల దగ్గిరికి వెళ్లేడు.

అన్నపూర్ణ చేతిలో హారతి పళ్లెముంది ఆవిడ పూర్ణగర్భిణి కావటాన నిండుగా వుండి, అందంగానూ వుంది ఆవిడ కట్టుకున్న ఖరీదైన జరీ అంచు పట్టుచీర, దానికి సరితూగే రవికతో ఎంతో హుందాగానూ వుంది

హారతి కళ్ళకద్దుకున్నాడు కృష్ణమూర్తి అతని నుదుట కుంకుమ దిద్దింది అన్నపూర్ణ అప్పైన పళ్లెంలో వుంచిన ప్రసాదాన్ని కృష్ణమూర్తి చేతుల్లో వుంచింది కళ్లకద్దుకుని ప్రసాదం పుచ్చుకున్నాడు కృష్ణమూర్తి

పెదబాబూ, చినబాబూ, బుజ్జీ తలో స్వీటూ తండ్రికి అందించేరు. వాళ్ల ముగ్గుర్నీ ఆప్యాయంగా దగ్గిరికి తీసుకుని, వాళ్లందించిన స్వీట్సు తిన్నాడతను. ఆ పైన ఆ ముగ్గురి బుగ్గల్నీ నిమిరి ముద్దాడేడు చివరివంతుగా భార్యవేపు తిరిగి కళ్లతో తన కోరికను తెలీజేసేడు అన్నపూర్ణ కళ్లు ఆనందంతో మెరిసేయి. భర్త కోరికను గమనించి, సిగ్గుపడి, అక్కడ్నుంచి గబుక్కున వెళ్లిపోయింది

కృష్ణమూర్తి దుస్తులు మార్చుకున్నాడు బుజ్జీని ఎత్తుకుని హాల్లోకి వచ్చేడు హాల్లో వెంకుబాబు యింకా నిలబడే వున్నాడు. కొడుకు నెత్తుకుని వస్తూన్న కృష్ణమూర్తిని ఆనందంగా చూస్తూ, తృప్తిగా అన్నాడు వెంకుబాబు

'మెనీహేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే సర్ !'

'థేంక్యూ కూచోండి !' అన్నాడు కృష్ణమూర్తి కూచుంటూ

వెంకుబాబు కృష్ణమూర్తి ఎదట సోఫాలో వొద్దికగా కూచున్నారు కృష్ణమూర్తి సంతకాలు చేయవలసిన చెక్కుల్ని ఫైలోంచి తీసి టీపాయ్‌మీద వుంచేడు.

బుజ్జీని గుండెలకు హత్తుకుంటో అన్నాడు కృష్ణమూర్తి.

'వారం రోజుల్నుంచీ రెస్ట్ లేకుండా తిరుగుతున్నాను టూ మెనీ ఫ్లైట్స్ ! ఇవేళ బొంబాయిలో వుండాల్సింది ముఖర్జీ ఎంత ప్రాధేయపడుతున్నా అతన్ని కాదని ఒప్పించి వచ్చేసేను ఎందుకో తెలుసాండీ !— నా భార్యా పిల్లల మధ్య చేసుకోబోయే ఈ పుట్టింరోజు పండగ— బొంబాయిలో నా 'స్టే' కంటే చాలా ముఖ్యమని నా ఉద్దేశం అదే ముఖర్జీతో కూడా అన్నాను సెంటిమెంట్సంటాడు ముఖర్జీ ! (కృష్ణమూర్తి చిరునవ్వు నవ్వేడు బుజ్జీని ప్రేమగా ముద్దు పెట్టుకున్నాడు రెండేళ్ల బుజ్జీ తండ్రిని తిరిగి ముద్దు పెట్టుకున్నాడు ) సీ దిస్ స్వీట్ కిస్ ! హౌ కాస్ట్లీ ఇటీజ్ ! ఇవేం తెలీవు ముఖర్జీకి చెప్పినా అర్థం చేసుకోలేదు. పూర్ ఫెలో ! సో మిస్టర్ బాబూ ! ఇవాళంతా నేను నా పిల్లల్తో ఆడుకుంటాను చెక్కులు తీసుకుని ఆఫీసుకి వెళ్లిపొండి. సాయింత్రం అయిదు ఆ ప్రాంతాలలో ఆఫీసు కొస్తాను. ఐ విల్ సైన్ దెమ్ దేర్ !'

తాను చెప్పదలుచుకున్నదేదో స్పష్టంగా

## పవన చక్రిక

—డాక్టర్ దాశరథి

గగన పూత్కృత వాయువీచిక
జగమునూ యెలలూపు చున్నది,
పవన చక్రిక తిరుగుచున్నది
జవన హయమై దుముకుచున్నది

నీలనీరద దుకూలాంచల
కేళిలో తన భాగమేమో
తెలిసికొనుటకు మాటిమాటికి
దివికి లంగలు వేయుచున్నది

భూమిలోగల జలము తోడి ధ
రా మ తల్లికి 'లాల' పోయగ
గగనతలమున అలలు రేగే
గాలితో ఆటాడు చున్నది

ఎవరి సాయము లేక తిరుగును
ఎవరి అనుమతి లేక ఆగును,
అవని పదములపైన నిక్కుచు
ఆకసమునే అంటజూచును

పవన చక్రిక వంటిదే ఈ
అవనిపై మానవుని జీవిక,
గాలి లేనిది బ్రతుక జాలదు!
కాంచనముపై ఆశ వీడదు!!

చెప్పి, తిరిగి బుజ్జితో ఆడుకుంటున్నాడు, కృష్ణమూర్తి వెంకుబాబు ఫైలు సర్దుకుని లేచి నించున్నాడు వస్తానని చెప్పేందుకు నోరు తెరవబోయేడు కానీ, కృష్ణమూర్తి బుజ్జి ఆటల్లోపడి సర్వస్వాన్నీ మరచినట్టున్నాడు కృష్ణమూర్తి వళ్ళో కూచున్న బుజ్జి, కృష్ణమూర్తి మెళ్ళో మెరుస్తున్న బంగారుగొలుసునీ, దానికున్న వేణుగోపాల కృష్ణుని బొమ్మనీ చేత్తో తాకుతూ ఆడుకుంటున్నాడు వాడి ఆటల్ని చాలా శ్రద్ధగా గమనిస్తున్నాడు కృష్ణమూర్తి

వెంకుబాబు పరవశుడయ్యేడు దేవునిపట్లా దేవాలయంలాటి ఇంటిపట్లా, భార్యా పిల్లల పట్లా, కృష్ణమూర్తికిగల శ్రద్ధాసక్తులకు వెంకుబాబు పూర్తిగా పరవశుడయ్యేడు తాను కూడా వెంటనే పెళ్ళాడి, పిల్లల్ని కనేసి వాళ్ళనెత్తుకుని, తీరుబడిగా వాళ్ళతో ఆడుకుంటో కాలక్షేపం చేయాలని— క్షణంలో వెంకుబాబుకి కోరిక కలిగింది ■ కోరిక మంచి ఆ కలలనుంచి

## పాలు

అతను దూరం కాకమునుపే కృష్ణమూర్తి గొంతు వినిపించింది—

'నాతో యింకా ఏదైనా పనుందా బాబూ?'

వెంకుబాబు త్రొట్రుపడ్డాడు తన కోరికకీ, కలలకీ సిగ్గుపడ్డాడు ఏం లేదని, వెళ్లొస్తానని పొడిపొడిగా అనేసి అక్కడ్నుంచి నెమ్మదిగా కదిలి బయటపడ్డాడు

వెంకబాబు వెళ్లిపోయిం తర్వాత కృష్ణమూర్తి వంట గదిలోకి తొంగిచూస్తో భార్యని హెచ్చరించేడు—

'అన్నపూర్ణా! ఇంకా గుడి కెళ్ళవలసిన పనుంది కాఫీ ఏర్పాట్లు చూచి తొరగా తెములు వేళవుతోంది!'

'ఇదుగో క్షణం!' అన్నదామె వంట గదిలోంచి

* * *

వేణుగోపాలస్వామివారి ఆలయం దగ్గిర కారు ఆగింది బుజ్జిని ఎత్తుకుని ముందుగా కృష్ణమూర్తి దిగేడు పెదబాబూ, చినబాబూ కారునుంచి దుముకుతున్నప్పుడు— ఆదుర్దాగా వాళ్లని సుందలించేడు కృష్ణమూర్తి

'నెమ్మదిగా దిగండ్రా పూల్స్!'

అన్నపూర్ణ దిగేందుకు ఇబ్బంది పడుతోంది ఆమె ఇబ్బంది పడుతూంటే కృష్ణమూర్తి మనస్సు చివుక్కుమంది మరుక్షణమే, అతన్లో ఆనందంతో కూడిన గర్వం ఉప్పొంగి పొర్లింది బుజ్జిని డ్రైవరికిచ్చి, అన్నపూర్ణ దిగేందుకు కృష్ణమూర్తి సాయపడ్డాడు

ఆమె కారు దిగుతున్నప్పుడు మనసారా వేణుగోపాలస్వామిని తలుచుకున్నాడు —

'ముగ్గురూ మగబిడ్డల్నే యిచ్చేవు ఈ తడవకైనా చక్కటి ఆడపిల్లనిచ్చి మా ముచ్చట తీర్చే భారం నీదే స్వామీ!''

— పతీ సుత సమేతంగా ఆలయం ప్రవేశించిన కృష్ణమూర్తిని అల్లంత దూరాన్నుంచే చూచిన పూజారులు ఎదురొచ్చి సాదరంగా ఆహ్వానించేరు. పేరు పేరునా వాళ్ల క్షేమ సమాచారములు కనుక్కున్నాడు కృష్ణమూర్తి అతని తండ్రిగారే ఈ ఆలయాన్ని కట్టించేరు ఆ మాటకొస్తే గుళ్ళూ గోపురాలూ, ధర్మసత్రాలూ వారెన్నో కట్టించి పుణ్యం దక్కించుకోవడమే గాకుండా—ప్రజానీకంలో మంచి పేరు ప్రతిష్ఠలు కూడా సంపాయించుకున్నారు

తండ్రికి తగ్గ కొడుకు ఈ కృష్ణమూర్తి తండ్రి ఆర్జించిన ఆస్తినీ, పేరు ప్రతిష్ఠలకూ ఏ విధమైన భంగమూ కలుగకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు లయన్స్ క్లబ్‌లో సింహమై, పురప్రముఖుల్లో ముఖ్యుడై తనకు తోచిన దాన ధర్మాలు తామూ చేస్తూనే వున్నాడు.

దేవుని ఎదుట భార్యా పిల్లలతో వినమ్రంగా నిలబడి వున్నాడు కృష్ణమూర్తి పూజారులు మంత్రోచ్చారణ చేస్తున్నప్పుడు జేగంట మోగించి చేతులు జోడించేడు కళ్లు మూసుకుని వేణుగోపాలస్వామిని మనసారా స్మరించేడు మంత్రోచ్చారణతోపాటు తన చెవి కింపుగా ఎక్కడ్నుంచో కమ్మగా వేణునాదం వినిపిస్తోంది అతని శరీరం యావత్తూ పరవశంతో జలదరించింది సాక్షాత్తు, ఆ వేణుగోపాలుడు తన ఎదుట అలవోకగా నవ్వుతూ ప్రత్యక్షమయ్యేడు ఆ పరమాత్ముని చేతుల్లో అపరంజి బొమ్మలాటి పసిపాప బోసి నవ్వుల్ని కురిపిస్తోంది కృష్ణమూర్తిని ఆకర్షించింది. చేతులు జాపేడు కృష్ణమూర్తి పరమాత్మ ఆ పసిపాపని కృష్ణమూర్తి చేతుల్లో వుంచేడు

మంత్రోచ్చారణ ముగిసింది జేగంట వినిపిస్తోంది. కళ్లు విప్పిచూసేడు కృష్ణమూర్తి పూజాద్రవ్యాలతో నిండిన హారతి పళ్లెం తన కళ్ళముందున్నది తృప్తిగా హారతిని కళ్లకద్దుకున్నాడు కృష్ణమూర్తి

'బాబుగారి దర్శనం ఈ మధ్య బొత్తిగా కరువైపోయింది' అన్నాడు పూజారి

కృష్ణమూర్తి చిరునవ్వునే జవాబుగా చెప్పి, బుజ్జి చేతి ద్వారా అయిదుపాయిల కాగితాన్ని పూజారి కిప్పించేడు పూజారి ■ చిన్న పచ్చ కాగితాన్ని పుచ్చుకున్నాడు భార్యా పిల్లలతో కారు వేపు కదిలేడు కృష్ణమూర్తి (ఇంకావుంది)

## చలం స్మృతి

(24 వ పేజీ తరువాయి)

వెళ్లి, యిద్దరూ ఎంతో ఆప్యాయంగా కలుసుకున్నట్లు తెలుస్తోంది

చలంగారు వ్యక్తిగా సింప్‌ల్ ఎండ్ స్ట్రెయిట్ కాదనే నా అభిప్రాయం గడుసుదనమూ, పోస్ ఎండ్ మాస్క్ ఉండేవి వాటిని తొలగించబోతే తియ్యని మాటలతో, ప్రేమాదరణలతో అడ్డుకునేవాడు కాని లౌకిక ప్రయోజనాలకూ, డబ్బూ అధికారం కోసం మాత్రం ఉపయోగించినవి కావవి కేవలం వ్యక్తిగా ఆకర్షణకు ఉపయోగించాయి వాటిని ఆయన వదలుకొనే సాధనలో 1962 ప్రళయ సంరంభం ఒక మలుపు చలం అటుపైన లోకాన్ని తన చుట్టూ ఆకర్షించే ప్రయత్నం మానివేశాడు! అది ఈశ్వరుడు చలంమీదవేసిన ప్రాక్టికల్ జోక్ అనీ, తద్వారా చలం మరో మెట్టు పైకి వెళ్లగలిగాడనీ భావిస్తాను నేను రచయితగా ఆయన పుస్తకాల్లో మాత్రం ఆ పర్సనాలిటీ మాస్క్ లోకాన్ని తికమక పెడుతూనే ఉంటుంది ఎప్పటికీ చలం వివాదాస్పద రచయితగా జీవిస్తూనే ఉంటాడు ●

